శ్రీమతే భగవతే తిరుపతిక్షేత్రాధివాసాయ వేంకటేశాయ నమోనమ

శ్లో॥ రాజత్క్షేత్రే తిరుపతిపురే రమ్యశేషాద్రిశృంగే
భ్రాజజ్జాంబూనదమణిలసద్భవ్యదివ్యాలయాంతః
భ్రాజంతం తం సకలకలుషధ్వంసనం వేంకటేశం
రాజీవాక్షం ప్రణతజనతాత్రాణదీక్షం నమామి।



This Book is Printed with the Financial Assistanc of Tirumala Tirupati Devasthanams under the schem "Aid to publish religious Books"



# శ్రీమదానందరామాయణము

## ద్వితీయ భాగము

విలాసకాండము, జన్మకాండము.
వివాహకాండము, రాజ్యకాండము.

గ్రంథకర్త : ప్రకాశకుడు

బులుసు ఉదయభాస్కరము

రిటైర్డు తెలుగు హిందీ పండితుడు.

రాజానగరము.

1981



వెల రు. 20.00

# కృతిసమర్పణము

అమితానందముతోడ నంకితముగా నానందరామాయణా
ఖ్యము గద్యాత్మకకావ్యపుష్ప మిదిగో కైకోరె యర్పింతు న
చ్చముగా మీదిది మీ పవిత్రచరణాబ్జాతమ్ములం దేను మా
త్రము మీవాడనె కాన? తల్లి! మహిజా! తండ్రీ! రఘూత్తంసమా!

బులుసు ఉదయభాస్కరము.

## దాతల సంస్మరణము

### మ హా రా జ పో ష కు లు

శ్రీ M. S. ప్రసాదుగారు. Ph. D. M. I. E (INDIA) M. C. I. M. (CANADA) M. S. B. శాస్త్రిగారు, వారి కుటుంబ సభ్యులు, వాల్తేరు.

పూజ్యులు శ్రీ శ్రీ శ్రీ శివానందమూర్తిగారు, హనుమకొండ.

శ్రీ కీ॥ శే॥ మాడపాటి అమ్మిరెడ్డిగారి జ్ఞాపకార్థము వారి కుమారులు శ్రీ సీతారామరెడ్డిగారు, వారి సోదరులు, రాజమండ్రి.

,, రాచకొండ పేరయ్యశాస్త్రిగారు, గొల్లప్రోలు.

### రా జ పో ష కు లు

శ్రీ బోనగిరి తాతారావుగారు, మండపేట.

,, కంభంపాటి సాంబశివశాస్త్రిగారు, B. Sc. D. M. & S. దివాన్ చెరువు.

,, బంగారు సీతారామయ్యగారు, నంద్యాల.

,, తుట్టగుంట రామారావుగారు, రాజానగరము,

,, మెల్లా అప్పారావు వడయారుగారు, H. M. B. S. B. M. D. (BIHAR) Consulting Physician రాజానగరము.

,, ప్రగడ బులిస్వామిగారి కుమారుడు గురయ్యగారు, నరేంద్రపురము.

,, S. R. కృష్ణమూర్తిశాస్త్రిగారు, రిటైర్డు ప్రొఫెసర్, మద్రాసు సంస్కృతకళాశాల, మదరాసు.

,, కొలచిన అగ్నిహోత్రుడుగారి జ్ఞాపకార్థము వారి కుమారులు శ్రీ సూర్యనారాయణరామశర్మగారు, పరిమెల్ల.

,, ఆచంట సీతారామయ్యగారు, రాజానగరము,

" గోదావరి సత్యనారాయణ సిద్ధాంతిగారు, రాజమండ్రి.
శ్రీ గాయత్రీబాబాగారు, రాజమండ్రి.
" దర్భా సూర్యనారాయణ, సుబ్బలక్ష్మి, వేంకటరమణ
నటరాజప్రభాకరులు, రాజమండ్రి.
" డాక్టరు K. V. R. చౌదరిగారు, మండపేట.
" వల్లూరి సత్తిరాజుగారు, మండపేట.
" P. లక్ష్మణరావుగారు, సంపత్ నగర్.
" జక్కంపూడి నారాయణస్వామిగారు, కొత్తవెలుగుబంద.
" కాళ్ళ అప్పలరాజుగారు, కొత్తవెలుగుబంద.
" కాళ్ళ పోలీసుగారు, కొత్తవెలుగుబంద.
శ్రీ గౌతమీ పుష్కర వేద పాఠశాల, రాజోలు.
శ్రీపాద శరచ్చంద్రమహాళిగారు, అమలాపురము.
పాపట్ల అన్నపూర్ణమ్మ ట్రస్టు, 3—5—927, హిమాయత్ నగర్,
హైదరాబాదు.

పైని పేర్కొనబడిన దాతలందఱును దమతమ శక్త్యనుసారము గాను, శ్రీత్యనుసారముగాను నుదారత మీఱ విరాళము లొసగి ఈ యానందరామాయణ గ్రంథ ముద్రణమునకు సహకరించి తమలోని సంస్మరణీయచరిత్రతను, సంస్తవనీయ చరిత్రతను ప్రకటించికొన్న మహానుభావులు. పరమౌదార్యమును బ్రదర్శించికొన్న పుణ్యపురుషులు. వీరి కెల్లరకును గృతజ్ఞతాపూర్వకముగా నైమోడ్పు గావించుచు బరమానందధామును, శ్రీ హనుమత్సీతాలక్ష్మణభరతశత్రుఘ్నాది పరివారసమేతుడు నగు శ్రీమదానందరాముడు పరిపూర్ణాయురారోగ్య భాగ్యముల నొసగి వీరిని సర్వదా సంరక్షించుచుండుగాక! యని నిండుమనంబున నాశాసించుచున్నాను.

రాజానగరము
12—4—81

బులుసు ఉదయభాస్కరము.

# తొలిపలుకు

శ్రీరామచంద్రుని చరితలకెల్ల బరమాధారము వాల్మీకిచే రచింపబడిన సంస్కృతరామాయణము. దాని నాధారముగా జేసికొని వివిధభాషలలో, ముఖ్యముగా నాంధ్రభాషలో ననేకరామాయణము లావిర్భవించినవి. ఆవిర్భవించుచున్నవి. భావికాలమున నింకను నావిర్భవించుచునే యుండును. ఏలయనిన భౌతికమైన ప్రతివస్తువునకు, భావమునకు దొలుత గొంతకాలము నవీనత ననుసరించి ప్రజాదర మధికముగా నుండుటయు, ననంతరము క్రమముగా బురాతనత ననుసరించి తొలుతటి యాదరభావము క్షీణించిపోవుచుండుటయు సంభవించుచుండును. కాని శ్రీసీతారాముల చరిత యట్టిది కాదు. అది నిత్యనూతనమైనది. ఎన్నిమారులు విన్నను, పఠించినను, లిఖించినను, రచించినను దనుప్తి గానరాని దివ్యచరిత్రమది. ఆకారణముననే యీ చరిత్రము నెందఱో మహానుభావులు వారివారి మనోభావముల కనుగుణముగా గద్యరూపమున, పద్యరూపమున, గద్యపద్యాత్మకముగాను, గేయరూపమునందును రచించిరి, రచించుచున్నారు. ముందుముందు రచించుచునే యుందురు.

లోకములో వాల్మీకి రామాయణము బాలకాండము మొదలు ఉత్తరకాండపర్యంతమేడు కాండములు గలదిగా, నిరువదినాలుగువేల శ్లోకముల పరిమితి గలదిగా బ్రసిద్ధమై యున్నది. ఆనందరామాయణ మీరామాయణమున కన్న భిన్నమైనది. ఇందు దొమ్మిది కాండములు 12252 శ్లోకములును గలవు. ఇందలి కాండముల నామములు గూడ భిన్నముగానే యున్నవి. ఇదియు వాల్మీకి విరచితముగనే కానవచ్చుచున్నది. అందలి కవితాశైలికన్న నిందలి కవితాశైలియు భిన్నముగనే గోచరించుచున్నది. ఈరెండు రామాయణములకును గర్త యొకడే యైనప్పుడు రెండు రామాయణము లేల వ్రాయవలసివచ్చెను? అన్న ప్రశ్న ముదయించుట సహజము. ఈప్రశ్నమునకు బ్రత్యుత్తరము

గూడ నీగ్రంథమునందే యాత్రాకాండమున నొక సుందరమైన గాథగా నీయబడినది. అందలి యాథార్థ్యమునుగాని, యాథార్థ్య రాహిత్యమునుగాని చర్చించి సిద్ధాంతీకరించుట విమర్శకుల పని.

ఈ యానందరామాయణములో మొదటిదగు సారకాండమున లోకప్రసిద్ధమైన రామాయణములోని యారుకాండముల విషయము అనగా శ్రీరామపట్టాభిషేకపర్యంతముగా నుండు గాథ యంతయు పూర్తిగాను, సంగ్రహముగాను వర్ణింపబడియున్నది. ఈసారకాండ మొక్కటి పఠించిన నారుకాండముల రామాయణ మంతయు పఠించి నట్టులగు నన్నమాట. ఇతరకాండములలో నారామాయణములో చెప్పబడని వివిధవిషయము లత్యంతమనోహరమైన ఖరిలో వర్ణింపబడి యున్నవి. ముఖ్యముగా మనోహరకాండమున ననేకములగు శ్రీరామో పాసనాప్రకారములు, మంత్రములు, సర్వతోభద్రయంత్రములు, కవచములు, స్తోత్రములు, గేయసాధనవిధానములును చక్కగా ప్రతిపా దింపబడినవి. ఇవి యన్నియు శ్రీమత్సీతారామచంద్ర భక్తిభావ సంభరితాంతరంగులగు సాధకులకు గొంగుబంగార మనదగినవి.

ఈ యానందరామాయణమును దెలుగున నాతికఠినమైన వచన శైలిలో వ్రాసి ప్రకటించుటకు బూనుకొన్నాను. ఆర్థికసౌలభ్యము నపేక్షించి యీగ్రంథమును మూడుభాగములుగా బ్రచురించి ప్రక టింప సంకల్పించికొన్నాను. అందు మొదటి భాగమింతకు ముందే ప్రకటింపబడినది. అందు సార, యాత్రా, యాగకాండము లనబడు మూడు కాండముల విషయము పొందుపఱపబడినది. రెండవభాగ మిదిగో మీాముందున్నది. ఇందు విలాస, జన్మ, వివాహ, రాజ్య కాండము లనబడు నాలుగు కాండముల విషయము పొందుపఱపబడి నది. ఆర్థికసౌలభ్యము ననుసరించి యనతికాలములో మూడవభాగ మును గూడ నచ్చొత్తించి ప్రకటించుటకు ప్రయత్నింపగల ననియు,

దానితో నానందరామాయణము పూర్తిగా వెలుగులోనికి రాగల దనియు మనవి చేసికొనుచున్నాను.

ఈ గ్రంథ మానందరామాయణము. ఇందలి రాముడు పరమానందధాముడగు నానందరాముడు. ఇతడు మానవుడై యవతరించి యుండియు ననుక్షణము నన్ని విషయములందును స్వస్వరూపపరిజ్ఞానముతో బ్రవర్తిల్లిన పరమపురుషుడు. ఇతనికి సీతావియోగాది క్లేశములవలన గలుగు దుఃఖానుభూతిలేదు. ఒకవిధముగా నితడు సీతావియోగము నెనయనేలేదు. అట్టియెడ నితనికి దుఃఖానుభూతి యెట్లుగాదవును? ఆకారణముననే యితడు పరమానందధాముడనదగు నానందరాముడైనాడు. ఇట్టిపురుషోత్తముని పావనచరిత్ర మగుటచేత నీగ్రంథ మానందరామాయణమన్న నామసార్థక్యము నెనసినది. కావున బ్రీతియుక్తాంతరంగులై యెల్లరు నీగ్రంథమును బఠించి యానందరాముని పరమానుగ్రహమునకు బాత్రులై పరమానందరసమును జూఱగొందురుగాక!

శ్లో॥ దృష్టం కిమపి లోకేఽస్మిన్న నిర్దోషం న నిర్గుణమ్
తస్మాద్దోషాన్ పరిత్యజ్య గృహ్ణంతు సుగుణాన్ బుధాః॥

రాజానగరము
21—4—81 బులుసు ఉదయభాస్కరము

# కృతజ్ఞతానివేదనము

శ్రీమదానంద రామాయణమును ముద్రింపగోరుదునని కోరుటయే తడవుగా సహర్షముగా సమ్మతించి సకాలమున సర్వాంగశోభాసముదంచితముగా గ్రంథము నచ్చువేసి యొసగజేసిన, బాలాజీప్రెస్ సంచాలకులు B. అప్పారావుగారికి, వారి సోదరులకు నందలి కార్యకర్తలకు బ్రత్యేకముగా నా కృతజ్ఞతాభివందనము లందించుచున్నాను.

రాజానగరము
21—4—81 బులుసు ఉదయభాస్కరము

## —: విషయానుక్రమణిక :—

### విలాసకాండము



### జన్మకాండము



### వివాహకాండము

రాజ్యకాండము - పూర్వార్ధము

—( : )—

## గణపతి ప్రార్థనా

శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్
ప్రసన్నవదనం ధ్యాయే త్సర్వవిఘ్నోపశాంతయే॥
వాగీశాద్యా స్సుమనస స్సర్వార్థానా ముపక్రమే
యం నత్వా కృతకృత్యా స్స్యు స్తం నమామి గజాననమ్।

## సరస్వతీ ప్రార్థనా

శ్లో॥ దోర్భిర్యుక్తా చతుర్భి స్స్ఫటికమణిమయీ మక్షమాలాం దధానా
హస్తేనైకేన పద్మం సితమపి చ శుకం పుస్తకం చాపరేణ
భాసా కుందేందుశంఖ స్ఫటికమణినిభా భాసమానాఽసమానా
సా మే వాగ్దేవతేయం నివసతు వదనే సర్వదా సుప్రసన్నా॥

## వాల్మీకి ప్రార్థనా

శ్లో॥ కూజంతం రామరామేతి మధురం మధురాక్షరమ్॥
ఆరుహ్య కవితాశాఖాం వందే వాల్మీకికోకిలమ్॥
యః పిబన్ సతతం రామచరితామృతసాగరమ్
అతృప్త స్తం మునిం వందే ప్రాచేతస మకల్మషమ్॥

## హనుమత్ప్రార్థనా

శ్లో॥ గోష్పదీకృతవారాశిం మశకీకృతరాక్షసమ్
రామాయణమహామాలారత్నం వందేఽనిలాత్మజమ్॥
అంజనానందనం వీరం జానకీశోకనాశనమ్
కపీశ మక్షహంతారం వందే లంకాభయంకరమ్॥

## శ్రీరామ ప్రార్థనా

శ్లో॥ వైదేహీసహితం సురద్రుమతలే హైమే మహామండపే
మధ్యే పుష్పకమాసనే మణిమయే వీరాసనే సంస్థితమ్॥
అగ్రే వాచయతి ప్రభంజనసుతే తత్త్వం మునిభ్యః పరమ్
వ్యాఖ్యాంతం భరతాదిభిః పరివృతం రామంభజే శ్యామలమ్॥

# శ్రీరామమంగళాశాసనమ్

1. మంగళం కోసలేంద్రాయ మహనీయగుణాబ్ధయే.
   చక్రవర్తితనూజాయ సార్వభౌమాయ మంగళమ్.

2. వేదవేదాంతవేద్యాయ మేఘశ్యామలమూర్తయే.
   పుంసాం మోహనరూపాయ పుణ్యశ్లోకాయ మంగళమ్.

3. విశ్వామిత్రాంతరంగాయ మిథిలానగరీపతేః.
   భాగ్యానాం పరిపాకాయ భవ్యరూపాయ మంగళమ్.

4. పితృభక్తాయ సతతం భ్రాతృభిస్సహ సీతయా.
   నందితాఖిలలోకాయ రామభద్రాయ మంగళమ్.

5. త్యక్తసాకేతవాసాయ చిత్రకూటవిహారిణే.
   సేవ్యాయ సర్వయమినాం ధీరోదాత్తాయ మంగళమ్.

6. సౌమిత్రిణా చ జానక్యా చాపబాణాసిధారిణే.
   సంసేవ్యాయ సదా భక్త్యా స్వామినే మమ మంగళమ్.

7. దండకారణ్యవాసాయ ఖరదూషణశత్రవే.
   గృధ్రరాజాయ భక్తాయ ముక్తిదాయాస్తు మంగళమ్.

8. సాదరం శబరీదత్త ఫలమూలాభిలాషిణే.
   సౌలభ్యపరిపూర్ణాయ సత్త్వోద్రిక్తాయ మంగళమ్.

9. హనుమత్సమవేతాయ హరీశాభీష్టదాయినే.
   వాలిప్రమథనాయాస్తు మహాధీరాయ మంగళమ్.

10. శ్రీమతే రఘువీరాయ సేతూల్లంఘితసింధవే.
    జితరాక్షసరాజాయ రణధీరాయ మంగళమ్,

11. విభీషణకృతే ప్రీత్యా లంకాభీష్టప్రదాయినే.
సర్వలోకశరణ్యాయ శ్రీరాఘవాయ మంగళమ్.

12. ఆసాద్య నగరీం దివ్యామభిషిక్తాయ సీతయా.
రాజాధిరాజరాజాయ రామభద్రాయ మంగళమ్.

13. బ్రహ్మాదిదేవసేవ్యాయ బ్రహ్మణ్యాయ మహాత్మనే.
జానకీప్రాణనాథాయ రఘునాథాయ మంగళమ్.

14. శ్రీసౌమ్యజామాతృమునేః కృపయాస్మానుపేయుషే.
మహతే మమ నాథాయ రఘునాథాయ మంగళమ్.

15. మంగళాశాసనపరైర్మదాచార్యపురోగమైః.
సర్వైశ్చ పూర్వైరాచార్యైస్సత్కృతాయాస్తు మంగళమ్.

16. రమ్యజామాతృమునినా మంగళాశాసనం కృతమ్.
త్రైలోక్యాధిపతి శ్రీమాన్ కరోతు మంగళం సదా.

— 0₀0 —

# తులసీదాసు సూక్తి

... () ...

శా. రామా! నాకనుకంపమై నొసఁగుమా! రాణన్ భవత్పుణ్యగా
థామాధుర్యము గ్రోలినంతనె పవిత్రప్రేమబాష్పాంబువ
ర్షామాస్యంబగు లోచనద్వయము, నిన్ బ్రార్థింతుఁ గాదేని నే
నామోదించెద జన్మజన్మమున నన్నంధు బొనర్పంగదే!

ఉ. ఎందఱు లేరు లోకమున నేలికలైనను నైజసేవకుం
డెందయినం బ్రమాద మొనరించిన భగ్గున మండువారలే
యందఱుఁ గాని రామవిభుఁ డాత్మఁ దలంపఁడు స్వప్నమందునై
నం దన కన్నులారఁ గనినన్ నిజసేవకలోకదోషముల్ ॥

ఉ. సేవకవాంఛితంబులనె చిత్తమునం దలపోయుఁగాని తా
నై వెలయింపఁ డెన్నడును నాత్మ మనోరథ మిట్టిదంచు, నో
రా! విపులాసుతాపతికి రామున కీడగు ఱేఁడెవం డిలన్?
గావున నట్టి సత్ప్రభుని గాదను వెంగలి యొక్కఁడుండునే?

ఉ. నారలు గట్టె, బండ్ల నశనం బొనరించెఁ, దృణాళిపై మువం
బారఁ బరుండె, వృక్షతతి యందుఁ బ్రియంబును జూపె నత్తఱిం
గూరిమిమై విభీషణున, కుం దనయంత నొసంగె లంక న
య్యారె! వచింపఁగా నలవియా? రఘువీరుని త్యాగశీలతల్ ॥

చ. తలల బదింటి దున్మి తొలుతన్ జ్వలనంబున వ్రేల్వ నీశ్వరుం
డలరి మహావిభూతిని దశాస్యున కేమి యొసంగె, దానినే
యలుప మటంచు క్షుద్రమిదియా? యొసఁగందగునంచు జంకు గొం
కులు పొదలన్ విభీషణునకున్ రఘువీరుఁ డొసంగెఁ గూర్మిమై ॥

చ. దనుజకులాధముండు, రిపు తమ్ముఁడు, తండ్రిని బోలు నన్నఁ బా
సిన దురితాత్ముఁడైన దఱిఁజేర్చె విభీషణు వెండియుం బ్రపూ
తను మహిజాత నొక్క యనృతం బపవాదము నెంచివీడెఁ గ
న్గొన వ్యవహారలీల రఘుకుంజరుఁ డెంతటి జాగరూకుఁడో ॥

# శ్రీమదానందరామాయణము

## విలాసకాండము



### ప్రథమసర్గము

—* శివకృత శ్రీరామస్తవరాజము *—

'గురువర్యా! సభామధ్యగతుడైన శ్రీరామచంద్రుని భక్తవశంకరుడైన శంకరుడే స్తోత్రముతో స్తుతించెనో, యా శ్రీరామ స్తవరాజస్తోత్రమును నే నాలకింపగోరుచున్నాను. వినిపింపుము.' అని విష్ణుదాసుడు శ్రీరామదాసుని బ్రశ్నింపగా నతడు 'శిష్యా! నీ వుత్తమ ప్రశ్న మొనరించితివి. నీకిప్పుడా శ్రీరామ స్తవరాజమును వినిపించుచున్నాను. సావధానమనస్కుడవై యాలకింపు' మనుచు నీ విధముగా నొడువ నారంభించును.

యత్పరం యద్గుణాధారం యజ్జ్యోతి రమలం శివమ్ ।
తదేవ పరమం తత్త్వం కైవల్యపదదాయకమ్ ॥ 1
శ్రీరామేతి పరం జాప్యం తారకం బ్రహ్మసంజ్ఞితమ్ ।
బ్రహ్మహత్యాదిపాపఘ్న మితి వేదవిదో విదుః ॥ 2
శ్రీరామ రామ రామేతి యే వదంత్యపి సర్వదా ।
తేషాం భుక్తిశ్చ ముక్తిశ్చ భవిష్యతి న సంశయః ॥ 3
స్తవరాజః పురాప్రోక్తః శివేన పరమాత్మనా ।
తమహం సంప్రవక్ష్యామి హరిధ్యానపురస్సరమ్ ॥ 4
తాపత్రయాగ్ని శమనం సర్వాఘౌఘనికృంతనమ్ ।
దారిద్ర్యదుఃఖశమనం సర్వసంపత్ప్రదాయకః ॥ 5

విజ్ఞానఫలదం పుణ్యం మోక్షైకఫలదాయకమ్।
నమస్కృత్య ప్రవక్ష్యామి రామం కృష్ణ మనామయమ్ ॥ 6
అయోధ్యానగరే రమ్యే రత్నమండపమధ్యగే ।
ధ్యాయేత్కల్పతరోర్మూలే రత్నసింహాసనం శుభమ్॥ 7
తన్మధ్యేఽష్టదళం పద్మం నానారత్నోపశోభితమ్ ।
స్మరేన్మధ్యే దాశరథిం సహస్రాదిత్య తేజసమ్ ॥ 8
పితురాసన మాసీన మింద్రనీల సమప్రభమ్ ।
కోమలాంగం విశాలాక్షం విద్యుద్వర్ణాంబరావృతమ్॥ 9
భానుకోటి ప్రతీకాశం కిరీటేన విరాజితమ్ ।
రత్నగ్రైవేయ కేయూర నరకుండలమండితమ్ ॥ 10
రత్నకంకణమంజీరకటిసూత్రై రలంకృతమ్ ।
శ్రీవత్సకౌస్తుభోరస్కం ముక్తాహారోపశోభితమ్ ॥ 11
చింతామణి సమాయుక్తం రత్నమాలావిరాజితమ్ ।
దివ్యరత్నసమాయుక్తం ముద్రికాభి రలంకృతమ్ ॥ 12
కర్పూరాగరుకస్తూరీ దివ్యగంధానులేపనమ్ ।
తులసీకుందమందార పుష్పమాల్యై రలంకృతమ్ ॥ 13
రాఘవం ద్విభుజం వీరం రామ మీషత్స్మితాననమ్ ।
యోగశాస్త్రేష్వభిరతం యోగేశం యోగదాయకమ్ ॥ 14
సదా సౌమిత్రి భరతశత్రుఘ్నై రుపశోభితమ్।
విద్యాధరసురాధీశ సిద్ధగంధర్వ కిన్నరైః ॥ 15
యోగీంద్రై ర్నారదాద్యైశ్చ స్తూయమాన మహర్నిశమ్ ।
విశ్వామిత్రవసిష్ఠాద్యైః ఋషిభిః పరిసేవితమ్ ॥ 16
సనకాదిమునిశ్రేష్ఠై ర్యోగిబృందై స్సమావృతమ్ ।
రామం రఘువరం వీరం ధనుర్వేదవిశారదమ్ ॥ 17

మంగళాయతనం దేవం రామం రాజీవలోచనమ్।
సర్వశాస్త్రార్థతత్త్వజ్ఞ మానంద మతిసుందరమ్ ॥ 18
కౌసల్యాతనయం రామం ధనుర్బాణధరం హరిమ్ ।
ఏవం సంచింతయేద్విష్ణుం యజ్జ్యోతిర్జ్యోతిషాం పరమ్ ॥ 19
ప్రహృష్టమానసో భూత్వా సభాయాం వృషభధ్వజః ।
సర్వలోకహితార్థాయ తుష్టావ రఘునందనమ్ ॥ 20
కృతాంజలిపుటో భూత్వా చింతయన్నద్భుతం హరిమ్ ।

శ్రీశివ ఉవాచ.

యదేకం యత్పరం నిత్యం యదనంతం చిదాత్మకమ్ ॥ 21
యదేకం వ్యాపకం లోకే తద్రూపం చింతయామ్యహమ్ ।
సర్వత్రైలోక్య సౌఖ్యార్థం రామభక్త్యతివృద్ధయే ॥ 22
విజ్ఞాన హేతుం విమలాయతాక్షం, ప్రజ్ఞాన సందివ్యసుఖైకరూపమ్।
శ్రీరామచంద్రం హరిమాదిదేవం, విశ్వేశ్వరం రామ మహం భజామి॥23
కవిం పురాణం పురుషం పరేశం సనాతనం యోగిన మీశితారమ్।
అణోరణీయాంస మనంతవీర్యం, ప్రాణేశ్వరం రామమహం భజామి॥24
నారాయణం జగన్నాథ మభిరామం జగత్పతిమ్ ।
కవిం పురాణం వాగీశం రామం దశరథాత్మజమ్ ॥ 25
రామరాజం రఘువరం కౌసల్యానందవర్ధనమ్ ।
భర్గం వరేణ్యం విశ్వేశం రఘునాథం జగద్గురుమ్ ॥ 62
సత్యం సత్యప్రియం శ్రేష్ఠం జానకీవల్లభం ప్రభుమ్ ॥
సౌమిత్రిపూర్వజం శాంతం కామదం కమలేక్షణమ్॥ 27
ఆదిత్యం రవి మీశానం ఘృణిం సూర్య మనామయమ్ ।
ఆనందరూపిణం సౌమ్యం రాఘవం కరుణాకరమ్ ॥ 28

జామదగ్న్యం తపోమూర్తిం రామం పరశుధారిణమ్ ।
వాక్పతిం వరదం వాచ్యం శ్రీపతిం పక్షివాహనమ్ ॥ 29
శ్రీశార్ఙ్గధారిణం రామం చిన్మయానంద విగ్రహమ్ ॥
హలధారిణ మీశానం బలరామం కృపానిధిమ్ ॥ 30
శ్రీవల్లభం కలానాథం జగన్మోహన మచ్యుతం ।
మత్స్య కూర్మవరాహాదిరూపధారిణ మవ్యయమ్ ॥ 31
వాసుదేవం జగద్యోని మనాదినిధనం హరిమ్ ।
గోవిందం గోపతిం విష్ణుం గోపీజనమనోహరమ్ ॥ 32
గోపాలం గోపరీవారం గోపకన్యాసమావృతమ్ ।
విద్యుత్పుంజప్రతీకాశం రామం కృష్ణం జగన్మయమ్ ॥ 33
గోగోపికాసమాకీర్ణం వేణువాదనతత్పరమ్ ।
కామరూపం కలావంతం కామినాం కామదం ప్రభుమ్ ॥ 34
మన్మథం మథురానాథం మాధవం మకరధ్వజమ్ ।
శ్రీధరం శ్రీకరం శ్రీశం శ్రీనివాసం పరాత్పరమ్ ॥ 35
భూతేశం భూపతిం భద్రం భూతిదం భూతిభూషణమ్ ।
సర్వదుఃఖహరం వీరం దుష్టదానవమర్దనమ్ ॥ 36
శ్రీనృసింహం మహావిష్ణుం మహాంతం దీప్తతేజసమ్ ।
చిదానందమయం నిత్యం ప్రణవం జ్యోతిరూపకమ్ ॥ 37
ఆదిత్యమండలగతం నిశ్చితార్థస్వరూపిణమ్ ।
భక్తిప్రియం పద్మనేత్రం భక్తానా మీప్సితప్రదమ్ ॥ 38
కౌసల్యేయం కలామూర్తిం కాకుత్స్థం కమలాప్రియమ్ ।
సింహాసనే సమాసీనం నిత్యవ్రత మకల్మషమ్ ॥ 39
విశ్వామిత్రప్రియం దాంతం స్వదారనియతవ్రతమ్ ।
యజ్ఞేశం యజ్ఞపురుషం యజ్ఞపాలనతత్పరమ్ ॥ 40

సత్యసంధం జితక్రోధం శరణాగతవత్సలమ్ ।
సర్వక్లేశాపహరణం విభీషణవరప్రదమ్ ॥ 41
దశగ్రీవహరం రుద్రం కేశవం కేశిమర్దనమ్ ।
వాలిప్రమథనం వీరం సుగ్రీవేప్సితరాజ్యదమ్ ॥ 42
నరవానరదేవైశ్చ సేవితం హనుమత్ప్రియమ్ ।
శుద్ధం సూక్ష్మం పరం శాంతం తారకబ్రహ్మరూపిణమ్ ॥ 43
సర్వభూతాత్మభూతస్థం సర్వాధారం సనాతనమ్ ।
సర్వకారణకర్తారం నిదానం ప్రకృతేః పరమ్ ॥ 44
నిరామయం నిరాభాసం నిరవద్యం నిరంజనమ్ ।
నిత్యానందం నిరాకార మద్వైతం తమసః పరమ్ ॥ 45
పరాత్పరతరం నిత్యం సత్యానందం చిదాత్మకమ్ ।
మనసా శిరసా నిత్యం ప్రణమామి రఘూత్తమమ్ । 46

భవోద్భవం వేదవిదాం వరిష్ఠం ఆదిత్యచంద్రానల సుప్రభావమ్ ।
సర్వాత్మకం సర్వగతస్వరూపం నమామి రామం తమసః పరస్తాత్ ॥ 47
నిరంజనం నిష్ప్రతిమం నిరీహం నిరాశ్రయం కారణ మాదిదేవమ్ ।
నిత్యం ధ్రువం నిర్విషయస్వరూపం నిరంతరం రామ మహం భజామి॥48
భవాబ్ధిపోతం భరతాగ్రజం తం భక్తిప్రియం భానుకులప్రదీపమ్ ।
భూతాధినాథం భువనాధిపత్యం భజామి రామం భవరోగవైద్యమ్॥49
సర్వాధిపత్యం రణరంగధీరం సత్యం చిదానందసుఖస్వరూపమ్ ।
సత్యం శివం సజ్జనహృన్నివాసం ధ్యేయం పరానంద మహం భజామి॥50
కార్యక్రియాకారణ మప్రమేయం కవిం పురాణం కమలాయతాక్షమ్।
కుమారవేషం కరుణామయం తం కల్పద్రుమం రామ మహం భజామి॥51
త్రైలోక్యనాథం సరసీరుహాక్షం దయానిధిం ద్వంద్వవినాశహేతుమ్
మహాబలం వేదనిధిం సురేశం సనాతనం రామ మహం భజామి ॥

వేదాంతవేద్యం కవి మీశితారం అనాదిమధ్యాంత మచింత్య మాద్యమ్
అగోచరం నిర్మల మేకరూపం పరాత్పరం రామ మహం భజామి॥ 53
అశేషవేదాత్మక మాదిదేవం అజం హరిం రామ మనంతమూర్తిమ్।
అపారసంవిత్సుఖ మేకరూపం నమామి రామం తమసః పరస్తాత్ ॥ 54
తత్త్వస్వరూపం పురుషం పురాణం స్వతేజసా పూరితవిశ్వ మేకమ్।
రాజాధిరాజం రవిమండలస్థం విశ్వేశ్వరం రామ మహం భజామి ॥55
యోగీంద్రసంఘైశ్చ సుసేవ్యమానం నారాయణం నిర్మల మాదిదేవమ్।
నతోఽస్మి నిత్యం జగదేకనాథం హరిం చిదానందమయం ముకుందమ్॥56
అశేషవిద్యాధిపతిం నమామి రామం పురాణం తమసః పరస్తాత్ ।
విభూతిదం విశ్వసృజం పరేశం రాజేంద్ర మీశం రఘువంశనాథమ్॥57
అచింత్య మవ్యక్త మనంతరూపం జ్యోతిర్మయం రామ మహం భజామి।
అశేషసంసారవికారహీనం ఆనంద సంపూర్ణసుఖాభిరామమ్ ॥ 58
నారాయణం విష్ణు మహం భజామి సమస్తసాక్షిం తమసః పరస్తాత్।
మునీంద్రగుహ్యం పరిపూర్ణ మేకం కలానిధిం కల్మషనాశహేతుమ్॥59
పరాత్పరం యత్పరమం పవిత్రం నమామి రామం మహతో మహాంతమ్।

బ్రహ్మా విష్ణుశ్చ రుద్రశ్చ దేవేంద్రో దేవతా స్తథా ।
ఆదిత్యాదిగ్రహాశ్చైవ త్వమేవ రఘునందన ॥ 60
తాపసా ఋషయ స్సిద్ధా స్సాధ్యాశ్చ మునయ స్తథా ।
విప్రా వేదాశ్చ యజ్ఞాశ్చ పురాణం ధర్మసంహితాః ॥ 61
వర్ణాశ్రమా స్తథా ధర్మా వర్ణధర్మా స్తథైవ చ ।
నాగా యక్షాశ్చ గంధర్వా దిక్పాలా దిగ్గజా దిశః ॥ 62
వసవోఽష్టౌ త్రయః కాలా రుద్రా ఏకాదశ స్మృతాః ।
తారకా ద్వాదశాదిత్యా స్త్వమేవ రఘునాయక ॥ 63

సప్తద్వీపా స్సముద్రాశ్చ నదా నద్య స్తథా ద్రుమాః ।
స్థావరా జంగమాశ్చైవ త్వమేవ రఘునందన॥ 64
దేవతిర్యఙ్మనుష్యాణాం దానవానాం దివౌకసామ్ ।
మాతా పితా తథా భ్రాతా త్వమేవ రఘునందన ॥ 65
సర్వేశ స్త్వం పరం బ్రహ్మ త్వద్రూపం విశ్వమేవ చ ।
త్వ మక్షరం పరంజ్యోతి స్త్వమేవ రఘుపుంగవ ॥ 69
శాంతం సర్వగతం సూక్ష్మం పరంబ్రహ్మ సనాతనమ్ ।
రాజీవలోచనం రామం ప్రణమామి జగత్పతిమ్ ॥ 67
తతః ప్రసన్నః శ్రీరామః ప్రోవాచ వృషభధ్వజమ్ ।

శ్రీరామ ఉవాచ

తుష్టోఽహం గిరిజాకాంత ! వృణీష్వ వర ముత్తమమ్ ॥ 68

శ్రీశివ ఉవాచ

యది తుష్టోఽసి దేవేశ శ్రీరామ కరుణానిధే ।
తవాద్య దర్శనేనైవ కృతార్థోఽహం న సంశయః ॥ 69
ధన్యోఽహం కృతకృత్యోఽహం పుణ్యోఽహం పురుషోత్తమ ।
అద్యమే సఫలం జన్మ హ్యద్య మే సఫలం తపః ॥ 70
అద్య మే సఫలం జ్ఞాన మద్య మే సఫలం శ్రుతమ్ ।
అద్య మే సఫలం సర్వం త్వత్పాదాంభోజదర్శనాత్ ॥ 71
అద్వైతం విమలం జ్ఞానం త్వన్నామస్మరణం తథా !
త్వత్పాదాంభోరుహద్వంద్వే సద్భక్తిం దేహి రాఘవ !॥ 72
తతః పరం సుసంప్రీతో రామః ప్రాహ సదాశివమ్ ।
గిరిజేశ ! మహాభాగ ! పునరిష్టం దదామ్యహమ్ ॥ 73

శ్రీశివ ఉవాచ

వరం న యాచే రఘునాథ యుష్మ । త్పాదాబ్జభక్తి స్సతతంమమా స్తు
ఇదం ప్రియం నాథ వరం ప్రయచ్ఛ । పునఃపునస్త్వా మిదమేవయాచే॥ 74

రామదాస ఉవాచ

ఇత్యేవ మీడితో రామః ప్రాదా త్తస్మై వరాంతరమ్ ।
తేనోక్త స్తవరాజాము దదౌ నానావరాన్ బహూన్ ॥ 75
ఏవం శివేన యః ప్రోక్త స్తవరాజ శ్శుభావహః ।
స ఏవాద్య త్వయా పృష్ట స్తవాగ్రే కథితో మయా ॥ 76
అయం శ్రీరఘునాథస్య స్తవరాజో హ్యనుత్తమః
సర్వసౌభాగ్యసంపత్తిదాయకో ముక్తిద స్స్మృతః ॥ 77
కథితో గిరిజేశేన తేనాదౌ సారసంగ్రహః ।
గుహ్యద్గుహ్యతరో సత్యస్తవ స్నేహాత్ప్రకీర్తితః ॥ 78
యః పఠే చ్ఛృణుయాద్వాపి త్రిసంధ్యం శ్రద్ధయాన్వితః ।
బ్రహ్మహత్యాదిపాపాని తత్సమాని బహూని చ॥ 79
హేమస్తేయ సురాపాన గురుతల్పాయుతాని చ ।
గోవధాద్యుపపాపాని చింతనాత్సంభవాని చ॥ 80
సర్వైః ప్రముచ్యతే పాపైః కల్పాయుతశతోద్భవైః ।
మానసం వాచికం పాపం కర్మణా సముపార్జితమ్ ॥ 81
శ్రీరామస్మరణేనైవ వ్యపోహతి న సంశయః ।
ఇదం సత్య మిదం సత్యం సత్యం నై వాన్యదుచ్యతే ॥ 82
రామ స్సత్యం పరం బ్రహ్మ రామాత్కించి న్న విద్యతే ।
తస్మాద్రామస్వరూపం హి రామ స్సర్వమిదం జగత్ ॥ 82
శ్రీరామచంద్ర రఘుపుంగవ రాజవర్య । రాజేంద్ర రామ రఘునాయక
రాఘవేశ ॥

రాజాధిరాజ రఘునాయక రామచంద్ర దాసోఽహ మద్య భవత
శ్శరణాగతోఽస్మి ॥ 84

ఉత్ఫుల్లామల కోమలోత్పలదళశ్యామాయ రామాయ చా ।
కామాయ ప్రశమాయ నిర్మల గుణగ్రామాయ రామాత్మనే।
ధ్యానారూఢమునీంద్రమానససరో హంసాయ సంసారవి ।
ధ్వంసాయ స్ఫురదోజసే రఘుకులోత్తంసాయ పుంసే నమః॥ 85

ఏవం శిష్య! మయా ప్రోక్తో యథా పృష్టస్త్వయా మమ ।
స్తవరాజో రాఘవస్య శ్రవణాత్పాపనాశనః ॥ 86

శ్రీరామ స్తవరాజము సమాప్తము
ప్రథమసర్గము సమాప్తము.

— ০০ —

## ద్వితీయసర్గము

### -: శ్రీరామచంద్రునిచే సీతాసౌందర్యవర్ణనము :-

'గురువర్యా! అయోధ్యానగరమునందు శ్రీరామచంద్రుడు మహాసౌందర్యరాశియగు సీతామహాదేవితో గూడి యుత్తమోత్తమములైన భోగముల ననుభవించిన విధమును, శుభకర్మల నాచరించిన విధమును సాకల్యముగా నాకు వినిపింపుము. వినగోరుచున్నాను, అని విష్ణుదాసుడు రామదాసుని బ్రశ్నింపగా నత డిట్లు వివరింప నారంభించును.

విష్ణుదాసా! నీవు చక్కని ప్రశ్న మొనరించితివి. రఘునందనుడు యుద్ధదీక్షను, నశ్వమేధయజ్ఞదీక్షను సంపూర్ణముగా నిర్వర్తించికొని యనంతరము సీతతోడను, సోదరులతోడను గూడి యయోధ్యలో నానందముగా నివసించెను. నానావిధములైన మనోహరసుఖభోగము

లను గల్పించి సీత కానందము గలిగించెను. ఆసీతారాముల మంగళమయమైన, పావనమైన విలాసచరిత్రము నొకింత వినిపింతు నాలకింపుము. దీని నాలకించిన సమస్తశుభములును సమకూరగలవు. వారి క్రీడావిలాసమయజీవితచరిత్రమును సమగ్రముగా నెవ్వరును వర్ణింపజాలరు. కావున సంగ్రహముగా వివరించుచుంటి నాలకింపుము.

అనంతరము శ్రీరామచంద్రు డయోధ్యలో సీతామహాదేవి తోడ కైలాసమునందు బార్వతితోడ గ్రీడించు బరమేశ్వరునివలె గ్రీడావినోదముల దేలియాడుచు గాలము గడపెను. రత్నఖచితమై, సువర్ణమయమై, దివ్యమై వైకుంఠమును బోలు భవనమునందు శ్రీరామచంద్రుని శయనమందిరము చంద్రునివలె స్వచ్ఛమై, యలరారుచుండెను. అందలి గోడలు సువర్ణమయములై రత్నఖచితములైనవి. స్తంభములు స్ఫటికమణిమయములైనవి. రచ్చలు మరకతమణిమయములైనవి. మిగిలిన భాగమంతయు నీలమణిఖచితమైనది. కుడ్యములు విచిత్రములైన చిత్తరువులతోడను, నద్దములతోడను నలంకృతములైనవి. భూమి సువర్ణమయమై ముత్తెములతో నలంకరింపబడినది. వితానము (చాందినీ) పుష్పమాలికలతోడను, ముత్తెపుగుత్తులతోడను బ్రకాశించుచుండును. ఆమందిరమునందు సుందరములై సువర్ణతంతునిర్మితములైన (జలతారు) కుడ్యవస్త్రము (తెరలు) లెన్నరాని కన్నులపండువు సేయుచుండును. అందు బదివేలమంది జను లొక్కమారుగా జేరినను జనసమ్మర్దము కారణముగా నిఱుకటముగా దోచనంత వైశాల్య ముండును. అందెడనెడ రత్నదీపములు కాంతు లీనుచుండును. ప్రాసాదాగ్రభాగమున బసిడికలశములు పెక్కులు వెలుగొందుచుండును. ఆమందిరమునందలి సుందరములైన చిత్తరువులు చెలువల చిత్తములందు మోహాంకు నుదయింప జేయును. అందు సువర్ణమయములైన పర్యంకము(మంచము) లనేకముల లరారుచుండును వానిపై జరీపనితనముతో బ్రకాశించు మెత్తని పట్టుదుప్ప

టులు పఱచబడియుండును. ఆ మందిర మనేకములగు నెలగల జిలుగు వస్త్రములతోడను, బుష్పగుచ్ఛములతోడను బారులు పారుచుండును. అందు నాలుగు మూలలందు ముత్తెపుగుత్తులు వ్రేలుచు జిత్తాహ్లాదము నొదవించుచుండును. దివ్యములైన పఱుపులు, దిండులును దేజరిల్లుచుండును. నెమలిపింఛములతో, గోపుచ్ఛములతో, జమరీమృగపుచ్ఛములతో, ఖర్జూరపత్రములతో నిర్మింపబడిన వీవన లెన్నియో వెలుగొందుచుండును. పర్యంకములకు నాలుగుమూలలందును రత్నదీపములు లగ్నిశిఖలవలె వెలుగులను వెలిబెట్టుచుండును. వట్టివేరువీవనలు ప్రకాశించుచుండును. సువర్ణమయములై, రత్నమయములైన తాంబూల పేటికలు తళతళ లీనుచుండును. వెండితో నిర్మింపబడిన నిష్ఠీవనపాత్రములు (ఉమ్మివేసికొను పాత్రలు) నిగనిగలు వెలయించుచుండును. చక్కదనమున రంభను మీఱిన చక్కనిచుక్క లనదగు దాసికామణు లెందఱో వివిధాభరణ విభూషితలై యిందందు నడయాడుచుందురు. సీతారాములకు వీవనలు వేయుచుందురు. అశ్వమేధ యజ్ఞకాలమున రాజపత్నులచే సీతామహాదేవికి గానుకగా నర్పింపబడిన చిత్రవిచిత్రములగు పంజరము లెన్నియో యందిందందు వ్రేలుచుండును. అందు నెమళులు, హంసలు, నానపక్షులు. గోరువంకలు, చిలుకలు, లావుకపిట్టలు, కోకిలలు మొదలగు నూర్లకొలది పక్షులు నిరంతరముగా గిలకిలారావములు సేయుచుండును. శిష్యా! విష్ణుదాసా! ఆ పక్షులు పలుకు పలుకుల నేమని వర్ణింతును? అవి యన్నియు నీ క్రిందివిధముగా నెడ తెగక రామనామస్మరణము గావించుచు జీవన్ముక్తము లివి యని చెప్పనొప్పుచుండును.

పక్షిణ ఊచుః

జయతు రాఘవో జానకీయుతో జయత్వఖిలరాజరాజేశ్వరః ।
దశరథాత్మజో లక్ష్మణాగ్రజో జయతు మాపతి ర్హాటకాంతకః ॥

జయతు కౌశిక స్యాధ్వరం గతో జయతు రక్షసాం మారకో మహాన్
జయతు గౌతమాహల్యయా స్తుతో జయతు జానకీతాతమానితః ॥
జయతు నః పతి శ్చాపఖండనో జనకజాకరోన్ముక్తమాలయా ॥
నృపసభాంగణే కౌశికానుగః పరమశోభిత శ్చాతిహర్షితః ॥
జయతు భూమిజాం ఘురామో స్తదా ముదా
నిజకరోత్పలే స్థాప్య రాఘవః ।
కమలహ స్తకేనాకరోన్నతిం స రఘునందనః పాతు నస్సుఖమ్ ॥
జయతు భూమిజాలింగితో మహాన్ జనమనోహర శ్చాతిశోభనః
పరశురామదం ధృత్యవై ధను ర్నిజపితు స్తదా దర్శయన్ బలమ్ ।
జయతు సీతయా భోగకృచ్చిరం, జయతు కైకయీప్రేరితో వనమ్ ॥
జయతు పర్వతే వాసకృచ్చిరం జయతు యోఽత్రిణా పూజితో వనే ॥
జయతు యో విరాధస్య ఘాతకృత్ । జయతు దూషణాదిప్రమర్దనః ।
జయతు యో మృగం యో హయద్భవాత్ । జయతు యః కబంధం
తృణాజ్జహౌ ॥
జయతు వాలిహా సేతుకారకో । జయతు రావణాదిప్రమర్దకః ।
జయతు స్వం పదం ప్రాప సీతయా।జయతు మంగళస్నానకృన్ముదా॥
జయతు వాక్యతో భూసురస్య యః । సకలభూతలం పర్యటన్ చిరమ్।
జయతు యాగకృల్లోకశిక్షయా । జయతు జానకీం రంజయన్ స్థితః ॥

శ్రీరామదాస ఉవాచ.

రఘువరస్య యత్పంక్తిభిః కృతం । నవక ముత్తమం యః పఠిష్యతి ।
తపననిర్గమే భక్తితత్పరో నిజమనోఽర్థితం సంగమిష్యతి ॥

( 0 0 0 )

శిష్యా ! విష్ణుదాసా ! ముందు నాచే వర్ణింపబడిన విధముగా సర్వలక్షణసంపన్నమైన సుందరమందిరమునందు సీతతోఁగూడి శ్రీరామ

చంద్రు డేకపత్నీ వ్రతమును బాటించుచు క్రీడావినోదసుఖభోగముల దేలియాడెను. పాన్పుపై నాసీనుడైన శ్రీరామచంద్రుని సీతయు దన క్రీడాకౌతుకాదులతోడ నానందింపజేసెను. రఘునందను డొకనా డానందపూర్వకముగా మంచముపై గూర్చుండి యతితరమైన సీతాదేవి సోయగము నవలోకించి యిట్లు వర్ణించెను.

తామరపువ్వులను బోలు కన్నులుగల యో ప్రేయసీ! సీతా! నీవు బ్రహ్మదేవునిచేత నేమి సృజింపబడితివి ? నిన్ను బ్రహ్మ సృష్టించ లేదని నే నూహించుచున్నాను. ఏల యనగా నిన్నుబోలు సౌందర్య రాశియగు కాంత నింకొకతె నీలోకములో నెందును గానను. నీగోళ్ళు పాడ్యమినాటి చంద్రరేఖలు. ఆగోళ్ళ నడుమనున్న యెఱ్ఱని వన్నెలు దానిమ్మగింజలు. వర్తులములై యుండు నీ బొట్టనవ్రేళ్ళు చంటిబిడ్డల బొట్టనవ్రేళ్ళను దలపించుచుండును. పాదతలములు తామరరేకుల లోపలిభాగములను దలపించుచుండును. అందు ధ్వజము మున్నగు రేఖ లందము లీనుచుండును. నీ పాదములందు బారాణితో నేర్పరింప బడిన స్వస్తికాదిచిహ్నములు పరమ రమణీయములై పరిఢవిల్లు చుండును. నీపాదముల యుపరితలములు రోమరహితములై, మాంస లములై, మంగళమూలకములై, సమములై, మృదులములై, పీత వర్ణయుతములై (పచ్చనివై) నాడులను వెలిబెట్టనివై రాజకాంతల వందనముల నందికొన న్వర్హములై యందగించుచుండును. నీపాద మూలములు వర్తులములై (గుండ్రనివి) యెఱ్ఱనివై, సమములై, నవనీతమృదులములై పొలుపారుచుండును. నీకాలి మడమలు వర్తులములై, సమములై, సీతములై, కోమలములై రోమరహితములై కన్నులపండువు సేయుచుండును. నీపిక్కలు గోఱుచ్ఛములను బోలుచు వర్తులములై, మాంసలములై, రోమరహితములై, మృదులములై, పీతములై, సుందరములై నాడులను వెలిబెట్టక పోడుములను వెల యించుచుండును. నీమోకాళ్ళు వర్తులములై మాంసలములై, మాదీ

ఫలములవలె మనమును హరించుచుండును. నీతొడలు అరటిబోదలను బోలుచు మాంసలములై, యత్యంతమృదులములై, వర్తులములై, బలుపు గలవై రోమరహితములై, సుఖసంధానసముచితములై శోభలు గురియుచుండును. నీ కటిప్రదేశము మాంసలమై మనోహరమై, వర్తులమై, పీతమై, రోమరహితమై; సన్ననై యేనుగు కుంభస్థలమును బోలుచు నాచిత్తములో మోహావు వత్తిలము నుదయింపజేయుచుండును. నీ నాభి గంభీరమై, వర్తులమై, రమణీయమై రాజిల్లుచుండును. నీయుదరముపై మూడు ముడుతలు త్రివేణిని దలపించుచుండును. నీ నడుము సింగపు నడుమును బోలి చెన్నలలారుచుండును. నీ యుదరము సూక్ష్మమై, మృదులమై, మాంసలమై, మంగళప్రదమై, రోమవిహీనమై, పీతమై, పుత్రోత్పత్తిసూచకమై పొలుపారుచుండును. నీవెన్నుపూస వంశఖండమును బోలుచు మాంసలమై, కోమలమై, నిమ్నమై (లోతు) రోమరహితమై యందమొలికించుచుండును, నీ పార్శ్వభాగములు కండగలిగి, పచ్చనివన్నెగలిగి, రోమములులేక సన్ననై చెన్నారుచుండును, నీకుక్షిదేశము పీతమై, రోమరహితమై, మాంసలమై సుంత యెత్తుగా శోభిల్లుచుండును. నీ వక్షస్థలము కోమలమై, రమణీయమై, రోమరహితమై, కండగలిగి, పచ్చని చాయగలిగి,సన్ననై, యెత్తుగా, విశాలముగా, నాకు సుఖదాయకమై సొబగు లీనుచుండును. నీ స్తనములు రెండును బలుపు గలిగి, గట్టితనము గలిగి మంగళప్రదములై సువర్ణకలశములను బోలుచు బొలుపారుచుండును. నీ బాహువులు రెండును నేనుగు తొండములవలె బలిసినవై మృదులములై చెలువారుచుండును. నీవ్రేళ్ళు సన్నముగా, మృదువుగా మనోహరముగా బ్రకాశించుచుండును. నీ యఱచేతులు శంఖము, ధ్వజము, మత్స్యము మున్నగు నుత్తమరేఖలు గలిగి, కండ గలిగి, యెఱ్ఱని చాయ, గలిగి, మనోహరములై యలరారుచుండును, చేతుల వెనుకభాగములు రోమ

రహితములై మాంసలములై, కోమలములై యొప్పుచుండును. నీ మూపులు బలుపుగలిగి వర్తులములై భాసిల్లుచుండును. నీ జత్రు దేశములు (మూపులసంధి యెముకలు) మాంసలములై మనోహరముగా నుండును. శంఖమును బోలు నీ కంఠము బలుపు గలిగి మూడు ముడుతలతో నొప్పులొలుకుచుండును. నీగడ్డము బలుపు గలిగి వర్తులమై మృదులమై నడుమ గుంట గలిగి చెలువు లీనుచుండును. నీ క్రిందిపెదవి పగడమువలె, దొండపండువలె నెఱ్ఱని చాయ గలిగి కోమలమై యమృతమువలె మధురిమలను వెలిబెట్టుచుండును. నీ దంతములు మల్లిమొగ్గలను దలపించుచు దాంబూలాదులను తఱచుగా సేవించుచుండుటచే నంత నల్లదనము వహించి సువర్ణపుష్పముల తోడను, సువర్ణసూత్రములతోడను జిత్రవిచిత్రముగా నలంకృతములై మనోహరముగా బ్రకాశించుచుండును. నీ పై పెదవి కోమలమై యెఱ్ఱని చాయతో నింపెసలారుచుండును. నీ ఘ్రాణము తిన్ననై, యున్నతమై, దివ్యమై, మనోహరమై యలరారుచుండును. నీకన్నులు తామర రేకుల వలె, సోగలై, లేడికన్నులవలె జపలములై, మన్మథుని బాణములవలె బ్రీతిజనకములై తేజరిల్లుచుండును. నీ చెవులు బలుపు గలిగి చిక్కనై, యాభరణముల భారమును వహింప నర్హములై యలరుచుండును. నీ చెక్కిళ్ళు చిక్కణములై (నునువు) యున్నతములై మంగళమూలకములై పొలుపారుచుండును. నీ కనుబొమలు సన్ననై విండ్లను బోలుచు నల్లని చాయతో గోమలములై యింపెసలారుచుండును. నీ లలాటము (నుదురు) వెడదయై, మాంసలమై, సమతలమై, మృదులమై యొప్పారుచుండును. నీ సీమంతము (పాపట) గంగాతటమును బోలి సుందరమై శోభిల్లుచుండును. నీ శిరోజములు (జుట్టు)నిడుదలై చిక్కనై, కోమలములై సువర్ణతంతువులవలె సొబగు లీనుచుండును. నీతల చిన్నదై, వర్తులమై, మాంసలమై, మంగళదాయకమై చెలువారుచుండును. నీ జడ కటిప్రదేశమును మీటి నిడుదయై నెగడొందు

చుండును. నీ చాయ సంపెంగపూచాయను దలపించుచుండును. నీలో సౌకుమార్యము మూర్తీభవించియుండును. నీ మొగముతో స్పర్థకు (పోటీ) బోయి చంద్రుడు క్షయరోగమునకు గురియయ్యెను. నీ కన్నులను గెలువబోయి ఓటమిని బొంది లేడి యడవులపాలైనది. నీకనుబొమలతో స్పర్ధకు దలపడినదగుటచేతనే నేను పూర్వము వింటిని నడుమకు రెండు ఖండములుగా విఱిచితిని. నీచూపుల తూపులు సోకినచో మునుల మనములందు గూడ వికార ముదయించును. నీ కన్నులలోని చపలత్వమును జూచి మత్స్యములు సిగ్గుపడును. నీ ముక్కును జూచి చిలుక తన కట్టి యందమైన ముక్కులేనందులకు దనను దాను జీకొట్టుకొనుచుండును. నీపెదవుల యెఱ్ఱదనమును, సౌకుమార్యమును జూచి తీయమామిడి చిగురు తనయందాగుణములు లేనందులకు జింతించి తనయెఱ్ఱదనమును వీడి సిగ్గుచే బచ్చనై వెలవెల బోవుచున్నది. ప్రేయసీ! యీవిధముగా నీ చక్కదనము నేమని వర్ణింతును? ఎంతని వర్ణింతును? దివ్యమైన నీ మహాసౌందర్యమును వర్ణింప బ్రహ్మదేవునకు గూడ నలవిగాదు. అని పలికి శ్రీరామ చంద్రుడు సీత నమితమైన ప్రీతితో గాఢముగా గౌగిలించికొనెను. ఆ తన సౌందర్యవర్ణనము నాలకించి సిగ్గుపడుచు సిరము వంచికొని మొగమున జిఱునగవు వెన్నెలలు గురియ నామె బతియొక్క బాహు బంధమున జలింపకుండెను.

ద్వితీయ సర్గము సమాప్తము.

— () —

## తృతీయ సర్గము

- దేహ రామాయణ వర్ణనము -

రామదాసు విష్ణుదాసున కిట్లు వినిపించును.

అనంతరము సీత సిగ్గుపడుచు, వినయభావమును వెల్లడించుచు 'రాజీవనయనాభిరామా ! నాప్రేమధామా ! శ్రీరామా ! మీరు

సమ్మతించినచో నాకు మిమ్మొక్క ప్రశ్న మొనరింప కుతూహల
మగుచున్నది, అని పలికెను. ఆ పలుకు నాలకించి రఘునందనుడు
దేవీ! ఏమి ప్రశ్నింప నెంతువో సుఖముగా బ్రశ్నింపుము. సంశ
యింపవలదు. ఎంతటి గుప్తవిషయమైనను నీకు దెలియజెప్పగలను'
అని యామెను బ్రోత్సహించెను. అంతట నామె మహాబాహూ!
స్వామీ! రఘురామా! నాకిప్పుడేమైన నుపదేశింపుము. తన్మూల
మున నాలో దివ్యజ్ఞాన ముదయింపనలయును అని కోరెను. ఆమె
పలుకు నాలకించి శ్రీరామచంద్రు డిట్లు నొడువ నారంభించెను. పరమ
ప్రీతా! సీతా! నీవుత్తమప్రశ్న మొనరించితివి. సావధాన చిత్తురా
లవై యాలకింపుము. నాయొక్క తత్త్వము నెఱుగగలుగునట్టి
యుపదేశము గావించెదను.

## దే హ రా మా య ణ మ్

### శ్రీరామచంద్ర ఉవాచ

సచ్చిదానందరూపాఖ్యసాగరస్య స్వదిచ్ఛయా ।
తరంగరూపమాఽఽత్మాంశబింబః శుద్ధో విసర్గతః ॥

ఆత్మనామా మాతృభూతబుద్ధే ర్జఠర సంభవః ।
శుద్ధసత్త్వాంతఃకరణం పితా చాత్మన ఈరితః ॥

తస్యాత్మనశ్చ చత్వారో భేదా స్తే బంధనః స్మృతాః ।
తుర్యావస్థ స్తత్ర పర స్తతో జాగ్రగవస్థకః ॥

స్వప్నావస్థ స్తృతీయ శ్చాపరః సుషుప్త్యవస్థకః ।
హృదయాకాశ స్తత్ స్థానం మనో వేగో బహిర్గమః ॥

మనోదుర్వృత్తిఘాతశ్చ మనో వేగస్య ఖండనమ్ ।
మాయాయోగ స్తత స్తస్య పూర్వసంస్కారవిగ్రహః ॥

తతః కుబుద్ధిహేతోర్హి భవారణ్యేఽటనం చిరమ్ ।
దంభస్య నిగ్రహ స్తత్ర పంచభూతాత్మికా స్థిరా ॥

ఆత్మనః పర్ణకుటికా విశ్రాంతిస్థాన మీరితా ।
కామక్రోధలోభజయ స్తత్రాశాకృంతనం స్మృతమ్ ॥

మోహస్య నిగ్రహ స్తత్ర శుద్ధమాయాశ్రయ స్తతః ।
రజోరూపా తు యా మాయా జఠరాగ్నా తదా స్మృతా ॥

తామస్యాశ్చైవ మాయాయా వియోగశ్చ తదా స్మృతః ।
సుఖలాభో మహాన్ క్లేశః శోకభంగ స్తతః పరమ్ ॥

వివేకస్యాశ్రయ స్తత్ర భక్త్యుద్రేక సమాగమః ।
అవివేకవధశ్చాపి వ్యుత్సాహేన సమాగమః ॥

అజ్ఞానతరణోపాయ స్త్రిగుణాశ్రయ సద్మని ।
లింగాఖ్యనిగ్రహ స్తత్ర మదస్య సంప్రకీర్తితః ॥

నిగ్రహో మత్సరస్యాపి తతోఽహంకారనిగ్రహః ।
వియోగో లింగదేహస్య మాయానామైక్యతా తతః ॥

హృదయాకాశగమన మానందైకసుఖం తతః ।
మాయాత్యాగ స్తతశ్చైవ సాత్త్విక్యా గ్రహణం స్మృతమ్ ॥

సాత్త్విక్యా మాయయా సార్ధం హృదయాకాశ ముత్తమమ్ ।
మహాకాశే ప్రణయనం సచ్చిదానందసంజ్ఞకే ॥

ప్రవేశనం సాగరే హి ముక్తి ర్జ్ఞేయాఽఽత్మనః శుభా ।
సాయుజ్యా సా పరిజ్ఞేయా భుక్తి ర్ముక్తిచతుష్టయే ॥

ఏవం మయేయం తే ప్రీత్యా సీతే సంజ్ఞానపేటికా ।
వేదసారై ర్గూఢార్థై రజ్ఞానమతి నాశకైః ॥

మజ్ఞానదైః పంచదశ శ్లోకరత్నైః ప్రపూరితా।
సమర్పితా గృహాణ త్వ మస్యాం బుద్ధ్యాఽవలోకయ ॥

సచ్చిదానంద మనునది యొక మహాసముద్రము. దాని సంకల్పమే దాని తరంగము. దానినుండి పరిశుద్ధమై, యంశభూతమైన యాత్మ యనెడు బిందువు వెలువడినది. ఆ యాత్మకు బుద్ధి తల్లి. శుద్ధమై సత్త్వగుణసంపన్నమైన యంతఃకరణము తండ్రి. ఆ యాత్మకు నాలుగు భేదము లున్నవి. అవి యవస్థలు. అందు మొదటిది తుర్యావస్థ. ఇది సర్వోత్తమమైనది. రెండవది జాగ్రదవస్థ. మూడవది స్వప్నావస్థ. నాలుగవది సుషుప్త్యవస్థ. హృదయాకాశము వానిస్థానము. మనోవేగము వాని బహిర్యాత్ర. మనోగతములైన దుర్వృత్తులను నశింపజేయుటయు, మనోవేగమును ఖండించుటయు, మాయతోడ సంపర్కము, పూర్వసంస్కారముల నణచుటయు, విమ్మట దుర్బుద్ధి కారణముగా సంసారమను మహారణ్యమున జిరకాలము తిరుగాడుటయు,దంభము నణచుటయు, నాత్మ పాంచభౌతికమైన పర్ణకుటీరమున నివసించుటయు, గామక్రోధలోభములను జయించుటయు, నాశను గోసివేయుటయు, మోహము నణచుటయు, శుద్ధమాయ నాశ్రయించుటయు, రజోగుణాత్మకమైన మాయ జఠరాగ్నిలో ప్రవేశించుటయు, దమోగుణాత్మకమైన మాయ నెడబాయుటయు, సుఖము లేకపోవుటయు, మహాక్లేశము గలుగుటయు, ననంతరము శోకము నివృత్తమగుటయు, వివేకము నాశ్రయించుటయు, భక్తిస్వప్రదేకముదయించుటయు, నవివేకము వధింపబడుటయు, నుత్సాహముతోడ మైత్రియు, నీ త్రిగుణాత్మకమైన దేహమునం దజ్ఞానమును దాటుటకుపాయ మవలంబించుటయు, మదము నణచుటయు (ఇచ్చట నీ మద నిగ్రహమును లింగనిగ్రహమందురు.) మత్సరము నణచుటయు, నహంకారము నణచుటయు, లింగదేహము తొలగుటయు, మాయ

లయము నొందుటయు, హృదయాకాశమును జేరి యానంద సుఖ మయత్వము నందుటయు, మాయను బరిత్యజించుటయు, సత్త్వ గుణాత్మకమైన మాయను స్వీకరించుటయు, నాసాత్త్వికమాయతోడ హృదయాకాశము సచ్చిదానందమనబడు మహాకాశమున లయము నొందుటయు, ననునివి దేహరామాయణములో గ్రమముగా సంభవించు పరిణామదశాసన్నివేశములు. సచ్చిదానంద సాగరమున నాత్మబిందువు లయము నొందుటయే నాలుగు విధములైన ముక్తులలో నొకటి యగు సాయుజ్యముక్తి యనబడును.

జనకజాతా! సీతా! యీ విధముగా వేదములయొక్క సారభూతములగు నిగూఢార్థములతో నిండినవియు, నజ్ఞానమును హరించునవియు, నన్నెఱిగింప ననువగు జ్ఞానమును బ్రసాదించునవియు నగు పదునైదు శ్లోకరత్నములతో నిండిన జ్ఞానపేటికను బ్రీతితో నీ కర్పించితిని. నీవీ పేటికను దెఱచి బుద్ధితోడను, జక్కని యాలోచనా దృష్టితోడను నీ శ్లోకరత్నములను బరిశీలించి చూడుము. నీకు నా స్వరూపపరిజ్ఞానము గలుగగలదు. అని పలికిన శ్రీరామచంద్రుని పలుకుల నాలకించి సీత సానందముగా నా జ్ఞానపేటికను దెఱచి తనబుద్ధి దృష్టిచే బరిశీలించి చూచెను. అప్పు డామెకు దన క్రీడారహస్యమంతయు జక్కగా నవగత మయ్యెను. అంతటనామె యెంతయో సంబరమంది శ్రీరామచంద్రుని పాదపద్మములకు బ్రణమిల్లెను. ఆనందముతో నిండినదై, యానందాశ్రువులను వెడలించుచు సానందము కారణముగా శరీరమున రోమాంచ ముదయింపగా నామె క్షణకాల మూరకుండెను. ఆమెను గాంచి రాఘవుడు- దేవీ! జ్ఞానపేటికను బరిశీలించి చూచితివా? అందు నీకేమి గోచరించినది? నీ యజ్ఞానము తొలగినదా? నాస్వరూప పరిజ్ఞానము గలిగినదా? నీకు బాగుగా దెలిసెనో లేదో నే నెఱుగగోరుచున్నాను. అందింకను నీ కవగతము గాని యంశ మేమైన నున్నచో మఱల బోధింతును, చెప్పుమని ప్రశ్నించెను. ఆపలుకుల నాలకించి

సీత యానందసాగరమున నోలలాడుచు మంచముపై గూర్చుండి శ్రీరామచంద్రునితో నీ విధముగా నొడువ నారంభించెను.

స్వామీ ! రఘునాథా ! నాకు మీా రొసగిన జ్ఞానపేటికను నేను బుద్ధిదృష్టితో బాగుగా బరికించితిని. నాకు మీా స్వరూపపరి జ్ఞానము ప్రాప్తించినది. మీారు నిర్గుణులు. నిర్వికారులు. లోకకల్యాణమును గోరి మీారు నాతోడగూడి యీావిధముగా భూమిపై క్రీడించుచున్నారు. పదునైదు శ్లోకములలో మీారు నా కుపదేశించిన జ్ఞానము నాకెట్లు లవగత మయ్యెనో వివరించుచుంటి నాలకింపుడు. లోకమునందలి యల్పబుద్ధులగు జనులకు జ్ఞానమును బ్రాప్తింప జేయుటకు, వారికి తగిన విధముగా బోధము చేయుటకును మీారాచరించిన చరిత్ర మేది గలదో,దానిని బాగుగా దలచి పరిశీలించినచో మానవున కాత్మజ్ఞానము తప్పక సిద్ధించును. సచ్చిదానందస్వరూపు డగు శ్రీమహావిష్ణువే సచ్చిదానంద మను మహాసముద్రము. అతనికి భూభారమును హరించుట మున్నగు సంకల్పములేవి గలుగునో యవియే యా సముద్రమునయొక్క తరంగములు. ఆ సముద్రమునుండియే యాత్మాంశరూపమగు నొక బిందువు బహిర్గతమగును. అట్లు బహిర్గతమైన బిందువే యాత్మ యనబడును. మీారే యా యాత్మస్వరూపులు. ఆత్మకు బుద్ధి తల్లియని కదా మీారంటిరి. అనగా మీాకు గౌసల్య తల్లి.శుద్ధమై సత్వగుణ సంపన్నమైన యంతః కరణమును గదా యాత్మకు తండ్రిగా చేసుకొంటిరి అనగా మీాకిక్కడ సత్యపరాక్రమ శాలియగు దశరథుడు తండ్రి.ఆ యాత్మయొక్క నాలుగు భేదములు నన్నదమ్ములు. అనగా రామలక్ష్మణభరతశత్రుఘ్న లనబడు మీారు నలుగురు నన్నదమ్ములు. అభేదములలో దుర్యావస్థ యు[illegible]. అనగా మీాసోదరులలో మీారు త్రయులు. అందు రెండ[illegible] యైన నిచ్చట మీాలో రెండవవాడు లక్ష్మణుడు. [illegible]వది స్వప్న



యై మూడవవాడు భరతుడు. నాలుగవది సుషుప్త్యవస్థయైన నాలుగవవాడు శత్రుఘ్నుడు. హృదయాకాశము ఆత్మకు స్థానమైన నయోధ్య మీకు స్థానము. ఆత్మవిషయమున మనోవేగము బహిర్యాత్రయైన విశ్వామిత్రుని యజ్ఞమును రక్షింప నేగుట మీ బహిర్యాత్ర. మనోగతమైన దుర్వృత్తి నణచుట యనగా దాటకాసంహారము, మనోవేగమును ఖండించుట యనగా మీరు విల్లు విఱచుట. మాయతోడి సంపర్కము అనగా మీరు నన్ను బెండ్లి యాడుట. పూర్వ సంస్కారనిగ్రహము అనగా బరశురాముని నిగ్రహించుట. దుర్బుద్ధి కారణము అనగా కైకేయీవరదానము. సంసారారణ్యమున దిరుగుట యనగా మీరు దండకారణ్యమున సంచరించుట. దంభము నణచుట యనగా విరాధసంహారము. ఆత్మకు బంచభూతాత్మకమైన యీ శరీరము పర్ణకుటీరమైన మీకు బంచవటిలోని పర్ణశాల విశ్రాంతి స్థానము. కామనిగ్రహమే ఖరసంహారము. క్రోధనిగ్రహమే దూషణసంహారము. లోభనిగ్రహమే త్రిశిరుడనువాని సంహారము. ఆశలను గోయుటయే శూర్పణఖ ముక్కుచెవులు గోయుట. మోహనిగ్రహమే మాయలేడి రూపమున నున్న మారీచుని సంహరించుట. శుద్ధమాయ నాశ్రయించుట యనగా దండకారణ్యమునందు మీరు నా సాత్త్విక స్వరూపమును మీ వామాంగమునందు ధరించుట, రజోగుణాత్మకమైన మాయ జఠరాగ్నిలో బ్రవేశించుట యనగా నా రజోగుణాత్మక స్వరూప మగ్నిలో బ్రవేశించుట. తమోగుణాత్మకమైన మాయతోడి వియోగ మనగా నా తమోగుణాత్మకస్వరూపమును రావణుడు హరించుటచే మీకు వియోగము గలుగుట. మీకు నాకు నెడబాటు గలుగుటయే సుఖములేమి. మహాక్లేశము.శోకభంగ మనగా గబంధ సంహారము. వివేకము నాశ్రయించుట యనగా సుగ్రీవునితోడి చెలిమి. భక్త్యుద్రేకప్రాప్తియనగా మీరు హనుమంతునకు లభించుట. అవివేకమును సంహరించుట యనగా వాలిసంహారము, ఉత్సాహముతోడి

మైత్రి యనగా విభీషణునితోడి మైత్రి. అజ్ఞానమును దాటుట కుపాయ మనగా సముద్రముపై వారధిని నిర్మించుట. త్రిగుణములకు నాశ్రయ భూతమగు లింగదేహమునందు మదనిగ్రహ మనగా లంకానగరము నందు కుంభకర్ణుని సంహరించుట. మత్సరము నణచుట యనగా మేఘ నాద సంహారము. అహంకారము నణచుట యనగా రావణసంహారము మాయ లయమొందుట యనగా నాసత్త్వరజస్తమోగుణాత్మకములగు మూడు మూర్తులును మిమ్ము జేరుట లింగదేహము నెడబాయుట యనగా లంకానగరపరిత్యాగము. హృదయాకాశమును జేరుట. యనగా నయోధ్యకు జేరుట. ఆనందసుఖభోగమనగా రాజ్యభోగము. మాయాపరిత్యాగ మనగా నన్ను వాల్మీకి యాశ్రమమున దిగవిడు చుట. (ఈ కార్యము ముందు జరుగనున్నది.) సాత్త్వికమాయను స్వీకరించుట యనగా మీరు నన్ను మరల స్వీకరించుట. సాత్త్విక మాయతోడి యుద్యోగము అనగా మీరు నాతోడ విహరించుట హృదయాకాశమును మహాకాశమున లయ మొందించుట యనగా నయోధ్యను వైకుంఠమునకు జేర్చుట. సచ్చిదానందసాగరమున ప్రవేశ మనగా మీరు మానవరూపమును బరిత్యజించి మహావిష్ణు స్వరూపమును దాల్చుట. మానవుల యీ ముక్తియే సాయుజ్య ముక్తిగా బేర్కొనబడినవి.

స్వామీ! మీరా విధముగా శుభాశుభకర్మముల నన్నిటిని లోక శిక్షణమును, లోకకల్యాణమును గోరి యాచరించుచున్నారు. నిర్గుణులు, నాత్మరూపులు, సచ్చిదానందస్వరూపులు, సర్వాతీతులు నగు మీకు గర్తవ్యకర్మమేమి? అకర్తవ్యకర్మమేమి? పదునైదు శ్లోకరత్నములలో మీరు నాకుపదేశించిన జ్ఞానము నాకు జక్కగా హృదయంగమమైనది. ఆ శ్లోకములను నేనెల్లవేళల గంఠమునందు హారమువలె ధరింతును. దేహరామాయణ మను పేర మీరు చేసినట్టి యుపదేశము మును పెవ్వరును జేసియుండలేదు. ముందుపదే

శింపబోరు. నాయందు మీకున్న యనురాగము కారణముగా మీరు నాకీ దేహరామాయణము నుపదేశించితిరి. కాని దీని యెఱుక బ్రహ్మాదిదేవతలకు గూడలేదు. గూఢమై, రమణీయమై, దుర్బోధమై యల్పమై యనల్పజ్ఞానమును బ్రసాదింపగల యీ దేహరామాయణము నాలకించినంత మాత్రమున బాపము లన్నియు నశించును.

అని పలుకుచున్న సీత పలుకుల నాలకించి శ్రీరామచంద్రుడు మందహాసము జేసి యిట్లు పలికెను. దేవీ! విదేహరాజకుమారీ! నీవు ధన్యురాలవైతివి. నేనొసగిన జ్ఞానపేటికను జక్కగా బరిశీలించితివి. నీ పరిశీలనములో న్యూనత్వ మావంతయును లేదు. మోహజాలమును హరింపగల నా స్వరూపపరిజ్ఞానమును నీవు నీబుద్ధిచే జక్కగ నవగత మొనర్చికొంటివి. ఈ దేహరామాయణము నెవ్వరికి నుపదేశింపరాదు. ఈ నిగూఢవిషయమును నీయందలి ప్రీతిచే నీ కుపదేశించితిని. దీనిని దాంభికునకు, నాస్తికునకు, శఠునకు, నభక్తునకు, బ్రాహ్మణులను ద్వేషించువానికి, బరభార్యల పొందు నభిలషించువానికి, మలినమైన యంతఃకరణము గలవానికి, గ్రూరునకు, బరనిందా పరాయణునకు, మందబుద్ధి యగువానికి నెన్నడు నుపదేశింపరాదు. కలియుగమం దిది గుప్తముగనే యుండును. వేనవేలు జనులలో నెవ్వనికో యొకనికీ దేహరామాయణ పరిజ్ఞానము గలుగును. సర్వవేదాంతముల యొక్కయు సార మిందు నిబిడీకృతమై యున్నది. ఇది భుక్తిముక్తులను బ్రసాదింపగలదు.

ఈవిధముగా బలికి శ్రీరామచంద్రుడు పలువురు దాసీజనములు దనకు వీవనల వీచుచుండ సీతతోగూడి రత్నఖచితమైన పర్యంకముపై బవళించి సుఖముగా నిదురించెను.

తృతీయ సర్గము సమాప్తము

—()—

# చతుర్థసర్గము

## సీతాదేవి యలంకారముల వర్ణనము

శ్రీరామదాసుకు విష్ణుదాసున కిట్లు వినిపించుచు.

నాలుగు గడియలరాత్రి శేషించియుండగా శ్రీరామచంద్ర
మేలుకొలుపుటకై యాతని శయనమందిరము వెలుపలకు జేరి వం
మాగధులు, సూతులు, నర్తకీమణులు, నటులు మున్నగువారు వి
ములైన వాద్యములను ప్రయోగించిరి. అచ్చర లాడుచు మంగళగీత
లను బాడిరి. కలకంఠములతో ప్రభాతస్తోత్రములతో బాటనేకస్తో
ములను బఠించిరి.

— సుప్రభాత స్తోత్రమ్ —

విఘ్నేశ్వర స్సకలవిఘ్నవినాశదక్షో
దక్షాత్మజా భగవతీ హి సరస్వతీ చ।
దృష్ట్వాష్టభైరవగణా నవదివ్యదుర్గా
దేవ్య స్సురాస్తు నృపతే తవ సుప్రభాతమ్॥

భాను శ్శశీ కుజబుధౌ గురుశుక్రమందా
రాహు స్స కేతు రదితి ర్దితి రాదితేయాః
శక్రాదయః కమలభూః పురుషోత్తమేంద్రో
రుద్రః కరోతు సతతం తవ సుప్రభాతమ్ ॥

పృథ్వీ జలం జ్వలనమారుతపుష్కరాణి
సప్తాద్రయోఽపి భువనాని చతుర్దశైవ
శైలా వనాని సరితః పరితః పవిత్రాః
గంగాదయో విదధతాం తవ సుప్రభాతమ్ ॥

దిక్చక్ర మేత దఖిలం దిగిభా దిగీశా
నాగా స్సుపర్ణభుజగా నగవీరుధశ్చ

పుణ్యాని దేవసదనాని బిలాని దివ్యా
న్యవ్యాహతం విదధతాం తవ సుప్రభాతమ్॥
వేదా ష్షడంగసహితా స్స్మృతయః పురాణం
కావ్యం సదాగమపథో మునయోఽపి దివ్యాః
వ్యాసాదయః పరమకారుణికా ఋషీణాం
గోత్రాణి వై విదధతాం తవ సుప్రభాతమ్॥

అని యీవిధముగా వందిమాగధులు సేయు స్తోత్రపఠనముల తోడను, మంగళగీతములతోడను, బంజరము లందలి పక్షులు గావించు స్తుతివచనములతోడను, నవవిధములగు వాద్యముల ధ్వనులతోడను సీతాసమేతుడైన శ్రీరామచంద్రుడు మేలుకాంచెను. తొలుత సీత మేల్కాంచెను. పిమ్మట రఘునందనుడు మేల్కాంచెను. మేల్కాంచి యతడు దేవతలను, మునులను, దండ్రిని, దల్లిని, సరయూనదిని, గురువును, జింతామణిని, గామధేనువును మానసికముగా స్మరించెను. సీతకూడ దుర్గను, గంగను, సరస్వతిని, రఘునందనుని, గౌసల్యను, గురుపత్నిని, దన తల్లిని సంస్మరించికొనెను. పిమ్మట శ్రీరామచంద్రు నకు బ్రణమిల్లి వినయవినమ్రవదనయై నిలిచెను. శ్రీరామచంద్రు డటనుండి కదలి యావశ్యకములగు శౌచవిధులను నిర్వర్తించికొని దంతధావనము జేసికొనెను. అనంతరము స్నానవిధులను పూర్తి జేసి కొనెను. యథావిధిగా నగ్నిలో హోమము లొనరించెను. గృహము నందు దేవతల నర్చించెను. బ్రాహ్మణుల కనేకదానములు గావించెను. అంతలో సీతయు స్నాన మొనరించి దేవీపూజనము గావించి కొని దేవతలకు, నగ్నిహోత్రమునకు, బ్రాహ్మణులకు, నత్తలకు నమస్కరించి శ్రీరామచంద్రునకు బ్రణమిల్లి యతని పార్శ్వభాగ మున గూరుచుండెను. సీతతోడను, దల్లులతోడను, సోదరులతోడను, మిత్రవర్గములతోడను గూడి రఘునందనుడు వసిష్ఠుని ముఖమున బురాణకథ నాలకించెను. ఆ గురువును, నాతని పత్నియగు నరుం

ధతిని బూజించెను. వారికి నమస్కరించెను. తరువాత దల్లులను, బ్రాహ్మణులను, బండితులను, వైదికకర్మనిష్ఠులగు మునులను, యోగ నిష్ఠులను, దపోధనులను, జ్యోతిశ్శాస్త్రవేత్తలను, మీమాంసాశాస్త్ర వేత్తలను, దార్కికులను, మంత్రశాస్త్రవేత్తలను, వయోవృద్ధులగు వారిని సపత్నీకుడై పూజించెను. వారి కందఱకును గరములుజోడించి నమస్కరించెను. పిమ్మట సీతయు బూజాసామగ్రులను సువర్ణపాత్రములో నుంచికొని సకియులను వెంట నిడికొని యేగి కామధేనువునకు నమస్కరించి బహువిధములగు నుపచారములతో, నూతనములైన పక్వాన్నములతో, విచిత్రములైన పాయసాదులతో నాధేనువు నారాధించెను. తరువాత దానికి బ్రదక్షిణ మాచరించి "యో గోమాతా! కామధేనువా! నీకు నమస్కారము. సత్వరముగా నీవు రామాదులకును, బ్రాహ్మణాదులకును దివ్యాన్నములను, బక్వాన్నములను బ్రసాదింపుము" అని ప్రార్థించెను. ఆకామధేనువునకు గ్రిందిభాగమున ననేకములగు సువర్ణపాత్రముల నుంచెను. కామధేను వా పాత్రములను వెంటనే దివ్యాన్నపరిపూర్ణములను గావించెను. వానిని గాంచి సీత యానందించెను. సువర్ణపాత్రములతోడ నా యాహారపదార్థములను గ్రహించి యామె కాలి యందెలు గల్లు గల్లుమను చుండగా నడివడిగా నడ్డనలు సేయుటకు లోనికి గొనిపోయెను. అంతలో శ్రీరామచంద్రుడు గూడ వేలకొలదిగా బ్రాహ్మణులను, మంత్రులను, నాప్తజనులను వెంట నిడికొని భోజనార్థము భోజన శాలలో బ్రవేశించెను. పట్టువస్త్రములను దాల్చి, వివిధాభరణ విభూషితులై రఘునందను డొసగిన గంధమాల్యాదులను గైకొని యెల్లరును సువర్ణపీఠములపై నాసీనులైరి. వారి ముందు రంగవల్లికలతో నలంకృతమైన స్థలముపై స్త్రీలు బంగారు ముక్కాలిపీటలను నిలిపి, వానిపై బంగారు పాత్రములను నిలిపిరి. వారి పార్శ్వప్రదేశము లందు శ్రీరామచంద్రుని సోదరుల భార్యలు బంగారు జలపాత్రము

లను, సువర్ణమయములై రత్నదీపసమలంకృతములైన సోమరసపాత్ర
ములను వేలు వేలుగా నుంచిరి. ఇంతలో వారికి రత్నహారములు,
ముత్యాల హారములును బరస్పర మొరసికొనుటవలన జనించినదియు,
గాలి యందెలు, చిఱుమువ్వలు, కంకణములు మున్నగువానివలన
బ్రాదుర్భవించినదియు నగు మధురశబ్దము వినవచ్చెను. ఈ శబ్దమేమి?
యని యెల్లవారలు నాశబ్దము వచ్చిన దిక్కున కవలోకించిరి. క్షణ
ములో సీతామహాదేవి వారి ముందు ప్రత్యక్షమయ్యెను. ఆమె
మెఱుపుదీవుల ప్రోవువలె, నూరుకోట్ల సూర్యుల తేజోరాశివలె దేజ
రిల్లుచుండెను. ఆమె పాదములందును, కాలివ్రేళ్ళయందును
జేప, తాబేలు, మొసలి మున్నగు నాకారములు గలిగి, రత్నఖచిత
ములై, సువర్ణమయములై, వివిధములైన చిఱుమువ్వల సవ్వడులను
వెలయించు నందమైన యందెలు, రత్నమయములైన యాభరణములు
గొలుసులు, రత్నకంకణములు ప్రకాశించుచుండెను. ఆమె కటిప్రదేశ
మున ముత్తెపుగుత్తులతో, సువర్ణసూత్రములతో, సువర్ణపుష్పము
లతో జూడముచ్చట గొలుపు పట్టుపీతాంబరము సరసరమణీయమై
పరిఢవిల్లుచుండెను. దానిపై భాగమున సద్దములతో గూర్పబడినదై,
సువర్ణసూత్రములతో నిర్మింపబడినదై, నెమలి, సింహము, వృషభము,
పులి, లేడి మున్నగువాని చిత్రములతో జిత్రితమై, సువర్ణసూత్రము
లతో నల్లబడిన మొలనూలు పరిమళపు బూతలచే గమగమలను
వెలిబెట్టుచు. శరీరపు గదలిక కారణముగా జిఱుమువ్వల సవ్వడులను
వెలయించుచు వీక్షణపర్వముగా వెలుగొందుచుండెను. అందు
బచ్చని, యెఱ్ఱని, యూకపచ్చని, నల్లని, నీలివన్నె గల మణులెన్నియో
ఘృణులను వెలిబెట్టుచుండెను. మొలనూలికి పైభాగమున నరటిపండ్ల
యాకారములతో నొప్పు నుజ్వలములైన సువర్ణపతకములు శోభిల్లు
చుండెను. బంగారు గొలుసులతో, గాజుద్రవపు బుడ్లతో, జిత్రవిచిత్ర
ములైన రత్నములతో, సువర్ణకిరీటపు దొడుగులు గలిగి ప్రకాశవంత

ములై నానావిధములైన మాణిక్యములతో గూర్చి నిర్మింపబడిన సువర్ణమయములైన యాభరణము లెన్నియో సొబగులీనుచుండెను. ఆమె హృదయదేశమున నవరత్నములు, ముత్యాలహారములు, విచిత్రములైన సువర్ణహారములు, బంగారుగొలుసులు, సువర్ణమయములైన మూర్తిమాలలు, యనవమాలలు, పుష్పమాలికలు, బంగారపు గోరునంకలు, సువర్ణపు టుసిరికాయల నడుమ జిన్నచిన్న బంగారు పూసలను జేర్చి కూర్పబడిన మాలలు, బగడములతో మణులతో, ముత్తెములతో మిశ్రమముగా గూర్పబడిన మాలలు, బంగారపు సంపంగిమొగ్గల కండెలు, మెడలో మంగళసూత్రము, రత్నఖచితమైన చిన్నపేటికయు, జిన్నచిన్నమణుల గుత్తులతో, ముత్తెపుగుత్తులతో గూర్పబడిన కంఠాభరణములు మున్నగా నెన్నియో యాభరణము లందములు సిందుచుండెను. మొలనూలువంటి నిర్మాణము గలిగి పగడములతో, మణులతో, మాణిక్యములతో, ప్రకాశవంతములగు ముత్తెపుగుత్తులతో, గాజుపూసల గుత్తులతో, రత్నపుష్పములతో గూర్పబడిన యాభరణము లింకను నామె కంఠదేశమున నెన్నియో కాంతు లీనుచుండెను. ఆమె కుచసీమయందు సువర్ణసూత్రములతో నిర్మింపబడి, ముత్తెములతో, మణులతో, గాజుబుడ్డలతో గూర్పబడి, సువర్ణసూత్రములతో జిత్రింపబడిన నెమలి, చిలుక, లవంగము మున్నగువాని చిత్తరువులతో నలంకరింపబడి, చిఱుచెమటచే దడిసి యొడలి నంటుకొని కంచుకము (రవికె) కన్నులపండువు సేయుచుండెను. ఆమె భుజములయందు సువర్ణమయములై, రత్నఖచితములై, వజ్రకంకణములను బోలు కేయూరములు మయూఖపుంజము లొలికించుచుండెను. వానియందు రత్నచిత్రములతో జిత్రితములైన పేటిక లమర్పబడియుండెను. వానియందు సువర్ణసూత్రములతో గూర్పబడిన ముత్తెపుగుత్తులు, బగడపు గుత్తులును వీక్షణపర్వముగా వ్రేలుచుండెను. ఆమె కరములయందు రత్నములతో, మాణిక్యము

లతో, ముత్తెములతో గూర్పబడి సువర్ణమయములై, ప్రకాశవంతము లైన గాజులు శోభించుచుండెను. వానికీవంక, నానంకగాజుతో నిర్మింప బడిన గాజులు కాంతులీనుచుండెను. ఆ గాజులనుండి వెలువడుకాంతులు చంద్రసూర్య కాంతులను దలపించుచుండెను. ఆగాజులపు పై భాగము నను, క్రిందిభాగమునను మణులతో, రతనములతో, ముత్తెములతో జిగిత్రములై, సువర్ణమయములై ప్రకాశవంతములై. దృఢములైన కంకణములు భాసిల్లుచుండెను. పగడములతో, ముత్తెములతో గూర్ప బడిన కరిహారములును, వానిపై రత్నఖచితములై దివ్యములైన గోరువంకలును సొబగు లీనుచుండెను. వానికి బైభాగమున బుష్ప మాలికలతో నంకితములై, సువర్ణరత్నమయములై, దంతపంక్తులను దలపించు నాకారములు గలవై, బహుళములైన కంకణములు ప్రభలను వెలిబెట్టుచుండెను. ఆమె చేతిప్రేళ్ళయందు రత్నములతో, మణులతో, ముత్తెములతో, నీలమణులతో, మరకతములతో, బగడ ములతో, జంద్రకాంతమణులతో, వివిధములగు పుష్పములతో, జిత్రితములైన యంగుళీయకములు కణుపు కణుపునను గాంతు లొలి కించుచుండెను. ఆమె నాసాగ్రభాగమున దివ్యమై, దీప్తిమంతమై, సువర్ణమయమై మణులతో ముత్తెములతో, రతనములతో గూర్పబడి నిర్మితమైన మయూరాభరణము (నెమలియాకారముగలది) మయూ ఖము లొలికించుచుండెను. అందు సుందరములైన ముత్తెపుగుత్తులు వ్రేలుచు మురుపు సూపుచుండెను. ఆమెచెవులయందు మకరధ్వజము లను బోలి రతనములతో, మణులతో, మాణిక్యములతో, ముత్తెము లతో, రత్నపుష్పములతో, విచిత్రముగా జిత్రితములై, సూర్యప్రభా భాసమానములై, దివ్యములైన తాటంకములు తళతళ లీనుచుండెను. ముత్తెములతో, రతనములతో, గూర్పబడి సువర్ణమయములై, దివ్య ములైన భ్రమరిక లను నాభరణములును, సువర్ణపుష్పములును, శోభలు గురియుచుండెను. ముత్తెపుగుత్తులతో గూర్పబడి మణి రత్న

మయములై, సువర్ణమయములైన,చిత్రములైన గొలుసులు చెలు వారుచుండెను.ఆమె పాపట మొదలు చెవుల వఱకు మాణిక్యము లతో, ముత్తెపుగుత్తులతో గూర్పబడి, పగడములతో జిత్రింపబడిన బహుళములైన సువర్ణమయహారములు శోభ బొలికించుచుండెను. ఆమె కేశపాశమునందు రతనములతో, వైడూర్యములతో, మణులతో, ముత్తెములతో, నీలమణులతో, గాశ్మీర కాంతమణులతో, బగడము లతో, జిత్రింపబడిన పరము మనోహరములైన చంద్రసూర్యాభరణ ములు చంద్రసూర్యులవలె వెలుగొందుచుండెను. ఆమె ఫాలదేశమున సువర్ణమయమై, రతనములతో, మణులతో, ముత్తెములతో శోభిల్లుచు దివ్యమై, యుజ్జ్వలమైన తిలకము కోటిసూర్యప్రభా భాసమానమై ప్రకాశించుచుండెను. ఆమె జడ మొదలు తిలకము వరకు మహోజ్జ్వ లమై, నానారత్న విచిత్రితమైన ముత్యాలహారము మోద మొలి కించుచుండెను. జనకమహారాజుచే కొనక్కవెట్టబడిన చూడామణి కూడ నానావిధరత్నములతో, ముత్తెపు గుత్తులతోగూడి మోదము నుద యింపజేయుచుండెను. ఆమె శిరోభాగమున సువర్ణసూత్రములతో గూర్పబడినవియు, రత్నపుష్పములతో గూడినవియు, జిత్రవిచిత్ర భంగిమలలో మణులచేత, వైడూర్యములచేత, గాశ్మీరపు బగడముల చేత నలంకృతములైనవియు నగు ముత్తెపుగుత్తులెన్నియో మురుపు లొలికించుచుండెను. వానిపై బరిమళభరితములైన పుష్పమాలికలు పొలుపారుచుండెను. ఆమె జడలో సువర్ణసూత్రమయములై, ముత్తె పుసరములతో గలపబడినవై, యనేకములగు పక్షుల రూపమున జిప్పుళ్ళ నడుమ మణులతో జిత్రింపబడినవై, కాంతిమంతములైన యాభరణము లెన్నియో యందములు సిందుచుండెను. మణులతో, మాణిక్యములతో, బూలగుత్తులతో గూర్పబడిన సుందరాభరణము లామె జడ చివర సొబగు లీనుచుండెను. ధరింపదగిన యాభరణము

లింకను ననేకము లున్నను భారమని యెంచి యామె వానిని ధరింప లేదు.

ఇట్లు వివిధాభరణ విభూషితురాలగు జగన్మాతను శ్రీ సీత నచ్చట భోజనము సేయ నాసీనులైన భూసురు లందఱును వీక్షణపర్వముగా విలోకించిరి. సర్వాభరణములను దాల్చిన వేళ నామె నెవ్వరును గన్నెత్తి చూడజాలరు. కారణమేమనగా నా దివ్యాభరణముల కాంతుల మూలమున జూచువారి కన్నుల జీకటులు గ్రమ్ముట తథ్యము. పద్మములను బోలు పాదములతో, రతనపు గలువపూవులను బోలు కరములతో, బద్మమును బోలు వదనముతో, బద్మపత్రములను బోలు నేత్రములతో, బద్మగర్భమును బోలు కోమలశరీరముతో, మేనిపై దివ్యములైన చందనకర్పూరాదుల పూతలతో, గల్లుగల్లు మను కాలియందెలతో, దివ్యములైన కంకణములతో దేజరిల్లు కరములతో, నడుగు జాడలను బట్టి యామె గమనమార్గము నెఱిగించు పాదముల పారాణితో, బాహువులయందు రత్నమయములై యందములు చిందు నంగదములతో, గజరాజు నడకను దలపించు నడకతో, దివ్యకుసుమముల దీప్తులతో, దివ్యములైన మందారకుసుమముల మాలికలతో, కస్తూరీతిలకముతో, కుంకుమముతో, పసపుతో, కాటుకతో, జిలుగవస్త్రముతో జెలువారు వదనముతో జూడ ముచ్చట గొలుపుచున్న యా జనకజాత నవలోకించి యెల్లరును దమ్ము దాము మఱచిపోయిరి. అత్యంతాశ్చర్య చకితులైరి. చిత్తరువులవలె గదలక, మెదలక స్తంభించిపోయిరి.

చతుర్థసర్గము సమాప్తము

( ౦౦౦ )

# పంచమ సర్గము

## సీతారాముల జలక్రీడలు

శ్రీరామదాసుడు విష్ణుదాసున కిట్లు వివరించుచు.

అనంతరము జనకజాత యెల్లరకు బంగారు పాత్రములందు వివిధములగు పదార్థములను వడ్డించెను. కామధేనువువలన ప్రాదుర్భవించిన వివిధములగు పక్వాన్నములు, బూరెలు, వటకములు, ఫేనికములు, పాయసములు, నప్పడములు, లడ్డుకములు, గుమ్మడివటకములు, పెరుగు, పాలు, నేయి, తేనె, తెల్లని చక్కెర, కండ చక్కెర, మిరియము మున్నగువానితో సంస్కరింప బడిన మజ్జిగ, నేతికూరలు, తినుట కింపులు నింపు నుపశాకములు, నువ్వులతో జేయబడిన వటకములు, మాదీఫలపు టూరుగాయలు, మామిడి మున్నగు ఫలముల రసములు, నరటి మున్నగు ఫలములు, వివిధములగు చోష్యములను, (పీల్చదగినవి) లేహ్యములను, (నాకదగినవి) పేయములను (త్రాగదగినవి) వారి కామె సానందముగా వడ్డించెను.

పిమ్మట శ్రీరామచంద్రుడు మిత్రులతోడను, బంధుగులతోడను సరసాలాపము లాడుచు సుఖముగా భోజనము చేసి చేతులు కడుగుకొనెను స్వహస్తములతో నందఱకు దాంబూలము లర్పించెను. తాను గూడ దాంబూలమును సేవించెను. దివ్యవస్త్రములను ధరించెను. అద్దమునం దొక్కమారు మొగము జూచికొనెను. తల్లులకు ప్రణమిల్లి వారివలన నాశీస్సులను బడసెను. అనంతరము దివ్యమై, సువర్ణమయమై, ముత్తెపుగుత్తులతోడను, రత్నములతోడను సమలంకృతమైన పల్లకి నధిరోహించి బంధుగులు, మంత్రులు, నాప్తులు తన చుట్టును జేరి తన్ననుసరింప, వందిమాగధులు స్తోత్రపఠనములు సేయుచుండ తన గృహమునుండి పయనమై జనకజాత మందిరమున

కరిగెను. అందు వెలుగొందు సభామందిరమున కరిగి సింహాసనముపై నాసీనుడయ్యెను. మంత్రులతోడను, లక్ష్మణుడు మున్నగు సోదరుల తోడను గూడి సీతియుక్తముగా రాజ్యకార్యముల నన్నిటిని సర్వ ర్తించెను. ధర్మపూర్వకముగా రాజ్యపాలనవిధులను బాటించెను.

అనంతర మచ్చట సీతయు దన సకియలతోడను, నూర్మిళ మున్నగు తోడికోడండ్రతోడను, నత్తగారలతోడను గూడి సుఖముగా భోజనము చేసి కరశుద్ధి గావించికొనెను. తాంబూలమును సేవించెను. పసుపువన్నె చీరను, మందారపూవు వన్నెరవికను ధరించెను. ఆ రవికపై ముత్తెపు గుత్తులు, సువర్ణపుష్పములు సువర్ణసూత్రములతో గూర్పబడి చూడ ముచ్చట గొలుపుచుండెను. కట్టు లెల్ల విధముల నలంకరించికొని యా గృహమున కనుబంధించియున్న యుద్యానవనమున కరిగి యచ్చట నున్న సుందరమందిరమున నొక్క మెత్తని యుపబర్హణముపై (దిండు) నాసీనురాలయ్యెను. సకియలు గూడ నామె చుట్టును జేరి కూర్చుండిరి. అట్లుండి కొంత తడవు గడచిన మీదట నామె యింతకుముందు వర్ణింపబడని దివ్యాలంకారములతోడ సమస్తదివ్యాభరణములను దన మేనిపై ధరించెను. ఆయలంకారముల నెవడు వర్ణింప గలడు? నాలుగు మొగముల వేలుపగు బ్రహ్మయు, నైదు మొగముల వేలుపగు శివుడును, నారు మొగముల వేలుపగు కుమారస్వామియు, నేడు మొగములు గల యుచ్చైశ్శ్రవ మనెడు నశ్వమును, వేయి మొగముల వేలుపగు నాదిశేషుడును గూడ నాయాభరణముల వైభవమును వర్ణింపజాలరు.

పరమపూత యగు జనకజాత యుద్యానవనమున కరిగె నన్న వార్త నాలించి జలయంత్రపాలకు లెల్లరు వడిగా నెల్ల జలయంత్రములను విముక్తములను గావించిరి. రతనాల పీటపై నాసీనయై సీత యా జలయంత్రముల కౌతుకములను, దరులతాగుల్మముల సోయగమును గన్నులపండువుగా గనుగొనదొడగెను.

అంతలో శ్రీరామచంద్రుడు రాజకార్యముల నెల్ల సంపూర్ణముగా నిర్వర్తించి సభాస్థలమును వీడి సహోదరులతోడ దన మందిరమున కరిగెను. ఆతరుణమున దుందుభులు, శంఖములు, గోముఖములు, భేరికలు, తూర్యములు, మున్నగు నవవిధ వాద్యములు ప్రయోగించబడెను. వారవనితలు చారుతరనృత్యములు సలిపిరి. వందిమాగధులు స్తోత్రపఠనము నొనరించిరి. ఉపవనములో నున్న సీత కూడ నాశబ్దముల నాలకించెను. వెంటనే యామె సంభ్రమముతోడ నాసనముపైనుండి క్రిందకు దిగి యెడమచేత జారీని గుడిచేత నొక చిన్న పాత్రను ధరించి శ్రీరామచంద్రున కెదురు వోయెను. అంతలో నాపురుషోత్తముడు కూడ బల్లకిని, దన్ననుసరించిన పరివారమును బయట దిగవిడిచి సోదరులతోడ గృహములోపల ప్రవేశించెను. అంతట సువర్ణమయములైన వివిధాభరణములను ధరించి కొని నూర్లకొలదిగా దాసికామణులా పరమపురుషుని దెసకు బరుగులు వెట్టిరి. ఆ తరుణమున నొక తరుణి శ్రీరామచంద్రునకు వీవన గొని వీచెను. ఒక వాలుగంటి చామరమును గేల దాల్చెను. ఒక దాసికామణి యాసనము న జేత ధరించెను. ఒక బింబాధర తాంబూలపేటి కను దాల్చెను. ఒక కలువకంటి నిష్ఠీవనపాత్రము గరమున ధరించెను. ఒక మనోహరాంగి మనోహరమైన జలకుంభమును జేత వహించెను. ఒక వనితామణి వస్త్రముల మూటను గ్రహించెను. ఒక కోమలాంగి కోదండమును గైకొనెను. ఒక ముద్దుగుమ్మ యమ్ముల పొది నవలంబించెను. ఒక తరుణుల మిన్న కరవాలమును బట్టుకొనెను. ఈవిధముగా నుపకరణములన్నిటిని జేటికలు గ్రహించిరి.

అనంతరము శ్రీరామచంద్రుడు పాదచారియై తనకొఱకెదురు చూచుచున్న జనకనందినిని జేర నరిగెను. గృహమున కనుబంధించి యున్న యుపవనములో సకియలచే బరివేష్టితురాలై సిగ్గుదొంతరలను

వెలిగొట్టుచు, చిఱునగవులు వెలయించుచు, క్రీగంటి వీక్షణముల
వీక్షించుచు నామెయు శ్రీరామచంద్రున కెదురుగా జనుదెంచెను.
ఆమెను గాంచి రఘునందనుడు గూడ చిఱునవ్వు నవ్వుచు నామె యొస
గిన జలముతో నాచమన మొనరించెను. కొంత తడ వాసనముపై
నాసీనుడై యుండి జలపాన మొనరించి యాసీతను వెంట నిడుకొని
జలయంత్రములకు జేరువగా నున్న మందిరమున కరిగెను. అందొక
యాసనముపై నాసీనుడై లక్ష్మణుని బిలిచి 'లక్ష్మణా! నీవు శీఘ్రముగా
భోజనశాల కరిగి యచ్చటి బ్రాహ్మణులను, నూర్మిళ మున్నగు వారిని
సత్వరముగా వంటలు సేయింప దొందరపెట్టుము. అచ్చటి యేర్పాటు
లన్నియు బూర్తిచేసి మరలి వచ్చి నాకా సమాచారమును సూచిం
పుము' అని యతని కాదేశించెను. అట్లకాక! యని యతడు వెంటనే
భరతశత్రుఘ్నులను వెంట నిడుకొని పోయి వసిష్ఠుడు మున్నగు మహ
ర్షులను, మంత్రులను, మిత్రులను రావించి యూర్మిళను, మాండవిని,
శ్రుతకీర్తిని గూడ బిలిచి శీఘ్రముగా వంటలు సేయించుటకు వారిని
దొందరించెను.

పిమ్మట రఘునందనుడు కుంకుమపూవన్నె మున్నగు నెన్నియో
వన్నెల జలధారల నురలించు జలయంత్రముల నన్నిటిని విముక్తము
లను గావింపజేసెను. అనంతరము సీతను బలముగా దన బాహుపాశ
ములతో బంధించి పట్టుకొని కొనిపోయి యా జలయంత్రధారలు
వర్షించు మడుగులోనికి మీదికెత్తి విసరివైచెను. తీరమున నిలిచి
దాసికామణు లాదృశ్యమును జూచి నగు మొగములతో దమ సంతో
షమును బ్రకటించుచుండిరి. సీతను బడవైచిన తోడనే రాఘవుడు
తానుకూడ నందు దుమికెను. జనకజాతతో గూడి యతడు సానంద
ముగా జలక్రీడలాడెను. భుజములతో నామెను గాఢముగా గవుగి
లించికొని పలుమాఱులు మీదికెత్తి విసరివైచెను. రంగురంగుల

నీరములు చిమ్మి యామె కానంద మొదవించెను. వివిధములగు సుగంధితైలములను, బరిమళద్రవ్యములను మంగళద్రవ్యములను దాసీజనముచే దెప్పించికొని వారిరువురు నొండొరులపై సంబరము మీఱ జల్లుకొనిరి. పూలను, క్రీడాద్రవ్యములను గూడ నొండొరులపై జల్లుకొనిరి. స్వహస్తములతో నిరువురు నొండొరులపై జలయంత్రములను వినుక్తములను గావించి నీరములు చల్లుకొనిరి. అంతలో శ్రీరామచంద్రుడు దాసికాజనమునకు గంటితో సైగజేసెను. తోడనే వారు సిగ్గుపడుచు దెఱల వెనుకకు దవ్వుగా బోయి నిలువబడిరి. ఆనందముతో గొందఱు గృహద్వారముల కడకు బోయి నిలిచిరి. అట్లు వెల్లరును దొలగిపోయిన వేళ నేకాంతమున నా సీతారాములా జలయంత్రముల దగ్గఱ నిలిచి చాలసేపు జలముతో క్రీడించిరి. వినోదము మీఱ జానకి రఘునందనునిపై బలుమాఱులు ముష్టిప్రహారములు గావించెను. అతడు కూడ నామెను గుసుమకోమలమగు ముష్టితో బ్రహరించెను. దొండ పండ్లను బోలిన యామె పెదవులను జుంబించెను. ఆమె కుచములను మర్దించెను. ఆమె రవికముడి విప్పి యామె నక్కున జేర్చి గాఢముగా గవుగిలించికొనెను. స్వహస్తములతో నామె కాసెనూడలాగుచు వస్త్రాపహరణభంగిమ నభినయించెను. చిఱునగవులు చిందించుచు నామె కూడ శ్రీరామచంద్రుని వస్త్రపుముడి నూడలాగ బోయెను. ఈవిధముగా నాపుణ్యదంపతు లానందము మీఱ జలక్రీడ లాచరించిరి. వారి జలక్రీడా విహారవినోదములను సవిస్తరముగా నెవరు వర్ణింపగలరు ?

ఇంతలో లక్ష్మణుడు భోజనమునకు రావలసినదని మిత్రుల నందఱను బిలిచి శ్రీరామచంద్రునకు సూచించుటకై యతడున్న తావున కరుగ దెంచెను. కాని యుద్యానవనద్వారముదగ్గఱనే దాసికాజన మాతని నిలిపి వైచిరి. వారాతనితో దేవా! శ్రీరాముని దర్శింప

బోవుట కిది తరుణము గాదు. మీ రిచ్చటనే నిలువవలయును. ఏల యనగా నాసీతారాములిప్పు డేకాంతమున జలయంత్రముల కడ జలక్రీడలాడుచున్నారు' అని తెలియజెప్పిరి. అప్పుడు లక్ష్మణుడు 'ఓచేటికలారా! మీరా మహాప్రభువు చెంతకేగి భోజనపు టేర్పాటులు పూర్తియైనవని సూచించుటకు లక్ష్మణుడు వచ్చియున్నాడని యతని కెఱుగజెప్పుడు. మీరు మఱలి వచ్చినమీదట నేను మఱలిపోయెద' నని వారి కాదేశించెను. తోడనే వారిలో నొక చేటిక పోయి తెఱవెనుక నిలిచి యడలుచు, సిగ్గుపడుచు మెల్లగా లక్ష్మణుని యాగమన వార్తను రాఘవున కెఱిగించెను. ఆ పలుకు నాలకించి రఘునందనుడు సీతను జలయంత్రపు ముసుగునుండి వెలుపలకు వెడలించెను. తానుగూడ సానందముగా వెలికి వచ్చెను. ఒడలికి నలుగు బెట్టించుకొని యుష్ణోదకముతో జక్కగా స్నాన మాచరించెను. సుగంధద్రవ్యముల నొడలిపై నలదికొనెను. ప్రియురాలితోడ బట్టు వస్త్రములను దాల్చెను. సువర్ణతంతుయుతములై, సుగంధద్రవ్యాంకితములైన తమ తడిబట్టల నాపుణ్యదంపతులు దాసదాసీజనమున కర్పించివైచిరి. పూవులు పఱచిన మార్గమునందు బ్రయాణ మొనరించి వారటనుండి క్రమముగా భోజనశాల కరిగిరి. అక్కడ వారు పూర్వమందలి పరిచర్యలకన్న నెక్కువ పరిచర్యలను బడసిరి. ఊర్మిళ మున్నగు సుదతిమిన్నలు కామధేనువువలన బ్రాదుర్భవించిన పవిత్రాన్నమును బంగారు గరిటెలతో బంగారు పాత్రములయందు దీరుగా వడ్డించిరి. మునులతోడను, గురువగు వసిష్ఠునితోడను, మంత్రులతోడను, మిత్రులతోడను గూడి శ్రీరామచంద్రు డానందము మీఱ భోజన పదార్థముల నారగించెను. అతని పాత్రమునందలి పదార్థములవేడిమి జల్లార్చుటకు జనకజాత వీవన గొని వీచెను. వినోదవచనము లాడి యతని చిత్తము నలరించెను. ఈవిధముగా భోజనవిధి నిర్వర్తించికొని సీత యొసగిన తాంబూలమును సేవించుచు నా పుణ్యపురుషుడు మంది

రములోపల మంత్రి మిత్రబంధువర్గములతో సరసాలాపము లాడుచు సమయమును గడప నారంభించెను. అంతలో జనకజాత తాను గూడ భోజనము చేసి దాసికాజనమును వెలుపల విడిచి శయనమందిరమున కరిగి సకియ లెందఱో తన్ను జుట్టువారుకొని యుండ గోరువంకలతోడ వినోదించుచు శ్రీరామచంద్రుని యాగమనమున కెదురు సూచు చుండెను. సకియ లామెకు వీవనలతోడ వీచుచుండిరి.

పంచమసర్గము సమాప్తము.

( 0*0 )

# షష్ఠ సర్గము

## —సీతారాముల దినచర్య—

శ్రీరామదాసుడు విష్ణుదాసున కిట్లు వివరించును.

అనంతరము శ్రీరామచంద్రుడు వందిమాగధులు స్తోత్రపఠనములు సలుపుచుండ బంధువర్గములతోడ శయనమందిరము వఱకు వెడలి వారిని వెలుపల విడిచి దాసీజన పరివేష్టితుడై లోనికి జనెను. ఆ పరమపురుషుని యాగమనము నెఱిగి సీతయు గోరువంకలతోడి వినోదమును జాలించి లేచి సకియలు తన్ననుగమింప, గాలియందెలు గల్లుగల్లు మనుచుండ నతని కెదురేగెను. చేతులు జోడించి యతనికి నమస్కరించెను. అతని చేయి బట్టుకొని తోడినచ్చి మంచముమీద గూర్చుండబెట్టెను. త్రాగుట కాతనికి జలము నొసగెను. సేవించుట కుత్తమమైన తాంబూలము నర్పించెను. పిమ్మట దాసీజనము వీవనలను గొని వీచుచుండ రాఘవుడు సీతామహాదేవితోడ గూడి మణిరత్న ఖచితమైన మంచముపై బవళించి నిదురించెను.

పిమ్మట జనకజాత క్షణకాలమున మేలుకొని క్రిందకు దిగి నిలిచెను. తోడనే రఘునందనుడు కూడ మేలుకాంచెను. సీత మఱల

నాతనికి ద్రాగుటకు నీరమును, సేవించుటకు దాంబూలము నర్పించెను. రాముని దాసీజనము రామునకు నెమలితొక్కలతో నిర్మింపబడిన వీవనలను గొని వీచుచుండిరి. అట్లే సీతయొక్క దాసీవర్గము చమరీ మృగపు దోకకుచ్చులతోడను, నావుతోకకుచ్చులతోడను జేయబడి, సువర్ణమయములైన వీవనలను గొని సీతకు వీచుచుండిరి. అనంతరము రాఘవుడు తనచేత సీత చేతిని బట్టుకొని వాకిట నెలకొనియున్న ద్రాక్షపొదరింటి కరిగి యందొక యాసనముపై గూర్చుండెను. దిండు నానుకొని యాసీనుడైన యామహాపురుషుని యెడమవంక సానందముగా జానకి యాసీనురా లయ్యెను. అట్లు సీతతోడ సుఖముగా గూర్చుండి యాపరమపురుషుడు బంగారముతోను, రత్నములతోను, ఏనుగుదంతములతోను చిత్రవిచిత్రములైన భంగిమలలో నిర్మింపబడిన కృత్రిమములగు నేనుగులు, గుఱ్ఱములు, నొంటెలు. మంత్రులు, బంటులు మున్నగు వినోద సాధనములతోడ (చదరంగము) బుద్ధిబలమును వెల్లడించుచు నాడుకొనెను. అటుపిమ్మట సీతాసమేతుడై యాశ్రీరామచంద్రుడు దాసీజనము వీవనలతో వీచుచుండ బంజరగతములైన పక్షులతోడ గొంత తడవు వినోదించెను. ఇంతలో జనకజాత పిలుపు నందికొని నూర్లకొలది వారవనిత లచ్చటకు జేరి శ్రావ్యముగా గానము లొనరించుచు జారుతరనృత్యములు గావించిరి. సీత వారికి నూతన వస్త్రాభరణములను బహూకరించెను. వానిని స్వీకరించి వారు వెడలిపోయిరి. అప్పుడామె 'స్వామీ! మన మిప్పుడు మేడమీదకు బోయి వినోదింతము. రండు.' అని రఘునందనునితో బలికి యతనిని దన వెంట మేడమీదకు దోడుకొనిపోయెను. అచ్చట నొక దివ్యమైన యాసనముపై గూర్చుండి రాఘవుడు ముత్యాల సరములతో, రతనాల తలుపులతో, బంగారపు దోడుపులతో నలరారు కిటికీలు గలిగి చూడముచ్చట గొలుపుచు రాజవీధిలో నున్న సౌధములను దిల

కించుచుండెను. ప్రజల వినోదములను దాను జూచుచు సీతకు జూపు చుండెను.

అంతలో నొక బ్రాహ్మణపత్ని మేనిపై వస్త్రాలంకారము లేవియు లేనిదై, కృశించిన శరీరము గలదై, యొక చంటిబిడ్డ నెత్తుకొని బిచ్చ మడుగుకొను తలంపున రాజమార్గమున బోవుచు జనకజాతకు గానవచ్చెను. వెంటనే సీత యామె నొక దాసిచే బిలిపించి వస్త్రాలంకార రహితవై యుండుటకు గారణ మేమని ప్రశ్నించెను. అప్పు డామె "యమ్మా! నాభర్త నన్నొంటరిగా వీడి తీర్థయాత్రల కేగెను. నేను నా తండ్రికి గారాబుకొమరితను, ఆకారణమున నాతండ్రి గృహ మున కరిగితిని. అనంతర మనతికాలమున వృద్ధుడగుటచే నాతండ్రి మరణించెను. అతని నివాస మవంతీనగరము. అచ్చట నతని కింకను బిడ్డలు గలరు. కాని వారు చాల జిన్నవారు. నాకు బోషకులు, రక్షకులు నెవ్వరును లేరు. ఆకారణమున నాకు వస్త్రాలంకారహైన్యము ప్రాప్తిం చినది." అని సీతకు బదులు పలికెను. ఆపలుకుల నాలకించి సీత యొక మారు శ్రీరామచంద్రుని మొగము వంకకు జూచి తన వస్త్రములను, నలంకారములను, నామె కర్పించెను. అంతియుకాక లక్ష్మణుని కడకు బోయి తన యాజ్ఞగా నెఱుగజెప్పి యతనివలన లక్ష బంగారు నాణె ములను గైకొను మని కూడ నామె కాదేశించెను. 'అల్ల కాక!' యని యా బ్రాహ్మణపత్ని లక్ష్మణుని కడకేగి సీతాసందేశము నాతని కెఱి గించెను. ఇక్కడ జనకజాత తాను ముందు ధరించినవానికన్న నెక్కు డలంకారములను, దివ్యవస్త్రములను దన మేనిపై ధరించెను. అక్కడ లక్ష్మణు డా బ్రాహ్మణికి లక్ష సువర్ణఖండములను నిస్సంకోచముగా నొసగి యామె నంపివైచెను. అతడామె వచనము లసత్యము లగు నేమో యని శంకించలేదు. ఏల యన రామరాజ్యమునం దసత్య మాడ జాలువా రెవ్వరును లేరు. అనంతరము సీత యొక దాసిమూలమున లక్ష్మణునకు మఱియొక సందేశము నంపెను. దాని ననుసరించి యతడు

సప్తద్వీపములందు, భరతవర్షము మున్నగు వేలు వేలు వర్షములందు నొక స్త్రీగాని, పురుషుడుగాని యుత్తమ వస్త్రాభరణములు లేని వారుగా గానరారాదనియు, నేదేశమునందైన, నేపట్టణమునందైన నెల్లు కానవచ్చినచో నాప్రాంతము నేలు రాజునకు దండనము విధింప బడుననియు యీ నా సందేశము నెఱిగి భూపతులందఱు దమ తమ రాష్ట్రములందు దమ ధనాగారములను గొల్లబెట్టి సుందర వస్త్రాభరణాదులతోడ బ్రాహ్మణాది వర్ణములవారి నలంకరించుచుండవలయు ననియు నయోధ్యా నగరమునందు, రాష్ట్రములందు, దుందుభిప్రోతము లాలమున నెల్లయెడల జాటింపజేసెను. తదనుసారముగా సప్తద్వీపముల నేలు నరపతు లట్లే యాచరించిరి. అది మొదలు లోకమునందు సీతాభయము కారణముగా సుందర వస్త్రాలంకారములు లేని స్త్రీ కాని, పురుషుడు కాని యెందును గానరాలేదు. ఈవిధముగా జనకజాత యెన్నియో కౌతుకముల నాచరించెను.

అనంతరము శ్రీరామచంద్రుడు నాల్గవ యామమున దన సోదరులను దోడుకొని సభామందిరమున కరిగెను. అచ్చట ధర్మపూర్వకముగా రాజకార్యములను నిర్వర్తించెను. నటులు ప్రదర్శించిన నాటకములను, వారవనితల చారుతర నృత్యములను విలోకించెను. వందిమాగధుల స్తోత్రపఠనముల నాలకించెను. అనంతరము వారి నందఱను వీడి సీతామందిరమున కరిగెను, సాయంసంధ్యావందన మాచరించెను. యథావిధిగా హోమవిధులను నిర్వర్తించెను. గంధము మున్నగు వానితో బ్రాహ్మణులను బూజించి వారికి వివిధములగు కానుకలను నైవేద్యములను నర్పించెను. పిమ్మట దాను భోజనముచేసి కొంతతడవు పురాణ కథాశ్రవణము జేసెను. హరిదాసుల కీర్తనముల నాలకించుచు, వారకాంతల నృత్యముల నవలోకించుచు, బురజను లందించు వార్తల నాలించుచు గాయకుల మధురగానముల నాకర్ణించుచు, సగము రాత్రి గడచువఱకు గాలమును గడపి యటనుండి కదలి మెల్లగా శయన

మందిరమున కరిగెను. రత్నదీపపు గాంతులతో సకియలను వెంట నిడుకొని సీత యాతని కెదురుగా నేగుదెంచెను. ఇరువురును లోనికేగి రత్నఖచితమైన మంచముపై నాసీనులైరి. రాము డనేక విధముల నామెకు మనోరంజనము గలిగించెను. అనంతరము దాసీజనము సువర్ణమయములైన వీవనలను గొని వీచుచుండ నా పుణ్యదంపతులు సుఖముగా నిదురించిరి.

ఈవిధముగా శ్రీరామచంద్రునివలన బతివ్రతయగు సీత పరమసుఖమును బొందెను. ఆమె వలన రఘునందనుడు కూడ బరమానందమును జూఱగొనెను. ఇట్లు ప్రతిదినము పరిపూర్ణ మనోరథుడగు శ్రీరామచంద్రుడు సీతతోడ గూడి యనేకములగు కౌతుకముల నాచరించెను. ఆ పరమపురుషుడు సీతతోడ గూడి యొక తరుణమున ప్రాంగణమునందు చంద్రకాంతిలో జరించెను. మఱియొక వేళ సౌధాగ్రమందు శయనించెను. వేఱొక తఱి సౌధములోపల శయనించెను. మఱియొక వేళ నేకాంతమందిరమున సుఖము నెనసెను. వేఱొక సమయమున బంగారు గొలుసులతో గూర్పబడిన వితానము(చాందినీ) గలిగిన మంచముపై బవళించెను. ఒకప్పుడు ద్రాక్షపొదరింటిలోను, నొకప్పుడు జలయంత్రముల చెంత, నొకప్పుడు గాజుపలక లమరించిన పుడమియందు, నొకప్పుడు సువర్ణమయమైన భూమియందు, నొకప్పుడు మణిమయమైన భూమియందు, నొకప్పుడు స్ఫటికమణులు మున్నగువానిచే ఖచితమైన భూమియందు, నొకప్పుడు పుష్పకవిమానమునందు, నొకప్పుడు రంగశాలయందు, నొకప్పుడు చిత్రశాలయందు, నొకప్పుడు నట్టివేళ్ళ మందిరమునందు, నొకప్పుడు పూవులతో నిండిన గృహమునందు, నొకప్పుడు కదళీవనమునందు, నొకప్పుడు పుష్పోద్యానమునందు, నొకప్పుడు చెట్లపై నిర్మింపబడిన గృహమునందు, నొకప్పుడు వృక్షశాఖలకు వ్రేలగట్టబడిన రత్నఖచితమైన యూయలయందు, నొకప్పుడు రత్నఖచితమై దారువుతో నిర్మింపబడిన మంచము మీదను

నొకప్పుడు తులసీవనమునందు, నొకప్పుడు సభామందిరమునందు, నొకప్పుడు ద్వారముపై నిర్మింపబడిన ప్రాసాదమునందు, నొకప్పుడు ఒంటిస్తంభపు మేడయందు, నొకప్పుడు తనయింటి గడపచెంత, నొకప్పుడు బృందావనమునందు సీతతోడ గూడి శ్రీరామచంద్రుడు పరమానందము ననుభవించెను.

షష్ఠసర్గము సమాప్తము.

—()—

# సప్తమసర్గము

—: శ్రీరామచంద్రుడు దేవకాంతలకు వరము లొసగుట :—

శ్రీరామదాసుడు విష్ణుదాసున కిట్లు వివరించును.

ఒకనాడు వ్యాసమహర్షి పలువురు శిష్యులతోడను, మునులతోడను గూడి శ్రీరామచంద్రుని దర్శించుటకును, చైత్రస్నాన మాచరించుటకునై, యయోధ్య కేగుదెంచెను. అతని యాగమనము నెఱిగి యెదురుగా నేగి భక్తితో సిరము వంచి కరములు ముకుళించి నమస్కరించి రఘునందనుడా మహామహుని దనగృహమునకు దోడుకొని వచ్చెను. అతనికి, నతని యనుయాయులకును వేఱువేఱుగా దివ్యాసనముల నొసగి వారిని గూర్చుండజేసెను. కామధేనువు వలన ప్రాదుర్భవించిన మణులతోడను, రత్నములతోడను వారిని బూజించెను. వారి కెల్లరకును వైభవోపేతముగా భోజనము పెట్టించెను. తాంబూలములను, దక్షిణలను సమర్పించెను. అనంతరము సీత వీవన గొని వీచుచుండగా శ్రీరామచంద్రుడా మునీంద్రుని కుశల మరసెను. వ్యాసుడాతనికి దన క్షేమసమాచారము నెఱుగజెప్పి, యతని క్షేమమును గూడ దానరసి యతనితో నిట్లు నొడువ నారంభించెను.

"మహాబాహూ! రఘునందనా! రాజ్యభోగముల నీనాడు నీవను భవించుచున్న విధముగా నింతకు మున్ను మహీపతి యొక్కడు నను

భవింపలేదు. ముందనుభవింపబోదు. అందును ముఖ్యముగా నేకపత్నీ వ్రతపాలమునందు నీకున్న యభినివేశమును జూడగా నెంతయో యాశ్చర్య మొదవుచున్నది. మహోన్నతపదవియందుండి, నిండు యౌవనమున నెగడుచుండి కామసంబంధమైన కోరుచిచ్చును భరించుటకు నీకు జెల్లినది. కాని యన్యు డెవడు భరింపగలడు!'' అనగా విని శ్రీరామచంద్రు డిట్లు పలికెను. మునికులభూషణా! నాకు మూడు నియమములు గలవు. అందు ఆడిన మాట దప్పకుండుట యొకటి. నాకు సీత యొక్కతెయే భార్య, ఇతరస్త్రీలు నాకు గౌసల్యవంటివారు. ఇది రెండవ నియమము. నే నెవరిని సంహరింపదలచినను నొక్క బాణమునే ప్రయోగింతును. రెండవ బాణము నుపయోగింప నక్కఱ లేదు. ఇది మూడవ నియమము. ఈ నియమములను నేను బూర్వమే ర్పఱచికొంటిని. మీ యాశీర్వచన బలమున నా నియమములు భవిష్యత్కాలమున గూడ సత్యములై నిలువగలవని నమ్ముచున్నాను. అనగా విని యట్లే యగుగాక! యనుచు నామహర్షి మఱల నిట్లనెను. శుభగుణసాంద్రా! శ్రీరామచంద్రా! నీ వవలంబించిన యీ యేకపత్నీవ్రతనియమమునకు ఫలముగా ముందు గలుగబోవు జన్మమునందు జాలసుందిసుందరాంగులను బత్నులనుగా బడయగలవు. ఈ మునివచనము నాలకించి రఘునందనుడు మఱల ''ఓ మునిచంద్రా! అనేకకాంతల నర్ధాంగులనుగా బడయుటకు నేను ముందుముందు ద్వారకానగరమున శ్రీకృష్ణుడనై యావిర్భవించుట యెట్లును సత్యమే. కాని యేకవ్రత మొనరించిన నేను ముందు జన్మమున ననేకకాంతలను బడయగలనో నాకు సెలవిందు.'' అని ప్రశ్నించెను. అంతట వ్యాసు డిట్లు నొడివెను. ''రాఘవా! చక్కని ప్రశ్న మొనరించితివి. నీ వీ జన్మమునం దవలంబించిన యేకపత్నీ వ్రతప్రభావము చేతనే ముందు జన్మమునం దనేకకాంతల పొందు నెనయగలవు. అయినను నీకొక్క దానమునుగూర్చి వివరించుచున్నాడ, నాలకింపుము. దాని నాచరించిన నీ కనేకకాంతలు ముందు

జన్మమున బ్రాప్తింపగలరు. సీత యెత్తు బంగారముతోడ నొక్కొక్క మూర్తిగా బదునాఱు మూర్తులను నిర్మింపజేసి సరయూనదీతీరమునందు సాదరముగా బ్రాహ్మణులకు నూతనవస్త్రములతో, నాభరణములతో, దక్షిణలతో నర్పింపుము. తజ్జన్మమున నీవు బహుళకాంతాసుఖ సంపదను బడయగలవు." ఈవ్యాసవచనము నాలకించి శ్రీరామ చంద్రుడు డష్టే పదునాఱు సువర్ణమూర్తులను నిర్మింపజేసి సానందముగా సరయూతీరమున బదునాఱుగురు బ్రాహ్మణశ్రేష్ఠులకు దానము జేసెను. ఆదానములను స్వీకరించిన బ్రాహ్మణు లందఱును "రాఘవా! నీవొక్క మనుగు మాకర్పించితివి. ఇది నీకు మఱల వేయి మడుంగులై ప్రాప్తింపగలదు. నిశ్చయముగా నీకు ముందుముందు పదునాఱువేల సుదతీలలామలు ప్రాప్తింపగలరు." అని సాదరముగా రఘునందను నాశీర్వదించిరి. అట్లకాక! యని రాఘవుడు వారిని వీడుకొలిపెను. అనంతరము వ్యాసుని గూడ నమస్కారపూర్వకముగా బూజించి సాగ నంపెను.

అనంతర మొకనాడు శ్రీరామచంద్రుడు సరయూనదీతీరమున నొక్క రమణీయమగు పటకుటీరమునందు బరిపూతయగు సీత తోడ గూడి సానందముగా గ్రీడించుచుండెను. అది చైత్రమాసకాలము. అందుచే శ్రీరామతీర్థమునందు స్నానమాచరించు తలంపున వేలాదిగా ననేకదేశములవా రయోధ్య కేగుదెంచిరి. వారిలో దేవతలు, యక్షులు, కిన్నరులు, గంధర్వులు, నాగులు, పర్వతములు, లతలు, నదులు, సర్వతీర్థములు, మహర్షులు, మహారాజులు, నచ్చరలు, పక్షులు, క్షేత్రములు, వానరులు, మున్నగు నెల్లవారలు నుండిరి. ఆకాలముననే యొకనాడు ఋతుధర్మము కారణముగా జనకజాత యంతరానిదై యుం డుట నెఱిగి దేవతల భార్యలు తమలో దా మేమియో సమాలోచన మొనరించికొని శ్రీరామచంద్రుని దివ్యసౌందర్యము నవలోకించుటచే బిచ్చిమెత్తి. కామాగ్నిచే దహింపబడు చిత్తములతో ననేకదివ్యవస్త్రా

భరణాదులను దాల్చికొని యర్ధరాత్రమున శ్రీరామచంద్రుడు వసించు శిబిరమున కరుగుదెంచిరి. వారిని గాంచి శ్రీరామచంద్రుని దూతలు మీరింత భయంకరమగు నర్ధరాత్రసమయమున నిచ్చటి కేల యరుగుదెంచితి రని ప్రశ్నించిరి. అంతట వారు "మేము శ్రీరామచంద్రప్రభువును దర్శింప నేగుదెంచితిమి. ఇప్పుడు మాకా పరమపురుషుని దర్శనము లభింపకున్న మేమెల్లర మీ సరయూనదిలో దుమికి ప్రాణపరిత్యాగము సేయగలవారము" అని బదులు పలికిరి. వారి పలుకుల నాలకించి పరుగిడి పోయి దూతలా యుదంతమును శ్రీరామచంద్రునకు నివేదించిరి. అప్పుడా మహాప్రభువు వారికి దర్శన మొసగెను. ఆసమయమున రాఘవు డిసుకతిన్నెపై మంచముమీద నాసీనుడై యుండెను. అతనిని దర్శించి యాస్త్రీలందఱును ధన్యులమైతిమని కృతకృత్యుల మని భావించికొనిరి. వారా రఘునాథుని సమక్షమున గామాగ్నిచే దహింపబడు చిత్తములతో, లజ్జచే నవనతములైన మొగములతో గూర్చుండిరి. అప్పుడా పరమపురుషుడు మీ యాగమనమునకు గారణ మేమని వారిని బ్రశ్నించెను. స్వామీ! మీకు దెలియని దేమిగలదు? అని వారు బదులాడిరి. వారి మనోగతాభిప్రాయము నెఱిగి రామభద్రుడు వారితో నిట్లనెను. "కాంతలారా! యీ జన్మమునందు నే నేకపత్నీవ్రతము నవలంబించితిని. నాయీ వచనము నసత్యమని తలపవలదు. ఇది సత్యము. కావున శీఘ్రముగా మీ రందఱును మీమీ యిరవులకు వెడలిపొండు. నారాజ్యమునం దధర్మము పొసగరాదు. అధర్మాచరణమున భూపతులకు నరకము ప్రాప్తించును." ఈ పలుకులు ములుకులై హృదయముల నాటగా వేలాదిగా నున్న యాకాంతలెల్లరు నా యిసుకతిన్నెపై మూర్ఛాక్రాంతలై వ్రాలిపోయిరి. వారి యీ యవస్థను గనుగొని కలత జెంది రఘునందనుడు వారి కానందము గలిగించుచు మఱల నిట్లనెను. "రమణులారా! ద్వాపరయుగమునందు వ్రేపల్లెలో నందుడను గోపకుని యింట

నేను శ్రీకృష్ణుడనై యవతరింతును. నావరప్రభావమున దేవతలందఱు నానాడు గోపాలకులుగా నావిర్భవింతురు. ఇంద్రుడు నందుడై యవతరించును. మీరందఱు నానాడు గోపికలై యూవిర్భవింపుడు. అప్పుడు మీమనోవాంఛితము నీడేర్పగలను. బృందావనమునందు యమునా తటమున నిసుకతిన్నెపై మీతోడ గూడి రాసక్రీడల నాచరింతును. కావున స్వస్థచిత్తత నెనసి సానందముగా స్వస్థలముల కరుగుడు" అనగా విని పునరుజ్జీవనము నెనసి సంతుష్టాంతరంగములతో నా కాంతా రత్నను లెల్లరును దమతమ యిరవులకు వెడలిపోయిరి.

అంతలో నచ్చటకు మాయాపురినుండి గుణవతి యను పేరుగల యొక సుందరీమణి చైత్రస్నానము సేయు తలంపున నేగుదెంచెను. అనగా విని విష్ణుదాసుడు రామదాసుని - మహానుభావా! ఆ గుణవతి యెవరు? ఆమె శీల మెట్టిది? ఆమె యెవని కొమరిత? ఆమె యుదంత మును నాకు విశదీకరింపుడు' అని వేడుకొనెను.

—స ప్త మ స ర్గ ము స మా ప్త ము. —

( 0*0 )

## అ ష్ట మ స ర్గ ము

రామదాసుడు విష్ణుదాసున కిట్లు వివరించును.

పూర్వము కృతయుగాంతమున మాయాపురియందు దేవశర్మ యను నొక బ్రాహ్మణోత్తము డుండెను. అత డత్రిగోత్రమునకు జెందినవాడు. వేదవేదాంగపారంగతుడు. అతిథి పూజనతత్పరుడు. అతడు నిత్యము భక్తితో సూర్యోపాసన మొనరించుచు మఱియొక సూర్యభగవానుని వలె దేజరిల్లుచుండెను. అతనికి దనయులు గలుగలేదు. వార్ధక్యమునం దొక్క గుణవతి యను పేరు గల కన్నియ యావిర్భవించెను. ఆమె నతడు చంద్రు డను పేర బరగున తన శిష్యున కొసగి పెండ్లి

గావించెను. అల్లునే యతడు తన తనయునిగా భావించెను. ఆ యల్లుడు గూడ దన మామనే తన తండ్రిగా నెంచెను. వారిరువురు నొకనాడు సమిధలను సేకరించికొను తలంపున వనమున కరిగిరి. హిమవత్పర్వత ప్రాంతమున సంచరించుచుండగా వారొక రాక్షసుని కంట బడిరి. రక్కసుని జూచుటతోడనే భయభ్రాంతులై, పాఱిపోవ జాలనివారై నిలిచిపోవగా వారినా రక్కసుడు మడియించెను. ఆక్షేత్రము యొక్క ప్రభావమును, బొందిలో నసువు లున్నంతవఱకు సాగించిన ధర్మవర్తనమును గారణముగా వారిని విష్ణుదూతలు వైకుంఠమునకు గొనిపోయిరి. బ్రతికియున్నంతవఱకు బుడమిపై వారనువర్తించిన సూర్యోపాసనాది విధానములచే వారియెడల శ్రీమహావిష్ణువు ప్రసన్నుడయ్యెను. శివోపాసకులేమి, సూర్యోపాసనపరులేమి, గణపతి నారాధించువారేమి, విష్ణుపూజాపరాయణులేమి, శక్తి నారాధించువారేమి, యెల్లరును వర్షపు నీరు సముద్రుని జేరు విధమున నా శ్రీమహావిష్ణువునే చేరుదురు. దేవదత్తుడను వాడొక్కడయ్యు నొకరిచే బుత్రునిగా, మఱి యొకరిచే మిత్రుడుగా. వేఱొకరిచే భర్తగా నెట్లు వేఱువేఱు కర్మములచే వేఱు వేఱు నామములతో వేఱు వేఱుగా వ్యవహరింపబడునో యట్లే యామహావిష్ణువు కూడ క్రియాభేదముచేత, నామభేదము నొంది యొకరికి శివుడై, మఱియొకరికి సూర్యుడై వేఱొకరికి గణపతియై, మఱియొకరికి విష్ణువై, యింకొకరికి శక్తియై యైదు విధములుగా భాసించుచుండును.

దేవశర్మయు, నతని యల్లుడును, దాము జేసికొన్న పుణ్యకర్మముల ప్రభావముచే సూర్యుని తేజమువంటి తేజము గలవారై, శ్రీమహావిష్ణుని రూపమువంటి రూపముగలవారై, దివ్యవిమానము నధిరోహించి చరించువారై, హరిసాన్నిధ్యము నెనసి, దివ్యాంగనాభోగము, చందనానులేపన భోగము మున్నగు బహువిధములైన భోగముల ననుభవించుచు వైకుంఠమునందు స్థిరనివాస సౌభాగ్యమును గాంచిరి.

అనంతరము తన భర్తయు, దండ్రియు రాక్షసునిచే జంపబడిన సమాచారము నెఱిగి గుణవతి మిక్కిలి విలపించెను. ఆమె యింటిలోని సామగ్రుల నన్నిటి నమ్మి యాధనముతో వారికి బరలోక క్రియల నాచరించెను. బిచ్చమెత్తుకొని బ్రతుకుచు నామె యాపురమునందే నివసించెను. విష్ణుభక్తితత్పరురాలై, శాంతస్వభావురాలై సత్యము, శౌచము మున్నగు నియమములను బాటించుచు నామె జితేంద్రియురాలై పుట్టువు మొదలు గిట్టువఱకు నెనిమిది వ్రతములను శ్రద్ధాపూర్వకముగా నాచరించెను. ఏకాదశీవ్రతము, కార్తికవ్రతము, చైత్రస్నానము, వైశాఖస్నానము, మాఘస్నానము, ప్రతిదినము విష్ణుమందిరమును శుభ్రపఱచుట. యందు రంగవల్లికలను (ముగ్గులు) దీర్చిదిద్దుట, నిత్యము మహావిష్ణువు నారాధించుట యనునవియే యామె యనుష్ఠించిన యెనిమిది వ్రతములు. ఒకనాడామె సాకేత నగరమునందు సరయూనదీజలమునందు చైత్రమాసమున బ్రతిదినము నియమపూర్వకముగా స్నాన మాచరించిన మహాపుణ్యఫలము గలుగు నని యొక పౌరాణికుని ముఖమున నాలకించెను. తోడనే యామె చాలమంది జనులను వెంట నిడుకొని సాకేతమున కేగి శ్రీరామ తీర్థమున నివాస మేర్పఱచికొనెను. అనంతర మొకనాడామె పూజా సామగ్రులను జేత ధరించి సరయూనదీతీరమున నిసుకతిన్నెపై బటకుటీరములో సీతతోడను, భ్రాతలతోడను నేకాంతముగా నివసించియున్న శ్రీరామచంద్రుని దర్శింప నేగెను. ద్వారపాలకు లామె యాగమన వార్తను రఘునందనునకు నివేదించిరి. ఆమహాపురుషు డామెను లోనికి గొని రండని వారి కాదేశించెను. అప్పుడామె పటకుటీరమున బ్రవేశించి సీతతోడను, భ్రాతలతోడను జెలువారుచున్న శ్రీరామ చంద్రుని దర్శించెను.

ఆ సమయమున రఘునందనుడు జగన్మాతయగు శ్రీసీతతోడ రత్నమయపర్యంకముపై (మంచము) నధివసించియుండెను. ఆమంచ

ముపై మెత్తని దిండు లమర్చబడియుండెను, పురుషోత్తముఁ డాసన
మున గోరువంకలతో వినోదించుచుండెను. లక్ష్మణభరతశత్రుఘ్నుల
పలువురు సఖియలు నాతని బరివేష్టించి కొలుచుచుండిరి. నెమలికన్ను
వీవనలతో మెల్లగా వీచుచుండిరి. ఆతరుణమున రఘురాజకుల
భరణంబగు శ్రీరామచంద్రుడు పాదములయందు రత్నఖచితములై
సువర్ణమయములై యందములు చిందు నందియలతో, కటిప్రదేశము
సువర్ణమయమై, రత్నఖచితమై మువనొలుకు మొలనూలితో, కరము
లందు మణిఖచితములైన సువర్ణకంకణములతో, భుజములయంద
రత్నఖచితములై, దివ్యములైన కేయూరములతో, కంఠదేశమున
గమనీయమగు కౌస్తుభరత్నముతో, హృదయదేశమున హృద్యమగ
చింతామణితో, గళసీమను చిత్రవిచిత్రములై, సువర్ణమయములై
వివిధములగు మణిముక్తారత్నహారములతో, సువర్ణమయములై బహు
ళములగు తులసిపూసల పేరులతో, బూలమాలలతో, బగడాల దండ
లతో, బంగారుగొలుసులతో, సువర్ణమయములై బహువిధరత్న
ఖచితములైన పదకములతో, రత్నములు, మణులు పద్మములు సమర్చ
బడి యరటిపండు రూపమున, దానిమ్మపూవు రూపమున రచింపబడిన
యాభరణములతో, నీలమణులతో రామనామమును గోచరించునట్లు
నిర్మితములైన సువర్ణభూషణములతో, వ్రేళ్ళయందు వివిధమణిరత్న
ఖచితములై శ్రీరామనామాంకితములై సువర్ణమయములై బంగారు
నుంగరములతో, కర్ణములయందు రతనాలు, ముత్యాలు గలిగి సువర్ణ
మయములై శోభిల్లు కుండలములతో. శిరమున మణులచే, ముత్యము
లచే, రత్నములచే, బగడములచే, వైడూర్యములచే ఖచితమై, సువర్ణ
మయమై, కలశములు గలిగి సూర్యభగవానునివలె గలకలలాడు కిరీ
టముతో, బుడమినవలె బహువిధాలంకారములతో జూ... చ్చాట
గొలుపుచుండెను.

ఇట్లు సువర్ణచ్ఛాయ గలిగి, తామరపూవులను బోలు కన్నులు గలిగి, చంద్రబింబమువంటి వదనము గలిగి, తామరపువ్వులవంటి కరములు గలిగి కోటిసూర్యప్రభలతో దేజరిల్లుచున్న శ్రీరామచంద్రుని దర్శించి గుణవతి సాష్టాంగముగా బ్రణమిల్లెను. అనంతరము లేచి తాను దెచ్చిన పూజాద్రవ్యములదో రఘునాథుని బూజించెను. ఆమె పూజలచే బ్రసన్నుడై రాఘవు డామె నిచ్చవచ్చిన వర మేదేని గోరుకొమ్మనెను. అంతట నామె స్వామీ! రఘునందనా! మీకు వేలాదిగా దాసికామణులు గలరు గదా! వారితో బాటు నన్నుగూడ నొక దాసినిగా స్వీకరింపు డని వేడుకొనెను. అప్పుడా పురుషోత్తము డామె కిట్లు నొడివెను. అమ్మా! నీవు బ్రాహ్మణవనితవై యుండి యిట్లు పలుకరాదు. అట్లు కాదందువేని, నన్ను సేవించుటకే కోరుదువేని నేనొక్క మాట జెప్పుచుంటి నాలకింపుము, నేను ముందు జన్మమున ద్వాపరయుగమునందు ద్వారకానగరమున శ్రీకృష్ణుడనై యావిర్భవింతును. ఆనాడు నీవు నన్ను గాంతారూపమున సేవింపగలవు. ఈపుట్టువున నీకు దండ్రియైన దేవశర్మ యానాడు సత్రాజిత్తను పేర నీకు దండ్రి గాగలడు. నేటి నీభర్తయగు చంద్రు డానా డక్రూరుడను పేర నాకు బ్రియసఖుడు గాగలడు. ఆనాడు నీవు సత్యభామ యనుపేర నాకు బ్రియురాలవు గాగలవు. ఈనాడు కోరిన విధముగా నీవానాడు నన్ను భజింపగలవు.” అనగా విని యాగుణవతి మిక్కిలి సంతసించి యామహాపురుషునకును, సీతామహాదేవికిని బలుమాఱులు ప్రణమిల్లి తన నెలవునకు మఱలిపోయెను. అనంతర మామె చైత్రస్నానమును బరిసమాప్తము గావించుకొని తనతోడి యాత్రికవర్గమును దోడుకొని హరిద్వారమునకు వెడలిపోయెను. జీవితశేష మంతయు నచ్చటనే కడపి కడకామె యొకనాడు గంగానదిలో స్నాన మొనరించుచు నందు మునిగి యసువులను బాసి స్వర్గతి నందెను. కాలాంతరమున ద్వాపర

యుగమునందు ద్వారకానగరమున నామె సత్యభామ యనుపేర సత్రాజిత్తు కొమరితయై శ్రీకృష్ణునకు బ్రియురా లయ్యెను.

అనంతర మొకనాటి రేయి సీతాలింగితుడై శ్రీరామచంద్రుడు దివ్యమైన పర్యంకముపై బవళించి నిద్రించుచుండెను. ఆతరుణమున బింగళ యనుపేర బరగు నొక వేశ్య శ్రీరామచంద్రునియందు మరులు గొని కామ భావావిష్టమైన చిత్తముతో దివ్యవస్త్రాభరణములను దాల్చి పాదములయందు గిలుకుటందెలు మున్నగు సవ్వడి సేయు నాభరణములను బరిహరించి సీతామహాదేవి తన్నేమి సేయునో యని యడలుచు, నిటునటు నెవరైన నుండిరేమో యని బెదరు చూపుల జూచుచు, నిద్రామగ్నులై యున్న ద్వారపాలకులను వంచించి యేకాంతమున నామహాపురుషుని పొందు గోరి యంతఃపురమున కరిగెను. తనచేతితో బాదమును స్పృశించి శ్రీరామచంద్రుని మేలుకొలిపెను. అతడును మేలుకాంచి తన పాదదేశమున నిలిచిన పింగళను గాంచెను. ఆమె యా మహానుభావుని చరణమును గరములతో దృఢముగా బట్టుకొని 'రాజీవనయనాభిరామా! శ్రీరామా! నేను మీయెడల నపరాధ మాచరించితిని. దానిని మన్నించి నాపై బరిపూర్ణానుగ్రహమును బ్రదర్శింపుడు.' అని పలికెను. ఆమె కామావిష్టచిత్తవృత్తి నెఱిగి రఘునందను డామె నూరార్చుచు నిట్లు పలికెను. "వనితారత్నమా! నాకీ జన్మమున నేకపత్నీవ్రతనియమము గలదు. అది నీవు కూడ నెఱుగుదువు. నీకోరిక తీరుటకు నే నొక మార్గము నుపదేశింతు నాలకింపుము. నేను ముందుముందు వ్రేపల్లెలో శ్రీకృష్ణుడనై వెలసి యట నుండి మధుర కరిగి కంసుని సంహరించి యచట నెలకొందును. ఆకాలమున గుబ్జాస్వరూపమున నీవు నన్ను భజింపగలవు. నీ వానాడు పుడమిపై బుట్టి కంసునికడ దాసివై యుందువు. నీయిప్పటి జీవితశేషము నిచ్చట బూర్తి జేసికొని యనేకులచే ననుభవింపబడిన యీకుత్సిత దేహమును వీడి మధురలో జన్మింపుము. ఇట్లు మెల్లగా నచ్చ బలికి

రాఘవుఁడు సీత మేలుకొనునేమో యని యడలుచు నామె కటనుండి చల్లగా వెడలి పోవ నాదేశించెను. ద్వారపాలనము సేయు దాసదాసీ జనవర్గమునకు జాగరూకులై యుండ నాజ్ఞాపించెను.

అనంతరము జనకజాతను మేలుకొలిపి యామె కాక్షణమున సంఘటితమైన వేశ్యాసమాగమనమునకు సంబంధించిన యుదంత మును సాంతముగా వినిపించెను. ఆయుదంతము నాలకించి జనకజాత రోషావేగముతో దటాలున బర్యంకమును వీడి దవ్వుగా నరిగి యిట్లు పలికెను. "ఆవేశ్య చనుదెంచిన వేళ నన్నేల మేలుకొలుపలేదు? మీ యేకపత్నీవ్రత మొక బూటకపు వ్రత మని నేను ముందుగనే భావించికొంటిని. సవ్వడి చేయకుండ మీరు పింగళతోడి పొందు నెనసి యామెను జల్లగా సంపివైచి యిప్పుడు నన్ను మేలుకొలుపుటను బట్టి మీప్రవృత్తి యెట్టిదో యొకరు తెలుపకయే తెలియ వచ్చుచున్నది. మీరు వ్యాసమునీంద్రుని సముఖమున నేకపత్నీవ్రతధారులలో నసా ధారణులయినట్లు, నేను గర్భదర్భుంగల వనితలెల్లరును మీకు గౌసల్య వంటి వారయినట్లును మించిమించి ప్రగల్భవచనము లాడితిరి. ఆమాట లెల్ల గల్లలే.ఇట్టి మీతోడ నికనేను జీవితమును సాగింపజాలను.నేనీక్షణ ముననే యరిగి సరయూనదిలో దుమికి తనువును జాలించికొందును. వేశ్యాసంపర్కముచేత దూషితమైన యీపర్యంకము నిక నేను స్పృశిం పను. వేశ్యాసక్తులైన మీయెడల నాకు ద్వేష ముదయించినది. నేను మరణించిన మీదట వేశ్యాసక్తులగు మీ భావి యెట్లు కావగియున్న నట్లు కాగలదు. వేశ్యాలోలుడగు భూపాలుని రాజ్యము చిరకాలము నిలువజాలదు." యిట్లు పలుకుచు నామె రాఘవునకు నమస్కరించి దేహ త్యాగముసేయ సంకల్పించి యాపటకుటీరమునుండి విద్యుల్లతవలె మెఱ యుచు వడిగా సరయూతీరమునకు బరుగు పెట్టెను. ఆమె యిట్లు పరు గిడు చుండగా జూచి రాఘవుడు గూడ సంభ్రమముతో విడిపడిన గోచినైన జక్కజేసికొనక యామె వెనుక బరుగిడి పోయి యా సరయూ

నదీతీరమందలి యిసుకలో దన బాహువులతో నామెను దృఢముగా బట్టుకొని నిలిపి యిట్లు పలికెను. "దేవీ! జనకకుమారీ! రోషమును వీడి నామాట నాలింపుము. నేనిప్పుడెట్టి యొట్టులు పెట్టుకొన్నను నీకు నాపై విశ్వాస ముదయింపజాలదు. కావున నీవేదైన దుర్ఘటమైన ప్రమాణమును సూచింపుము. దాని నాచరించి నీకు విశ్వాసము గలిగింప బ్రయత్నింతును. ఏమిచేయుమందువో శీఘ్రముగా జెప్పుము. క్రోధము నుజ్జగింపుము." అనగా విని జనకజాత యిట్లనెను. "స్వామీ! నేను మాత్ర మేమి చెప్పనేర్తును. అగ్నిని స్పృశించి ప్రమాణము సేయు డందమన్న నది మీమొగమునుండి యావిర్భవించినదిగదా సూర్యచంద్రులను సాక్షుల గావించి శపథము సేయుడందమన్న వారి రువురును మీకు నయనము లయిరిగదా! జలమును దాకి ప్రమాణము సేయు డంద మన్న నందే మీనివాసము గదా! భూమిని సాక్షి గావించి ప్రమాణ మొనరింపు డందమన్న దానిని ధరించిన వారు మీరేకదా! శేషతల్పము సాక్షిగా బలుకు డంద మన్న నది మీయదియే కదా! లక్ష్మణుని ముఖమున దెలిసికొందమన్న నతడు వెలుపల నున్నవాడు గదా! శాస్త్రములపై బ్రమాణము సేయింతమన్న నవి మీ నోళ్ళవలన నావిర్భవించినవి గదా! నాకు దోచునదెల్ల మీస్వరూపమే కాని! మీకు దుర్ఘటమగునట్టి దేదియు నాబుద్ధికి స్ఫురించుట లేదు. మీకిప్పు డేమి సూచింపగలను? దీని కొక్కటియే మార్గము గలదు. దానిని సూచించెద. దాని ప్రకార మాచరింపుడు. అది యేమనగా, మీ గురునరేణ్యులగు వసిష్ఠముని చంద్రులను వెంటనే యిచ్చటకు బిలిపించి వారి చరణారవిందములను స్పృశించి ప్రమాణము సేయుడు. దానివలన మీపై నాకు బ్రత్యయ ముదయింపగలదు."

జనకజాత పలికిన యీపలుకుల నాలకించి రఘునందనుడు వెంటనే యొక దాసిచే లక్ష్మణుని బిలిపించి శీఘ్రముగా వసిష్ఠముని చంద్రులను దా మున్న యెడకు దోడుకొని రమ్మని యతని కాదేశించెను. అంతట

లక్ష్మణునకు పల్లకినధిరోహించి రాజద్వారమునుసమీపించి శ్రీరామాజ్ఞ నెఱిగింపగా ద్వారపాలకులు ద్వారముదెఱచిరి. అప్పుడతడు ప్రయాణము సాగించి పురములోనున్న గురువరుల సదనమునకు జేరెను. తన యాగ మనవార్త నొకదాసిచే వసిష్ఠున కందజేసెను. అర్ధరాత్రమునందు లక్ష్మ ణుని యాగమనము నెఱిగి యరుంధతీ వసిష్ఠులు చిత్తములం దెంతయో తత్తఱమునొందిరి. లక్ష్మణుని లోనికి బిలిచి యామహర్షి యతనిరాకకు గారణ మడిగెను "మునికులోత్తమా! శ్రీరామచంద్ర మహాప్రభువు మిమ్ము వెంటనే వెంటనిడుకొని రమ్మని నాకాదేశించెను, అందులకు గారణమేమి కో నేనెఱుగను. శీఘ్రముగా బయనము కండు. బయట బల్లకి సిద్ధముగా నున్నది. "అని యతడా మునిపుంగవున కెఱుగ జెప్పెను. తోడనే యాముని చంద్రు డరుంధతిని దోడుకొని పల్లకి నెక్కి పయన మయ్యెను. ఆమహానుభావుని వెనుక మఱియొక పల్లకి నెక్కి లక్ష్మణుడు కూడ నలుగడల రత్నదీపప్రకాంతులు విస్తరించు చుండ, వేత్రహస్తులచే బరివేష్టితుడై బయలువెడలెను. క్రమముగా వారెల్లరును రాఘవుని శిబిరమునకు జేరిరి. గురువరుల రాక నెఱిగి శ్రీరామచంద్రుడు వారి కెదురుగా వచ్చి తోడుకొని పోయి యుత్త మాసనముపై నుపవిష్టులగావించి సీతతోడ గూడి వారికి బ్రణామ మొనరించెను. నిండు భక్తితో వారిని నూతన వస్త్రాభరణాదులతోడ బూజించెను. పిమ్మట నానిశీథమునందు సంఘటితమైన సింగళా వృత్తాంతమును, క్రోధపూరితురాలై సీత పలికిన పలుకులను దెలిపి మీచరణారవిందములపై బ్రమాణము జేసి యామెకు బ్రత్యయము గలిగింప నెంచి మిమ్ము రావించితి నని సవినయముగా బలికెను. వాచ కాంతనుగాని, వేఱుకాంతనుగాని నెన్నడును మానసికము గానైన భావించి యెఱుగ ననుటకు మీ దివ్యశ్రీ చరణారవిందములే ప్రమా ణము అని పలుకుచు నాముని రాజు చరణములపై గరముల నిడి

సిరమువంచి యామెకు బునఃప్రణామ మొనరించెను. అప్పుడు జనక జాత రఘునందనుని బవిత్రవర్తనునిగా నెఱిగెను. సిగ్గుపడుచు దన యపరాధమును మన్నింపుడని మఱియు మఱియు వేడుకొనెను. అటుపిమ్మట నామె పతివ్రతాతిలక మగు నరుంధతికి నవ్యములు, దివ్యములునగు వస్త్రములను, నాభరణములను సమర్పించెను. ఈవిధముగా సీతారాముల పూజల నందికొని యా పుణ్యదంపతులు పల్లకి నధిరోహించి మరల దమ గృహమునకు మఱలిపోయిరి.

అనంతరము రఘువరుడు సీతను గౌగిలించికొని శయనించి సుఖముగా నిద్రించెను. మఱునాడు ప్రాతఃకాలమున సీత పింగళను బిలిపించి బంధించి యనేకవిధముల ధిక్కరించి దాసీజనముచే గొట్టించెను. అంతియ కాక ఓసి పింగళా! నాయెడల నపచార మొనరించితివి. కావున నీవు మధురానగరములో మూడు వంకరలు గలదానవై యావిర్భవించెదవుగాక యనికూడ శపించెను. ఆమె యనేకవిధముల వేడుకొనగా కృష్ణుడు నిన్నుద్ధరింపగలడు లెమ్మని శాపవిమోచన విధమును దెలియజెప్పెను. పింగళను బంధించి రన్న వార్త నెఱిగి రఘు నందనుడు త్వరితముగా నరుగు దెంచి యామెను విడిపించెను.

ఈవిధముగా శ్రీరామచంద్రు డెన్నియో కౌతుకముల నొనరించెను. తన చరితములచే సీత నానందపఱచెను.

అష్టమసర్గము సమాప్తము.

—()—

# నవమసర్గము

## శ్రీరామచంద్రుని కురుక్షేత్ర యాత్ర

రామదాసుడు విష్ణుదాసున కిట్లు వినిపించును.

ఒకనాడు శ్రీరామచంద్రుడు సీతతోడను, భ్రాతలతోడను గూడి పుష్పకవిమానము నధిరోహించి సూర్యగ్రహణ కాలమున

బుణ్యతీర్థస్నానము సేయుతలంపున గురుక్షేత్రమునకరిగెను. అచ్చటకు దేవతలు, గంధర్వులు, కిన్నరులు, నాగులు, ననేకములగు నాశ్రమములనుండి మహర్షులు మహారాజులును, వేలాదిగా నేగుదెంచిరి. అచ్చటి తీర్థమునందు స్నానమొనరించికొని సీతతోడ గూడిశ్రీరామ చంద్రుడు రథములు, గుఱ్ఱములు, నేనుగులు, నొంటెలు మున్నగు వాని నెన్నిటినో దానము లొనరించెను. అనంతరమా మహారాజు లనేకవిధములగు కానుకలను జేత బూని శ్రీరామచంద్రుని దర్శింప నేగిరి. అట్లులే వారి భార్యలు కూడ ననేకములగు కానుకలను జేకొని సీతా మహాదేవిని సందర్శింప నరిగిరి. జనకజాత యారాజపత్నుల నెల్లరను గౌగిలించికొని గౌరవించి యుత్తమాసనములపై గూర్చుండనియమించి నకియలచే. మునిబాలకులచే బరివేష్టితురాలై తాను గూడ నొక వరాసనముపై నాసీనురా లయ్యెను.అప్పు డచ్చట నామెచే ననేక విధములగు పూజాసత్కారముల నందుకొని యగస్త్యుని భార్యయగు లోపాముద్ర సానందముగా నాసీనురాలై యుండెను. ఆమె జనక జాతనవలోకించి "అమ్మా! అన్నవల మిన్నా! అవనిజా! వినుట కింపగు శ్రీరామచంద్రుని పురుషకారగాథ యేదియేని నుంత వినిపింపు మమ్మా! విని యానందింతును" అని పలుకరించెను. ఆమె పలుకు నాలకించి సీత తన పాణిగ్రహణము మొదలు కురుక్షేత్ర యాత్ర వఱకు సాగిన చరిత్రము నంతను నామెకు జెప్పి వినిపించెను. అది యంతయు నాలకించి లోపాముద్ర మఱల నిట్లనెను. అమ్మా! అవని జాతా! శ్రీరామచంద్రు డాచరించిన దంతయు నందముగనే యున్నది. కాని యొక్క యెడ నాత డాచరించిన శ్రమ మంతయు ననావశ్యకమగునట్టిదనియు, నిరర్థకమగునట్టి దనియు నని నేను భావించుచున్న దానను. అది యెట్టిదన్న నా మహాపురుషుడు సేతుబంధ నిర్మాణము విషయమున జేసిన ప్రయత్నమెల్ల ననావశ్యక మగునట్టిదే. అత డగస్త్య మహర్షి కేల సూచింపలేదో యెఱుగను. కాని సూచించి

యున్నచో నా మహాతపోధను డాసాగర జలమునంతను బుడిసిట బట్టి క్షణములో ద్రాగివైచి సముద్రము నిగిరిపోవునట్లు చేసి వానర వీరులకు లంకానగరమునకు జేర ననువగు సులభమార్గమును గల్పించి యుండువాడు. అట్లు చేయక రాఘవు డనావశ్యకముగా వానరులకు గ్లేశము నొదవించెను. "

లోపాముద్ర పలికిన యీపలుకుల నాలకించి జనకజాత యామెను విహసించుచు సగర్వముగా మఱల నిట్లు పలికెను. "మహాపతివ్రతా శిరోమణీ! లోపాముద్రా! సేతుబంధము విషయమున రాఘవు డొనరించిన ప్రయత్న మేదియు ననావశ్యక మగునట్టిది కాదు. అది యెట్టిదో వివరించు చుంటి నాలకింపుము. శ్రీరామచంద్రమహాప్రభువు బాణప్రయోగము గావించి సముద్రమును శుష్కింపజేయ సంకల్పించె నేని యందు వసించు జీవుల నన్నిటిని హత్య జేసినవాడగును. ఆకారణముననే యామహాపురుషు డట్లు చేయలేదు. అంబర మార్గమున నంబుధిని దరింప నెంచెనేని రావణు డామహాప్రభువును మానవునిగా భావింపజాలడు. హనుమంతుని మూపు నధిరోహించి సాగరమును దరింప బూనెనేని యిందు రాముని ఘనత యేమున్నదని లోక మా మహాపురుషుని జులుకన సేయును. బాహువులతో సముద్రము నీది లంకకు జేర యత్నించెనేని బ్రాహ్మణుని మూత్రమును లంఘించిన వాడగును, అట్లుచేయుట ధర్మవిరుద్ధము గదా! మఱియొక్కమాఱు సముద్రజలమును శోష మొనరించి వానరులకు మార్గమును గల్పింపు డని యగస్త్యమహర్షినే ప్రార్థింతి మన్న నదియు యుక్తముదు,గా వేల యనగా మున్నొకమాఱా మహర్షి కుపితుడై యా సాగరజలము నంతను బానము జేసి మఱల మూత్రద్వారమున దానిని బహిర్గత మొనరించినవాడు. ఆకారణముననే యా సాగరమునకు క్షారత్వము (ఉప్పదనము) ప్రాప్తించినది. మూత్రరూపము నొందిన యాజలము నా మహాముని యెట్లుపానము సేయగలుగును? శ్రీరామచంద్రుని

మాటను ద్రోసిపుచ్చుటకిచ్చగింపక యామహర్షి సముద్రజలమును పాన మొనరించుట కుద్యమింపనువచ్చును. కాని యది కారణముగా రాఘవునకు లోకములో నపకీర్తి వాటిల్లును, తన కార్యసిద్ధిని గోరి యధికార దర్పముతో రాఘవు డొక బ్రాహ్మణునిచే మూత్రపానము సేయించె నని లోకమా పురుషోత్తముని దూషింప దొరకొనును. ఆకారణముననే యా ధర్మతత్త్వజ్ఞుడగు మహాప్రభువా మహర్షిని సముద్రజలపానము సేయ బ్రార్థింపలేదు. ఇన్ని విధముల నాలోచించి రఘునందనుడు సాగరముపై వానరులచే సేతుబంధమును నిర్మింప జేసెను. ఇట్టినిర్మాణము నింతకు మున్నెవ్వడును జేసియుండలేదు. ఇక ముందు జేయబోడు. తన్నిర్మాణము గావించి యతడు తొల్లి జలధిపై శిలలను దేలించిన దశరథానందవర్ధనుడగు శ్రీరామచంద్రు డీతడే యను నాశాంత విశ్రాంతమైన కీర్తిని బడసెను. ”

జగన్మాత యగు సీత పలికిన యీపలుకుల నాలకించి లోపాముద్ర యామహిళా సభయందు లజ్జితురాలై క్షణకాలము మౌన భావము వహించియుండెను. పిమ్మట సీత నగుమోముతో ముందునకు వచ్చి మునిపత్నులను, లోపాముద్రను బూజించి కడపట నామెతో “నమ్మా! పతివ్రతాశిరోమణీ! లోపాముద్రా! నే నిప్పుడు దురుసుతనము మీఱ మాటలాడి నీమనసును నొప్పించి నీయెడల నపరాధ మాచరించిన దానను, నన్ను మన్నింపుము. ప్రసంగ వశముననను, నీయెడల నున్న స్నేహభావము కారణముగను నీసమక్షమున శ్రీరామచంద్రుని పురుషకారము నొక్కింత యుగ్గడించితిని. ఆపురుషకారమునకు నీపతిదేవులగు నగస్త్యమహామునిచంద్రుల యాశీర్వచనమే కారణమని నేను భావించుచున్నాను” అని పలికి క్షమాభిక్ష వేడుకొని యామెను, నామెతోడివారలను సగౌరవముగా సాదరముగా వీడుకొలిపెను. అనంతర మామె శ్రీరామచంద్రుని సన్నిధికి వెడలిపోయెను.

పిమ్మట రఘునందనుఁడు మహారాజుల పూజా సత్కారముల నందికొని వారిని సాదరముగా వీడుకొలిపి యేనుగులు, గుఱ్ఱములును వెనుకొని రాగా సీతతోడ గూడి గరుడవాహనము నధిరోహించి తన నగరమునకు వెడలిపోయెను. సూర్యగ్రహణ కాలమున కురుక్షేత్రమున కరుగుదెంచిన జనులందఱును శ్రీరామచంద్రుని దర్శనము తమకు లభించినందుల కపరిమితానందము నొందుచు దమతమ నెలవులకు దఱలిపోయిరి. శ్రీరామచంద్రుఁడును నగరమధ్యమున పౌరకాంతలచే గుంభదీపపు నివాళుల నందికొనుచు సరిగి తన మందిరమున బ్రవేశించి జనకజాతతోడ గూడి హాయిగా గాలము గడపెను.

ఇట్లు సాకేతనగరమునందు సీతతోడ గూడి శ్రీరామచంద్రుఁడనేకమహోత్తర కౌతుకముల నాచరించెను. సీతతోడ శ్రీరామచంద్రుని వలె నూర్మిళతోడ లక్ష్మణుఁడును, మాండవితోడ భరతుఁడును, శ్రుతకీర్తితోడ శత్రుఘ్నుఁడును గూడి సానందముగా సమయమును వెడలింప దొడగిరి. పౌరులందఱును దమతమ పత్నులతోడ గూడి పరమానందపూర్వకముగా గాలమును గడపుచుండిరి. పార్వతిని గూడి పరమేశ్వరుఁ డానందించు విధమున సీతామహాదేవితోడ గూడి శ్రీరామచంద్రుఁ డానందము ననుభవించెను. ఆమహానుభావుఁడు రాజ్యపరిపాలనము సేయు కాలమున లోకమునందు పరస్త్రీల పొందును గోరువాఁడు గాని, వేశ్యాలోలుఁడు గాని, మాదక ద్రవ్యములను సేవించువాఁడు గాని, దరిద్రుఁడు గాని, వ్యాధిగ్రస్తుఁడు గాని, చింతాక్రాంతుఁడు గాని, మనోవ్యాకులత నొందువాఁడుగాని, పాపాత్ముఁడు గాని, మందబుద్ధి గాని, తస్కరుఁడు గాని, హింసాపరాయణుఁడు గాని యొక్కఁడును లేకుండెను.

శిష్యా! విష్ణుదాసా! ఇది సాకేతనగరమునందు సీతామహాదేవితోడ గూడి శ్రీరామచంద్రమహాప్రభువు నెఱపిన శ్రవణసుఖదాయకమైన విలాసముల చరిత్రము. దీనిని నీకు వినిపించితిని. ఈ

విలాసకాండమును శ్రీ రామచంద్రుని సన్నిధానమునందు ప్రాతః కాలమున, మధ్యాహ్నసమయమున, నిశీథసమయమున బఠించు మానవుని బుడమిపై మానవరూపమున ప్రత్యేకముగా నవతరించిన శ్రీరామచంద్రునిగా నెఱుగదగును, ఈకాండమును బఠించుటవలన ధనమును గోరువాడు ధనమును, భోగములను గోరువాడు భోగములను, దనయులను గోరువాడు తనయులను బడయగలుగును. శ్రీరామ భక్తితత్పరుడై యీ కాండము నాసక్తితో నాలకించిన వాడు పుడమిపై సుఖములను బడయును. పాపములనుండి విముక్తుడగును. ఈకాండ, మత్యంతరమణీయమైనది. జనులకు వినుట కింపులు నింపునది. పరమానంద సంధాయకమైనది.చిత్రమైనది,శ్రవణసుఖకరమైనది, మనుజుడు చతుర్విధ పురుషార్థములలో దేనిని గోరి దీనిని బఠించినను దాని నవశ్యము వడయగలడు. రాత్రివేళల భార్యతోడ మంచముపై గూర్చుండి యీకాండము నారు మాసముల కాలము నియమముగా బఠించువానికి బుత్రప్రాప్తి గలుగగలదు. అట్లు కాని పక్షమున వ్యాసు (పురాణము జెప్పు పండితుడు) నొక మంచముపై గూర్చుండ జేసి యాతని కెదురుగా మఱియొక మంచముపై భార్యతోడ గూడి కూర్చుండి రాత్రివేళలయందీ పరమపవిత్రమగు విలాసకాండము నాసక్తి మీఱ దొమ్మిది మాసముల కాల మాలకింపవలయును. ఇట్లు లాచరించు నపుత్రకుడు తప్పక పుత్రవంతుడగును. పుత్రుని బడయగోరువారు మాత్రమే మంచముపై గూర్చుండి యీకాండమును బఠనము, శ్రవణము జేయవలయును. పుత్రప్రాప్తికన్న భిన్నమైన కోరిక గలవారు మాత్ర, మెన్నడు నీకాండమును మంచముపై నుండి శ్రవణము జేయరాదు. భార్యను బడయగోరువాడు భక్తియుక్తాంతరంగముతో నీవిలాసకాండమును దొమ్మిది మాసముల వఱకు నియమముగా బఠించినచో నతనికి దప్పక సౌందర్య శాలిని యగు భార్య లభించును. కన్య యగునామె పతిని గోరుచు నీకాండము

నారు మానసులు పర్యంతము శ్రవణము జేసినచో నామె నిశ్చయముగా నుత్తముడగు పతిని బడయగలదు. ఈకాండము నాలకించు స్త్రీలకు సౌభాగ్యసంపద యెన్నటికిని క్షయము నొందదు. తమతమ పతుల యాయుర్వృద్ధికి గోరి యుత్తమ స్త్రీలు స్నాన మొనరించి నిత్యము నియమ పూర్వకముగా నీ కాండమును శ్రవణము జేయవలయును.

ఈవిలాసకాండము మనోహరమైనది, విచిత్రమైనది, మధురమైనది, పావనమైనది, చెఱకుముక్కవలె రసవంతమైనది, దీనిని బఠించు వారికి బాపములు నశించును. ధర్మనిష్ఠ గలుగును, జననమరణ రూపమగు భవరోగము నశించును.

—నవమ సర్గము సమాప్తము—

విలాసకాండము సమాప్తము

—) 0~0~0 (—

# జన్మకాండము

## ప్రథమ సర్గము

### శ్రీరామచంద్రుని యుద్యానవన విహారము

శ్రీరామదాసుడు విష్ణుదాసున కిట్లు వినిపించును.

సాకేతనగరమునందు సీతతోడ గూడి శ్రీరామచంద్రుడు సోదర సమేతుడై దేవదుర్లభములగు వివిధములైన క్రీడల నాచరించెను.

ఒకనాడు శ్రీరామచంద్రుడు దాదిముఖమున సీతామహాదేవి గర్భవతిగా నున్నదన్న వార్త నాలకించి బ్రాహ్మణులను రావించి

వారి కనేకగానము లొనరించెను. వారికి బ్రతిదినము భోజనాదిక ములు వెట్టించి సంతర్పణ మొనరించెను. సిపుణులను రావించి యనేకరత్నఖచితములగు నవీనాభరణములను, బచ్చనివి, యెఱ్ఱనివి, చిత్రవర్ణములు గలవి. సన్ననివి, విస్తృతములైనవి, వెలగలవి, కల కలలాడునవియు నగు దివ్యవస్త్రములను నిర్మింపజేసి సంబరము మీఱ జనకజాత కర్పించెను. అనంతరము రెండవ మాసమున రెండవ దినమున బ్రాహ్మణులతోడను, కులగురువగు వసిష్ఠమునివర్యుని తోడను గూడి యామెకు యథావిధిగా బుంసవనసంస్కారము నాచ రించెను. ఆ సందర్భమున నాదరము మీఱ సుమేధను, జనకుని గూడ రావించి దివ్యములగు నుత్సవముల నెన్నిటినో జరపించెను. గర్భవతి యగు తన కొమరితను గాంచి పరమానందభరితుడై జనకుడా పుణ్యదంపతులకు బూజాసత్కారములు గావించెను. సువర్ణతంతు నిర్మితములై, పచ్చనై, యాకుపచ్చనై, సన్ననై, లఘువులై, విస్తృతములై, పొడనై పొలుపారు ననేక సుందరవస్త్రములను, నాభరణములను నామెకు గానుకగా సానందముగా నర్పించెను. ఏనుగులను, నొంటెలను, రథములను, గుఱ్ఱములను, సుందరాకార ములు గల దాసికామణులను, దాసజనులను, బల్లకులను, మనోహర వస్త్రములను శ్రీరామచంద్రున కర్పించెను. ఈ విధముగా జనకమహా రాజు సీతారాములను బూజించి, వారివలన బూజలను స్వీకరించి తన మిథిలానగరమునకు మరలిపోయెను.

పిమ్మట సీతతోడ గూడి శ్రీరామచంద్రుడు సంతుష్టాంతరంగ ముతో సమయమును వెడలించుచుండెను. గర్భభారాలసురాలగు సీత యాభరణములనెల్ల బరిత్యజించి నెల్లనైన వదనకమలముతో గృశించియుండియు నొకవిధమగు విలక్షణ సౌందర్యముతో వీక్షణ పర్వముగా వెలుగొందుచుండెను. ఒకనా డామె తనకు దన స్వామి తోడ గూడి సాకేతనగరము వెలుపల నుద్యానవనమునందు విహ

రించి వినోదింప గుతుక మగుచున్నదని తన దాదిచే శ్రీరామచంద్రు నకు సూచింపజేసెను. ఆ వార్త నాలించి యతడు నగుమోముతో లక్ష్మణుని రావించి దాని నాతని కెఱిగించెను. అది విని యాతడు పోయి శిరములపై జత్రేసులైన తలపాగలను, కరములయందు వేత్రములను దాల్చిన భటులను సభాస్థలికి రావించి చిఱునవ్వు నవ్వుచు "భటులారా! మీ రంగడివీధికి బోయి 'శ్రీరామచంద్ర మహాప్రభువును గూడి సీతామహాదేవి పురము వెలుపల నున్న యుప వనమున కరుగ నున్నది. కావున వారికి ముందు నడచుటకు సన్న ద్ధులు కండు' అని వణిజుల నెల్లరను ద్వరపెట్టుడు." అని వారి కాదేశిం చెను. వారు పోయి యట్లే రాజమార్గమునందు, నాలుగు వీధుల కూడలులయందు, నంగడి వీథులయందును నిలిచి కరములు మీది కెత్తి 'మహాజనులారా! సీతారాము లుపవన విహారమున కరుగు చున్నారు. కావున మీరెల్లరును వారికి ముందు నడచుటకు సంసిద్ధులు గావలయును' అని ఘోషణము గావించి మఱల లక్ష్మణుని చెంతకు మఱలి పోయిరి. అప్పుడు లక్ష్మణుడు మఱల "సేవకులారా! మీరు శీఘ్రముగా నేగి యుపవనమున నెల్లయెడల బటకుటీరముల నేర్పఱిం పుడు. అచ్చటి ప్రదేశములను శుభ్రపఱచుడు. జలయంత్రము లన్నియు జక్కగా బని సేయుచున్నవో లేదో పరిశీలనము సేయుడు. సన్నని వస్త్రములను గొనిపోయి యచ్చట నుంచుడు. ఇంకను నితర ములగు, నావశ్యకములగు నేర్పాటు లన్నియు గావింపుడు. ఆరామము నందలి భవనముల నన్నిటిని దివ్యవస్త్రములతో, దోరణాలతో, ముత్తెపుగుత్తులతో జక్కగా నలంకరింపుడు," అని వారికాదేశించెను. అట్లకాక యని చని వారట్లే యాచరించిరి.

అనంతరము లక్ష్మణుడు శ్రీరాముని సన్నిధికేగి నమస్కారము గావించి ప్రభూ! సర్వము సిద్ధము చేయబడినది. మీకును, సీతామహా దేవికిని వాహనమును సిద్ధము చేయుదునా? యని ప్రశ్నించెను.

అప్పుడు రఘునాథుడు సీత వంకకు దిరిగి సీతా! నీవే వాహనము నిచ్చగింతువు? అని యామెను ప్రశ్నించెను. ఆమె పల్లకి గావలయునని బదులు పలికెను. రఘునందనుడు గూడ బల్లకినే యిచ్ఛగించెను. వారి కోరికల నెఱిగి లక్ష్మణుడు జరీపనితనము గలిగిన సుందర వస్త్రములచే బరివేష్టితములై మంచిముత్యాల జాలరులతో నలంకృతములై, మంగళప్రదములైన రెండు పల్లకుల నచ్చటకు వెంటనే దూతలచేత దెప్పించెను. తోడనే పరమానందము తోడ రాఘవుడు పల్లకి నధిరోహించెను. వెల్లబాఱి కృశించిన శరీరముగల జనకజాత గూడ బరిమితములైన యాభరణములను మేనదాల్చి పరిచారికలు కైదండ లొసగ నల్లనల్లన నేగి పల్లకి నధిరోహించెను. ఆ పల్లకియందు క్రింద నొక మెత్తని దిండును, నామె వెన్నువంక నొక దిండును నమర్పబడియుండెను. పరిచారిక లామెకు వీవనలతో వీచుచుండిరి. ముత్తెములతోను, సువర్ణతంతువులతోను వినిర్మితమై పల్లకిలో బయ భాగమున వ్రేలు నొక చెండు నామె యవలంబముగా గేల ధరించెను. ముత్తెపుజాలరులతో నలంకృతములైన యా పల్లకిలోని కిటికీలనుండి యామె రాజమార్గమునందలి వింతలను, వినోదములను మాటిమాటికి దిలకించుచుండెను. వారాంగనలు చారుతర నృత్యములు సలుపుచుండిరి. అంతలో శ్రీరామచంద్రుని సోదరులు, వారి భార్యలు, తల్లులు బంధుగులును వేఱువేఱు పల్లకుల నధిరోహించిరి. ముందు సోదరులు, వారి వెనుక దల్లులు, వారి వెనుక సీత, యూర్మిళ, మాండవి, శ్రుతకీర్తి యనువారును, సంచలకును ముందు గులగురువగు వసిష్ఠమహర్షియు నుండి శ్రీరామచంద్రుని దివ్యమంగళ విగ్రహమును దిలకించుచు ముందునకు సాగిరి. ఆ యెడ వారవనితలు చారుతర నృత్యములు సేసిరి. మంగళవాద్యము లనేకములు మ్రోగినవి. వందిమాగధు లనేకస్తుతి ప్రబంధములతో సీతారాములను స్తుతించిరి. ఇట్లు వివిధములగు నుత్సవములతో నానందము మీఱ బయనము

సాగించి పోయి యనేకసైన్య పరివేష్టితుడై శ్రీరామచంద్రుడు సీత తోడ గూడి తమకై నిలుపబడిన యొక మనోహర పటకుటీరమున బ్రవేశించెను. అతని ననుగమించి యరుగుదెంచినవా రెల్లరు గూడ వారివారికై ప్రత్యేకింపబడిన పటకుటీరములందు బ్రవేశించిరి.

అచ్చట నెల్లయెడల నంగడివీధు లేర్పడియెను. ఆ యారామ మయిదు క్రోశముల పొడవు వెడల్పులు గలది. అంతమేరయు జుట్టును వస్త్రముతో బ్రాకార మేర్పాటుప బడియెను. జనకజాత పట కుటీరమున వసించి యా యారామము నవలోకించి యానందించెను.

ఆ యుద్యానవనమునం దొకచోట రసమున శాలయను లన దగు రసాలవృక్షములు, (తీయమామిడి), నొకచోట శోకమును హరిం పగలవివి యనదగు నశోకవృక్షములు, నొకచోట తాళవృక్షములు, తమాల వృక్షములు, హింతాలవృక్షములు (గిరికతాడి), సాలవృక్ష ములు (మద్ది), నొకచోట స్వర్లోకమును దాకబోవు పోకమ్రాకులు, నొకచోట శ్రీరమ్యములైన మారేడుతరువులు, నొకచోట గురుతర శోభలను గురియించు నగురువృక్షములు, (ఇరుగుడుచెట్లు) నొకచోట గపుల మూలమున గపిలవర్ణమును నెలయించు గపిత్థవృక్షములు, (వెలగ) నొకచోట వనలక్ష్మియొక్క కుచములా యివి? యనదగు లకుచతరువులు, (గజనిమ్మ) నొకచోట నమృతఫలము లివి యని యెన్నదగు నరటితరువులు, నొకచోట హృదయరంజకములని యెన్న వలయు నారింజలు, నొకచోట వేతసతరువులు, నిమ్మభూజములు, మాదీఫలపు దరువులు, నొకచోట బాంధుల నిటకు వచ్చి శ్రమ మపనయించి కొనుడని పిలుచుచున్న భంగి నాకులను గదలించు కప్పు రపుటనటి వృక్షములు, నొకచోట కదలుచున్న పల్లవము లనెడు కరములతో మల్లికాపుష్పగుచ్ఛమనెడు స్తనమును స్పృశింపబోవు పున్నాగులను (పురుషపుంగవులు) బోలు పున్నాగవృక్షములు, నొక చోట బగిలిన ఫలముల రూపమున దమ హృదయము లెంతయో

యనురాగపరిపూర్ణములని తెలుపుచు మగలు తమ మగువలను వలె మాధవీలతలను గాఢముగా కౌగిలించికొనబోవు దాడిమీ వృక్షములు, నొకచోట మే మసంఖ్యాక బ్రహ్మాండముల నుదరమున ధరింతు మని తెలుపుభంగి నసంఖ్యాకజంతుజాలముల నుదరమున దాల్చు ఫలములు క్రిందకు వ్రేల గించిదవనతములైన యుదుంబర తరువులు, (మేడి) నొకచోట వనదేవత నాసికను బోలు పనసవృక్షములు, నొకచోట జిలుకముక్కులను వెక్కిరించు పూలతోడి పలాశ వృక్షములు, (మోదుగు) నొకచోట నూలుబంతుల నపహసించు పూలబంతులతోడి కదంబముల బంతులు (కడిమి), నొకచోట మేరు శిఖరములను దలపించు నమేరువృక్షములు, (సురపొన్నలు) నొకచోట గాముకుల పాలిటికి మదన సదనములని చెప్పనొప్పు రాజాదన భూజములు, నొకచోట బటకుటీరములను విహసింప బటువులగు వటవిటపినివహములు (మఱ్ఱి), నొకచోట గొమ్మలపయి గూరుచున్న బకములను దలపునకు దెచ్చు పువుగుత్తులతోడి గిరిమల్లికల మొత్తములు, నొకచోట బుష్పఫలాదులకై యాచకజనము మీదికి చేతులెత్తగా వేయి కరములు గలవానివలె బోలుపారు కరమర్ద (కలివె చెట్టు) కరీర (వెణుతురుచెట్టు) కరజ (కానుగు) తరువులు, నొకచోట వనలక్ష్మికి నీరాజనము లర్పింప మీదికెత్తిన దీపములా యివియన నొప్పు మొగ్గలతోడి రాజచంపకతరువులు (సంపంగి) నొకచోట వికసించిన తామరలతోడి తటాకములను దలపించు వికసితసుమ సముదాయములైన శాల్మలీద్రుమములు, నొకచోట జలించు దళములతో గలకలలాడు నశ్వత్థవృక్షములు, నొకచోట గమగమలాడు పరిమళములతో ఘ్రాణతర్పణ మొనరింపగల బంగారువన్నె మొగలి వృక్షములు, నొకచోట గృతమాలతరువులు (ఱేల) నొకచోట నక్తమాల వృక్షములు, నొకచోట రేగుచెట్లు, మంకెనలు, నొకచో దిందుక తరువులు, గారభూరుహములు, కరుణతరువులు, నొకచోట

భూమిరూపమును దాల్చిన శంకరునకు స్వహస్తములతో ముత్యముల నర్పించుచున్నవా? యన నొప్పు నిప్పవృక్షములు, నొకచోట గాలిచే గదలుచు వీచబడుచున్న వీవనలను దలపించు మద్దిచెట్లు, నొకచోట నాకసమంట గొడుగుల నెత్తిపట్టుకొన్నవా? యన నొప్పు నారికేళ వృక్షములు, ఖర్జూరితరువులును, నొకచోట సముందములగు పిచుమంద (వేప) వృక్షములును, నొకచోటఁ బాటలవృక్షములు, తింత్రిణీవృక్షములు (చింత) పోకమ్రాకులును, గరహాటతరువులును, నొకచోట వనదేవత నొసటి తిలకములా? యన నొప్పు తిలకవృక్షములు, పొగడతరువులును, నొకచోట తాండ్ర, జువ్వి, యందుగు, దేవదారువు, మ్రానిపసువు చెట్టులును, నొకచోట సదాఫల తరువులు, సదాపుష్పవల్లరులును, నొకచోట నేలకి తీగలు, లవంగలతలు మిరియపు దీగలును, నొకచోట నేరేడు, మామిడి, జీడిమామిడి, గుమ్మడితరువులును, నొకచోట శాకతరువులు, చందనపు దరువులును, రక్తచందనపు దరువులును,నొకచోట గరక,కొండగోంగు,ఉసిరిక చెట్లును, నొకచోట ద్రాక్ష, తమలపాకు, పిప్పలి తీగలును, నొకచోట సుగంధ బంధురములైన మల్లెలు, నడవిమొల్లలు, తులసిమొక్కలును, నొకచోట నగిసెవృక్షములు, ముసరుచున్న తుమ్మెదలతోడి మాలతీలతలును, నపరిమితనయనానందసంధానచణములై యలరారు చుండెను. ఆవనములోని వల్లికామతల్లికలు, తుమ్మెదల రూపమున నేఁగుదెంచిన కృష్ణు ననేకవిధముల రంజింపజేయ బరిమళపూరితములై, వరమసుఖదాయకములై కామసంజనకములైన పిల్లవాయువులను మెల్లమెల్లగా వీతేఱజేయుచుండెను. అనేక మృగసమూహము లావనను నందింద ను బహమానందము మీఱ దిరుగాడు చుండెను. వివిధములగు పక్షిసంతానములు గిలకిలారావములు గావించు చుండెను. అందిందందు వివిధ నదీతటాకకుండములు మెండుగా గన్నుల పండువు సేయు

చుండెను. ఆ యుద్యానవనము నేల రాలుచున్న పూలహావమున నర్ఘమును సృష్టించుచున్నట్లును, నెమలి యఱపుల రూపమున దూరముగా నున్న వారికి రంకురండని స్వాగతము పలుకుచున్న విధముగను బరిఢవిల్లుచుండెను.

ఇట్టి సర్వాంగసుందరమైన పుష్పవనమును గాంచి జనకజాత యమందానందము నెనసి యందిందందు గుతుకము దీర బరిభ్రమించెను.

ప్రథమసర్గము సమాప్తము

—) 0~0~0 (—

# ద్వితీయసర్గము

## * సీతారాముల యుద్యానవనవిహారము *

రామదాసుడు విష్ణుదాసున కిట్లు వినిపించును.

అనంతరము శ్రీరామచంద్రునితోఁ గూడి సీతామహాదేవి మనోహరములగు నుద్యానవన భూములయందు మేలు మేలని దేవతలు కూడ మెచ్చుకొను విధమున నెన్నియో క్రీడల నాచరించెను. ఒకప్పుడామె యుపవనములోని దివ్య భవనమునందు గాలము గడపిన మఱియొకప్పుడు పటకుటీరములందు వసించి సమయమును నెఱలించెను. ఒకవేళ మామిడిచెట్ల నీడలో నుపవిష్టురాలైన మఱియొక వేళ బుష్పవనములోపల దిరుగాడెను. ఒక సమయమున జలయంత్రముల సమీపమున నాసనముపై నాసీనురాలైన మఱియొక సమయమున నదీసరోవరతీరములందు గూర్చుండెను. ఒకప్పుడు నౌకపై దటాకమునందు విహరించిన మఱి యొకప్పుడు సరయూనది యందు విహరించెను. శ్రీరామచంద్రునితోఁ గూడి యామె యొకప్పుడు పగటివేళను, మఱి యొకప్పుడు రాత్రివేళను జలక్రీడల నాచరించెను. ఒక సమయమున నామె యరటితోటలలో విహరించియు, మఱియొక సమయమున

చెట్లపై నెత్తుగా నిర్మింపబడిన గృహములందు వసించియు, నింకొక సమయమున వట్టివేళ్ళతో నిర్మింపబడిన గృహములందు నివసించియు, గాలము గడపెను. ఒక తరుణమున సరయూనదిలో నిర్మితములైన గృహములలో గాలమును వెడలించిన మఱియొక తరుణమున గృత్రిమ గృహములందును, బూబొాదరిండ్లయందును గాలమును వెడలించెను. ఒక సమయమున జిత్రశాలలో వసించిన వేఱొక సమయమున బుష్పక విమానమునందు నివసించెను. ఒకకాలమున మొగలి పొదల నడుమ నున్న మఱియొక కాలమున నొంటిస్తంభపు మేడలో నుండెను. ఒక ప్పుడు సరియూనదిలో నౌకపై నిర్మింపబడిన గృహములంను వాసము జేసిన వేఱొకప్పుడు నదీతీరమున నిసుకతిన్నెలపై వాసము జేసెను. ఒకప్పుడామె యొంటిస్తంభముపై నెత్తుగా నిర్మింపబడిన సుందరభవనములో సఖజనపరివేష్టితయై యున్న మఱియొకప్పుడు రఘునందనునితో గూడి యేకాంతవాసము జేసెను. ఒకవేళ నూయలల నధిరోహించి వినోదించిన వేఱొకవేళ దానిమ్మతోటలో బర్యంకము (మంచము) నధిష్ఠించి వినోదించెను. ఒకప్పుడు వృక్షముపై నమర్ప బడిన పర్యంకముపై రాఘవునితో గూడి పవళించి యానందించెను. వెల్లబాఱిన యొడలు గలిగి, పృథులమైన యుదరము గలిగి వెలు గొందు నా విదేహరాజకుమారి యొకప్పు డెట్టుని అవికను, నాకు పచ్చని చీరనుధరించి చెట్ల చివురుటాకు జొంపముల మాటున దాగి నగుమొగముతో శ్రీరామచంద్రు నెంతయో యలయించి వినో దించెను. కడకతడు తనను గుర్తింపగా నెఱిగి సానందముగా బరుగిడి వచ్చి యాతని గాగిలించిగొనెను.

ఇట్టులా వనమునందు సీతారాములు బరమాద్భుతములైన చేష్టావిశేషములతో వినోదించుచు గ్రీడించిరి. వారి క్రీడావినోదము లను సవిస్తరముగా నెవడు వర్ణింపగలడు? మునికులతిలకుడగు వాల్మీకి యొక్కడే యందులకు సమర్థుడయ్యెను. కావుననే యామహా

మహాత్ముఁడు శ్రీరామచరిత్రమును నూరుకోట్ల శ్లోకములలో రచింపగలిగెను. విష్ణుదాసా! అందలి సారాంశమును మాత్రమే వర్ణించి నీకు వినిపించుచున్నాను.

ఉద్యానవనములో నున్నవేళ నా సీతామహాదేవి యొకప్పుడు వారవనితల చారుతరనృత్యముల నవలోకించెను. ఒక తరుణమున వీనులవిందుగా వివిధవాద్యధ్వనుల నాలకించెను. ఒక కాలమున చిత్రకళాగోష్ఠిలో నిమగ్నురాలయ్యెను. ఒక తరుణమున నింద్రజాలముల నీక్షించెను. ఒకవేళ గడపై నెక్కి యాడుట నవలోకించెను. ఒక సమయమున స్తంభముపై బ్రదర్శింపబడు కౌతుకములను వీక్షించెను. ఒక తఱి కృత్రిమములగు నేనుగులు మున్నగువాని రూపములను, నిపుణులగు చిత్రకారులచే రచింపబడిన తనయొక్కయు, దన స్వామియొక్కయు వివిధభంగిమలు గల చిత్తరువులను విలోకించుచు వినోదించెను. ఈ విధముగా జనకజాత యుద్యానవనవాస మొక్క మాసము గావించెను.

పిమ్మట నామె శ్రీరామచంద్రుని గూడి క్రమముగా దన నగరమునకు మఱలిపోయెను. ఆయెడ పురమునందలి పుణ్యస్త్రీలు తమ తమ భవనములపై నుండి యా పుణ్య దంపతులపై బూలు వర్షించిరి. కుంభదీపములతోను, నితరదీపములతోను నీరాజనము లర్పించిరి. పెరుగు కలిపిన యన్నము, మినుములు, తైలము, నావగింజలు మున్నగు పదార్థముల బలు లర్పించిరి. ఈవిధముగా శ్రీరామచంద్ర సమేతయై సీతామహాదేవి స్వగృహమునకు జేరుకొనెను. ఈవిధముగా ననేకములగు క్రీడా వినోదములతో రఘునందనుడు జనకజాతను, జనకజాత రఘునందనుని బరస్పరము రంజింపజేసికొనిరి.

ఇంతలో సీత కాఱవ మాసము ప్రాప్తించెను. అప్పుడు రాఘవు డామెకు వసిష్ఠునిచే సీమంతోన్నయన సంస్కారము జేయించెను. ఆసమయమున సుమేధాదేవిని, జనకమహారాజును రావించెను.

బ్రాహ్మణుల కెన్నియో దానములు గావించెను. జనకుడు గూడ నాయెడ శ్రీరామచంద్రుని, సీతను, వారి బంధువర్గమును, మాతృ వర్గమును, పౌరులను నూతనవస్త్రాదుల నర్పించి పూజించెను. పురజను లెల్లరును వేఱువేఱుగా దమ తమ యిండ్లలో భోజనములు సేయించు టకు సీతారాములను వెంట గొంపోయిరి. ఆయెడ ననేక మంగళ వాద్యములు మ్రోగినవి. వారవనితలు చారుతరనృత్య గానములు సలిపిరి. స్త్రీలు సీతారాములపై బూలవానలు గురియించిరి. వివిధ దేశములకు జెందిన రాజకాంతలెందఱో సానందముగా సీతామహా దేవిని సందర్శించు తలంపున నయోధ్యానగరమున కరుగుదెంచిరి. వారి సైన్యములతో నిండి సాకేతనగర మపూర్వ శోభాన్వితమయ్యెను. రాజకాంతలా తరుణమున ధరణిజ కనేక దివ్య స్త్రాభరణాదులతోడను, దివ్యాన్నములతోడను, దమ తమ దేశము లందలి చిత్రవిచిత్రములగు దివ్యవస్తు సముదాయములతోడను నారాధనము గావించిరి. అట్లు వారా బంగారుతల్లి సన్నిధానమున నొక్క మాసము కాలము వాస మొనరించి పిమ్మట గ్రమముగా దమతమ దేశములకు దరలిపోయిరి.

అనంతర మొకదినమున రఘునందను డేకాంతమున దన కాంత యగు సీతను, నామె జనని యగు సుమేధను, జనకుడగు జనకుని దన ముందు గూర్చుండ నియమించి తన సంశయమును దీర్పవేడుచు దన మనస్సులోని యొక రహస్యమును వెల్లడించుచు నిట్లు ప్రశ్నించెను- "మామా! జనకమహారాజా! సీతను జూడకుండ నేను క్షణమైన గపపజాలకున్నాను వెంట వెంటనే వచ్చి యామెయొక్క చంద్ర బింబమును బోలు ముద్దుమొగమును జూచి స్వస్థతను బొందు చుందును. నాకు మనస్సులో నారాట మధికమైన వేళ సీతా సాన్నిధ్యము నాశ్రయించుచుందును. ఇప్పుడు సీతను గాంచుటచే నాలో గామభావము ప్రబుద్ధ మగుచున్నది. స్త్రీ గర్భవతిగా నున్న

స్థానచలనము చేయునలయును' అని చెప్పెను. అట్లకాక! యని రఘునందనుడు తానంతకు ముందు సీతతోడ నాలోచించిన ప్రకార మంతయు లక్ష్మణుడు గూడ వినుచుండ కౌసల్య కెఱిగించెను. అది యెల్ల నామె కూడ నామోదించెను. తరువాత నెనిమిదవ మాసమున సీతామందిరమున జేరి యేకాంతమున లక్ష్మణుడు వీవనగొని వీచు చుండగా రఘునందనుడు జనకనందినితో నిట్లు చెప్పెను. "దేవి! నిన్ను గూర్చి చాకలివాడు నిందావచనము లాడెనను మిషమున లోకాపవాదమునకు వెఱచినట్లు నటించుచు నిన్నిప్పుడు వనములో విడువ నెంచుచున్నాను. గర్భధారణమయిన మీ౦దట మూడవ మాసము నుండి కాని, అయిదవమాసమునుండి కాని, యేడవ మాసము నుండి కాని స్త్రీసాంగత్యము తగదని శాస్త్రములు ఘోషించు చున్నవి. కావున లోకాపవాదము నెపముగా నిన్ను బరిత్యజించి యా శాస్త్రాజ్ఞను బాలించ నెంచుచున్నాను. నిన్ను జూచుచున్న నన్ను గామము మిక్కిలి బాధించుచున్నది. ఏదియో యొక నెపము లేకున్న సీతతోడ నాకు వియోగము సంభవింపదు. ఆకారణముననే యీ మిషము కల్పింపబడినది. అయిదేండ్లు గడచిన తరువాత నీవు మఱల నన్ను జేరగలవు. లోకమునకు నమ్మకము గలిగించుటకై శపథ మొకటి సేయగలవు. అప్పుడు భూమి వివరమార్గమును బ్రకటింపగా సింహాసనముపై నాసీనురాలవు గాగలవు. సర్వలోకపూజ్యురాలవగు నీవా వివర మార్గమున బాతాళమునకు వెడలిపోవ నుంకించు తరుణమున నేను భూదేవిని బ్రార్థించియు, భయపెట్టియు నిన్ను నాయొడి లోనికి జేర్చికొందును. పిమ్మట దనయులతోడను, నాతోడను గూడి భోగముల ననుభవింపగలవు. నావలన నీకు కుశుడను పేర జ్యేష్ఠ కుమారు డొక్కడు గలుగును. వాల్మీకి మహర్షి తపః ప్రభావమున లవుడను పేర బరగు మఱియొక తనయుడు నీకు బ్రాప్తించగలడు. ఈవిధముగా నీకు వాల్మీకి యాశ్రమమునం దిరువురు తనయులు

ప్రాదుర్భవింప నున్నారు. నా వచనానుసారముగా నీ తల్లిదండ్రులు ముందుగనే యీ యాశ్రమ ప్రదేశమున కరిగి నీకై వాసయోగ్యములగు గృహాదులను నిర్మించి, యందు సమస్తసౌకర్యములను గల్పించి నీ యాగమనమునకై నిరీక్షించు చున్నవారు. కావున నీవిప్పుడు నేను జెప్పుచున్న ప్రకారముగా నాచరింపుము. తొల్లి దండకారణ్య ప్రాంతమున గంగాతీరము నందు జేసిన విధముగా నిప్పుడు కూడ నీవు సాత్త్వికమూర్తిని దాల్చి నా వామాంగము నందు వసింపుము. రాజసతామసమూర్తివై వాల్మీకి యాశ్రమమున కరిగి లోకమునకు నీ భర్తృవియోగమును బ్రదర్శింపుము. అక్కడ కూడ నీకు గుశుడు జన్మించిన వేళ నే నేకాంతమున దర్శన మీయగలను." అని చెప్పగా విని 'యట్లకాక!' యని జనకజాత సాత్త్వికమూర్తిగా రఘునందనుని వామపార్శ్వమున లయ మొందెను. రాజసతామస రూపమును ధరించి వనముల కేగ నుద్యుక్తురాలై యుండెను.

అనంతరము జ్ఞానస్వరూపుడగు శ్రీరామచంద్రుడు రాజ్యతంత్ర నిర్వాహణ చతురులైన మంత్రులు, సేనానాయకులు, వృద్ధులు తన్ను బరివేష్టించి కొలువ సింహాసనముపై నాసీనుడయ్యెను. అచ్చట నతని మిత్రు లందఱును జేరి యాయా హాస్య ప్రసంగము లేవియో వివరించుచుండిరి. ఆసమయమున ప్రసంగవశమున రాఘవుడు విజయు డనువానిని జూచి—"విజయా! నన్ను, సీతను, నాసోదరులను, కైకేయిని గూర్చి గ్రామవాసులు గాని, నగరవాసులు గాని యేమనుకొను చున్నారో యెఱుగ జెప్పుము. కొంచెము కూడ దాచవలదు. దాచితి వేని నామీద నొట్టు" అని ప్రశ్నించెను. అప్పుడు విజయు డిట్లు ప్రత్యుత్తర మిచ్చెను. —"దేవా! శ్రీరామచంద్రుడు అనన్య సాధారణ ములైన కార్యముల నాచరించె నని జనులు మిమ్మొకవంక బ్రశంసించు చున్నారు. మఱియొకవంక 'రావణసంహారము గావించి రాఘవుడు సీతను విడిపించి క్రోధమును గడకు ద్రోసి యింట నిలిపికొన్నవాడు

ఇట్లు చేయుటలో నతని భావ మేమియో, అట్టి సీతను గూడుటలో గలుగు సుఖ మేమియో యెఱుగరాకున్నది. స్త్రీలయెడల జరిగిన దుష్కృతము ఆకస్మికమే యైనను గోపకారణము గాకపోదు. రాజెట్టి మార్గము ననుసరించిన ప్రజలు కూడ నట్టిమార్గమునే యను సరింతురు.' అని నిందా వచనము లాడుచున్నారు. ప్రభూ! ఒక చాకలి యాడిన మఱియొక మాటను గూడ విన్నింతును. ఆలకింపుడు. అవ మార్గమున జరించిన తన భార్యను గాంచి యొక చాకలి- 'ఓసి కులటా! నేను రాముడను గాను. చిరకాలము రావణు నింట నున్న సీతను దెచ్చికొని యింట జేర్చి యేలుకొనుట కతనికే చెల్లినది. కాని నే నావిధముగా నిన్ను స్వీకరించువాడను గాను. పో పొమ్ము! నీ యిచ్చవచ్చిన దారిని బొమ్ము!' అని పదరుచుండగా నేనా మార్గ మున బోవుచు నాలకించితిని. ఇవి నేను విన్నవిషయములు. మీ యాజ్ఞమేరకు నేను దాచకుండ వివరించితిని. పిమ్మట దేవరచిత్తము." అనగా విని రఘునందనుడు స్వజనులను ఏమి? ఇది నిజమా? యని ప్రశ్నించెను. వారు కూడ నతనికి నమస్కరించి జనులు నిందాలాపము లాడుచుండుట యథార్థ మని వాకొనిరి. అప్పుడు రాఘవుడు మంత్రి వర్గమును, మిత్రబృందమును వెడలిపోవ నాదేశించి లక్ష్మణుని రావించి 'లక్ష్మణా! సీత మూలమున నా కతితరమగు లోకాపవాద మొదవుచున్నది. కావున దెల్లవాఱిన వెంటనే సీతను రథముపై నెక్కించికొని పోయి వాల్మీకి మహర్షి యాశ్రమప్రాంతమున దిగ విడిచి మఱలి రమ్ము! నామాట కడ్డు చెప్పినచో నన్ను జంపినవాడ వయ్యెదవు. లోకమునకు నమ్మకము గలుగుటకై యామె భుజమును ఖండించి తీసికొనిరమ్ము!' అని యతని కాజ్ఞాపించెను. పిమ్మట కైకేయిని సందర్శింప నంతిపురమున కరిగెను.

ఇంతలో నంతిపురమున కైకేయి సీత చెంత గూర్చుండి -తల్లీ! సీతా! నాకు రావణుని జూడ కుతూహల మగుచున్నది. అతని

రూపము నీగోడమీద జిత్రించి నాకు జూపుమా! యని వేడుకొనెను. అప్పుడు సీత అమ్మా! నేనా దశాననునెన్నడును జూడలేదు. గౌతమీతీరమున బంచవటిలో నుండగా నన్ను రావణుడు హరించెను. ఆనాడతని కుడికాలి బొటనవ్రేలిని మాత్రము నేను జూచితిని. అని బదులు పలికెను. ఆమాట విని కైకేయి నీవుచూచిన యా బొటనవ్రేలినే చూపుమని సీతను గోరెను. అట్లకాక యని సీత యాక్షణము ననే రావణుని దక్షిణపాదాంగుష్ఠమును గోడపై జిత్రించి కైకేయికి జూపి కొంత తడవు గడచినమీదట దన మందిరమునకు వెడలిపోయెను. అనంతరము దుర్బుద్ధి యగు కైకేయి రామునకు జూపదలచి యా యంగుష్ఠము నాధారముగా జేసికొని యచ్చట రావణుని రూపమును బూర్తిగా జిత్రించెను. అంతలో రాముడు వచ్చుచుండె నని యెఱిగి యామె యాగోడకు జేరువగా రామున కాసనము గల్పించెను. అంతలో రాముడరుగుదెంచి కైకేయికి నమస్కరించి యా యాసనముపై గూర్చుండి గోడమీద రచింపబడిన రావణుని చిత్రమును జూచెను. ఈ చిత్రము నిచ్చట నెవరు లిఖించిరని కైకేయి నడిగెను. సీత రచించినదని యామె బదులు పలికెను. అప్పుడు రాఘవుడు తనలో ఎవరి మనమున కేది యిష్టమో వారు దానినే స్మరించుచుందురు. ఆడుదాని చరిత్ర మెట్టిదో యెవ్వ రెఱుగగలరు! స్త్రీమూలమున శివుడు మున్నగువారు సయితము మహామోహమున జిక్కిరి గదా! యని తర్కించికొనెను. సభాస్థలమున సీతనుగూర్చి దుర్ముఖుని ముఖమున విన్న యుదంత మంతయు గైకేయి కెఱుగ జెప్పెను. లక్ష్మణుని వెంట రేపు సీత నడవికి బంపించి గంగానదీ తీరమున దిగవిడుతు ననియు, రావణుని చిత్రమును లిఖించిన యామె బాహువును ఖండించి తెమ్మని శాసింతుననియు, లక్ష్మణుడా బాహువును దెచ్చి నీకును, బురజనులకును జూపగలడనియు స్త్రీహత్యకు వెఱచి లక్ష్మణుడు డాకార్యమున కియ్యకొనకున్నను నామె నాయుధపు

లోని క్రూరజంతువులైనను జంపి భక్షింపగల ననియు గూడ నామెకును దెలియజెప్పెను. ఆమాటల నాలకించి యామె మిగుల సంతసించెను. సీతావిరహదుఃఖము గారణముగా రాము డెట్లును రాజ్యపరిపాలనము సేయలేడు. ఎల్లవేళల నతనికి సేవజేయు వ్రతము నవలంబించినవాఁడగు గావున లక్ష్మణుడును రాజ్యమును గాంక్షింపఁడు. అప్పుడు రాముఁ డెట్లును నాభరతునే రాజ్యపరిపాలనము సేయుచుండును. ఈ విధముగా రాజ్యము మఱల నాబిడ్డకే ప్రాప్తింపగలదు' అని మనమున దర్కించుకొని యామె తృప్తి జెందెను.

అనంతరము శ్రీరామచంద్రు డామెకు నమస్కరించి పోయి సుమిత్రను, దన తల్లి యగు కౌసల్యను గూడ దర్శించి వారికి గూడ సీతను సంబంధించిన మాయయుదంత మంతయు నెఱుఁగజెప్పెను. పిమ్మట వారికి నమస్కారము జేసి యటనుండి కదలి సీతానివాస మందిరమున కరిగెను. సీతామహాదేవి యతని కర్ఘ్య పాద్యాదు లర్పించెను. కూర్చుండ నాసన మేర్పఱచెను. అప్పుడు రఘునందనుడు సభలో దుర్ముఖు డాడిన మాటలను, కైకేయి మందిరములో దాను రావణుని చిత్రమును జూచిన తెఱఁగును నామెకు తెలియజెప్పెను. అప్పుడామెయు రాఘవునకు- స్వామీ! కైకేయి కోరఁగా నేను రావణుని యంగుష్ఠమును మాత్రమే రచించితిని. ఆ యంగుష్ఠమును బట్టి యామె దుష్టబుద్ధియై చిత్రలేఖన నైపుణ్యము గలది గావున స్వయముగా రావణుని సమగ్రమూర్తిని రచించి నేను రచించితి నని మీతో జెప్పినది. అని నివేదించెను. ఆమె పలుకుల నాలకించి రాఘవుడు 'ఔను! కైకేయియు కుటిల బుద్ధిని నేనెఱుగుదు నని యామె నూఱడించెను. సానందముగా నామె నాలింగనము జేసికొని యామె మోమును జుంబించెను. ఆమెతోడ బంగారు పర్యంకముపై బవళించి సమస్తభోగములను ననుభవించెను. ఆరేయి నాత డామెతో వినోదముగా నిట్లులనెను. దేవీ! గర్భవతులగు స్త్రీల మానస మేదియో కోరుచుండును. కావున నీ

మన మేమి కోరుచున్నదో నాకెఱుగజెప్పుము. నీ యాకోరికను వెంటనే సఫల మొనర్చెదను. అనగా విని జనకజాత భవిష్యత్కార్య క్రమము నకు బద్ధురాలై స్వామీ! గంగాతీరమునందలి వృక్షములను, మునాశ్రమములను, మునిపత్నులను, వనముకు దర్శింప నామన మెంతయో కుతూహల పడుచున్నది. కావున దప్పక నన్నొక్కమాఱు వనమున కంపగోరుదు నని యాతనికి బ్రత్యుత్తర మిచ్చెను. అంత రఘు నందనుడు -'ప్రేయసీ! రేపు నిన్ను వనమునకు గొనిపొమ్మని లక్ష్మణున కాదేశించెద లెమ్ము! ఇంత కాలము నీక్రీడావినోదములలో బడి నా జపధ్యానాదిక్రియలయం దశ్రద్ధ వహించితిని. ఇప్పుడు నీవు వనముల నుండువేళ మఱల నా జపక్రియాదికమున మునిగి కాలమును వెడలించెదను.' అని పలికి యామెకు సుఖముగా నిద్రనొసగెను. ఆమెయు దనలో- నాతల్లియు, దండ్రియు వనమునం దున్నవారు గదా! వారచ్చట నుండగా నా కేవస్తువునకును గొఱంత గలుగదు. కావున నేనెట్టి వస్తువులను వెంటగొనక చెలికత్తెను దోడ్కొని లక్ష్మణునితోడ రథము నధిరోహించి సానందముగా గానసముల కరి గెదగాక!' యని నిశ్చయము జేసికొని సుఖముగా నిద్రించెను.

పిమ్మట నామె ప్రాతఃకాలమున బెందలకడనే మేల్కాంచి స్నాన మొనర్చికొనెను. రాఘవుడును స్నానము జేసెను. జనకజాత యతనికొక యుత్తమపాత్రమున బక్వాన్నములను వడ్డించెను. సానం దముగా నాత డారగించెను. అటుపిమ్మట నామె తాను గూడ నుపాహా రమును సేవించెను. ఊర్మిళ మున్నగు కాంతారత్నములను బ్రియమార బలుకరించెను. అత్తలకు జరణాభివందనము లొనరించెను. గంగాతీరము నందలి వృక్షములను, మునికుటుంబములను దర్శింప నేగుటకు సర్వ విధముల సన్నద్ధురాలయ్యెను. సఖీసమేతయై లక్ష్మణుని సంస్మరించెను. రాముని యానతి నెనసి లక్ష్మణుడు రథమును గొనితెచ్చెను అందు జనకజను, నామెసకియను దులసియనునామెను నధిరోహింపజేసి దక్షిణ

మార్గము నవలంబించి వాయువేగమున రథమును దోలికొని గంగా తీరాభిముఖముగా బయనము సాగించెను. ఇంద్రాదిదేవత లాసమయమున జగన్మాత యగు సీతకు మార్గమున శుభము లొనగూడుటకై మంగళా చరణములు గావించిరి. వారి రథము క్రమముగా దమసానదిని దరించి, గోమతీనది నతిక్రమించి, గంగానదిని గడచి, పరమపావన సలిల యగు యమునానది నధిగమించి, మఱియొక తమసానదిని గూడ దాటిపోయి చిత్రకూట పర్వతప్రాంతమున వాల్మీకిమహర్షి యాశ్రమము చేరువగా నొక యశ్వత్థవృక్షము నీడలో నిలిచెను. అంతట లక్ష్మణుడు ముందుగా రథము డిగి యట నొక యాసనమును నిలిపెను. సీత తన సఖియతోడ రథావతరణ మొనరించి యా యాసనముపై నాసీనురాలయ్యెను. అప్పుడు లక్ష్మణుడు కన్నులందు గన్నీ రురలుచుండ, గంఠము గద్గదితముగాగా సిరము వంచి యామెకు నమస్కరించి 'అమ్మా! లోకాపవాదమునకు వెఱచి శ్రీరామచంద్రుడు నిన్ని యడవిలో దిగవిడిచి రమ్మని నాకాదేశ మొసగినాడు, ఇందు నాదోస మావంతయును లేదు. నీవా మున్యాశ్రమమున కరిగి యందు వసింపుము' అని యెఱుగజెప్పి మరల రథము నధిరోహించి పూర్వ మార్గము ననుసరించి పురము దిక్కునకు మగిడిపోయెను.

శిష్యుల ముఖమున నా సీతాసమాచారము నాలకించి వాల్మీకి మహర్షి యా శిష్యులను, జనకమహారాజును, సుమేధను, మహీసురులను, మహిళామణులను వెంటనిడుకొని జనకజాత కడకేగి యామెను సానందముగా బూజించెను. జనకు డామెను బల్లకి నెక్కించి పలువురు పడతులు చామరముల వీచుచుండ, బహువిధ వాద్యధ్వను లెల్లకడల బ్రబలుచుండ, నాటకస్త్రియ లాడుచుండ, గాయకులు కర్ణపర్వముగా గానములు సలుపుచుండ, వందిమాగధ బృందము లమందానందమున స్తోత్రపఠనము లొనరించుచుండ, మునిపత్నులు తన తనయపై వనపుష్పములను వర్షింపజేయుచుండ, గొందఱంద

గత్తెలు కేల వేత్రములను (బెత్తెము) దాల్చి యాత్రము మీఱ బల్లకికి ముందు భాగమున బరుగులు వెట్టుచుండ నానందము మీఱ వాల్మీకి మున్యాశ్రమమునకు గొనివచ్చెను. ఈవిధముగా నామె క్రమముగా మున్యాశ్రమమున ప్రవేశించెను.

ఆతరుణమున మునిపత్నులామెకు గర్పూరదీపములతో నీరాజనము లర్పించిరి. ఆ వాల్మీకి మున్యాశ్రమమునందా బంగారుతల్లి యొక సువర్ణపర్యంకముపై (మంచము) మెత్తని దిండులపై నధివసించి పరమానందము నెనసెను. ఆమె పరమాత్మునియొక్క పరాశక్తి యగు సాక్షాల్లక్ష్మీదేవి యని వాల్మీకి మహర్షి వాకొనగా నాలకించి మునిపత్ను లెల్లరును వేఱువేఱుగా నామెను వన్యపుష్పముల తోడను, వనసంభవములగు దివ్యాన్నములతోడను నవిరామముగా నారాధింపసాగిరి. గర్భవతులగు కాంతలకు సహజముగా గలుగు కుతుకముల నెఱిగిన వారగుటచే వారామె కేమేమి కావలెనో యెఱిగి యెఱిగి యామె కుతుకములను దీర్చుచుండిరి. అప్పుడప్పుడు సీత శిబిక నారోహించి వనసీమలలో విహరించి పరమానందము నొందుచుండెను. మహాపతివ్రతయగు నాజనకజాత సాకేతము నందువలెనే వాల్మీకి మున్యాశ్రమమున గూడ హాయిగా గాలము గడపసాగెను.

తృతీయసర్గము సమాప్తము.

—:—

## చతుర్థసర్గము

### వాల్మీకి మున్యాశ్రమమున లవకుశుల జననము

శ్రీరామదాసుడు విష్ణుదాసునకీ విధముగా వినిపించుచు.

అనంతరము లక్ష్మణుడు రథము నధిరోహించి చని గంగాతీరమునకు జేరి తనలో నిట్లు తలపోసెను, "లంకానగరమునుండి మఱ

లించు కాలమునం దెల్లర సమక్షమున నేనే జనకజ నగ్నిలోఁ బ్రవేశింప జేసి యామె పవిత్రతను బయలు పఱచితిని. అట్టి బంగారుతల్లిని రఘునందనుడు శాస్త్రాజ్ఞను బాటించుచు దన మనములోని కామ వాసన శాంతించుటకై యిచ్ఛాపూర్వకముగా నీయడవిలో బరిత్యజించివైచెను. ఇంతవఱకు నొక విధముగా యుక్తమే యని సమ్మతింప వచ్చును. కాని యిది యేమి యాజ్ఞ? వనమునుండి మఱలి వచ్చువేళ సీతామహాదేవి భుజము నొకదానిని ఖండించి కొనిరమ్మని నన్ను బిలిచి నాకు రహస్యముగా నాదేశించెను గదా! ఇది యెంత దుర్ఘటమైన కార్యము? మాఱు పలికినచో దనమీద నొట్టని నానోరు గూడ మూసివైచెను గదా? ఇప్పుడు నేను సీతాభుజమును ఛేదించి కొనిపోకున్న నతడు నన్నేమనునోకదా? నన్ను దన కన్నబిడ్డనువలె పాలించి లాలించిన యీ మహాపతివ్రతాశిరోమణి భుజమును నేనెట్లు ఖండింపగలను? అట్టి భయంకరకృత్యమునకు నేను పాలుపడజాలను. కావున నారాఘవునకు మొగము జూపక యిప్పు డగ్నిప్రవేశము జేయుటయే నాకు సముచితముగా దోచుచున్నది.”

ఇట్లు తలపోసికొని లక్ష్మణుడు చితిని బేర్చికొనుటకు సంకల్పించి కొనెను. అంతలో బ్రహ్మదేవుని వచనము ననుసరించి విశ్వకర్మ వడ్రంగి రూపమును ధరించి, కరమున గుఠారమును వహించి వనములో నిందందు బరిభ్రమించుచు నాయెడ కేగుదెంచెను. అతని నవలోకించి లక్ష్మణుడు 'ఓయీ! నీవు నాకొక్కింత సహాయ మొనరింపుము. నీ చేతిలోని గొడ్డలితో దరువులను ఛేదించి నాకర్పింపుము. నేను వానితో నాకై చితిని బేర్చికొందును. నీవు చేయు నీయుపకృతికి బదులుగా నీవు కోరినంత ధనమును నీ కర్పించెదను' అని యతనిని బ్రార్థించెను. అంతట విశ్వకర్మ నీ యగ్నిప్రవేశమునకు హేతువేమని లక్ష్మణుని బ్రశ్నించెను. సౌమిత్రి సంఘటిల్లిన యుదంత మంతయు నాతని కెఱిగించెను. అప్పుడు విశ్వకర్మ మందహాసము జేయుచు

'వీరవరా! అల్పవిషయమునకై యనువులను దొరగ దొరకొనుట పాడిగాదు. నే నిప్పుడే నిమేషకాలమున సీతాభుజమును నిర్మించి నీకర్పించెదను.' అని లక్ష్మణునకు నచ్చుబలికి శీఘ్రముగా సీతాభుజమును జర్మముతో, నెత్తుటితో, నెమ్ములతో, స్నాయువులతో, రవికతో, సహజములగు నలంకారములతో, జిహ్నములతో గూడి చెలువారు విధముగా రచించి యర్పించి యంతర్ధానము నందెను. ఆ సీతాభుజమును జేకొని యా లక్ష్మణు డయోధ్యకు జేరెను. అతడు చేరినప్పటి కయోధ్య యుత్సాహరహితమై, సుడిగాడ్పులు రేగుటచే ధూళిధూసరమై, సుదతిలేని సదనమువలె గళవాసి వెలవెల బోవుచుండెను. మహాదుఃఖభారముతో మొగము వంచికొని పురమున బ్రవేశించి సభాస్థలమునకు జేరి యత డన్నకు బ్రణమిల్లి సీతాభుజమును జూపెను. కంకణాలంకృతమైన యాభుజమును గాంచి రాఘవు డధోముఖుడై 'లక్ష్మణా! నీవిప్పుడీ భుజమును గొనిపోయి కైకేయికి, బురజనులకు, నరపాలకులకు, మిత్రవర్గమునకు, నితరుల కెల్లరకును జూపుము. ఇది నాయాజ్ఞ' యని లక్ష్మణున కాదేశించెను. 'అట్లకాక!' యని లక్ష్మణు డట్లే కావించెను. అనంతరమా భుజము నొక పేటికలో నుంచి పదిలపఱచెను. కైకేయి యా భుజమును గనుగొని యమితానందభరితురాలయ్యెను. పరమాత్ముయు, విజ్ఞానదృష్టి గలవాడు, కేవలుడు, నాదిదేవుడు నగు శ్రీరామచంద్రుడు గూడ సీతావిరహితుడైన కారణమున సమస్తభోగపరిత్యాగము గావించి విరక్తుడై మునిజనముచే గొలువబడుచు, మునివృత్తి నవలంబించి కాలము గడపుచుండెను.

అక్కడ వాల్మీకిమహర్షి యాశ్రమమున సీతామహాదేవియు, ననుదినమును వనవాసులచే గొలువబడుచు సుఖముగా సమయము బుచ్చుచుండెను. అట్టులా యాశ్రమమున రెండుమాసముల కాలమును వెడలించి పరమపూత యగు సీత యొక శుభదినమున రాత్రివేళ

సూర్యప్రభాభాసమానుడై సుకుమారుడగు నొక్క కుమార రత్నమును గాంచెను. ఆరాత్రివేళ నాసమయముననే యా పుత్రోదయ సమాచారము నెఱిగి శ్రీరామచంద్రుడు సోదరసమేతుడై పుష్పక విమానము నధిరోహించి యతిరయమున నాకాశ మార్గమున నా వాల్మీకిమహర్షి యాశ్రమమున కాగమించెను. మహర్షికి బ్రణ మిల్లి యతనితోడను, మఱికొందఱు బ్రాహ్మణోత్తములతోడను గూడి యథావిధానముగా దన తనయునకు జాతకర్మాది సంస్కారము లాచరించెను. సీతామహాదేవి యుత్సంగమున జెలువారు తనయుని వదనకమలము నవలోకించి పరమానంద భరితుడై మునివరులకు, విప్రవరులకు మొదము మీఱ ననేక నూతనవస్త్రాభరణాది దానము లొనరించెను. మహోత్సవము సేయించెను. యథావిధిగా బితృదేవతల తృప్తిని గోరి శ్రాద్ధవిధి నిర్వర్తించెను. ఆసమయమున నంబరమున నమరులు దుందుభులను మొరయించిరి. పూవులను గురియించిరి. సీతను, శిశువును, శ్రీరామచంద్రుని గాంచి సంతసించి యంతరిక్షమున నమరు లందఱు నాట్యము లొనరించిరి. వారవనితలు చారుతర నృత్యములు గావించిరి. వందిమాగధులు స్తోత్రపఠనము లొనరించిరి. మునిపత్నులు జ్యోతులు వెలిగించి శిశువునకు, సీతకు, శ్రీరామచంద్రునకు వేవేలుగా నీరాజనము లర్పించి కర్ణపర్వముగా గానములు చేసిరి. వారి నందఱను రఘునందనుడు నూతన వస్త్రాభరణాదికము లొసగి గౌరవించెను. ఆ సమయమున జనకమహారాజు కూడ సీతారాములను నిండు భక్తితో వైభవోపేతముగా నారాధించెను. వాల్మీకిమహర్షి కుశాగ్రములతో(దర్భలు) యథావిధిగా బాలకునకు శాంతిసంస్కార మాచరించెను, కుశాగ్రములతో సమంత్రకముగా బ్రోక్షింప జేసికొన్నవాడు గావున నీబాలకునకు కుశుడను పేరు తగి యున్నది. అని శ్రీరామచంద్రుని యెదుటనే నామనిర్ణయ మొనరించెను. ఈవిధముగా శ్రీరామచంద్రుడు నానా విధోత్సవములతో

నా రేయి నచ్చట వెడలించెను. అచ్చటి కానాడు తా నేగుదెంచిన సమాచార మెవ్వరికిని దెలుపరాదనియు దెలిసినవాడు తనకు శత్రు తుల్యుడు, దండనపాత్రుడు నగుననియు నచ్చటి యాశ్రమవాసుల కందఱకు నెచ్చరిక జేసెను. అనంతర మచ్చటి మునుల కందఱకు బునఃపునః ప్రణామము లొనరించి సీతను సాదరముగా బలుకరించి సోదరసమేతుడై మఱల బుష్పకము నధిరోహించి క్షణకాలములో సాకేత నగరమును సమీపించెను. విమానమునుండి యవతరించి గృహములోనికి బోయి యథాపూర్వకముగా నిద్రించెను.

అనంతరము రఘునందనుడు నూ అశ్వమేధయజ్ఞములు సేయ సంకల్పించి సువర్ణముతో దివ్యవస్త్రాభరణ విభూషితమై తేజరిల్లు సీతామూర్తిని నిర్మింపజేసెను. పాపాత్మురాలు, మలినురాలు, పతి నిందాపరాయణురాలు, పతిద్వేషపరురాలు, క్రూరాత్మురాలు, చౌర్యపరతంత్రురాలు, భర్త్రాజ్ఞావిపరీతవర్తనురాలు, స్వేచ్ఛాప్రవర్తనశీలురాలు, భర్తృహత్యాపరతంత్రురాలు, కలహస్వభావురాలు అంకుటాలు, పరాపహృతురాలు, మగని వీడి చన్న మలినవర్తనురాలు నగు భార్యను బరిత్యజించి యజ్ఞాదిశుభకర్మములు ఫలించుటకై బ్రాహ్మణులు దర్భలతోడను, క్షత్రియులు బంగారముతోడను, వైశ్యులు వెండితోడను, శూద్రులు రాగితోడను బత్నీమూర్తిని గల్పించికోవలెనని శాస్త్రము చెప్పుచున్నది. అట్లుగాక శక్యమైనచో సర్వవర్ణములవారును సువర్ణముతోడనే పత్నీమూర్తిని గల్పించికొన వచ్చును. ఈ నియమము ననుసరించి శ్రీరామచంద్రుడు సువర్ణమయమైన సీతామూర్తిని రచింపజేసికొని యగ్నిహోత్ర ప్రతిష్ఠాపనము గావించెను. రావణుడు సీత నపహరించి కొనిపోయిన కాలమున సమస్త శుభకర్మఫలప్రాప్తి నుద్దేశించి శ్రీరామచంద్రుడు బంగారము లభింపని కారణమున దర్భలతోడ సీతామూర్తిని గల్పించికొనెను. ఇతర గృహస్థు లెల్లరును బత్నీ యభావమున దర్భలతోడ బత్నీమూర్తిని

గల్పించికొని యగ్నిహోత్రవిధుల నాచరించికొనుచుందురు. నిత్య ముగా బత్నీ పరిత్యాగము సేయుట గృహస్థులకు ధర్మసమ్మతమైన పని గాదు. మగనిపై బగ వహించునదియు, గులటయు, బాపాత్ము రాలునగు భార్యను ఆధానమను కర్మమున బరిత్యజింప దగునని కొందఱును బరిత్యజింప నక్కఱ లేదని కొందఱును జెప్పుదురు.

పురోహితుని తోడను, భూసురులతోడను గూడి శ్రీరామ చంద్రుడు ప్రతిపక్షమున నొక్క యశ్వమేధము నాచరించి ప్రతి నవమినాడు నవభృథస్నాన మొనరింప నిశ్చయించెను. గంగానది కావలి తటమున యజ్ఞభూమి నేర్పఱచెను. ప్రయాగ మొదలు ముద్గ లాశ్రమము వఱకును గల భూమి యంతయు బంగారునాగళ్ళతో దున్నింపబడెను. ఆయాశ్రమ ప్రాంతమున గంగ యుత్తరవాహినిగా బాఱుచున్నది. అనంతర మచ్చట రాఘవుడు సువర్ణమయమైన సీతామూర్తిని వెంటనిడుకొని యజ్ఞవిధాన మారంభించెను అజ్ఞులగు వారు దర్శించుటకై యా సీతామూర్తి కల్పింపబడినది. జ్ఞానదృష్టి గలవారికి క్షణకాలమైన శ్రీరామచంద్రు నెడబాయక యాతని వామాంగమున సాత్త్వికమూర్తిగా నెలకొనియున్న లోకమాతయగు సీత నిరంతరముగా దర్శన మొసగుచునే యుండును. యజ్ఞపరిసమాప్తి వేళ దాను గల్పింపజేసిన సువర్ణ సీతామూర్తిని దన గురువగు వసిష్ఠున కర్పించివైచెను. ఈ విధముగా వసిష్ఠుడు శ్రీరామచంద్రునిచే నూఱు యజ్ఞములు సేయించి యాపురుషోత్తముని వలన నూఱు సీతా సువర్ణమూర్తులను స్వీకరించెను. ఈదానముల ఫలముగానే శ్రీరామచంద్రుడు ముందుముందు ద్వాపరయుగమున శ్రీకృష్ణ రూప ముతో నవతరించి పదునాఱు వేలకు మించిన స్త్రీలను బెండ్లి యాడుట సంభవించును. ప్రతియజ్ఞమునందు రఘునందను డొక శ్యామకర్ణాశ్వమును విడిచెను. ఆ యశ్వము నాలుగు దినములలో నాలుగుదిక్కులను బరిభ్రమించి మఱలి వచ్చినది. అన్ని యజ్ఞము

లందు నన్ని యశ్వములు సక్రమ యాచరించినవి. శత్రుఘ్నుడు పుష్ప కము నధిరోహించి యశ్వరక్షకుడుగా నశ్వము ననుగమించువాడు. దీక్షబూని శ్రీరామచంద్రుడు డెల్లవేళల యజ్ఞవాటికలో నెలకొని యుండువాడు. ఈవిధముగా దొంబది తొమ్మిది యజ్ఞములు నిర్విఘ్న ముగా బరిసమాప్తములైనవి. కడపటి యజ్ఞమునకు గూడ నా మహా మహుడు దీక్ష వహించెను.

గంగానది కీవలియొడ్డున ముద్గలమహర్షి యాశ్రమ మున్నది. అవలి తటమున నుత్తరవాహినియైన గంగకు జేరువగా వాల్మీకి మహర్షి పది దివసముల పర్యంతము ప్రతిరాత్రి యందును, ప్రాత స్సాయంసంధ్యల యందును శ్రీరామ రక్షామంత్రముతో సీతామహా దేవి గన్న శిశువున కభిమంత్రణ మొనరించి పదునొకండవ దివస మున కుశుడని నామకరణము గావించెను. శ్రీరామచంద్రుని యాజ్ఞచే నాబాలకునకు జేయవలయు సమస్తసంస్కారములను నిర్వర్తించెను. ఈవిధముగా నాబాలకుడు మాతృ లాలితుడై దినదిన ప్రవర్ధమాను డగుచుండెను. సుమేధయు, జనకమహారాజు నాబాలకుని మనోహర ములగు నానావిధ నూతన వస్త్రములతోడను, బులిగోరు పతకము మున్నగు బహువిధ సువర్ణాభరణములతోడను నలంకరించి పరమా నందము నొందుచుండిరి. ఆ బాలకుడు గూడ ముద్దుగొలుపు తన క్రీడలచే జనకజాత మనము నలరించుచుండెను.

ఒకనాడు బాలకు డూయలలో బవళించి నిదురించుచుండెను. వాల్మీకిమహర్షి చెంగటనే యుండెను. జనకజాతయొక్క సఖియు యేదియో పని చేసికొనుచుండెను, సుమేధ, జనకుడు నెల్లరు నెటకో వెడలియుండిరి. ఆనా డాశ్వయుజ మాసములోని భానువారము. ఆనాడు జనకజాతకు గంగాస్నానము సేయ సంకల్ప మొదవెను. బాల కుని రక్షణభారమును వాల్మీకిమహర్షి కప్పగించి యామె సఖియను వెంట నిడికొని వెంటనే తమసానది దిక్కునకు బయనమయ్యెను.

మార్గ మధ్యమున నామె కొక యాడుకోతి కానవచ్చెను. అది కటిదేశ మున, మూపుమీద, దలమీద, నుదరదేశమున నయిదు కోతిపిల్ల లను వహించియుండెను. ఆ యాడుకోతిని గన్నంతనే సీతకు దన బిడ్డ తలపునకు వచ్చెను. అప్పుడామె తనలో నిట్లు చింతించెను. "తిర్య గ్యోనిలో (జంతుజాతి) జన్మించియు నీయాడుకోతి యెంత ప్రేమ ముతో దన బిడ్డలను సంరక్షించి కొనుచున్నది! మమత కారణముగా క్షణమైన విడువక తన బిడ్డలను దానే వహించి యుందందు బరిభ్ర మించుచున్నది గదా! మానవమాత్రురాలనై జన్మించియు నేను మమకార మావంతయు లేక బిడ్డ నొంటరిగా నింట దిగవిడచి స్నానము సేయ దవ్వుగా నరుగుచున్నాను. నేనెంత మూర్ఖురాలను! ఈలోకములో సుఖమున్నది క్షణికమైనది గదా!" ఇట్లు తనలో దర్కించికొని యామె వెంటనే వెనుదిరిగి యాశ్రమమున కేగుదెంచెను.

సీత యాశ్రమములో బ్రవేశించి నప్పటి కందెవ్వరును లేరు. మహర్షి లఘుశంకానివృత్తికై (మూత్రపరిత్యాగము) వెలికి వెడలి యుండెను. ఏదియో కార్యము నపేక్షించి వటువు లెల్లరును వెలికి బోయియుండిరి. ఆ సమయమున దొట్టిలో బవళించిన బాలకుని గ్రహించి యెత్తికొని సకియతోడ మగుడ బ్రాతఃకాలమున నదివంకకు నడచిపోయెను. నదిని సమీపించి సానందముగా స్నాన మొనరించి కొనెను.

అనంతరము వెలికి జన్న మునిరాజు లోనికి వచ్చి తొట్టెలో బాలకుని గానక యెంతయో పరితపించెను. సీత శపించు నని యెంచి మనమున నెంతయో భయము నందెను. వెంటనే బాలక నిర్మాణము నకు నలయు లవములను (వేశములు) సేకరించి తన తపోబలముచే గుశుని బోలు మఱియొక బాలకుని సృజించి వానికి బ్రాణము బోసి రిక్తముగా (ఖాళీ)మన్న యాతొట్టెలో బండబెట్టెను. తొందఱపాటు

కారణముగా నా మహానుభావుడు జ్ఞానదృష్టిచే సర్వము నెఱుగ గలిగియు సత్యము నెఱుగజాలక పోయెను.

అనంతర మఖిల జగన్మాత యగు సీత కూడ చక్కగా స్నానవిధిని నిర్వర్తించికొని కుశు నెత్తికొని సకియను దోడ్కొని పాదములందలి బంగారు నూపురగులు గల్లుగల్లు మనుచుండ నాశ్రమము లోపలకు మఱలి వచ్చెను. తొట్టిలో బవళించియున్న మఱియొక బాలకు నవలోకించి యామె యా బాలకు డెవరివాడని వాల్మీకి మహర్షిని ప్రశ్నించెను. సీతామహాదేవి కటిదేశమున వెలువారు శిశువును కుశు నవలోకించి వాల్మీకిమహర్షి పరమాశ్చర్య చకితుడయ్యెను. పిమ్మట జగన్మాతకు సీతకు నమస్కరించి సంఘటిల్లిన సమాచారమును సాంతముగా నామె కెఱిగించెను. తాను సృజించిన శిశువును గూడ నామె యుత్సంగమునం దుంచి 'అమ్మా! విదేహారాజకుమారీ! నా యనుగ్రహమున నీ బాలకుడు నీకు ద్వితీయ తనయుడై తేజరిల్లగలడు. వీనిని గూడ స్వీకరింపుము. లవములచే నిర్మింపబడినవాడు గావున నీ బాలకు డిప్పటినుండియు లవుడను పేర బరగుచు కుశు నెడబాయక వర్ధిల్లగలడు' అని యాశీర్వచన పూర్వకముగా నామె కర్పించెను. వాల్మీకి వచనానుసార మామె సహర్షముగా లవుని స్వీకరించెను. ఆ బాలకులలో కుశుడు జ్యేష్ఠుడుగను, లవుడను జుడుగను బరిగణింప బడుదురని కూడ మునిరా జామె కెఱిగించెను. అనంతరము లవునకు గూడ జాతకర్మాది సంస్కారముల నన్నిటిని సంపన్నముల గావించెను. ఆ తరుణమున దివియందును, భువియందును గూడ దేవదుందుభులు మొరసెను దేవతలు దివినుండి జనకజాత మీదను, బాలకులమీదను, మునిరాజుమీదను సానందముగా బుష్పవృష్టులు గావించిరి. సుమేధాజనకులు పరమోత్సవములు సేయించిరి.

కాలక్రమమున నాబాలకు లిరువురు నల్లారుముద్దుగా బెరిగి పెద్దవారై వాల్మీకి మహర్షివలన నస్త్రవిద్య, ధనుర్విద్య మున్నగు నెల్లవిద్యల నభ్యసించిరి. మహర్షి వారిచే దాను రచించిన శ్రీమద్రామాయణము నంతను సాంతముగా నభ్యసింపజేసెను. అశ్వినీదేవతలవలె నందములు సిందు నా ముద్దుగుమారు లిరువురు వీణావాదనము సేయుచు వీణారవంబును దలపించు కంఠస్వరంబులతో గర్ణపర్వముగా శ్రీమద్రామయణమును గానము సేయుచు వనములలో, మున్యాశ్రమములలో దిరుగాడదొడగిరి. ఆసుందరబాలకులను జూచియు, వారి మధురగానము నాలించియు మునిజను లెల్లరు నమందానందము, నతితర విస్మయము నెనయుచుండిరి. ఎల్ల దిక్కులయందు, నెల్లలోకములందు, స్వర్గమునందు, మర్త్యలోకమునందు, పాతాళములందు, గంధర్వులందు, గిన్నరులందు, దేవతలయందు, నెందును మేమిట్టి గానవాద్యమాధుర్యము నెన్నడును గనియు, వినియు నెఱుగమని వారా బాలకులను బ్రశంసింప సాగిరి. నిత్యము మునిజనముచే నీవిధముగా గొనియాడబడుచు నా ముద్దుబాలకు లిరువురు నేకాంతముగా నావాల్మీకిమహాముని యాశ్రమమున వసియించి హాయిగా గాలము బుచ్చుచుండిరి. కరముల గనత్కనకకంకణములతో, జరణముల రవళించు మణిఖచిత నూపురములతో, బాహువుల బంగారు బాహుపురులతో, గళసీమను గమనీయకాంచన రత్నహారములతో, గర్ణముల మనోహరమణిమయ కుండలములతో, గటిదేశమున గాంతులీను బంగారుమొలనూలితో గలకలలాడుచు నాముద్దుల బాలకు లను దినమును దమ క్రీడావినోదములచేతను ముద్దుమాటలచేతను దమ మాతయగు సీతను, సుమేధను, జనకుని, మునిరాజును బరమానంద భరితుల గావించుచుండిరి.

చతుర్థసర్గము సమాప్తము.

—()—

# పంచమసర్గము

## * శ్రీరామరక్షామహామంత్రము *

గురువరేణ్యా! శ్రీరామదాసా! వాల్మీకిమహర్షి శ్రీరామరక్షామహామంత్రముచేత కుశు నభిమంత్రితుని గావించెనని మీరు నొడివియుంటిరి గదా! బాలకులకు శాంతి నొదవించు నా పరమపావనమంత్రమును నాకుపదేశింపుడు, అని విష్ణుదాసుడు రామదాసుని ప్రశ్నించును. అంతట రామదాసుడు విష్ణుదాసున కీవిధముగా వివరింప నారంభించును.

శిష్యా! విష్ణుదాసా! చక్కని ప్రశ్న మొనరించితివి. నీ కిదే శ్రీరామరక్షామహామంత్రము నుపదేశించుచున్నాడ నాలకింపుము. ఈమంత్రమును దొల్లి పరమేశ్వరుడు పార్వతికి గుమారస్వామి రక్షణకై యుపదేశించియుండెను. దానినే నీకిప్పుడు నేను వినిపించుచున్నాను. వినుము.

అథ ధ్యానమ్

శ్లో॥ వామే కోదండదండం నిజకరకమలే దక్షిణే బాణ మేకం
పశ్చాద్భాగే చ నిత్యం దధత మభిమతం సాసితూణీరభారమ్
వామేఽవామే వసద్భ్యాం సహమిళితతనుం జానకీలక్ష్మణాభ్యాం
శ్యామంరామం భజేఽహం ప్రణతజనమనఃఖేదవిచ్ఛేదదక్షమ్॥

అస్య శ్రీరామరక్షాస్తోత్రమంత్రస్య బుధకౌశిక ఋషిః శ్రీరామచంద్రో దేవతా. రామ ఇతి బీజమ్. అనుష్టుప్ ఛందః. శ్రీరామచంద్రప్రీత్యర్థే జపే వినియోగః

శ్లో॥ చరితం రఘునాథస్య శతకోటి ప్రవిస్తరమ్।
ఏకైక మక్షరం పుంసాం మహాపాతకనాశనమ్॥
ధ్యాత్వా నీలోత్పలశ్యామం రామం రాజీవలోచనమ్।
జానకీలక్ష్మణోపేతం జటాముకుట మండితమ్॥

సాసితూణధనుర్బాణపాణిం నక్తంచరాంతకమ్ ।
స్వలీలయా జగత్త్రాతు మావిర్భూత మజం విభుమ్ ॥
రామరక్షాం పఠేత్ప్రాజ్ఞః పాపఘ్నీం సర్వకామదామ్ ।
శిరో మే రాఘవః పాతు ఫాలం దశరథాత్మజః ॥
కౌసల్యేయో దృశౌ పాతు విశ్వామిత్రప్రియః శ్రుతీ ।
ఘ్రాణం పాతు మఖత్రాతా ముఖం సౌమిత్రివత్సలః ॥
జిహ్వాం విద్యానిధిః పాతు కంఠం భరతవందితః ।
స్కంధౌ దివ్యాయుధః పాతు భుజౌ భగ్నేశకార్ముకః ॥
కరౌ సీతాపతిః పాతు హృదయం జామదగ్న్యజిత్ ।
పార్శ్వే రఘువరః పాతు కుక్షీ మిక్ష్వాకునన్దనః ॥
మధ్యం పాతు ఖరధ్వంసీ నాభిం జాంబవదాశ్రయః ।
సుగ్రీవేశః కటిం పాతు సక్థినీ హనుమత్ప్రభుః ॥
ఊరూ రఘూత్తమః పాతు గుహ్యం రక్షః కులాంతకృత్ ।
జానునీ సేతుకృత్పాతు జంఘే దశముఖాంతకః ॥
పాదౌ విభీషణశ్రీదః పాతు రామోఽఖిలం వపుః ।
ఏతాం రామబలోపేతాం రక్షాం యః సుకృతీ పఠేత్ ॥
స చిరాయుః సుఖీ పుత్రీ విజయీ వినయీ భవేత్ ।
పాతాళభూతలవ్యోమచారిణ శ్ఛద్మచారిణః ॥
న ద్రష్టు మపి శక్తాస్తే రక్షితం రామనామభిః ।
రామేతి రామభద్రేతి రామచంద్రేతి వా స్మరన్ ॥
నరో న లిప్యతే పాపై ర్భుక్తిం ముక్తిం చ విందతి ।
జగజ్జైత్రైకమంత్రేణ రామనామ్నాఽభిరక్షితమ్ ॥
యః కణ్ఠే ధారయే త్తస్య కరస్థాః సర్వసిద్ధయః ।
వజ్రపంజరనామేదం యో రామకవచం స్మరేత్ ॥
అవ్యాహతాజ్ఞః సర్వత్ర లభతే జయమంగళమ్ ।

ఆదిష్టవా యథా స్వప్నే రామరక్షా మిమాం హరః ।
తథా లిఖితవాన్ ప్రాతః ప్రబుద్ధో బుధకౌశికః ॥
రామో దాశరథిః శూరో లక్ష్మణానుచరో బలీ ।
కాకుత్స్థః పురుషః పూర్ణః కౌసల్యానందవర్ధనః ।
వేదాంతవేద్యో యజ్ఞేశః పురాణపురుషోత్తమః ॥
జానకీవల్లభః శ్రీమా నప్రమేయపరాక్రమః ।
ఇత్యేతాని జపన్నిత్యం మద్భక్తః శ్రద్ధయాన్వితః ॥
అశ్వమేధాయుతం పుణ్యం సంప్రాప్నోతి న సంశయః ।
సన్నద్ధః కవచీ ఖడ్గీ చాపబాణధరో యువా ॥
గచ్ఛన్మనోరథా న్నశ్చ రామః పాతు సలక్ష్మణః ।
తరుణౌ రూపసంపన్నౌ సుకుమారౌ మహాబలౌ ॥
పుండరీకవిశాలాక్షౌ చీరకృష్ణాజినాంబరౌ ।
ఫలమూలాశినౌ దాంతౌ తాపసౌ బ్రహ్మచారిణౌ ॥
పుత్రౌ దశరథస్యైతౌ భ్రాతరౌ రామలక్ష్మణౌ ।
ధన్వినౌ బద్ధనిస్త్రింశౌ కాకపక్షధరౌ శ్రుతౌ ॥
వీరౌ మాం పథి రక్షేతాం తా వుభౌ రామలక్ష్మణౌ ।
శరణ్యౌ సర్వసత్త్వానాం శ్రేష్ఠౌ సర్వధనుష్మతామ్ ॥
రక్షఃకులనిహంతారౌ త్రాయేతాం నో రఘూత్తమౌ ।
ఆత్తసజ్జధనుషా విషుస్పృశా వక్షయాశుగనిషంగసంగినౌ ॥
రక్షణాయ మమ రామలక్ష్మణా వగ్రతః పథి సదైవ గచ్ఛతామ్ ।
ఆరామః కల్పవృక్షాణాం విరామః సకలాపదామ్ ॥
అభిరామః స్త్రిలోకానాం రామః శ్రీమాన్ స నః ప్రభుః ।
రామాయ రామభద్రాయ రామచంద్రాయ వేధసే ।
రఘునాథాయ నాథాయ సీతాయాః పతయే నమః ॥
శ్రీరామ రామ రఘునందన రామ రామ
శ్రీరామ రామ భరతాగ్రజ రామ రామ

శ్రీరామ రామ రణకర్కశ రామరామ
శ్రీరామ రామ శరణం భవ రామరామ ॥
లోకాభిరామం రణరంగధీరం । రాజీవనేత్రం రఘువంశనాథమ్ ।
కారుణ్యరూపం కరుణాకరం తం। శ్రీరామచంద్రం శరణం ప్రపద్యే॥
దక్షిణే లక్ష్మణో యస్య వామే చ జనకాత్మజా ।
పురతో మారుతి ర్యస్య తం వందే రఘునందనమ్ ॥
గోష్పదీకృతవారాశిం మశకీకృతరాక్షసమ్ ।
రామాయణమహామాలారత్నం వందేఽనిలాత్మజమ్ ॥
అఘౌఘ స్తిష్ఠ దూరే త్వం రోగా స్తిష్ఠంతు దూరతః ।
వరీవర్తి సదాఽస్మాకం హృది రామో ధనుర్ధరః ॥
మనోజవం మారుతతుల్యవేగం
జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠమ్ ।
వాతాత్మజం వానరయూథముఖ్యం
శ్రీరామదూతం శరణం ప్రపద్యే ॥
రామరామ తవపాదపంకజం చింతయామి భవబంధముక్తయే ।
వందితం సురనరేంద్రమౌలిభి ర్ధ్యాయితం మనసి యోగిభిః సదా॥
రామం లక్ష్మణపూర్వజం రఘువరం సీతాపతిం సుందరమ్ ।
కాకుత్స్థం కరుణార్ణవం గుణనిధిం విప్రప్రియం ధార్మికమ్ ।
రాజేంద్రం సత్యసంధం దశరథతనయం శ్యామలం శాంతమూర్తిమ్
వందే లోకాభిరామం రఘుకులతిలకం రాఘవం రావణారిమ్ ॥
ఏతాని రామనామాని ప్రాత రుత్థాయ యః పఠేత్ ।
అపుత్రో లభతే పుత్రం ధనార్థీ లభతే ధనమ్ ॥
మాతా రామో మత్పితా రామచంద్రః
స్వామీ రామో మత్సఖా రామచంద్రః ।
సర్వస్వం మే రామచంద్రో దయాళుః
నాన్యం జానే నైవ జానే న జానే ॥

శ్రీరామనామామృత మంత్రబీజ
సంజీవనీ చేన్మనసి ప్రవిష్టా।
హాలాహలం వా ప్రళయానలం వా
మృత్యోర్ముఖం వా విశతాం కుతో భీః॥
శ్రీశబ్దపూర్వం జయశబ్దమధ్యం
జయద్వయేనాపి పునః ప్రయుక్తమ్।
త్రిః సప్తకృత్వో రఘునాథనామ
జపన్నిహన్యా ద్ద్విజకోటిహత్యాః॥
ఏవం గిరీంద్రజే ప్రోక్తా రామరక్షా మయా తవ।
మహోపదిష్టా యా స్వాస్యై ర్విశ్వామిత్రాయ వై పురా॥

శ్రీరామదాస ఉవాచ :

ఇతి శివేనోపదిష్టాం శ్రుత్వా దేవీ గిరీంద్రజా।
రామరక్షాం పఠిత్వా సా స్కందం సమభిమంత్రయత్॥
తస్యా స్తేజోబలేనైవ జఘాన తారకాసురమ్।
షడాననః క్షణాదేవ కృతకృత్యోఽభవత్పురా॥
సైవేయం రామరక్షా తే మయాఽఽఖ్యాతాఽతిపుణ్యదా।
యస్యాః శ్రవణమాత్రేణ కస్యాపి న భయం భవేత్॥
వాల్మీకినాఽనయా పూర్వం కుశాయ హ్యభిషేచనమ్।
కృతం బాలగ్రహాణాం చ శాంత్యర్థం సా మహోదితా॥
బాలానాం గ్రహశాంత్యర్థం జపనీయా నిరంతరమ్।
రామరక్షా మహాశ్రేష్ఠా మహాఘౌఘనివారిణీ॥
నాస్యాః పరతరం స్తోత్రం నాస్యాః పరతరో జపః।
నాస్యాః పరతరం కించి త్సత్యం సత్యం వదామ్యహమ్॥

పంచమసర్గము సమాప్తము

— o0o —

# షష్ఠ సర్గము

— లవుడయోధ్యనుండి కమలమును దెచ్చి సీత కర్పించుట —

ఒకనాడు జనకజాత వాల్మీకిమహర్షిని గని మునిరాజా! నా శీఘ్రముగా శ్రీరామచంద్రునితో సంయోగము నొదవించు నొ వ్రత మేదైన నెఱిగఁజెప్పుము అని ప్రార్థించెను. అప్పుడు ముని జా మెకీ విధముగా నొడువసాగెను. దేవీ! విదేహరాజకుమా నొడువుచుంటి నాలకింపుము. పాడ్యమి మొదలు నవమి వఱ దొమ్మిది దినములు చేయవలసిన వ్రత మొకటి యున్నది. పాడ్యమి నాడు ధాతు నిర్మితములైన శ్రీరామ పాదుకల నొకచో బ్రతిష్ఠిం వానిపై దొమ్మిది తామరపూవులతో మంత్రాంజలి నర్పింపుము అనంతరము సతీనయుల మొగమున నానంద రామాయణములో జన్మకాండము నాలకింపుము. పదియునాడు పదునెనిమిది తామ పూవులతో మంత్రాంజలి నర్పించి జన్మకాండమును రెండుమాఱుల శ్రవణము జేయుము. పూజించికొనుటకు సతులకు బతిని మించి మఱియొక దైవము లేదు. ఈవిధముగా దినమునకు దొమ్మిది సంఖ్య జూలసంఖ్యను బెంచుచు నెన్నిదినములైన నన్నిమాఱులు జన్మ కాండ శ్రవణము జేయవలయును. నవమినా డెనుబది యొక్క తామరపూవులతో బతిపాదుకల నారాధించి తొమ్మిది మాఱుల జన్మకాండము నాలకింపుము, పిమ్మట దశమినా డెనుబది యొక్క బ్రాహ్మణదంపతుల జంటలను నూతన వస్త్రాభరణాదుల నర్పించియు మధుర భోజనములు పెట్టించియు సంతృప్తుల గావించి దక్షిణ లొసగి నమస్కరించి యంపివేయుము. ఈవ్రతము నాచరించుట వలనను, జన్మకాండ శ్రవణము జేయుటవలనను నీ వచిరకాలము శ్రీరామచంద్రునితోడ సంయోగము నెనయగలవు. సంయోగ కర్త

వ్రతమని దీనికి పేరు. ఈ పవిత్రవ్రతము నాచరించినవా రనతి కాలమున స్వజనులతో సంయోగమును బొందుదురు. ''

ఈ వాల్మీకి వచనముల నాలకించి జానకి మరల నామహా మునితో నో మునికులభూషణా! అయోధ్యా నగరములోని పూల వాటికలోని జలాశయములో నెన్నియో తామరపూవు లున్నవి. కాని యటకేగి యా తామరపూలను దేగల మొనగా డెవడు గలడు! శ్రీరామచంద్రుని యాజ్ఞచే నన్నివేళల నతని సైనికులా జలాశయమును గాపాడు చుందురు.' అని పల్కెను. ఆమె మాటల నాలించి యామె యెదుటనే నిలిచియున్న యయిదేండ్ల ప్రాయము వాడైన లవబాలకుడు 'అమ్మా! నీవు నిశ్చింతముగా వ్రతారంభము సేయుము. ప్రతిదినము నీకు వలయు తామరపూలను నేను దెచ్చి యిచ్చెదను.' అని యామెను ప్రోత్సహించెను. ఆ లవుని పలుకుల నాలకించి సీత విహసించి యా బాలకు నెత్తికొని ముద్దాడి 'నాయనా! ఆ తామరపూలను నీవెట్లు తేగలవు! అక్కడ పెక్కుకు మించిన శ్రీరామ భటబృందము గావలి గాయుచుండును. అని ప్రశ్నించెను. తల్లిపలుకుల నాలకించి తనయుడు 'అమ్మా! నీ స్తన్యమును గ్రోలిన వాడ నగుటచేతను, వాల్మీకి మహామునివలన శస్త్రాస్త్ర విద్యల నెఱసి యాశీస్సుల నందికొన్నవాడ నగుటచేతను రామభటులకే కాదు శ్రీరామచంద్రునకైన వెఱవను. నాపౌరుష మెట్టిదో చూచెదవు గాక! నాకు సెలవిమ్మని మరల ప్రార్థించెను. ఆమెకు, వాల్మీకి మునిచంద్రునకు వంగి వందనములు గావించి వారివలన నాశీర్వ చనముల నందికొని ధనుస్తూణీరములను దాల్చి, సుభగ వస్త్రాభరణ యుతముగా వీరవేషమును ధరించికొని యరదము నధిరోహించి యేకాకియై కళవాసియున్న యయోధ్యాదిక్కున నతిరయమున బయ నించెను. నగరమునకు క్రోశము దూరమున రథము నిలిపి క్రిందకు దిగి పాదచారియై పుష్పవాటికను సమీపించెను. ఆసమయమున

మధ్యాహ్నసమయ మగుటచే నారామరక్షకు లందఱును భోజన ములు సేయ దమ తమ యిరవులకు దఱలిపోయిరి. అట్టి తరుణమున నిర్బాధముగా దామరపూలను సేకరించికొని మఱలి వచ్చి రథము నధిరోహించి వాల్మీకి మున్యాశ్రమమునకు జేరెను. మునికి, జననికి బ్రణమిల్లి సానందముగా దామరపూవుల నామె కర్పించెను. ఆపూవుల నందికొని యమందానందము నొంది యామెయు వ్రతారంభ మొన రించెను.

ఈ విధముగా లవకుమారు డేడు దివసముల వఱకు నిర్బాధ ముగా బూలను గొనివచ్చి జనని కర్పించెను. రామభటు లప్పటివఱకి లవుడు తామరపూలను గొనిపోవుచున్నా డన్న యుదంతము నెఱు జాలకపోయిరి. ఎనిమిదవనాడు గూడ లవుడు యథాపూర్వకముగ నయోధ్య కరిగెను. ఆరామమునకు వెలుపల రథమును నిలి యతడు పాదచారియై పుష్పవాటిక కరిగెను. కాసారములోనికి డి కమలములను గ్రహించి నిర్భయుడై మెల్లగా రథమును సమీపిం నంతలో నారామరక్షకులా యెడ కాగమించిరి. కమలములను గొ పోవు నా లవకుమారు నవలోకించి వారు విస్మితులై 'కుమారా శ్రీరామసేవకులలో మేము నిన్నెన్నడు నవలోకించి యుండలేద శ్రీరామసేవ కెప్పు డంగీకరించితివి? ఎప్పటినుండి కార్యరంగమ ప్రవేశించితివి? ప్రవేశింపకున్న నిర్భయముగా నీరజముల నెట్లు కొ పోగలవు?' అని యాబాలకుని బ్రశ్నించిరి. వారి ప్రశ్నముల నా కించి లవుడు 'భటులారా! నేను వాల్మీకిమహాముని యనుచరుడ మీరు నొడువు రాముని నే నెన్నడును జూడలేదు.' అని బదులు : కెను. అంతట నాభటు లందఱు క్రోధమున మండిపడుచు 'బాలా నీవు శ్రీరామచంద్రప్రభువరుని జూచియుండలేదు. కమలము గొనిపోవ మాలో నెవ్వరి యనుమతిని బొందలేదు. దినదినము వ ములను మాత్రము గొనిపోవుచున్నావు. నేటివఱకు నీ విషయము

మే మెఱుగజాలక పోయితిమి. నిలుము. నిలుము. వెడలకుము. నీవు శ్రీరామచంద్రుని యెడల నపరాధ మాచరించినవాడవు. నిన్ను మే మిప్పుడా ప్రభువు సమక్షమునకు గొనిపోయెదము.' అని పలుకుచు శస్త్రపాణులగు నూఱుగురు సైనికుల దళమును వెంటనిడికొని యున్న పదునలుగురు మహాభటులా బాలకుని మార్గమును నిరోధించిరి. వారి నవలోకించి రథము నధిరోహించియున్న లవకుమారుడు విహసించి 'పొండు! రామభటులారా! పొండు! పోయి నాయుదంతమును మీప్రభువున కెఱుగజెప్పికొనుడు. మగటిమి గలవాడైన నారాముడే నన్నెదిరింప నాగమింపగలడు.' అని తన నిర్భీకతను వెల్లడించెను. అతని వచనము లాలించి యతితర క్రోధము వహించి యాభటులు మఱల 'బాలకా! ఊరక యేల ప్రలపింతువు? ఏల శీఘ్రముగా మరణింప నుద్యమింతువు? నిన్ను బంధించి మే మిప్పుడే మాప్రభువు సమక్షమునకు గొనిపోయెదము' అని వాకొనుచు లవుని బట్టి బంధింప నతని రథమును సమీపించిరి. వారిని గాంచి లవుడు 'భటులారా! రావలదు. నన్ను బట్ట నుద్యమింపవలదు. నామాటను గాదని యడుగు ముందున కిడినచో మిమ్మిప్పుడే నా వాడి యలుగుల సాయమున మీప్రభువు చెంతకు విసరివైచెదను' అని హెచ్చరించెను. అయినను వారు తమ యుద్యమమును మానలేదు. అప్పు డతడు వెంటనే వింట బాణములను సంధించి ప్రయోగించి యా మహాభటులను బదునలుగురను యజ్ఞశాలలో దీక్ష వహించియున్న శ్రీరామచంద్రుని సమక్షమున బడునట్లు విసరివైచెను. వారు మూర్ఛాక్రాంతులై శ్రీరాముని చెంత బుడమిపై బడిరి. శేషించినవారు వారి యవస్థను గనుగొని యడలి పఱతెంచిరి. లవుడు విజేతయై యథాపూర్వకముగా నాశ్రమమున కరిగి పూలను దల్లి కర్పించి సంఘటిల్లిన సమాచారమును సాంతముగా నామె కెఱిగించెను.

అక్కడ మూర్ఛాక్రాంతులైన పదునలుగురు భటులును వసతిశాలమున దెలివిని గాంచి సంభవించిన యుదంత మంతయు సాంతముగా శ్రీరామచంద్రప్రభువున కెఱుగ జెప్పిరి. అంతట రఘునందనుడు విస్మితుడై యారామరక్షణమునకై వేయిమంది భటులను బురికొల్పి యంపెను. నవమినాడు మగుడ యథాపూర్వకముగా లవుడయోధ్య కరుగుంచెను. తోడనే శ్రీరామునిచే నంపబడిన వేయిమంది భటులు నా లవకుమారునితో నాలము సేయ సన్నద్ధులైరి. వారిని గని లవుడు 'భటులారా! మీప్రభు వేనాడు సీత నడవిలో విడిచి వచ్చెనో యానాడే జయలక్ష్మి యాతని విడిపోయినది. కావున మీరా రాఘవుని కడకే మరలిపొండు. ఏల వ్యర్థముగా యుద్ధరంగమున కరిగి యసువులను బోగొట్టికొందురు? సీతాపరిత్యాగ విషయమున మీప్రభువునందున్న పౌరుషము నాయందు లేదు. పొండు.' అని వారిని నిరసించెను. లవు డాడిన యాములుకులను బోలు పలుకులచే దూటులువడిన హృదయములు గలవారై యా రామభటులు మహాధ్వనులు సేయుచు నొక్కుమ్మడిగా నా బాలకునిపై ననేక శస్త్రములను బ్రయోగించిరి. లవకుమారు డంతట శీఘ్రముగా ధనువు నెక్కువెట్టి శరములను సంధించి ప్రయోగించి వారి శస్త్రముల నన్నిటిని నిష్ప్రయోజనములను గావించుటయే కాక వారిలో గొందఱను బూర్వమందువలె శ్రీరామచంద్రుని సముఖమునకు విసరివైచెను. శేషించినవారా చర్యను గని మనముల నడ లంకురింప నడవడ వడకుచు వడివడిగా బరువిడి పాఱిపోయిరి. అప్పుడు లవుడు కమలములను గైకొని యాశ్రమమునకు మగిడిపోయెను. ప్రణామపురస్సరముగా బూల నర్పించి తల్లికి సంఘటిల్లిన యుదంత మంతయు నెఱిగించెను. తనయుని పురుషకార విధము నాలకించి తల్లి పరమానందభరితురా లయ్యెను.

అనంతర మక్కడ యజ్ఞవాటికలో గాయపడిన కాయములతో మూర్ఛాక్రాంతులై పడిన భటులు కొంతవడికి దెల్వొని గని రఘునందను నవలోకించి 'మహాబాహూ! రఘుకులాంబుధి పూర్ణచంద్రా శ్రీరామచంద్రా! అపూర్వమైనదీ యుదంతము. నొడువుచున్నార. మాలకింపుము మమ్మిన్నివిధముగా బరాస్తుల గావించినవాడు, కేవల మయిదేండ్ల ప్రాయమువాడు. వాల్మీకి మహాముని వలన నెల్ల విద్యలను గ్రహించినవాడు. లక్ష్మణాదులకు గూడ జయింప శక్యము గానివాడు. సీతాపరిత్యాగవిషయము నెత్తి మిమ్మును మమ్మును వెక్కిరించిన వాడు. ఇసుమంతయు భయము నెఱుగనివాడు. ఒంటరిగా నున్నవాడు. కావున మంత్రులను రావించి వారితో మంత్రణ మొనరించి యీ బాలకుని బరిమార్చుట కుపాయ మరయదగును' అని వాక్రుచ్చిరి. వారి పలుకుల నాలకించి రాఘవుడు వెంటనే మంత్రులను రావించి వారితో మంత్రణ మొనరించి యొక దూత నతిరయమున వాల్మీకి మహర్షి కడ కంపెను. అత డాశ్రమమున కరిగి మునిరాజును గని మునివరేణ్యా! మహావీరుడైన మీ శిష్యుడొకడు మా మహారాజు నెడల నపరాధ మొనరించినాడు. కావున వానిని వెంటనే శ్రీరామచంద్ర ప్రభువుల చెంతకు బంపుడు. కానిచో మీరా బాలకుని దోడ్కొని స్వయముగా రండు. ఇది శ్రీరామచంద్రప్రభువరుల యాజ్ఞ. విస్మృతి కారణముగా యజ్ఞమునకు రండని మాప్రభువులు మిమ్ము బిలువ జాలక పోయిరి. అందులకు మిమ్ము క్షమింపగోరుచున్నారు.' అని ప్రభుని యాదేశము నుగ్గడించెను. ఆ యాదేశము నాలించి శిష్యులను దోడ్కొని స్వయముగా రాగలనని మహర్షి దూతకు బ్రత్యుత్తర మిచ్చెను. మునికి బ్రణమిల్లి దూత వెడలిపోయెను. భావియుదంతము నెఱిగినవాడగుటచేతనే లోకరీతి ననుసరించి శ్రీరామచంద్రుడు యజ్ఞమునకు రండని వాల్మీకి నాహ్వానింపలేదు. జనకజాతయు సానందముగా వ్రతమును సమాప్త మొనరించెను.

ననుగమించి యరుగుదెంచుచుండెను. అతని వెనుక బదివేల సంఖ్య గల చతురంగబల మాగమించుచుండెను. అతని పుష్పకవిమానము నధిరోహించి యా కడపటి యశ్వమేధయజ్ఞ మహోత్సవము నవలోకించు తలంపుగల ననేకులు మహర్షులు, రాజర్షులు, బ్రహ్మ క్షత్రియ వైశ్యాది వర్ణములవారు నరుగుదెంచుచుండిరి. సీతామహాదేవిని, నామె తనయులను వెంట నిడికొని వాల్మీకిమహర్షి కూడ బయనించెను. సుమేధను దోడుకొని జనకుడు ప్రయాణించెను. జనకజాత పల్లకిలో దెఱల మఱుగున నుండుటచే మహారాజు లెవ్వరు నామెను గానలేక పోయిరి. జను లెవ్వరును దెలిసికొనలేకపోయిరి యజ్ఞవాటికకు రెండు క్రోశముల దూరమున నొక పర్ణకుటీరమును నిర్మింపజేసి వాల్మీకి మహర్షి సీతను, నామె తనయులను నా కుటీరమున మఱుగుపఱచెను. తన సైన్యమును వెంట నిడికొని, సుమేధతో గూడి జనకుడు రాజ సైన్యములు విడిసిన తావున కరిగెను. అతనిని శ్రీరామచంద్రుడు చూచెను. వివిధములైన యలంకారములతో, సిరములపై జటాజూటములతో, నంగములం దత్యంత మనోహరములైన నారవస్త్రములతో వెలుగొందుచు ముద్దులు మూటగట్టుచున్న మహాబుద్ధిశాలురగు లవకుశుల నవలోకించి వాల్మీకిమహర్షి "నాయనలారా! మీరీ నగరమునం దిందంతు బురవీథులం దెల్లయెడల శ్రీమద్రామాయణ మహాకావ్యమును గానము సేయుచు బరిభ్రమించుడు. శ్రీరామచంద్రుడు వినగోరినచో నాతని యెదుటగూడ గానము సేయుడు. జన్మకాండము మొదలుగాగల కాండములనుమాత్ర మిచ్చట గానము సేయవలదు. ఆ కాండములను నే నాదేశించిన మీఁదటనే గానముసేయుదురు గాక. శ్రీరామచంద్రప్రభువు మీ కేమైన నొసగినచో స్వీకరింపవలదు. అని వారి కాదేశించెను.

ఆ మహర్షి యాదేశానుసారముగా నా లవకుశులు రామాయణగానము సేయుచు నగరమునం దింతం దెల్లయెడల సంచరింప

ఈ చరిత్రము నాలకించి విష్ణుదాసుడు 'గురువరేణ్యా! అశక్తులైనవా రీవ్రతము నెట్లాచరింపవలెనో యెఱుగజెప్పుడు' అని రామదాసుని బ్రశ్నించును. అప్పుడు రామదాసుడు విష్ణుదాసున కిట్లు వివరించును.

"శిష్యా! విష్ణుదాసా! నొడువుచున్నాడ నాలకింపుము మానవులు దమ శక్తి ననుసరించి బంగారముతోగాని, వెండితోగాని రాగితోగాని శ్రీరామపాదుకలను రెంటిని నిర్మింపజేసికొనవలయును కమలములు దొరకనివేళ నితర కుసుమములతోగూడ నారాధన జేయవచ్చును. ఎనుబదియొక్కమంది దంపతులను బూజింప శక్తి లేనివేళ దొమ్మండుగురు దంపతులనైనను శక్త్యనుసారము బూజింపవచ్చును. ధనలోభమునకు దావీయరాదు. ఈ వ్రతముయొక్క ప్రభావమున నెంతదూరమందున్న ప్రియజనమునైనను శీఘ్రముగా గలసికొనవచ్చును. భావికార్యము లన్నియు నవలికాలమున సిద్ధించును"

—: షష్ఠ సర్గము సమాప్తము :—



# సప్తమ సర్గము

—* లవకుశులతోడ రామలక్ష్మణాదుల యుద్ధము *—

రామదాసుడు విష్ణుదాసున కిట్లు వినిపించును.

అనంతరము శ్రీరామచంద్రుడు కడపటి యశ్వమేధము నారంభించి దేశసంచారమునకై యశ్వమును వదలెను. దానికి రక్షకుడై దాని ననుగమించి శత్రుఘ్నుడు కదలెను. దక్షిణపశ్చిమోత్తర దిక్కులందు బరిభ్రమించి యా యశ్వము తూర్పుగా యజ్ఞవాటిక దిక్కునకు మఱలి వచ్చుచుండెను. భూమిపాలకు లందఱివలన గోట్లకొలది దీనారములను స్వీకరించి వాటిని వెంట నిడికొని శత్రుఘ్నుడాయశ్వ

నారంభించిరి. అపూర్వములైన పద్యములు. వృత్తములు. మున్నగు గేయములతో గర్ణపర్వముగా వినవచ్చు తన పూర్వ చరిత్రమును శ్రీరామచంద్రుడు గూడ నాలకించి యెంతయు గుతూహలము గలవాడయ్యెను.

అనంతరము రఘునందనుడు యజ్ఞసంబంధములగు విధులను నిర్వర్తించికొని మునీశ్వరులను, మహారాజులను, బండితులను, వేద వేత్తలగు విప్రులను పౌరాణికులను, వ్యాకరణ శాస్త్రవేత్తలను, జ్యోతిష్కులను, వివిధములైన కళలలో నిపుణులగు నితరజనులను, వృద్ధులను సాదరముగా సభలోనికి రావించి రామాయణ గానము సేయు లవ, కుశుల సందు బ్రవేశపెట్టెను. ఆసభలో జేరిన జనము లందఱు నా శ్రీరామచంద్రుని, మనోహరాకారులగు నా ముని బాలకులను నిర్నిమేషముగా నిరీక్షించి యెంతయో విస్మయము నొందిరి. "యీ బాలకు లిరువురును శ్రీరామచంద్రుని ప్రతిబింబ ములుగా గానవచ్చుచున్నారు. జటావల్కలములను ధరించి యుండక పోయినచో రఘునందనునకు నీ బాలకులకును భేద మా వంతయు గానరాదు. వీరు రాఘవుని బోలియుండుటకు గారణమేమియో యెఱుగరాదు, అని వారు తమలో దాము తర్కించికొనుచుండిరి.

ఆతరుణమున లవుని బాణముచే గొట్టబడిన రామదూత ముందునకు వచ్చి శ్రీరామచంద్రునకు నమస్కరించి వ్రేలితో లవుని వంకకు నిర్దేశము సేయుచు మహాప్రభూ! మహాబాహూ ! యీ బాల కుడే బాణ ప్రయోగము జేసి మమ్ముల నెల్లరను మీ సమక్షమునకు వినరివైచి పరిమళ భరితములైన సువర్ణకమలములను నిత్యము గొని పోయినవాడు, ఈతడే సీతాపరిత్యాగ విషయము నెత్తి మిమ్మును, మమ్మును, దూషింప దొరకొన్న యహంకారి. ఈతడే మీకు దండన పాత్రుడు. మీరు దండింతు రన్న భయముచేతనే, యీతడు పూర్వ మందలి తన రథమును, వస్త్రాభరణములను, శస్త్రాస్త్రములను బరిత్య

జించి నారవస్త్రములను ధరించి దీనునివలె గానవచ్చుచున్నాడు. ఈ యహంకారిని మీరిప్పుడే దండింప వలయును. అనిచెప్పి యూరకుండెను. దూత పలుకుల నాలకించియు రఘూత్తముడా యిరువురు ముద్దుబాలకుల వంకకు వాత్సల్యామృతము నొలికించు చల్లని చూడ్కులనే ప్రసరింపజేసెను.

అంతట బాలకు లిరువురును సభాస్తారుల కెల్లరకు నమస్కరించి వరుసగా శ్రీరామచంద్రునకు, భరతశత్రుఘ్నులకు, వసిష్ఠమహర్షికి వంగివంగి వందనములు గావించి వీణియలను ప్రయోగించుచు గంధర్వ గానమును మించి కర్ణపర్వమగు విధమున సుమధురగానము సేయ నారంభించిరి. వారి మధురగాన మాలించి రఘునందను డత్యంతానంద భరితు డయ్యెను. క్రమముగా నా బాలకులవలన నాతడు విలాస కాండ పర్యంతముగా గల తన చరిత్రమంతయు వీనులవిందుగా నాలకించెను. అప్పటి కపరాహ్ణ మయ్యెను. శేషించిన చరిత్రమును గూడ మఱునాడు తనకు వినిపింపవలసిన దని రాఘవుడు వారి కాదేశించెను. "అట్లకాక !" యని వారంగులకు సమ్మతించిరి. అనంతరము శ్రీరామచంద్రుడు లవునివంకకు జూచుచు నతనితో "కుమారా ! నీవు నాయెడల నపరాధ మొనరించినవాడ వైనను నీయెడల సంతుష్టాంతరంగుడ నయిన కారణమున నేను నిన్ను శిక్షింపను. నీ గానము నాలింపగా నా మనసు పరమానందభరితమైనది. నేను నిన్ను క్షమించితిని. నీవీ నగరమున నిర్భయముగా జరింపుము." అని చల్లని మాటలాడెను. ఆ మాటల నాలించి మఱల లవుడు "దేవా ! మీ దర్శనమును గోరియే నేను మీయెడల నపరాధ మొనరించితిని. ఆ యపరాధము చేయుట చేతనే నే నిచ్చటకు రాపింపబడితిని. ఇప్పుడు మిమ్ము దర్శించుటచే నా పౌరుష మినుమడించినది. మీ సమక్షమున గానము చేయుటచే నా కీర్తి పెంపొందినది" అని పలికి మాౌనము

వహించి సోదరుని దోడుకొని యటనుండి కదలి వెడలిపోవుట కుద్యమించెను. అంతలో రఘునందనుడు భరతునిచే వారికి బదివేల బంగారు నాణెముల నిప్పింపబోయెను. కాని వారా ధనమును స్వీకరింపక "రాజేంద్రా! యీ బంగారముతో మాకు బని యేమి? మేము వనమునందు లభించు కందమూల ఫలాదులను భక్షించి జీవించువారము. దయతోగూడిన మీ చల్లని చూపే మాకు బదివేలు." అని పలికి యా ధనమును బరిత్యజించి మహర్షి సన్నిధికి వెడలిపోయిరి. రాఘవుడు వారివలన దన చరిత్రము నాలకించి యెంతయో విస్మితుడయ్యెను. కుశుడు సంఘటిల్లిన సమాచారమంతయు మునిరాజునకు, జననికి నెఱుగజెప్పెను. అనంతరము లవకుశు లిరువురును గంగాస్నానము సేయుటకు నదికి బోయి మఱలివచ్చిరి. లవుడు మునిబాలకులతో గూడి యాడుకొన దొడగెను.

ఇంతలో నా బాలకు లున్న తావునకు శ్రీరామచంద్రుని యశ్వమేధాశ్వ మాగమించెను. దానిని జూచి క్రీడనమును మాని లవకుమారుడా యశ్వమును బట్టి తన పర్ణశాలకడ నొక వృక్షమునకు గట్టివైచెను. పిమ్మట మఱల యథాపూర్వముగా మునిబాలురతో నాడుకొనదొడగెను. అంతలో నంబరమార్గమున నాయెడకు బుష్పకవిమానము గూడ నేగుదెంచెను. అందున్న శత్రుఘ్నాదులు వృక్షమునకు గట్టబడియున్న యశ్వము నవలోకించి యది యేదియో చిన్నపిల్లల చిలిపిచేష్టగా భావించి నవ్వుకొని యశ్వమును బంధవిముక్తము గావింపుడని దూతల కాదేశించిరి. వారు గుఱ్ఱమును విడిపింప బోయిరి. వారిని గని లవు డొక తృణకణమును వాయవ్యాస్త్ర మంత్రముచే నభిమంత్రించి యవలీలగ వారిపై బ్రయోగించెను. అంతట బ్రళయవాయువులు చెలరేగి ఏనుగులు, గుఱ్ఱములు, రథములు మున్నగు శత్రుఘ్నుని సైన్యమంతయు దూదిపింజల దండు వలె నున్నర

మున కెగసి దవ్వుగా బోవ నారంభించెను. ఆ సమాచారము నెఱిగి రఘునందనుడు వెంటనే సుగ్రీవుడు, నంగదుడు, నలుడు, నీలుడు, మైందుడు, జాంబవంతుడు, సుమంత్రుడు, భరతుడు, హనుమంతుడు, గరుత్మంతుడు, విభీషణుడు, సుషేణుడు, ద్వివిదుడు, దధివక్త్రుడు, మకరధ్వజుడు మున్నగు వారిని, బలువురు సామంత భూపాలురను వారి వారి బలగములతోడ శత్రుఘ్నాదులకు బాసటగా నిలువ నంపెను. వారు మహాహంకారములతో లవునితో బోరాటము సలుప నేగుదెంచిరి.

వారిని గాంచి లవుడు వారిలోని యొక భటుని ధనుస్తూణీరములు పుడమిపై బడగా వాని నందుకొని వారితో బోరుట కుపక్రమించెను. కర్ణములు పగులునట్లు లొక్కమారు టంకారము గావించి తనలో నిట్లు తర్కించికొనెను. "అక్కటా! నాతో బోరాటము సలుప నేగుదెంచి నా పినతండ్రులు మున్నగువా రందఱు నా సముఖమున నిలిచియున్నారు. వీరితో నే నెట్లు యుద్ధము సేయగలను? వాడి యలుగులను వీరిపై నెట్లు ప్రయోగింపగలను? స్వజనమును సంహరించినచో నన్ను జననియు, మునివరుడును, రఘునందనుడు నేవిధముగా మన్నింతురు? ఇప్పట్టున నాకు గర్తవ్య మేది? యుద్ధము నెడల బెడమొగము పెట్టికొని మునిరాజు కడకు వెడలిపోయినచో నా మునిరాజు వలన బడసిన నా విద్య యంతయు విఫలమైపోవును గదా! కావున బ్రాణహాని యెవ్వరికిని గలుగని విధమున సమర మొనరించెదగాక". ఈ విధముగా నిశ్చయించికొని యా లవకుమారుడు తనవంక కాగమించుచున్న వారిని జూచి మేఘగంభీరనిస్వనుడై భటులారా! నిలుడు! నిలుడు! ముందున కడుగు పెట్టకుడు! పీడించుటకిప్పుడు మీకు నేను సీతామహాదేవి వలె సులభసాధ్యుడను గాను. సీతాక్లేశాగ్నిని హరించు మేఘముగా నన్ను గుర్తింపుడు. ఆ సీతామహాదేవి యొక్క నిట్టూర్పులచే మీలోని పౌరుష మంతరించినది.

కావున వ్యర్థపు యత్నములు మాని వెనుకకు మఱలుడు. అని వ
ములుకులను బోలు పలుకులతో వారి మనములను నొవ్వజేసెను
పిమ్మట సమ్మోహనాస్త్రమును బ్రయోగించి వారి నందఱి
మోహితులగావించివైచెను. సమ్మోహితులై యున్న సుమంత్రు
భరతుని రెండు చంకలయందు నిఱికించుకొని హనుమంతుని, సుగ్రీవ
రెండు చేతులతో బట్టుకొని సానందముగా గొనివచ్చి సీతకు జూపెను
సీత వారిని జూచి యేకాంతమున బుత్రుని చారినుండి వారిని విడిపిం
రక్షించెను. లవుడు వారిని నలుగురను గొనిపోయిన సమాచారం
నెఱిగి శ్రీరామచంద్రుడు లక్ష్మణునితో "లక్ష్మణా! యిట్టి పౌరు
మును మున్ను రావణునికడ గూడ జూచియుండలేదు. ఈ బాల
డసాధ్యసాధనము జేయుచున్నాడు. ఇప్పుడు మనకు దెలువేవి
కర్తవ్యమేమి?" అని నైరాశ్యవచనము లాడెను. అది విని లక్ష్మణు
"అన్నా! రఘునందనా! మీరీ విషయమున నావంతయు జింతిం
వలదు. సింహము లేడిపిల్లను గొనిపోవు విధమున క్షణకాలము
నా పిల్లవానిని బట్టి బంధించి మీ సన్నిధికి గొనితెత్తును." అని పలి
ప్రణామ మొనరించి రథము నధిరోహించి యతిరయమున నాహ
రంగమున కరిగెను.

అతనిని గాంచి లవుడు గూడ నతని సమక్షమున కరు
దెంచెను. మనోహరాకారుడగు నా బాలుని గాంచి లక్ష్మణు
బాలకా! నా యెదుట నిలుచుటకు సాహసింపవలదు. నీవు :
ముందు నిలువజాలవు నిలిచినచో నీ ప్రాణములు నిలువవు. శేషి
చిన రామాయణమును గూడ నీవలన వినగోరుచున్నాను. కావు
నిన్ను సంహరింప నిచ్ఛగింపను. శ్రీరామచంద్ర ప్రభువు నెడల నీ
పర్యాయము నపరాధము నొనరించితివి. ఆ విషయము నెఱి
యుండియు నిన్ను బరిమార్చుటకు నామన మిచ్ఛగించుటలేదు. నీ

బ్రదుకుపై నాస గలదేని, నీవు బంధించిన యశ్వముతోడ నీవు గొని పోయిన వీరులను నలుగురను నా కప్పగించి నన్ననుగమించి వచ్చి యా శ్రీరామచంద్రప్రభువుని శరణు వేడికొనుము అని పలికెను. అంతట లవుడు గూడ నిర్భయముగా ఓయి ప్రలాపీ! నేను నిన్ను, నీయన్న యగు రఘునందనుని బాగుగా నెఱుగుదును. సీతాపరిత్యాగ విషయమున మీ రిరువురు నసాధారణ పరాక్రమమును బ్రదర్శించిన వారు. మీ పౌరుషము సీతయెడలనే చెల్లును గాని లవుడను పేర బరగు నాయెడల జెల్లదు. నేను సీతామహాదేవి దుఃఖములను హరించుటకై వాల్మీకి మహర్షిచే సృజింపబడినవాడను. ఇప్పుడు నిన్ను, నీయన్న యగు శ్రీరామచంద్రుని సమరరంగమున జయించి యా తల్లి దుఃఖమును హరించెదను. మహాపతివ్రతయగు నామెను మీరిరువురును గూడి మోసగించిరి. దానికి బ్రతీకారము సేయ నేనిచ్చట కేగుదెంచితిని. సీతాదుఃఖాగ్నిచే మీయిరువుర పౌరుషమును ధగ్ధమైనది. కావున నా యెదుట నిలుచుటకు బ్రయత్నింపవలదు. దిక్కుమాలిన వారివలె దేవురించుచు నీవు, నీవారును వెనుకకు మఱలిపొండు. అని కటుకములుకులను బోలు పలుకులతో నతని మనమును దూటులుపడ బొడిచెను.

అంతట క్రోధావేశమున మండిపడుచు లక్ష్మణాదులు లవకుమారునిపై శస్త్రాస్త్రములను గురియించిరి. లవుడు రెచ్చి పరాక్రమించి యమోఘములగు తన బాణములతో వారి శస్త్రాస్త్రవర్షమును నిరోధించి శ్రీరాముని మంత్రులు మున్నగువారిని బెక్కుర నొక్కొక్కడిగా నతని యజ్ఞవాటములో బడునట్లు విసరివైచెను. అట్లు యజ్ఞమున బడినవారెల్లరు నొకింత సేపటికి దెల్వి గని ఛిన్నభిన్నములైన శరీరములతో, నెత్తురుల నొలికించు గాయములతో, డడబడుచున్న కంఠస్వరములతో గలత నొందుచు రఘునందను నవలోకించి

'శ్రీరామచంద్రమహాప్రభూ! మీరు మున్ను గనుగొనుచుండియు మౌనభావము వహించి యూరకుంటిరేల! రణరంగమున లవుడు శస్త్రాస్త్రములచే మృతినొందువాడుగాడు. ఆ లవుని యమోఘబాణముల బారికి దక్కి లక్ష్మణుడు బొందిలో ప్రాణములతో మరలి రావలెనన్నచో వెంటనే యాపిల్లవాని సిధనమునకు దగిన యుపాయ మాలోచింపుడు.' అని పలికి లవు డాడిన పరుషవాక్యములను గూడ నతని కెఱుగజెప్పిరి. వారి పలుకుల నాలకించి శ్రీరామచంద్రుడు క్షణకాల మూరకుండెను.

అక్కడ లవుడు పుంఖముల (ఈకెలు) పర్యంతము శరీరమున దిగబడిపోవునట్లు లక్ష్మణునిపై బది బాణములను బ్రయోగించెను. అంతట లక్ష్మణుడు గూడ నా బాలకునిపై ననేక బాణములను బ్రయోగించెను. కాని యవి యన్నియు విఫలము లయ్యెను. అప్పు డతడు మనమున నారాటమొంది క్షణకాల మేమియో యాలోచించి కొని నిరుపాయుడై కడకా బాలకునిపై బ్రహ్మాస్త్రమును బ్రయోగించెను. అంతట లవుడా యస్త్రమునకు బద్ధుడయ్యెను. బద్ధుడైన యా బాలకు నశ్వముతో బాటుగా గొనిపోయి లక్ష్మణుడు శ్రీరామ చంద్రున కప్పగించెను. బ్రహ్మాస్త్రమును మన్నించుచు లవుడు మెల్లగా శ్రీరామచంద్రుని సమీపించెను అతడు తన తనయుడని యెఱిగి యుండియు జనములకు గౌతుకమును జూపనెంచి లక్ష్మణుని గాంచి 'లక్ష్మణా! నీవు మహాకార్యసాధనము జేసితివి. ఇతడు క్షత్రియుడు. కాని బ్రాహ్మణుడుగాడు. కావున బ్రహ్మహత్యా భయమును బరిత్యజించి యీ బాలకు నిప్పుడే శీఘ్రముగా నంత మొందింపుము.' అని యతని కాదేశించెను. ఆ యాదేశము నాలించి లక్ష్మణుడు 'అన్నా! యీ బాలకుడు శస్త్రములచేత సంహరింపబడువాడు గాడు. భరతాదులును, నేను నీ పిల్లవానిపై నెన్ని శస్త్రములను బ్రయో

గింపలేదు? మీరే కనుగొనుడు. ఇతని శరీరముపై గాయ మొక్కటి యైన గానవచ్చుచున్నదా అని బదులు పలికెను. అట్లయినచో నే యుపాయమున మరణింతువని నా యెదుటనే యీ బాలకుని ప్రశ్నిం పుము. వీరు లెన్నడును మరణమునకు వెఱవరు. తమ మరణోపాయ మున గుప్తము గావింపరు. తమ బలముపై నాధారపడి జీవించు వారెన్నడు నసత్యమాడరు' అని శ్రీరామచంద్రుడు మఱల లక్ష్మణుని బురికొల్పెను. లక్ష్మణుడు నీ వే యుపాయమున మరణింపగలవని ప్రశ్నించెను. నీమీద నెంత జలము పోసిన నంతగా బెరుగగల వని వాల్మీకిమహర్షి మున్నొకప్పుడు లవునితో జెప్పియుండెను. ఆ మాటను దలపునకు దెచ్చుకొని లక్ష్మణుని గికురించి లోకమునకు దన పరాక్రమును బ్రదర్శింప నెంచి నీటితో చదుపుటవలన దనకు మృత్యువు ప్రాప్తించగలదని బదులు పలికెను.

ఆ మాట నాలించి లక్ష్మణుడు శీఘ్రముగా నా బాలకు నొక శిలపై గూర్చుండ జేసి కడవలకొలది నీరు దెప్పించి వాని శిరముపై గ్రుమ్మరించు నేర్పాటు గావించెను. ఆకార్యక్రమమున నయోధ్యా నగరవాసులగు నెందఱో స్త్రీలు, బురుషులును బాలుగొనిరి. నీటిని జేరవేయుట కెన్నియో రథములు, నొంటెలు, నేనుగులు, నెందఱో నీరుమోయువారు నుపయోగింపబడిరి. కడవలతో నీటిని గుమ్మరించు కొలదియు లవుడు మేఘమువలె బెరిగిపోవ నారంభించెను. పెరిగి పెరిగి యేడు తాళవృక్షముల ప్రమాణము గలవాడై యతడు భయం కర పరాక్రమశాలిగా జూపట్టదొడగెను. అప్పుడు లక్ష్మణుడు 'ఓయీ! వీరవరా! నీ వసత్య మాడితివి. నీవు నొడివినది నీ మరణో పాయము గాదు. వృద్ధ్యుపాయము' అని లవునితో ననెను. 'తైల మిగిరిపోయి దీపజ్వాల యంతరించిపోవ నున్నప్పు డది యొక్కమాఱు వృద్ధి బొందుట సహజముగదా! అట్లే నా యాయువు క్షీణింప

నున్నది. కావున నాకిట్టి వృద్ధి గలుగుచున్నది' అని లవుడు బదులు పలికెను. లక్ష్మణుడా పలుకులను విశ్వసించెను. జనులు మఱల గడవలతో గంగాజలములను దెచ్చి నిచ్చెనలపై నిలిచి యవిరామముగా లవునిశిరమున గ్రుమ్మరింప నారంభించిరి. అట్లు కొంతతడవు నీరములు వోయగా నొక్కమాఱుగా బ్రహ్మాస్త్రమును విడివడి లవుడు చలనము గలవా డయ్యెను. బాలలీలగా నతఁ డొక్కమాఱు భుజము లప్పళించి తొడల జఱచ నారంభించెను. ఆ భయంకర బాలకుని గని జను లడలి వడవడ వడకుచు నూడిపోయెడు గోచులతో, మల మూత్రములను బయల్పఱచు శరీరములతో మఱియు మఱియు వెనుకకు దిరిగి బెదరుచూపులతో నాబాలకునివంక కవలోకించుచు దూరముగా బరుగులు వెట్టిరి.

ఇంతలో నక్కడ గంగాతీరమున ఖేలననిరతుడై యున్న కుశుడు కడవలతో జలములను గొనిపోవుచున్న జనములను గనుకొని జనములారా! యీ సమారోహమంతయు నేమి? యని వారిని బ్రశ్నించెను. లవుని పలుకులను విశ్వసించి వాని నంతమొందించుటకై 'మేమీ జలమును గొనిపోవుచున్నవారము' అని వారు బదులు పలికిరి. అంతట కుశుడు వడివడిగా నాశ్రమమున కరిగి ధనుర్బాణములను దాల్చి యజ్ఞవాటికలో బ్రవేశించి కర్ణములు పగులునట్లు లొక్కమాఱు భయంకర టంకారము గావించెను. ఆ కుశుని చాపధ్వని నాలించి లవుడు క్షణకాల మూరకుండెను. లక్ష్మణుడు కుశునితో బోరొనరింప ముందున కేగుదెంచెను. అప్పుడు కుశుడు లక్ష్మణుని గని ఓయీ! వీరవరా! నీవును, నీయన్నయగు శ్రీరామచంద్రుడును, మీ పరివారమును గూడి సీతను, లవుని వంచించితిరి. కాని నేను లవునివలె మీ వంచనలకు లోగువాడను గానని యెఱిగి ముందున కడుగిడుము. మీ రొనరించిన వంచనలకు బ్రతిక్రియ

గావించుటకై నేనిచ్చట కేగుదెంచితిని. మీపరాక్రమ మొక యాడు
దాని యెడలను, శిశువునెడలను జెల్లును గాని నా యెడల జెల్లదు.
సీతాదుఃఖాగ్నిజ్వాలలచే మీ బలమంతయు నంతరించినది. కావున
నాచేత నుపహసింపబడుచు నా వాడి యలుగులచే నేల యుసురులను
దొరగ నుద్యమించెదవు? బొందిలో ప్రాణములతో వెనుకకు మఱలి
పొమ్ము. అని ములుకులను బోలు పలుకులతో నతని హృదయ
మును దూటులు వడ బొడిచెను. అనంతరము రామా ! వాల్మీకి కడ
నే నేర్చికొన్న విద్యాప్రభావమును ప్రదర్శించుచున్నాను. అని పలికి
కుశుడు లక్ష్మణునితో దారుణమైన సమరము సాగించెను. లక్ష్మణుడు
కుశునిపై ప్రయోగించిన విశిఖము లన్నియు వితథము లగుచుండెను.
తా నభ్యసించిన రామాయణమువలన లక్ష్మణు డాదిశేషుని యవ
తారమని యెఱిగినవా డగుటచే కుశుడు లక్ష్మణునిపై గారుడాస్త్ర
మును ప్రయోగించెను. ఆ గారుడాస్త్రము నవలోకించి సౌమిత్రి
నవనాడులును క్రుంగ నడలి యరదమునుండి పుడమిపై గూలెను.

అట్లు కూలిన లక్ష్మణుని గాంచి యజ్ఞదీక్ష వహించి యున్న
ప్పటికిని రఘునందనుడు తత్కాలమున ధనుర్బాణములను కేలధరించి
యజ్ఞకుండమునందు నిలిచి సౌమిత్రిని బ్రదికించికొను తలంపున
బ్రహ్మాస్త్రమును సంధించి యాగారుడాస్త్రముపై ప్రయోగించెను.
అంతట నది శాంతించెను. నేను సీతవలె వంచనలకు లొంగువాడను
గానని పలుకుచు కుశుడు మఱల శ్రీరామచంద్రునిపై సర్పాస్త్ర
మును ప్రయోగించెను. మఱియు నో రామా ! నీ పౌరుషమును
ప్రజలకు జూప నెంచి సీత నన్యాయముగా మున్ను వనములలో దిగ
విడిచినవాడ వని నే నెఱుగుదును. వాల్మీకి కడ నేర్చిన నా విద్యా
ప్రాభవమెంతటిదో ? ఇప్పుడు చూచెదవుగాక ! అట్లు కాదంటివేని
వెంటనే పోయి యా వాల్మీకిమహర్షిని సీతామహాదేవిని శరణు వేడు

కొనుము అని రఘువరుని మనము నొవ్వనాడెను. అంతట రాఘవుడా సర్పాస్త్రముపై మార్జాలాస్త్రమును ప్రయోగించెను. అంతట నది శాంతించెను. కుశుడు మగుడ సారమేయాస్త్రమును (కుక్క) ప్రయోగించెను. రాఘవుడు ముసలాస్త్రమున (రోకలి) దానిని వారించెను. జానకీ జఠరమున జన్మించిన కుశుడు మఱల నాగ్నేయాస్త్రమును సంధించెను. పర్జన్యాస్త్రమున రాఘవుడు దానిని శాంతింప జేసెను. కుశుడు వాయవ్యాస్త్రమును ప్రయోగింప బర్వతాస్త్రమున దానిని శాంతింపజేసెను. కుశుడు వజ్రాస్త్రమును ప్రయోగించెను. రాఘవుడు యామ్యాస్త్రమున దానిని వారించెను. అంతట కుశుడు బ్రహ్మాస్త్రమును సంధించెను. ఆ సమయమున యజ్ఞవాటమునం దెల్లయెడల హాహాకారములు విస్తరించెను. తోడనే రఘునందనుడా బ్రహ్మాస్త్రమును వైష్ణవాస్త్రమున వారించెను. ఈ విధముగా కుశుడు రాఘవుని మీదను, రాఘవుడు కుశుని మీదను శతముల కొలది శరములను వర్షించుచుండిరి. కుశునకు, రాఘవునకు నడుమ సాగిన యాభయంకర సమరములో నొక వైచిత్ర్యము గోచరించెను. అది యెట్టిదనగా రాఘవుని ధనువునుండి విడివడిన శరము లన్నియు కుశుని గాయపఱపక యాతని శిరముపైనుండి దూసికొని పోయి పుడమిపై బడసాగెను. కుశుని ధనువునుండి విడివడిన బాణము లన్నియు రాఘవునకెట్టి యపాయము గలుగకుండ నతని పాద ప్రదేశమున బడసాగెను.

ఆ వైచిత్ర్యము నవలోకించి యత్యంతాశ్చర్య చకితుడై మంత్రివరు నొక్కని రావించి మంత్రిసత్తమా! నీవు వెంటనే వాల్మీకిమహర్షి సన్నిధి కరిగి నమస్కరించి ఆర్యా! మహాబలశాలు లగు మీ యీ శిష్యు లిరువురు నెవ్వరు అని యాయనను బ్రశ్నించి యాయన యందుల కేమి బదులు పలుకునో ఆలకించి వచ్చి నా కెఱి

గింపుము అని యాదేశించెను. అట్లకాక యని మంత్రి వెంటనే రథము నధిరోహించి రెండు క్రోశముల దూరమున నున్న వాల్మీకి మహర్షి సన్నిధికి జేరెను. మునికి బ్రణమిల్లి రఘువరుని సందేశమును వినిపించెను. వాల్మీకి మహర్షియు నో మంత్రిసత్తమా! రేపు సభామధ్యమున లవకుశులు శేషించిన రామాయణమును గానము సేయు తరుణమున నా బాలకు లిరువురు నెవ్వరో యరయగలవు. అని రాఘవున కెఱుగజెప్పు మని పలికి యాతని బంపివైచెను. అనంతరమా ముని రాజు సానందముగా గుశలవులను దనకడకు బిలిపించికొని వారి నొక్కమాఱు బిగియార గాగిలించికొని యా యా కథాప్రసంగములతో నాటి రేయిని హాయిగా వెడలించెను.

సప్తమ సర్గము సమాప్తము.

—()—

## అష్టమ సర్గము

### —* శ్రీరామచంద్రుడు సీతను మఱల బరిగ్రహించుట *—

శ్రీ రామదాసుడు విష్ణుదాసున కీ విధముగా వినిపించును.

మఱునాడు ప్రాతఃకాలమున శ్రీరామచంద్రు డా బాలకుల నిరువురను శ్రీమద్రామాయణ గానము సేయ సభలోని కాహ్వానించెను. వారును జటావల్కలధారులై చని మునిరాజునకు, జనని యగు జనకజాతకును బ్రణమిల్లి వారి యనుమతి నెనసి సభాస్థలి కరుగుదెంచిరి. వారు సభాస్తారుల కెల్లరకు నమస్కారములు గావించి, రామాయణములోని జన్మకాండమును సానందముగా గానము జేసి వినిపించిరి. సభాసదులతోడ గూడి శ్రీరామచంద్రుడు నిజచరిత్రము నాలకించి యత్యంత విస్మితుడయ్యెను. జను లెల్లరును బరమాశ్చర్య

చకితులైరి. ఆ బాలకు లిరువురును సీతాకుమారు లని యెఱిగి, యమందానందము నొందిరి. ఇంతలో లవుని వాయవ్యాస్త్రమున నెగురగొట్టబడిన శత్రుఘ్నాదులును, సమ్మోహనాస్త్ర మోహితులైన యంగదాది వానరవీరులును, మహారాజులు, లక్ష్మణుడు నస్త్ర ప్రభావమునుండి విముక్తులై, సజీవులై పుష్పకవిమానము నధిరోహించి యాయెడ కాగమించిరి. వచ్చినవా రెల్లరును శ్రీరామచంద్రునకు నమస్కరించి యా మహాపురుషుని చెంత నాసీనులైరి.

అనంతరము శ్రీరామచంద్రు డేమియో యాలోచించి యా బాలకుల నిరువురను సానందముగా వీడుకొలిపి యటనుండి వారి తావున కంపివైచెను. తరువాత విభీషణుని, లక్ష్మణుని, శత్రుఘ్నుని, మకరధ్వజుని, గరుత్మంతుని సుషేణుని, జాంబవంతుని నుద్దేశించి వారికిట్టు లాదేశించెను "మీరు శీఘ్రముగా నరిగి సీతామహాదేవితోడ దేవసన్నిభుడగు వాల్మీకి మహర్షి నిచ్చటకు దోడుకొనిరండు. ఇప్పుడు సభలో సభాస్తారుల సమక్షమున నొక నిర్ణయము జరగవలసియున్నది. కావున గంగానది కీవలి యొడ్డున విశాలమైన సభ నెలకొనుటకు వలయు నేర్పాటులు సత్వరముగా సాగింపుడు. అచ్చట మీ రందఱు జూచుచు, నాలకించుచు నుండగా నా సమక్షమున సీత తన నిర్దోషిత్వమును ప్రకటించుచు, శపథ మొనరించును. అప్పుడు నాయెడల, జానకియెడల దోష మానంతయు లేదని మనులు మున్నగువా రెల్లరు నెఱుగగలరు." ఆ యాదేశము నాలించి లక్ష్మణాదులు వెంటనే వాల్మీకి మహర్షి సన్నిధి కరిగి యాయనకు రామాజ్ఞ నెఱిగించిరి. శ్రీరామచంద్రుని మనోగతాభిప్రాయము నెఱిగి సంతసించి మునిరాజు తమ యాశ్రమమున బద్ధులైయున్న సుమంత్రాదులను నలుగురను సాదరముగా గౌరవించి లక్ష్మణున కప్పగించెను. రేపటి దినసమున సీత సభలో ప్రమాణము సేయగలదని రాఘవునితో

జెప్పుమనియు, సతులకు బతి యొక్కడే పరమదైవ మనియు, మూడు లోకములందును బతి నెడబాసిన సతికి గతి లేదనియు లక్ష్మణున కెఱుగజెప్పెను. అప్పుడు లక్ష్మణాదులు శ్రీరామచంద్రుని చెంతకు మగిడి వచ్చి సుమంత్రాదుల నప్పగించి వాల్మీకి సందేశము నా మహా పురుషున కెఱిగించిరి. రాఘవుడా సందేశము నాలించి యమందా నంద మొందెను. సుమంత్రుని, భరతుని, హనుమంతుని, సుగ్రీవుని గాఢముగా గౌగిలించుకొని వారు నలుగురును మరణించి మరల జన్మించినట్లులుగా దలపోసెను. లవునిచే బంధింపబడియు మే మెల్లర మును సీతామహాదేవిచే సంరక్షింపబడితిమని సుమంత్రాదులు శ్రీరామచంద్రున కెఱిగించిరి.

మఱుచటి దివసమున శ్రీరామచంద్రుడు బృహత్తరమైన సభ నేర్పఱచెను. సభాసదుల నందఱను సాదరముగా సభలోనికి రావిం చెను. పిమ్మట సభలో సమాసీనులైన మునివరులను, జనపతులను సంబోధించి "మహాజనులారా! ఇప్పుడు సీత యీ సభలో బ్రమా ణము సేయును. ఆమె పలుకుల నాలకించి గుణదోషములను దెలిసి కొనుడు" అని వారి కాదేశించెను. ఆ మాటల నాలించి సీతామహా దేవిని సందర్శించు తలంపున బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రాది వర్ణములవా రందఱును, వానరశ్రేష్ఠు లందఱును దురదుర సభలో బ్రవేశించిరి. పిమ్మట సీతను వెంట నిడుకొని వాల్మీకి మహర్షియు సభలో బ్రవేశించెను. మునిరాజును ముందిడికొని, సుంత మొగము వంచికొని దోయిలి గట్టుకొని జనకజాత మెల్లమెల్లగా నడుగు లిడుచు యజ్ఞవాటమున బ్రవేశించెను. శ్రీమహావిష్ణువును వెనుకొని యాగ మించిన మహాలక్ష్మివలె వాల్మీకి మహర్షిని వెనుకొని వచ్చుచున్న సీతామహాదేవిని గాంచి యచ్చటి జనులందఱు నమందానందమున జయజయధ్వానములు గావించిరి. సీతాసమేతుడై వాల్మీకి మహర్షి

సభాజనసమధ్యమునకు జేర్చి శ్రీరామచంద్రుని సంబోధించి యీవిధముగా బలికెను. "శ్రీరామచంద్రా! ఇదిగో! యీమె పరమపవిత్రవర్తనురాలును, నీ సహధర్మచారిణియు నగు సీతామహాదేవి. పూర్వమీమెను పాపవర్తనురాలని శంకించి నీవు నా యాశ్రమ సమీపమున విడనాడితివి. లోకాపవాదమునకు వెఱచి యానాడీమెను యమునానది కీవలియొడ్డున బరిత్యజించితివి. ఈమె యిప్పు డిచ్చట దన నిర్దోషిత్వమును వెల్లడించికొన నిచ్ఛగించు చున్నది. అందుల కీమె కనుమతి నిమ్ము. ఈ బాలకు లిరువురును సీతాకుమారులు. ఇందు కుశుడు నీవలన బొడమినవాడు. లవుడు సీతాశాపభీతి కారణముగా నాచే జలలవములచే సృజింపబడినవాడు. ఈ బాలకు లిరువురు నసాధారణ పరాక్రమశాలు లనుట సత్యము. నేను బ్రచేతసుని బదియవ కుమారుడను. నే నసృతమాడువాడను గాను. ఈ బాలకు లిరువురు నీ తనయు లనుట యెంత తథ్యమో నా యీ పలుకులు గూడ నంత యథార్థములు. అనేకవత్సరముల పర్యంతము నేను సమ్యగ్రీతిగా దీవ్రతప మొనరించిన వాడను. ఈ జనకజాత పాపవర్తనురాలే యైనచో నే నీమె చేతి జలముసు గూడ గ్రోలువాడను గాను." ఇట్లు పలికి యా మహర్షి కుశుని శ్రీరామచంద్రుని కుడి తొడమీదను, లవు నెడమ తొడమీదను గూరుచుండబెట్టి తానా పరమపురుషుని యెదుట నుపవిష్టు డయ్యెను. శ్రీరామచంద్రుడును సాదరముగా నా బాలకుల నాలింగను జేసికొని వారి శిరములను మూర్కొనెను. బృహదాకారుడై యున్న లవుని శిరముపై గరము నుంచి యథాపూర్వముగా నాతని నత్యంత వామనాకారుడగు బాలకునిగా నొనరించివైచెను.

పిమ్మట రఘునందనుడు చెక్కుచెదరని రెండు బాహువులతో విలసిల్లు జనకజాతను గాంచి యేమియు నెఱుగని వానివలె నెదుట

నున్న లక్ష్మణుని సంబోధించి, లక్ష్మణా! పూర్వము నాకు జూపుటకై నాయాజ్ఞననుసరించి నీవు సీతా భుజమును ఖండించి తెచ్చియుంటివి గదా! దానిని సురక్షిత మొనరించి యుంటివేని శీఘ్రముగా నిచ్చటకు గొనిరమ్ము. అని యతని కాదేశించెను. అంతట లక్ష్మణు డట్లేకాక! యని చని పేటికలో బదిలపఱచి యుంచబడిన సీతాభుజమును దెచ్చి శ్రీరామచంద్రునకు జూపెను. ఐదేండ్లకాల మతిక్రమించినను జెడక మాంసలమై మనోహరమై సీతాభుజ సదృశమై వెలుగొందు నాభుజమును గాంచి యచ్చటనున్నవా రెల్లరు నత్యంతాశ్చర్య చకితులైరి. పిమ్మట సభాసదు లెల్లరు నవలోకించుచుండగా దొల్లి విశ్వకర్మచే రచింపబడిన యాసీతాభుజము క్షణకాలములో నంతర్హితమై పోయెను. ఆ కౌతుకము నవలోకించి సభాస్తారు లెల్లరు నెంతయు నబ్బురపడిపోయిరి. అంతట విస్మయావిష్టమానసుడై శ్రీరామచంద్రుడు వాల్మీకి మహర్షికి బ్రణమిల్లి యిట్లు పలికెను." మునివరేణ్యా! పరమపవిత్రములైన మీవలుకులచే నాకు బ్రత్యయము గలిగినది. తొల్లి లంకా నగరమునందు గూడ నేను సీతయొక్క పవిత్రతను గుఱితించియుంటిని. నాడు దేవతల సమక్షమున దన పవిత్రతను బ్రకటించికొన్న మీదటనే యీసీతను నేను గృహమున జేర్చికొంటిని. ఆయీ సీతను బరమ పవిత్ర వర్తనురాలని యెఱిగియుండియు లోకాపవాదనమునకు వెఱచి మున్ను మీయాశ్రమ ప్రాంతమున దిగవిడిచితిని. నాయీ యపరాధమును మన్నింతురు గాక! కుశుడు నావలన బొడమినవాడనియు, లవుడు సీతాశాపభీతిచే మీచే సృజింపబడిన వాడనియు నేనెఱుగుదును. అయినను నిచ్చట జేరిన జనులకెల్లరకును బ్రత్యయము గలిగించుటకై యీసభలో మీసమక్షమున సీత తన నిర్దోషిత్వమును బ్రకటించి కొనుచు శపథము సేయవలెనని కోరుచున్నాను. పరమపవిత్ర వర్తనురాలని వెల్లడియైనమీదట నేనీమెను స్వీకరింతును. ఇట్లు పలికి రాఘవు

దూరకుండెను. సీత సేయు శపథము నాలించుటకై కుతూహలాయత్త చిత్తులై సభాసదు లెల్లరు నామెవంక కవలోకించుచుండిరి.

అప్పుడు పట్టువస్త్రమును దాల్చియున్న జనకజాత యా సభా మధ్యమున మొగము మీదికెత్తికొని చూపులు వాల్చికొని దోయిలి గట్టుకొని 'అమ్మా! భూదేవీ! నేను శ్రీరామచంద్రుని దక్క నన్య పురుషు నెన్నడును మానసికగానైన దలపోసి యెఱుగనిదాన నేని నీలో బ్రవేశింప నాకు వివరమును బ్రసాదింపుము' అని శపథ మొన రించెను. అట్టులామె శపథము సేసినతోడనే భూతలమునందు బెద్ద వివర మేర్పడెను. ఆవివరమునుండి మనోహరాకారమై, మహాశ్చర్య జనకమై, మార్తాండప్రభాభాసమానమై, మహాసర్పములచే మోయ బడు పరమోజ్వలమైన సింహాసనము వెలికి వచ్చెను. భూదేవి తన ముద్దుకొమరితె యగు సీతను స్వాగతవచనము లాడుచు సానందముగా రెండు చేతులతో జేరదీసి యక్కున గదియించి యాలింగనము జేసికొని యా సింహాసనముపై గూరుచుండబెట్టెను. నూతన వస్త్రములు, నాభరణములు, పూలమాలికలు, సుగంధద్రవ్యములు మున్నగువానితోడ నామె నానందము మీఱ నారాధించి చామర ముతో వీవసాగెను. అప్పుడా సింహాసనము క్రమక్రమముగా రసాతల మునకు బోన నారంభించెను. అట్లు రసాతలమున బ్రవేశించు సీతా మహాదేవిని గాంచి యంబరవీధి నాక్రమించియున్న యమరకాంత లెల్లరు నానందము మీఱ నామెపై పూలవానలు గురియించిరి. మఱియు మఱియు సాధువాదములు పలికిరి. సీతాశపథము నవలో కించి భూమ్యాకాశములందలి స్థావరజంగమాత్మకలోక మంతయు బరమాశ్చర్య చకిత మయ్యెను. నరులు, వానరులు ననేక విధములగు భావములకు లోనైరి. కొందఱు చింతాక్రాంతులైరి, కొందఱు ధ్యానా వస్థలో మునిగిరి కొందఱు శ్రీరామచంద్రుని దెసకు జూచుచుండిరి.

కొందఱంతర్హితురాలగుచున్న సీతామహాదేవి ననిమేషదృక్కులతో నవలోకించుచుండిరి. క్షణకాలము చరాచరాత్మక ప్రపంచమంతయు స్తంభీభావము వహించెను. లోకమంతయు సమ్మోహితమైపోయెను. అంతట రఘునందనుడు సంభ్రమము మీఱ సింహాసనమునుండి క్రిందకు భూమికి యెడమచేతితో రసాతలమున ప్రవేశించుచున్న సీతామహాదేవి హస్తమును బట్టుకొని నిలిపి భూదేవి నీవిధముగా ప్రార్థించెను.

"అమ్మా! నీ వెల్ల లోకములకు నివాసస్థానమవు. జగదేక మాతవు. అనయము మహాసిరిముపై విరాజిల్లుదానవు. నీవు పుణ్య స్వరూపిణివి. జనములకు ధనముల నొసగు తల్లివి. నీగర్భమునుండి మహౌషధులను వెలిబెట్టి లోకమును దనియింపజేయుచున్నావు. నీవే దుర్గాదేవివి. నీవే స్వరాదేవివి. నీవే విష్ణుప్రియ యగు మహాలక్ష్మివి. నీవే యిప్పుడిచ్చట నా మహాశక్తివి. నిన్ను నేనే సృజించితిని. నీ యుదరమునుండి వెలికొట్టి సమస్తధాతువులను జనుల కర్పించుచున్నావు. సూక్తములు. నసూక్తములు నగు సమస్తకర్మము లందును నీవే క్షమాస్వరూపిణివై ప్రకాశించుచున్నావు. ఈ జనకజాత నీ కొమరిత. నీ విచ్చట నాకత్తగారవు. నీవింతకు మున్ను గన్యాదానము జేసియుండలేదు. కావున నాకిప్పుడానందము మీఱ గన్యాదానము సేయుము. దేవీ! నాయెడల బ్రసన్నురాలవు గమ్ము. కాకున్న నీపై నాకు క్రోధ ముదయించును."

ఇట్లు రఘునందనుడు వేడికొనుచున్నను నా పరమపురుషుని వేడికోలును వినదోయి సతిక భూదేవి జనకజాతను రసాతలమునకు గొనిపోవుచునే యుండెను. నారీసహజమైన కన్యకాస్వభావము కారణముగా నామె రాఘవుని సవినయప్రార్థనను నాలింప నిచ్ఛగించలేదు. తనప్రార్థనను నామంతయు నిరసించుక వెడలిపోవుచున్న యామెను

గని శ్రీరామచంద్రు డొక్కమాఱుగా గనుదోయి జేవురింప నతి తరాగ్రహవ్యగ్రమానసుడయ్యెను. 'లక్ష్మణా! శీఘ్రముగా ధనువు నిటు దెమ్ము! ఈ భూదేవిని నావాడి యలుగున శిక్షించెదను' అని లక్ష్మణున కాదేశించెను. వెంటనే లక్ష్మణుడు వింటిని దెచ్చి యన్న కందించెను. తోడనే రాఘవుడు వింట నారి నెక్కించి శరమును సంధించెను. ఆ తరుణమున బ్రచండ వాయువులు వీవదొడగెను. లవణసముద్రమంతయు నెంతయు గలగుండుపడసాగెను. దివినుండి భువిపై నుల్క లూడిపడజొచ్చెను. ఎల్ల దిక్కులయందును ధూళి గ్రమ్మనారంభించెను. త్రాహి! త్రాహి! రక్షింపుము అని మొఱ పెట్టుచు ధరణి యంతయు గంపించెను. అంతట భూదేవి యడలి రెండు చేతులతో జనకజాత నెత్తికొని వచ్చి శ్రీరామచంద్రుని యొడిలో గూరుచుండబెట్టెను. ఆ మహాపురుషుని చరణకమలములపై సిరసు నుంచి నమస్కరించెను. ఆ సమయమున నంబరమునందు దేవదుందుభులు మొరసినవి. దేవతలు సంతోషము మీఱ సీతా రాములపై బూలవానలు గురియించిరి. అప్పుడు శ్రీరామచంద్రుడు శాంతించి చేతిలోని శరచాపములను బరిహరించి స్వహస్తముతో దన చరణములపై వ్రాలియున్న భూదేవిని లేవనెత్తి గారవించెను. ఆ భూదేవియు మాఱుమాఱు రాఘవునకు బ్రణమిల్లి యాతని బ్రస న్నుని జేసికొనెను. తాను దెచ్చిన దివ్యసింహాసనమును సీతామహా దేవి కిచ్చివైచెను. ఆమెను బలువిధముల స్తుతించెను. ఆమెచే బూజల నందుకొనెను. రాఘవుని కడ సెలవుగొని క్షణకాలములో నామె యంతర్హితురాలయ్యెను.

ఆ తరుణమున జను లెల్లరు సీతకు బునర్జన్మము ప్రాప్తించి నట్టులుగా దలపోసిరి. జయజయధ్వానములు సేయుచు వేఱువేఱుగా నామెను బూజించిరి. రాఘవుడా తరుణమున నానందము మీఱ

నెన్నియో దానము లొనరించెను. ఎల్లయెడల నవవిధవాద్యములు ప్రమోగినవి. వారకాంతలు చాతురతర నృత్యములు సేసిరి. వంది మాగధులు ప్రబంధముల గానము జేసిరి. గంగానది కీవలి తటమున నేప్రదేశమున జనకజాత శపథ మొనరించెనో, యా ప్రదేశమున సీతాకుండ మనుపేర నొక తీర్థ మేర్పడెను. సీతామహాదేవియొక్క నిట్టూర్పులు గారణముగా నాకుండమందలి పరమపవిత్రమైన జల మెల్ల వేళల నగ్నిసంతప్త మయినయట్టులు వేడిగా నుండును. స్మరించి నంత మాత్రమున నా సీతాకుండము సమస్తభయములను హరించును. తమ మగల యాయుర్వృద్ధిని గోరు స్త్రీలా కుండమును దప్పక సేవింపవలయును.

అనంతరము మనోహరవస్త్రాలంకార విభూషితు లగు తనయులతోడను, ప్రియురాలగు విదేహరాజకుమారితోడను గూడి శ్రీరామచంద్రుడు సానందముగా నవభృథస్నాన మాచరించెను. ఈ విధముగా నిర్విఘ్నముగా నూఱు యజ్ఞములను బూర్తిగా నాచరించి పిమ్మట సమ్మదము మీఱ లవునకు యథావిధిగా జాతకర్మాది సంస్కారములను సంపన్నము జేసెను. దేవతలను బూజించెను. అనేకదానము లొనరించెను. మునులను బూజించెను. మహారాజులను గారవించెను. సుమేధను, జనకభూపతిని సేవించెను. సెల వొసగి ఋషులను, ఋత్విజులను వీడుకొలిపెను. ధనధాన్యాదికము నొసగి బ్రాహ్మణాదులను సంతుష్టుల గావించెను. పిమ్మట వారికి గూడ వెడలిపోవ సెలవొసంగెను. అనంతరము సామంతరాజులతోడను, కుమారులతోడను, జనకజాతతోడను, సోదరులతోడను గూడి యయోధ్యానగరమున కరిగెను. గజేంద్రము నధిరోహించి యేగుదెంచు రాఘవునకు బురస్త్రీలు నీరాజనము లర్పించిరి. సీతను, తనయులను దోడుకొని శ్రీరామచంద్రుడు నిజగృహమున బ్రవేశించెను. ఆ సమయమున నయోధ్యలో మహోత్సవములు సేయబడెను. పుర

వాసులు చిరకాలమునకు, సీతామహాదేవిని గాంచి పరమానందము నొందిరి. పిమ్మట రాజవర్గమును గూడ దగిన విధముగా బూజించి వారిని, సుమేధా జనకులను సెల వొసగి సాదరముగా వీడుకొలిపెను. అనంతరము తనయులతోడను, జనకజతోడను, సోదరులతోడను గూడి రఘునందనుడు చిరకాలము యథాపూర్వకముగా సమస్త సుఖ సంపదల దులదూగుచు గాలమును గడపెను.

శ్రీరామచంద్రుడొక కల్పమున సీతామహాదేవితోడ గూడి పదమూడువేల సంవత్సరముల పర్యంతము రాజ్యమేలెను. మఱియొక కల్పమున బదునొకండు వేల సంవత్సరముల పదునొకండు దివసముల పర్యంతము సప్తద్వీపవతియగు వసుంధరను బాలించెను. వేఱొక కల్పమున బదివేల పదునందల సంవత్సరముల పర్యంతము రాఘవుడు రాజ్యపాలనము సేసినట్లు పెద్దలు చెప్పుదురు.

అ ష్ట మ స ర్గ ము స మా ప్త ము.

—) 0₀0 (—

# న వ మ స ర్గ ము

## — శ్రీరామాదుల తనయుల యుపనయన సంస్కారములు —

శ్రీ రామదాసుడు విష్ణుదాసున కీ విధముగా వివరించును.

అనంతరము కొంతకాలమునకు నూర్మిళయు, మాండవియు, శ్రుతకీర్తియు గర్భవతులైరి. సీతామహాదేవి వారి కానందపూర్వకముగా గర్భదోహదక్రియల నాచరించెను. శ్రీరామచంద్రుడు వారికి బుంసవనాది సంస్కారములను సంపన్నము గావించెను. ఆ సమయమున భార్యతోడను, బంధువులతోడను, జనకమహారాజును గూడ రావించెను. పురకాంతలెల్లరును వారి కుతుకముల నెఱిగి పూరింప

దొడగిరి. రఘునందనుడు పలువిధములగు నుత్సవముల నొనరించి, నవ్యవస్త్రాభరణాదికములతో వారి నానందపఱచెను. పిమ్మట గొంత కాలమున కూర్మిళ మనోహరాకారుడగు నొక్క బాలకుని గాంచెను. ఒక్క శుభదినమున మాండవియు నొక్క కుమారుని గనెను. పిమ్మట శ్రుతకీర్తియు కవలపిల్లలను గాంచెను. కాలాంతరమున నూర్మిళకు మఱియొక తనయుడును, మాండవికి మఱియొక తనయుడును ప్రాదుర్భవించిరి. శ్రీరామచంద్రుడు నా తరుణమున కులగురువగు వసిష్ఠుని, శిష్టులగు బ్రాహ్మణులను రావించి మహోత్సవపురస్సరముగా యథావిధిగా నా బాలకులకు వేర్వేరుగా జాతకర్మాది సంస్కారముల నాచరింపజేసెను.

లక్ష్మణుని మొదటి కుమారున కంగదుడనియు, రెండవ కుమారునకు చిత్రకేతు డనియు నామకరణము సేయబడెను. మాండవి యొక్క మొదటి తనయునకు పుష్కరుడనియు, రెండవ తనయునకు తక్షుడనియు పేర్లు పెట్టబడెను. శ్రుతకీర్తికి కలిగిన కవలపిల్లలలో మొదటివాడు సుబాహు వనియు, రెండవవాడు యూపకేతువనియు పేర్కొనబడెను. ఈ నామకరణ మహోత్సవములను స్వయముగా కులగురువగు వసిష్ఠుడు నిర్వర్తించెను. ఈ బాలకు లందఱు నేకకాలమున గాక వేర్వేఱు సమయములందు ప్రాదుర్భవించిరి. అందఱి జన్మకాలములందును దివిపై నిలిచి దేవత లానందపూర్వకముగా దుందుభులను మ్రోగించి యాయా మాతాపితరుల మీఁదను సూర్యప్రభాభాసమానులగు బాలకులమీఁదను పూలవానలు కురియించిరి. రాజాజ్ఞచే రాజద్వారమున మహోత్సవము సేయబడెను. నవవిధ వాద్యములు మ్రోగెను. అచ్చరలాడిరి. తూర్యములు మ్రోగించబడెను. వందిమాగధులు స్తోత్రపఠనములు సేసిరి. పతాకలతోడను, ధ్వజములతోడను, తోరణములతోడను నగరమంతయు చక్కగా నలంకరింపబడెను. మిత్రులు, భూపతులును వేర్వేరుగా నూతనవస్త్రా

భరణాదికములతో శ్రీరామాదులను బూజించిరి. శ్రీరామాదులు బ్రాహ్మణుల కనేకదానము లొనరించి రుచ్యములగు భోజనపదార్థములచే వారిని సంతృప్తుల గావించిరి. శ్రాద్ధము లాచరింపబడెను.

ఈవిధముగా శ్రీరామాదుల తనయు లెనమండుగురును జంద్ర బింబములను బోలు వదనములు గలవారై తల్లులచేత లాలింపబడుచు హాయిగా దినదిన ప్రవర్ధమానులు గాజొచ్చిరి. సువర్ణాభరణ విభూషితులై యాబాలకులు గొలుసులచే బంధింప బడిన బంగారు దోలికలలో జూడ ముచ్చట గొలుపుచు విరాజిల్లుచుండిరి. వారి ఫాలదేశమున ముత్యాల జాలరులతో విలసిల్లు బంగారు రావియాకు పదకములు ప్రకాశించుచుండెను. కంఠదేశమున మణిరత్న ఖచితములై, సువర్ణమయములైన పులిగోరు పదకములు కాంతు లీనుచుండెను. కర్ణములందు సువర్ణమణిమయములైన మువ్వల కటిసూత్రములు మురువు గొలుపుచుండెను. పాదముల రవళించు మణిమయమంజీరములు నయనాభిరామములై నలువు మీఱుచుండెను. ఆబాలకులు పాలదంతములతో జిఱునవ్వులు నవ్వి మాతాపితరుల నానందడోలికల నూగులాడ జేయుచుండిరి. ఆసమయములందాయా సంస్కారములచే సంస్కరింపబడి యాబాలకులు ముంగిళ్ళలో బ్రాకుచు ముద్దులు మూటగట్టుచుండిరి. అనేక విధములైన యాట పాటలతోడను, శిశు సహజములైన చపలచేష్టల తోడను, ముఖచుంబనముల తోడను, కృత్రిమ యుద్ధములతోడను గునగున సాగునడకలతోడను, ముద్దు ముద్దు మాటలతోడను నెల్లవారల మనముల నలరించుచుండిరి.

ఈవిధముగా దినదిన ప్రవర్ధమానులై యా బాలకు లొకనాడు నవ్యవస్త్రాలంకారములను దాల్చి సానందముగా సభాస్థలి కేగుదెంచి శ్రీరామచంద్రునకు బ్రణమిల్లి సింహాసనములపై నాసీనులైరి. ఇట్టు

లుండగా నొక్కనాడు శ్రీరామచంద్రుడు సభలో నుపవిష్టుడైన వసిష్ఠమహర్షిని గని గురువరేణ్యా! యథాక్రమముగా మీరీ బాలకుల శుభాశుభ లక్షణములను బరిశీలించి యెఱుగజెప్పు డని యా మహానుభావుని ప్రార్థించెను. అంతట వసిష్ఠమహర్షి యితరవిప్రులతో గూడి తొలుత కుశుని రావించి యాతని లక్షణములను బరికించి శ్రీరామచంద్రునితో నిట్లు నొడివెను.

"శ్రీరామచంద్రా! ఈ పిల్లవా డయిదింట సూక్ష్మతాలక్షణము గలవాడు. అనగా నితని చర్మము, కేశములు, వ్రేళ్ళ దంతములు, వ్రేళ్ళకణుపులు నీయైదును సూక్ష్ములై శోభిల్లుచున్నవి. ఈ సూక్ష్మత్వ మితడు మహాశ్రీమంతు డగుటను సూచించును. ఇత డయిదింట దీర్ఘతాలక్షణము గలవాడు. అనగా నితని భుజములు, నయనములు, హనువులు, జానువులు(మోకాళ్ళు) నాసికయు దీర్ఘములై తేజరిల్లుచున్నవి. ఈదీర్ఘతాలక్షణ మితడు దీర్ఘాయుష్మంతు డగుటను ప్రకటించును. ఇత డేడింట నెఱ్ఱదనము గలిగి వెలుగొందుచున్నాడు. అనగా నితని కరములు, చరణములు, నేత్రాంతములు, తాలువులు, నాలుక, క్రిందిపెదవి, నఖములు నీయేడు నెఱ్ఱదనము గలిగి యలరారుచున్నవి. ఈయెఱ్ఱదన మితడు రాజ్యభోగముల ననుభవించుటను దెలియ జేయుచున్నది. ఇత డాఱింట నౌన్నత్యలక్షణము గలిగి కన్నుల పండువు సేయుచున్నాడు. అనగా నితని వక్షస్థలము, నుదరము, ఫాలదేశము, మూపులు కరపుటలు, వదనము నీయాఱు నున్నతములై ప్రకాశించుచున్నవి. ఈయౌన్నత్య మితడు పరమైశ్వర్య సంపన్ను డగుటను వెల్లడించును. ఇతడు మూడింట హ్రస్వతాలక్షణము గలవాడు. అనగా నితని కంఠము, తొడలు, మగగుఱియు హ్రస్వములై (పొట్టివి) యలరారుచున్నవి. ఇది యొక శుభలక్షణము. ఇతడు మూడింట గాంభీర్యము గలిగియున్నాడు. అనగా నితని కంఠస్వరము, బలము నాభియు గంభీరములైనవి. ఇది

మఱియొక శుభలక్షణము. ఇతడు మూడింట వైశాల్యము గలిగి వెలుగొందుచున్నాడు. అనగా నితని లలాటము, కటిప్రదేశము వక్షస్థలము విశాలములై వెలుగొందుచున్నవి. ఈ వైశాల్యమితడు మహాతేజశ్శాలియు, మహైశ్వర్యసంపన్నుడు నగుటను సూచించును. ఈవిధముగా నితడు ముప్పదిరెండు శుభలక్షణములతో ముద్దులు గురియుచున్నాడు. మఱియు నితని యఱచేతిలో నొకరేఖ చూపెడు వ్రేలు మొదలు చిటికెనవ్రేలి పర్యంతము సాగిపోయినది. ఇది యితని దీర్ఘాయుష్యమును బ్రకటించును. ఇతని హస్తములు తాబేటి వెన్నువలె ఘనములై యున్నవి. పాదములు కోమలములై పరిఢవిల్లుచున్నవి. ఇది రాజ్యసూచకమగు శుభలక్షణము. అంతియేకాదు. ఇతని చరణములు మాంసలములై, యరుణములై, సమములై, సూక్ష్మములై, సమానగుల్ఫములు (చీలమండలు) గలవై, స్నిగ్ధములై చెలువారుచున్నవి. ఇది మహైశ్వర్యసూచకమగు మంచి లక్షణము. ఇతని చేతిలోని రేఖ లల్పములై, యరుణములై భాసిల్లుచున్నవి. ఇది యితడనయము సుఖవంతుడగుటను బ్రకటించును. ఇతని లింగము కృశమై, హ్రస్వమై యెసలారుచున్నది, ఇది యితడు రాజరాజేశ్వరుడగుటకు చిహ్నము. ఇతని పిఱుదులు, చీలమండలు, బలిష్ఠములై, వర్తులములై యున్నవి. ఇతని నాభి దక్షిణావర్తమై (కుడివైపునకు సుడిగలది) వర్తులమై యలరారుచున్నది. ఇది యితని పరమైశ్వర్యమును బ్రకటించును. ఎవని మూత్రము దక్షిణావర్తమై యేకధార గలిగియుండునో, యెవని వీర్యము మీనముతో, దేనెతో సమానమగు సుగంధము గలిగియుండునో, యతడు నరపతి యగును. దీర్ఘములై, మాంసలములై, స్నిగ్ధములై, వామావర్తలక్షణము గలవై, లంబమానములైన యితని భుజము లితనియందలి భూభారసహనసామర్థ్యమును బహిర్గత మొనరించుచున్నవి. ఇతని కరతలములందు శ్రీవత్సమును, వజ్రమును, చక్రమును, పద్మమును, గోదం

డమును, దండమును బోలిన రేఖలున్నవి. అవి యితడు స్వర్గలోకాధిపతి గూడ గాగలడని సూచించుచున్నవి. ఇతనికి ముప్పదిరెండు దంతములున్నవి. శంఖమును బోలు కంఠ మున్నది. క్రౌంచపక్షి యొక్కయు, దుందుభియొక్క యు, హంసము యొక్కయు, మేఘము యొక్కయు ధ్వనినిబోలు గంభీరమైన కంఠస్వర మున్నది. ఇవి యన్నియు నితని సర్వేశ్వరాధిక్యమును వెల్లడించుచున్నవి. ఇతని నేత్రములు మధువువలె బింగళవర్ణము గలిగియున్నవి. ఇతని లలాటమున నయిదు రేఖ లున్నవి. ఇతని యుదరము సింహోదరమువలె సన్నముగా నున్నది. ఈలక్షణము లితనిని సిరి యెన్నడు విడనాడదని తెలియజేయుచున్నవి. ఇతని పాదములం దూర్ధ్వరేఖలు గానవచ్చుచున్నవి. ఇతని శ్వాసము పద్మగంధము గలిగి భాసించుచున్నది. ఇతని కరములు, నాసికయు నత్యంతసుందరములై యలరుచున్నవి. ఇతడు సర్వవిధముల మహాలక్షణ సంపన్నుడు.''

ఈవిధముగా కుశుని లక్షణములను వివరించి పిమ్మట వసిష్ఠ మహర్షి క్రమముగా లవాదిబాలకుల లక్షణములను గూడ విశదముగా రాఘవున కెఱిగించెను. అప్పుడు రఘునందనుడు సంతసించి యామునిరాజును వస్త్రాభరణములతో బూజించి వీడుకొలిపి నిజమందిరమున కరిగెను.

శ్రీరామచంద్రుడు నిజమందిరమున బ్రవేశించునప్పటికి జనకజాత తన మాత యొసగిన దివ్యసింహాసనముపై మెత్తని దిండుల నానుకొని కూరుచుండి యద్దమును గరమున ధరించి యందు చంద్రబింబమును బోలు తన వదనమును జూచికొనుచుండెను. దాసికాజనులా బంగారుతల్లికి వింజామరముల వీచుచుండిరి. సఖియలు బహువిధంబుల సేవలు జేయుచుండిరి. శ్రీరామచంద్రుని యాగమనము నెఱిగి యామె తటాలున సింహాసనమునుండి క్రిందకు దిగెను. ఆ సమయమున రాఘవుడు బాలకులచే బరివేష్టితుడై యుండెను. అసని

యెడమచంకలో యూపకేతుకుసు, గుడిచంకలో నంగదుకును విరాజిల్లుచుండిరి. కుశలవులు ముందుండిరి. రాఘవుని వెనుక లక్ష్మణుడు తక్షుని, బుష్కరుని నెత్తికొని వచ్చుచుండెను. అతని వెనుక భరతుడు సువర్ణాభరణ విభూషితుడగు చిత్రకేతుని, సుబాహుని నెత్తికొని యాగమించుచుండెను. అతని వెనుక శత్రుఘ్నుడు శ్రీరామచంద్రుని యాయుధములను గొని మెల్లమెల్లగా నరుగుదెంచుచుండెను. ఈవిధముగా జనుదెంచుచున్న రఘునందను నవలోకించి పట్టువస్త్రముతో, రవళించు నందియలతో, జిఱుమువ్వల మొలనూలితో గలకలలాడుచున్న సీత యెదురుగా జని ముందు నడచుచున్న లవుని రెండు చేతులతో నెత్తికొని ముద్దిడికొని రెండవచేత గుశుని బట్టుకొని నడపించుచు రాఘవు ననుసరించి స్వస్థానమునకు జేరెను. సకియలచే బరివేష్టితురాలై సీత శ్రీరామచంద్రున కనేకసపర్యలు సేసి యాతని మనమును రంజింపజేసెను. రాఘవుడును సీతాసింహాసనముపై నాసీనుడై యొడిలోను, ముందుభాగమున బాలకులను గూరుచుండ బెట్టుకొని సీతకు జూపుచు వారిని ప్రేమముతో లాలించెను. పిమ్మట గులగురువగు వసిష్ఠుడు సెప్పిన బాలకుల శుభలక్షణములన్నియు నామె కెఱుగజెప్పెను. ఆమెయు నావిషయముల నాలించి పరమానంద మొందెను. అప్పు డూర్మిళచే పీవబడుచున్న వైదేహితో రాఘవుడు 'దేవీ! యీ యంగదుని, జిత్రకేతుని గొనిపోయి లక్ష్మణుని యొడిలో గూరుచుండ బెట్టుమని సవినోదముగా బలికెను. తోడనే యామె యా బాలకుల నెత్తికొని లక్ష్మణుని వంకకు సాగెను. అతడు లజ్జితుడై యటనుండి వెడలిపోవ నుంకించెను. వెడలిపోకుండ నతని బట్టి నిలుపు డని రఘునందనుడు మాండవిని, శ్రుతకీర్తిని నాదేశించెను. చిఱునగవులు నగుచు వారాతని బట్టి నిలిపి యుపవిష్టుని గావించిరి. అప్పుడు జనకజాత యాతని బిడ్డల నాతని యొడిలో గూరుచుండబెట్టెను. అట్లే భరతుని యొడిలో తక్షుని, బుష్కరుని,

శత్రుఘ్నుని యొడిలో సుబాహుని, యూపకేతుని గూడ గూరు
చుండ బెట్టెను. అప్పుడు రాఘవుడు మఱల సీతతో నూర్మిళాదులను
వీవనలతో వారివారి భర్తలకు వీవ నాదేశింపు మని సవినోదముగా
బలికెను. ఆపలుకు విని యూర్మిళాదు లటనుండి పాఱిపోవ నుంకించిరి,
పాఱిపోకుండ వారిని సకియలు పట్టి నిలువరించిరి. అప్పుడు సిగ్గిలుచు
వీవనలు చేతగొని యూర్మిళాదులు వారివారి భర్తలకు వీవ నారంభిం
చిరి. ఈవిధముగా రాఘవుడు మహీజాతతోడను, మఱదండ్రతోడను
గూడి భోజనవేళలందును, నూరక కూరుచున్న సమయములందు
నెన్నియో వినోదచర్యలను సాగించెను.

అనంతర మొకనాడు శ్రీరామచంద్రుడు కులగురువగు వసిష్ఠ
మహర్షిని రావించి కుశునకు, లవునకు నుపనయన సంస్కారము చేయ
వలె నని చెప్పెను. అట్లగాక! యని గురు నందులకు సమ్మతించెను.
పిమ్మట నొకశుభదినమున రాఘవుడు జ్యోతిష్కులను రావించి
వారితో మంత్రణ మొనరించెను. వారు కుశుని ప్రాయ మయిదేం
డ్లనియు, లవుని ప్రాయ మొక్కింత తక్కువ యనియు దెలిసికొనిరి.
గురు శుక్రబలములను బరిశీలించిరి. పంచాంగములను బరికించిరి.
అప్పుడు శ్రీరామచంద్రునితో వారిట్లు నొడివిరి. "రఘునందనా!
బ్రాహ్మణబాలకున కెనిమిదవ యేటను, క్షత్రియబాలకునకు బండ్రెం
డవ యేటను, వైశ్యబాలకునకు బదునాఱవ యేటను నుపనయన
సంస్కారము చేయదగు నని మహర్షులు సెప్పుదురు. బలమును గోరు
మహారాజతనయునకు జన్మకాలమునుండి యాఱవయేటను, గర్భగతు
డయినప్పటినుండి యేడవ యేటను నుపనయన మొనరింపవలయును.
బ్రహ్మవర్చస్సును గోరు బ్రాహ్మణ బాలకున కయిదవ యేటను,
బలమును గోరు క్షత్రియబాలకున కాఱవ యేటను, ధనమునుగోరు
వైశ్యబాలకున కెనిమిదవ యేటను నుపనయనము చేయదగు నని

శాస్త్రములు చెప్పుచున్నవి. కావున నో రఘునందనా! మీరు మీ తనయులకు గర్భగతు లయినప్పటినుండి లెక్కించి యాఱవ యేట నుపనయనము గావించుట మేలు. ముహూర్తమును గూడ వివరించు చున్న వార మాలకింపుము. నేటికి బదునైదవ దినమున గుశున కుప నయనము సేయ నెంతయో యనువైన ముహూర్తమున్నది.” ఇట్లు నొడివి వారూరకుండిరి. వారి పలుకుల నాలకించి రాఘవుడు సంత సించెను. ధనవస్త్రాదికములతో వారిని గారవించి వీడుకొలిపెను.

పిమ్మట లక్ష్మణుని బిలిచి యతని కిట్టు లాదేశించెను. లక్ష్మణా! నేటికి బదునైదవ దివసమున గుశున కుపనయనము సేయవలయును. తమతమ యంతఃపుర పరివారములతోడను, పౌరులతోడను, నాటికి ముందుగనే విచ్చేయవలసిన దని మునీశ్వరులకు, జనపతులకు, మిత్ర వర్గమునకు నాహ్వానపత్రికల నంపుము. మన యయోధ్యానగరము నలంకరింపజేయుము. కందకముల నేడింటిని శోధింపజేయుము. సౌధ ములకు, దేవమందిరములకు వెల్లలు వేయింపుము. చిత్తరువులను లిఖింపజేయుము. వివిధములైన పూజావిధానములకు వలయు నేర్పా టులు గావింపుము. ధ్వజములను స్థాపింపుము. పతాకలను బంధి పుము. ఎల్లయెడల దోరణములను గట్టింపుము. బంగారు వేదికలను నిర్మింపజేయుము. మండపముల నేర్పఱింపుము. గజములను, దురగ ములను, బల్లకులను నలంకరింప జేయుము. ఆవశ్యకమని తోచిన ప్రతియంశమును నేను చెప్పకున్నను నీవే విచారించి పూర్తి సేయింపుము.” ఈ రామాదేశము నాలించి యట్లకాక! యని లక్ష్మ ణుడు శీఘ్రముగా నన్ని యేర్పాటులును గావించెను.

అనంతరము శ్రీరామచంద్రుడు ముహూర్తదినమున దనయుల తోడను, జనకజతోడను, సోదరులతోడను, వారి భార్యలతోడను గూడి యభ్యంగస్నానమాచరించెను. అనేకవిధములైన యాభరణ

ములను, నూతనవస్త్రములను దాల్చెను. గురువును, మునులను బూజించి పుణ్యాహవాచన మొనరించెను. నాందీశ్రాద్ధము నాచరించెను. దేవతాప్రతిష్ఠ జేసెను. సప్తద్వీపములందలి మునులు, జనపతులును దమతమ యంతఃపురపరివారములతో, వాహనములతో, బలగములతో నయోధ్యకు విచ్చేసిరి. వారితో నయోధ్య కోలాహల భరితమై కలకలలాడుచుండెను. ముహూర్తసమయమున బ్రాహ్మణ బృందముతో గూడి వసిష్ఠమహర్షి శ్రీరామచంద్రునకు, గుశునకు నమమ నూతనవస్త్రపు దెఱను బట్టి సుస్వరముతో, మధురాక్షరములతో నీ విధముగా మంగళవాచన మొనరించెను.

శ్లో॥ ధ్యాత్వా శ్రీగణనాయకం విధిసుతాం శంభుం విధిం మాధవం
లక్ష్మీం శైలసుతాం విధేస్తు దయితామింద్రం సురాంస్తాన్ గ్రహాన్
పుణ్యాన్ స్థావరసమ్నగాశ్చ సుమునీన్ స్వీయాం కులస్యాంబికాన్
తాతం మాతర మాదరేణ వటవే భూయాత్సదా మంగళమ్॥

శ్లో॥ తదేవ లగ్నం సుదినం తదేవ తారాబలం చంద్రబలం తదేవ,
విద్యాబలం దైవబలం తదేవ సీతాపతే ర్యత్స్మరణం విధేయమ్॥

అనగా శ్రీమహాగణాధిపతియొక్కయు, సరస్వతీదేవియొక్కయు శంకరునియొక్కయు, విధాతయొక్కయు, మాధవునియొక్కయు, మహాలక్ష్మియొక్కయు, నింద్రునియొక్కయు, దేవతలయొక్కయు, గ్రహములయొక్కయు, బవిత్రములైన పర్వతములయొక్కయు, నిలువేలుపగు నంబికయొక్కయు, దల్లిదండ్రులయొక్కయు నాదర పూర్వకమైన సంస్మరణ మీ వటువున కెల్లవేళల మంగళదాయక మగుగాక!

సీతారాముల సంస్మరణమే శుభలగ్నము. అదియే శుభదినము అదియే తారాబలము. అదియే చంద్రబలము. అదియే విద్యాబలము అదియే దైవబలము. అని భావము.

పై మంత్రములను బఠించి మంగళవాద్యములు మ్రోగుచుండ, దూర్యధ్వనులు సెలగుచుండ నోంకారఘోషములతో గులగురువగు వసిష్ఠుడు తెఱను దొలగించెను. బాలకుని రాఘవుని యొడిలో గూరుచుండబెట్టి యథావిధిగా హోమవిధు లాచరించెను. వటువుచే గౌపీనమును, దండకమండలములను ధరింపజేసెను. మొలకు బంగారు మౌంజీమేఖలను (ముంజగడ్డితో జేయబడిన మొలత్రాడు.) బంధించెను. కృష్ణాజినమును ధరింపజేసెను. పిమ్మట కుశునకు గాయత్రీ మంత్రము నుపదేశించెను. క్రింది విధముగా బ్రహ్మచర్య వ్రతనియమముల నుపదేశించెను.

“కుమారా! శౌచవిధిని నిర్వర్తించుకొన్న మీదట నాచమనము సేయవలయును. దంతధావన మొనరించుకొని మొగము గడిగికొని మలమూత్రవిసర్జనము గావించికొని స్నాన మొనరించికొని ప్రాణాయామము సేయవలయును. ప్రాతస్సాయంసమయములందు విధిగా సూర్యున కర్ఘ్యప్రదానము సేయవలయును. అనంతర మగ్నికార్య మొనరించి బ్రాహ్మణులకు వందనములు సేయవలెను. ఫలానిగోత్రము వాడ నని పలుకుచు బ్రణమిల్లవలెను. మేఖలను, యజ్ఞోపవీతమును, దండమును, కృష్ణాజినమును నిరంతరము ధరింపవలెను. ఉత్తములగు బ్రాహ్మణుల యిండ్ల కడ భిక్షాటనము సేయవలయును. వాఙ్నియమము బాటింపవలెను. గురువు ననుమతి వడసి యేవగించుకొనకుండ నన్నగ్రహణము సేయవలెను. శ్రాద్ధకాలమునందు, నాపత్కాలమునందు నొక్కపూట భోజనము సేయవలెను. పగటివేళ బ్రాహ్మణుడు రెండుమాఱులు భోజనము సేయరాదు. అగ్నిహోత్రవిధి నాచరించు బ్రాహ్మణుడు ప్రాతఃకాలమున, సాయంసమయమున మాత్రము భోజనము సేయవలెను. మద్యమును, మాంసమును, జీవహింసను, జలమునందు సూర్యబింబదర్శనమును, స్త్రీసంపర్కమును, నిలువ

యున్న, యుచ్ఛిష్టమైన (ఎంగిలి) పదార్థమును, బరనిందను బరిహరింపవలెను. గురువు నెదుట నిరంకుశముగా ప్రవర్తింపరాదు, మహానుభావులనియో, మహాప్రభువు లనియో యేదియో యొక విశేషణము లేకుండ గురువు నామము నుచ్చరింపరాదు. గురునిందాతిరస్కారములు సాగు తావున జెవులు మూసికొనవలెను. లేక యటనుండి వెడలిపోవలెను. తల్లితోగాని, మేనయత్తతోగాని, చెల్లెలితోగాని యేకాంతవాసము సేయరాదు. ఇంద్రియములు బలవత్తరములైనవి. అవి మహావిద్వాంసులను సైతము మోహసముద్రమున ముంచివేయును.

వసిష్ఠమహర్షి యిట్టి విధుల నన్నిటినో వటువున కుపదేశించెను. ఎన్నియో దానములు సేయించెను. అనేకములగు నుత్సవములు సేయించుచు దల్లితోడ నా వటువును భుజింపజేసెను. యథావిధిగా బలాశమును (మోదుగు) బూజింపజేసెను. కుశునిచే గడపట నావాహిత దేవతల విసర్జనము జేయించెను. ఆతరుణమున జనపతులు, జనకభూపతియు శ్రీరామచంద్రుని బూజించిరి. భూసురులు, భూమిపతులు మొదలు చండాలుర పర్యంతము నెల్లవారలను రాఘవుడు ధనవస్త్రాదికము నొసగి సంతుష్టుల గావించెను. ఈవిధముగా ననేక మహోత్సవములతో నొక మాసము కాల మతిక్రమించిన మీదట నా జనపతులు మున్నగువారి కందఱకు వారివారి నెలవుల కరుగ సెల వొసగి యంపివైచెను.

ఈవిధముగనే రఘునందనుడు కాలాంతరమున మఱల సాదరముగా నెల్లదిక్కులనుండియు రాజబృందములను రావించి లవునకు గూడ నొక శుభదినమున నుపనయన సంస్కారమును సంపన్నము గావించెను. అనంతరమా కుశాగ్ర బుద్ధులగు బాలకు లిరువురును గురువుకడ జేరి వేదాధ్యయన మొనరించిరి. శ్రీ రాఘవుని బాల్య కాలములందు నక్కంగల బాలురకు గూడ గ్రహములు ముఖ్యముగ

సంస్కారములు జరిగించెను. ఆ సమయములందు గూడ బ్రాహ్మణులు, మహారాజులు మున్నగు వారిని రావించి మహోత్సవములు సేయించెను. ఒకరి విషయమున నాధిక్యమును జూపలేదు. మఱియొకరి విషయమున న్యూనతను బ్రదర్శింపలేదు. పిమ్మట నాబాలకు లందఱును బ్రహ్మచర్యవ్రతము నవలంబించి గురుసన్నిధానమున జేరి చక్కగా వేదాధ్యయనము గావించిరి. అనంతరమా బాలకుల తోడను జనకజాతి తోడను గూడి శ్రీరామచంద్రుడు కుమారస్వామి తోడను, గణపతి మున్నగు వారి తోడను, పార్వతీ దేవితోడను, గూడియున్న పరమశివునివలె బ్రకాశించెను.

వేదాధ్యయనము పూర్తియైనమీఁదట నా బాలకులు గురువును, మంత్రులను, సైన్యమును, వెంట నిడుకొని, తీర్థయాత్రలు సేయ నరిగిరి. భూమండలము నందు భారతఖండమున నే యే పుణ్యతీర్థములు గలవో, యవి యెల్ల సేవించి యైదుమాసములలో దమ నగరమునకు మఱల వచ్చిరి. ఆ బాలకుల యాగమనము నెఱిగి లక్ష్మణుడు నగరి నంతయు నలంకరింపజేసి పట్టపుటేనుగును ముందిడుకొని వారి కెదురుగా జనెను. వారును లక్ష్మణుని గాంచి యతనికి బ్రణమిల్లిరి. అతడు వారి నానందము మీఱ గౌగలించికొనెను. అనేకములగు మహోత్సవములతో బాలకు లయోధ్యలోని తమ గృహమున కరిగిరి. మార్గమధ్యమున మేడలపై నిలిచి పురస్త్రీలు వారిపై బూలవానలు గురియించిరి. కొందఱు స్త్రీలు దీపములతో వారికి నీరాజనము లర్పించిరి. పిమ్మట నాబాలకులు సభాస్థలికి జేరి, రాఘవునకు బ్రణమిల్లిరి. అతఁ డానందముతో వారిని గౌగిలించికొనెను. పిమ్మట వారు సీతామహాదేవి మందిరమున కరిగిరి. అంతలో సీతయు, నూర్మిళయు, మాండవియు, శ్రుతకీర్తియు వడిగా దధ్యోదనముల తోడను, దీపములతోడను, తైలపక్వములైన పక్వాన్నముల తోడను, తాంబూలముల తోడను, లవణముల తోడను, భూషణముల

తోడను, (మినుగులు.) జలకలశములతోడను నాదరము మీరఁ వారికి నీరాజనము లిచ్చిరి. పిమ్మట నా బాలకు లందఱును, వేలు వేలుగా సీతామహాదేవికి నమస్కారములు జేసిరి. పిమ్మట కౌసల్యకు, సుమిత్రకు, కైకేయికి ప్రణమిల్లి తమ తల్లులకు నమస్కరించిరి. ఆ తరుణమున వా రెన్నియో దానములు చేసిరి. వేలువేలుగా నెంగఱకో బ్రాహ్మణులకు భోజనములు పెట్టిరి. ఈవిధముగా శ్రీరామ చంద్రుని భవనమున నెన్నియో మహోత్సవములు సేయబడెను.

అనంతరమా బాలకు లందఱును, దివ్య వస్త్రాభరణములను దాల్చి రథముల నధిరోహించి మంత్రిబాలకులను, సైన్యమును వెంట నిడుకొని, యయోధ్యా నగరమునందలి రాజమార్గము లందును నాలుగు మార్గముల కూడలు లందును, నారామములందును, నుప వనములందును, నరణ్య ప్రదేశములందును, నదీతీరములందును సానం దముగా బరిభ్రమించిరి. ఈవిధముగా సాకేత నగరమునందు, మహా రాజగు శ్రీరామచంద్రుడు బాలురతోడను, సీతతోడను, సోదరుల తోడను, గూడి చిరకాలము సుఖసంపదల దేలియాడెను.

శిష్యా! విష్ణుదాసా! యీవిధముగా నీకు జన్మకాండమును వివరించితిని. కుశలవాదుల జన్మగాథలను వర్ణించి తెలియజెప్పితిని. ఈకాండము మనోహరమైనది. పవిత్రమైనది. ఆనందదాయకమైనది. పుత్రపౌత్రులను బ్రసాదించునది. సమస్త సుఖములను జేకూర్చునది.

పావనమైన యీజన్మకాండమును భక్తితో నాలకించిన స్త్రీలకు భర్తృవియోగ మెన్నడును సంభవించదు. గ్రామాంతరము నకో, దేశాంతరమునకో, తీర్థస్థలములకో వెడలిపోయి చిరకాలముగా రాకున్న వారి యాగమనమును గోరువారీ జన్మకాండము నవశ్యముగా బఠింపవలెను. భావికార్యములు సత్వరముగా సిద్ధింపవలెనని కాంక్షిం చువారు గూడ నీ జన్మకాండమును దినదినము పారాయణము సేయ

వలెను. మొదటి దినమున నొక పర్యాయము, రెండవదినమున రెండు మాఱులుగా వృద్ధిగావించుచు దొమ్మిది దినములు పారాయణ మొనర్చి పదియవనాటినుండి దినమున నొకమాఱు పఠనము దగ్గించు కొనుచు మఱియు దొమ్మిది దివసములు పారాయణము సేయవల యును. అనగా జివరి దినమున నొక్కమాఱే పారాయణము జేయ వలసివచ్చును. ఇట్లు లాచరించినవారి సమస్తకామితములును సిద్ధించును. ఈక్రమమున నొక సంవత్సరకాలము పఠనమొనరించినవా డపుత్రుడైన బుత్రుని బడయును. ఈజన్మకాండ శ్రవణమువలన బుత్రులను గోరువాడు పుత్రులను, ధనమును గోరువాడు ధనమును, గామితములను గోరువాడు కామితములను బడయును. ఆనంద రామాయణ మధ్యమందున్న యీజన్మకాండము తనయులను బ్రసాదించునది. దీని పారాయణము, శ్రవణము జేయు మానవుడు శీఘ్రక తనయుని బడయును.

నవమసర్గము సమాప్తము—జన్మకాండము సమాప్తము.

—()—

# శ్రీమదానంద రామాయణము

## వివాహ కాండము

### ప్రథమసర్గము

### స్వయంవరసందర్భమున శ్రీరామచంద్రుడు భూరికీర్తిమహారాజు నగరమున కరుగుట

శ్రీరామదాసుడు విష్ణుదాసున కిట్లు వివరించును.

ఒకనాడు శ్రీరామచంద్రుడు మంత్రిబృందపరివేష్టితుడై మనోహరచ్ఛత్ర సమలంకృతమైన మణిమయ సింహాసనముపై నా

సీనుఁడై యుండెను. ఆతరుణమున తమ ప్రభుని సందేశమును రాఘ
వున కెఱిగింప నొక దూత సభాస్థలి కేగుదెంచెను. మహారాజా! నేను
పూర్వదేశాధిపతి యగు భూరికీర్తి మహారాజుచే మీచరణారవింద
సన్నిధానమున కంపబడిన దూతను. మామహారాజు మీపేర నొక
పత్రము నంపినారు. ఈపత్రమును జదివికొని మాప్రభువు నెడల నను
గ్రహమును జూపుడు.'' అని పలుకుచు ప్రణామపురస్సరముగా నొక
పత్రము రామదూత చేత నిడెను. దాని నతడు వడిగా దెచ్చి లక్ష్మ
ణుని ముందుంచి తన స్థానమున కరిగి నిలిచెను. సుందర వస్త్రమున
జుట్టబడిన యా పత్రమును లక్ష్మణుడు వెలికి దీసెను. అది కుంకు
మాంకితమై చిన్నచిన్న బంగారు పువ్వులతో నలంకరింపబడి
యుండెను. దర్శన మాత్రమున నది శుభమును సూచించుచుండెను.
శ్రీరామచంద్రుని సింహాసనము చెంత నిలిచి మధురస్వరముతో
లక్ష్మణుడా పత్రమునందలి విషయము నీవిధముగా జదివి వినిపించెను.

"లోకములో రావణసంహారార్థము దశరథ తనయుడను పేర
కౌసల్యకు కొమరుడై యావిర్భవించిన శ్రీరామచంద్రునకు జయము.
ఆ శ్రీరామచంద్రుని చరణకమలముల గంధమును భ్రమరము వలె
నాఘ్రాణింప భూరికీర్తి యను పేరి బరగు నేను వినయ వినమిత శిర
స్కుడనై నిరంతరము గా ప్రార్థించుచున్నాను.

మహాప్రభూ! రఘునందనా! నాకు జంపిక, సుమతి యను పేర్లు
గల యిరువురు పౌత్రిక (కొడుకు కూతురు) లున్నారు. వారికి
స్వయంవరము నేర్పాటు జేసితిని. ఈ సందర్భముగా నెందరో మహా
రాజులు విచ్చేసియున్నారు. మీరు గూడ మీతనయుల తోడను,
సోదరుల తోడను, సోదరపుత్రుల తోడను, మంత్రుల తోడను,
మిత్రుల తోడను, పురజనుల తోడను, నంతిపురమువారి తోడను,

సేనలు తోడను నాయెడల ననుగ్రహమును జూపి నా నగరమునకు దప్పక విచ్చేయుడు. నాయీ వేడికోలును విఫలము సేయవలదు."

ఆ పత్రార్థము నాకర్ణించి స్వస్థచిత్తుడై రాఘవుడు కులగురు వగు వసిష్ఠునితో మంత్రణ మొనరించి యా స్వయంవరమున కరుగు టకు నిశ్చయించెను. పిమ్మట లక్ష్మణునిఁ బిలిచి "లక్ష్మణా! సైన్య ములను సన్నద్ధముగా నుండ నాదేశింపుము. సీత, నేను, భరతుడు శత్రుఘ్నుడు, మన కుమారులు, మంత్రులు, మిత్రులు, నంతఃపురము వారు, సేవకులు, బ్రాహ్మణులు నెల్లరమును గూడి రేపటి దినమున స్వయంవరమున కరుగ వలయును. నగర సంరక్షణభారమును విజ యున కప్పగింపుము. మార్గమధ్యమున విడియుట కనువుగా ముందుగా బట్టకటీరముల నంపుము. దూతలచే మార్గములను శోధింపజేయుము. స్త్రీలందఱు పుష్పక విమానముపై బయనించు నేర్పాటు సేయుము." అని యతని కాదేశించెను. అతడును దోయిలి గట్టుకొని యట్లకాక! యని రాఘవుడు చెప్పిన విధముగా సర్వము సంపన్నము గావించెను.

మఱుచటి దినమున ప్రాతఃకాలమున రఘునందనుడు స్నాన మొనరించికొనెను. నిత్యవిధిని నిర్వర్తించికొనెను. అగ్నిహోత్ర ములను గొనిపోయి పుష్పకవిమానమునందు స్థాపించెను. మిత్రవర్గ ముతో గూడి భోజనము చేసెను. పిమ్మట సీతను బిలిచి పయనము నకు దొందఱ పెట్టెను. అప్పుడు సువర్ణాభరణవిభూషితలై దివ్య వస్త్రములను దాల్చి సీత మున్నగు స్త్రీలందఱును పుష్పకవిమానము నధిరోహించిరి. మనోహరమైన ఛత్రములతో నలంకరింపబడిన పట్టపు టేనుగు నెక్కి వీవనలచే వీవబడుచు రఘునందనుడు ముందు సాగెను. అతనికి ముందు మఱియొక గజరాజము నధిరోహించి కుల గురువగు వసిష్ఠుడు పయనించెను. రాఘవుని వెనుక గజారూఢుడై లక్ష్మణుడు నెడలెను. అతనివెనుక సేనమంథుగురు బాలకులును గజ

ములనధిరోహించి ప్రయాణము సాగించిరి. వారి వెనుక భరత శత్రుఘ్నులు కూడ గజముల నధిరోహించి బయలువెడలిరి. వారి వెనుక మంత్రులు, పౌరులు, జానపదులు మున్నగువా రందఱును నానా వాహనముల నెక్కి పయనించిరి. ఐరావత కులమున బొడమిన తెల్లని వన్నె గల నాలుగు దంతములతో శోభించు గజేంద్రము నెక్కి శ్రీరామచంద్రుడు చూడ నచ్చట గొలువుచుండెను. ఈవిధముగా నాపరమ పురుషుడు మెల్లగా మార్గమున వందిమాగధుల స్తోత్రపఠనములను, మంగళ వాద్యధ్వనులను నాలకించుచు సానందముగా పూర్వదిక్కునకు ప్రయాణము సాగించెను. పుష్పక విమానమునందున్న స్త్రీలందఱు నందాల రాము నవలోకించుచు నానంద సంభరితహృదయారవిందలై యాతనిపై పుష్పవృష్టులు గురియించిరి. నవవిధ వాద్యములు ప్రమోగినవి. వారవనితలు చారుతర నృత్యము నొనరించిరి. నటులు మనోహర గీతముల నాలపించిరి. ఈవిధముగా శ్రీరామచంద్రుడు సాకేతనగరమునుండి మెల్లగా కోశ యోజనము కన్న నెక్కుడు దూర మరిగి యచ్చట తమ సైనికులచే నిర్మింపబడిన విడిది ప్రదేశము నవలోకించెను. గజేంద్రము నుండి యవతరించి పటకుటీరమున ప్రవేశించెను.

ఈవిధముగా రాఘవుడు మెల్లగా జనుచు మార్గమధ్యమున మనోహరములైన పెక్కు దేశముల నవలోకించెను. క్రమముగా భాగీరథీనదిని దరించెను. కటకదేశము నతిక్రమించి యిరువది దివసములలో మనోహరమైన భూరికీర్తి మహారాజు దేశమున ప్రవేశించెను. ఆ మహారాజుయొక్క దూత వడిగా జని శ్రీరామచంద్రుని యాగమనవార్తను తమ రేని కెఱిగించెను. ఆ వార్త నాలించి యా మహారాజు పరమానందభరితుడై రాఘవుని కెదురుగా జనెను. తన నగరమును పతాకలతో, ధ్వజములతో, తోరణములతో, నలంకరింపజేసెను. స్వయంవరమునకు విచ్చేసిన మహారాజుల నందఱను వెంట నిడికొని

గజరాజమును ముందిడికొని భూరికీర్తి శ్రీరామచంద్రునకు ప్రత్యుత్థాన మొనరించెను. శ్రీరామచంద్రుని, నతని పరివారమును గాంచి స్వయంవరమునకై యరుగుదెంచిన మహారాజు లందఱు దీనవదనులై మనములలో నెక్కువ యారాటము నొందిరి. చింతాక్రాంతమానసముల తోడనే వారు శ్రీరాముని కెదురేగిరి. దూరమునుండియే రాఘవుని, ద్వరితముగా బురోగమించు నతని సైన్యమును విలోకించిరి. అతనికి ప్రణమిల్లి కానుక లర్పించి యాతనిచే నాలింగితులై యతని పార్శ్వమున నిలిచిరి. పుత్రసమేతుడై భూరికీర్తిమహారాజు ప్రణామపురస్సరముగా వస్త్రములతో, నాభరణములతో, వాహనములతో గౌరవించి రామాకలను గోపురములతో, నట్టాలికలతో గలకలలాడు తన నగరములోనికి గొనిపోయెను. వారకాంతలు చారుతరనృత్యము లొనరించుచుండ, వందిమాగధులు స్తోత్రపఠనములు సేయుచుండ, మంగళవాద్యములు మ్రోగుచుండ ప్రభువు మెల్లగా నగరప్రవేశము జేసెను. శ్రీరామచంద్రుని యాగమనవార్త నాలించి యానగరములోని నారీమణు లందఱును దమతమ పనులను మాని సంభ్రమము మీఱ గోపురముల నెక్కియు, మేడలమీదకు బరుగిడి వచ్చియు రఘునందను నవలోకింపదొడగిరి.

ఒకకాంత యూయలలో నేడ్చుచున్న తన తనయునట్లె విడనాడి రాఘవు నాలోకింప దత్తఱము మీఱ మేడ పైభాగమునకు బరుగిడి వచ్చెను. ఒకముగుద మగనికి దాంబూలవీటిక నందించుచు వెలికి బరుగెత్తెను. ఒక పాలతులమిన్న వంటసేయుచు నాపనిని నడుమనే విడిచి పరుగు వెట్టెను. ఒక నీలవేణి జుట్టు విప్పి జడవేసికొన ప్రయత్నించుచు విడబాఱిన కేశరాశితో వెలికి బరుగిడెను. మగనిచే గాగిలించికొనబడిన యొక మదవతి మగని కరములను దొలగద్రోసి మేడమీదకు బరుగిడెను. ఒక సతి పతికి బాదప్రక్షాళనము సేయుచు నొక పాదమును గడిగి రెండవపాదమును గడుగకయే వడివడిగా వెలికి

వెడలిపోయెను. ఒక ముద్దియ తనను ముద్దిడుకొనుచున్న మగని మొగమును దొలగ ద్రోసి సీతారాములను సందర్శింప దత్తఱము మీఱ ధావన మొనరించెను. ఒక చెలువ చెలువునితో గూడి పర్యంకమున నిదురించుచు శ్రీరామాగమనవార్త నాలించి నిద్రను మాని ప్రాకిపోయిన కాటుకతో, నిద్రాముద్రను వీడని నయనములతో, మొగముపై ముసరు ముంగురులను దొలగద్రోసికొనుచు మేడమీదకు బరుగిడి పోయెను. ఒక యన్నువలమిన్న యభ్యంగన స్నానము జేయుచు నాపని పూర్తి కాకుండ నడుమనే లేచి తాను ధరించిన చిన్న వస్త్రమును గరముతో సంభాళించుకొనుచు రయము మీఱ బరువు వెట్టెను. ఒక రమణీమణి రవికను ధరించుచు నొక చేతికి దొడిగికొని రెండవ చేతికి దొడిగికొనకయే సరగున సౌధోపరి భాగమునకు బరుగిడి పోయెను. ఒక సుదతి పదముల నందియలను దాల్చుచు నొక చరణమున ధరించి రెండవ చరణమున ధరింపకయే యట్టాలిక నధిరోహించెను. ఒక మానినీమణి మగని కేదియో శుభవార్త దెలుపుచు నది పూర్తిగా దెలుపకయే వడివడిగా వెలికి బాఱెను. ఒక పైదలి పతి కన్నము వడ్డించుచు నన్నపాత్రను నేలపై విడిచి బయటకు బరువువాఱెను. ఒక పుణ్యస్త్రీ చక్కగా స్నానమొనరించికొని దివ్యవస్త్రములను దాల్చి తులసికి, మహాదేవునకు ప్రదక్షిణములు సేయుచు నాపని పూర్తి సేయకయే పరుగు వెట్టెను. ఒక కోమలి నీరుచేదుటకై నూతిలోనికి జార్చిన రజ్జుఘటమును (నీరుతోడు కలశము) వెలికి లాగకయే వదలివైచి రయమున బాఱెను. ఒక మాతృమూర్తి యేకాంతమున బిడ్డకు బాలిచ్చుచు నాబిడ్డను గుచములపై నదిమికొని యట్లే వెలికి బరుగు వెట్టెను. ఒక వనితారత్నము వస్త్రధారణము సేయుచు దాల్పబోవు కోక చెరగును జేతబట్టుకొని శీఘ్రముగా నట్టాలికమీదకు బరుగిడిపోయెను.

ఈవిధముగా ననేక కార్యములలో నిమగ్నులై యున్న యా నగరము నందలి స్త్రీలందఱు నాయా కార్యముల నసంపూర్ణముగా విడనాడి శ్రీరామచంద్రుని దివ్యమంగళవిగ్రహమును దర్శింప బరుగులు వెట్టిరి. గజారూఢుడైన యామహాపురుషుని దర్శించి యానందము మీఱ నతనిపై బూలు వర్షించిరి. అట్టాలికలపై నిలిచి వారు 'ఆహా! రాజరాజగు శ్రీశ్రీరామచంద్రుని గన్నతల్లి గౌసల్య పరిపూర్ణమనోరథురాలైనది. ఆమె యెంతయు ధన్యాత్మురాలు' అని తమలో దా మాడికొనజొచ్చిరి. తన బింబాధరరసముచే శ్రీశ్రీరామచంద్రుని దనియ జేయు జనకనందిని సీత యెంత ధన్యాత్మురాలో కదా! యని కొందఱు వాకొనిరి. 'ఆ జనకజాత తొలిజన్మమున దుష్కరమైన తప మొనరించియుండును ఆకారణముననే యామె రాజరాజునకు బ్రియురాలు కాగలిగినది.' అని కొంద ఱామె భాగ్యమును గొనియాడిరి. 'సీతామహాదేవికి దాసికలమై శ్రీరామచంద్రుని సేవించుకొను భాగ్యమునకైన నోచికొనని మన మెంత దురదృష్టవంతురాంద్రము!' అని కొందఱు వాపోయిరి. ఈవిధముగా బురకాంతలాడికొను వివిధవచనముల నాకర్ణించుచు రాజమార్గము ననుసరించి రఘునందనుడు భూరికీర్తిచే దనకై యేర్పాటు చేయబడిన విడిదిభవనమును సమీపించెను. అక్కడ గజేంద్రమునుండి యవతరించి భవనమున బ్రవేశించి సీతతోడను, సోదరులతోడను, బాలకులతోడను, బరివారముతోడను సుఖముగా నుండెను.

ప్రథమసర్గము సమాప్తము.

# ద్వితీయ సర్గము

## —చంపికా స్వయంవరవర్ణనము—

శ్రీరామదాసుడు విష్ణుదాసున కిట్లు వివరించును.

వచ్చుచటి దినమున శ్రీరామచంద్రుని సన్నిధి కరుగుదెంచి భూరికీర్తిమహారాజు సమస్కారపూర్వకముగా నతనిని సభాస్థలికి

విశ్వేయ ప్రార్థించెను. అట్లకాక! యని శ్రీరామచంద్రుడు బంగారు తంతువులతో నిర్మింపబడిన శ్రేష్ఠమైన కవచమును, శిరస్త్రాణమును దివ్యవస్త్రములను, నుత్తరీయములను, గటిబంధమును ధరించి వివిధ మణిమయాభరణ విభూషితుడై యెనమండుగురు బాలకులతోడను సభాస్థలి కరిగెను. అప్పటికి ముందుగా సభాస్థలికి జేరి యాసనములపై నాసీనులై యున్న మహారాజు లందఱును ససంభ్రమముగా లేచి శ్రీరాముని యాగమనవార్త నాలించిన వెంటనే యతని కెదురుగా జని వంగివంగి వందనములు గావించిరి. మనోహరములైన వస్త్రాభరణ ములతో, విచిత్రములైన తలపాగలతో, ముదమును వెలిబెట్టు మొగ ములతో రాణించు రామదూతలా మహారాజుల పేర్లను వేఱువేఱుగా నిట్లు ప్రభువున కెఱుగజెప్పిరి.

"రాజరాజేశ్వరా! ఈమహారాజు కర్ణాటదేశాధిపతి విజయుడు. మీకు జయమనుచు బ్రణమిల్లుచున్నాడు. కనుగొనుడు. ఈమహారాజు ద్రవిడదేశాధీశ్వరుడగు కంబుకంఠుడు నమస్కారము సేయుచున్నాడు. విలోకింపుడు. మహాప్రభూ! యీనరపతి విదర్భదేశము నేలు నంగ నాథుడు మీకు మ్రొక్కుచున్నా డవలోకింపుడు. ఈయేలిక మగధ దేశము నేలు పరంతపుడు మీకు వందనము సేయుచున్నాడు. వీక్షింపుడు. ఈజనపతి యవంతీదేశము నేలు ప్రతాపశాలి యుగ్ర బాహుడు మీకు మ్రొక్కుచున్నాడు. కాంచుడు. ఈనరపాలుడు హైహయపత్తనమునేలు ప్రతీపుడు మీకు బ్రణామము సేయుచున్నాడు, చూడుడు. ఈభూపాలుడు శూరసేనదేశాధిపతి సుషేణుడు మీకు గర ములు జోడించి నమస్కరించుచున్నాడు. కనుగొనుడు. ఈ భూమీ శుడు హరిద్వారమునందుండువాడు. శివవంశమునందు జన్మిం చినవాడు. యజ్ఞకీర్తియనుపేర బరగువాడు. మీ కభివాదనము సేయు చున్నాడు. పరికింపుడు. ఈనరనాథుడు సాగరతీరమునందలి కళింగ దేశము నేలు హేమాంగదుడు మీకు సాగి మోడ్పు గావించుచున్నాడు,

వీక్షింపుడు. ఈజనపాలుడు బుద్ధిమంతుడు. శౌర్యవంతుడు. నాగపత్తనము నేలువాడు, పాండ్యుడను పేర బరగువాడు. మీ కయిదు పది సేయుచున్నాడు. అవలోకనము సేయుడు.''

ఈవిధముగా భటుడు వివరించు వివరణముల నాలకించుచు మహారాజుల ప్రణామములను జల్లని చూడ్కులతో స్వీకరించుచు శ్రీరామచంద్రుడు సోదరులతోడను, బాలురతోడను, మంత్రులతోడను గూడి సభలో బ్రవేశించి పడమటగా నున్న ఛత్రచామరమండితమైన దివ్యసింహాసనముపై దూరుపువంకకు దిరిగి కూరుచుండెను. ఆమహాభాగుని కుడివంక లక్ష్మణుడు, భరతుడు, శత్రుఘ్నుడును గూర్చుండిరి. ఎడమవంక గుహుడు మున్నగువారును, మంత్రిబాలకులు నాసీనులైరి. శత్రుఘ్నునకు గుడివంక సుమంత్రుడు మున్నగు మంత్రులుపవిష్టులైరి. సభలో నుత్తరమున దక్షిణమున నున్న పంక్తులలో నితర భూపాలురందఱును సింహాసనములపై నాసీనులై యుండిరి. వారందఱు బడమటివంకకు దిరిగి మిత్రులతో, మంత్రులతో, పుత్రులతో మండలాకారముగ గూర్చుండియుండిరి. ఆతరుణమున వారవనితలు చారుతరనృత్యము లొనరించిరి. అట్టాలికలపైనుండి బ్రాహ్మణులు మున్నగువారు కౌతుకము నవలోకించుచుండిరి. పిమ్మట మంగళవాద్యములు మ్రోగుచుండ, నగురుధూపములు వెలుగుచుండ, వారకాంతలు నర్తనములు సేయుచుండ, గాయకులు గానము లొనరించుచుండ, వందిమాగధులు స్తోత్రపఠనములు సేయుచుండ దివ్యవస్త్రాభరణములను దాల్చి నవరత్నమయములైన మహామాలలను గరకమలములందు ధరించి భూరికీర్తి మహారాజు మనుమరాండ్రిరువురును బల్లకుల నెక్కి సభాస్థలి కేగుదెంచిరి. వారి పల్లకులు మెల్లగా సభకు ముందు భాగమునకు జేరి నిలిచినవి. వారి నయనకటాక్షములచే మహారాజుల మర్మస్థలములు భిన్నములయ్యెను.

కామబాణములచే వారి మనసులు వికలములయ్యెను. వారి కంఠములు, పెదవులు, దాలువులు నిగిరిపోయెను.

అంతట జంపిక యనుపేర బరగు కన్యకారత్నము పల్లకిలో నుండియే యాగ్నేయకోణమునుండి సభలో బ్రవేశించెను. సుమతి యను కన్యకారత్న మీశాన్యకోణమునుండి సభలో బ్రవేశించెను. నంద యనుపేర బరగు వృద్ధురాలగు నొకదాది చేత బెత్తెమును ధరించి చంపిక ననుసరించి నడచి దక్షిణముగా నున్న మహారాజుల నందఱను వేఱువేఱుగా నామెకు వర్ణించి యెఱుగజెప్పెను. అతివృద్ధురాలగు సునంద యను మఱియొక దాది సుమతి ననుసరించి చని యుత్తరముగా నున్న భూమిపాలుర నందఱను వర్ణించి యామెకు దెలియజెప్పెను.

నంద యను దాది చంపికను మహారాజుల సన్నిధికి గొనిపోయి యిట్లు నొడువ నారంభించెను. కన్యకారత్నమా! ఇతడు పాండ్యరాజు బుద్ధిమంతుడు. నాగపత్తనము నేలువాడు. శౌర్యవంతుడు రథికుడు. నరపతులలో శ్రేష్ఠుడు. ప్రజాపాలనతత్పరుడు. నీ మనమునకు నచ్చి నచో నుత్తముడగు నీతని వరింపుము. పలదు ముందునకు బోవలదు. ఇతనికి బట్టమహిషివై నాగపత్తనము జేరి యానందము మీఱ నీతనితో గూడి యచ్చటి సౌధములలో విహరింపుము. నంద నొడివిన రెండర్థములను స్ఫురింపజేయు నీ వివరణను నాలకించి యాకన్యక బుద్ధిమంతురా లగుటచే నాతని వరించుట కిచ్చగింపలేదు. ఆమె నందను మఱియొక మహారాజు కడకు వెడల బురికొల్పెను.

అప్పుడు నంద యామెను మఱియొక జేని కడకు గొనిపోయి యిట్లు నొడివెను. అమ్మా! ఇతడు కళింగదేశాధిపతి. హేమాంగదు డనుపేర బరగువాడు. ఇతని కెన్నియో గజరాజములు గలవు. వాని గండస్థలములందు ముత్యాలదండలు వ్రేలుచుండును. ఇతనికి బట్ట మహిషివై గవాక్షముల (కిటికీ) మార్గమున సముద్రసౌందర్యము

నవలోకించుచు వినోదింపవచ్చును. ఇతని భార్యల నడుమ ముఖ్యురాలవు గమ్ము. వలదు ముందునకు జనవలదు. ఈవివరణము నాలించియు నాచంపిక యాతనివరింప నిచ్చగింపక దాదిని ముందునకు సాగుమనెను.

అప్పుడు దాది మఱియొక నరపతి కడకరిగి యిట్లుపలికెను. తల్లీ! చంపికా! ఇదిగో! ఇటుచూడుము. ఈమహారాజు హరిద్వారమున నివసించువాడు. సముద్రమున జంద్రునివలె నీపవంశమున బ్రాదుర్భవించినవాడు. ఇత డనేక యజ్ఞము లొనరించి లోకములో యజ్ఞకీర్తి యనుపేర బ్రసిద్ధి గాంచినవాడు. ఇతడు ప్రమదాప్రియుడు. సువర్ణాభరణ విభూషితుడగు నీమహారాజును వరింపుము. ఇతనికి బట్టమహిషివైనచో బడవ నెక్కి చని గంగాతరంగములపై విహరించుచు వినోదింపవచ్చును. ఇతనికి బ్రియపత్నివి గమ్ము. వలదు. ఇక ముందునకు సాగవలదు. ఈవివరణము నాలించియు జంపిక మన మా జనపతిపయి లగ్నము గాలేదు. ఆమె మఱల నందను ముందునకు సాగుమని సైగ జేసెను.

అంతట నంద ముందునకు జని మఱియొక మహారాజును జూపి చంపికతో నిట్లు పలికెను. 'బాలా! యీ జేనిని విలోకించితివా! ఇతడు శూరసేనదేశము నేలువాడు. సుషేణుడను పేర బరగువాడు. ఇతని కెన్నయో గుణములు, నెందఱో చంచలాక్షులగు నంచయానలు నున్నారు. ఇతని ప్రాంగణమునం దెల్లవేళల వారవనితల చారుతర నృత్యములు సాగుచుండును. నీ మొగమును బోలిన మొగము గలవాడగు నీతని వరించి జన్మసాఫల్యమును బడయుము. వలదు. ముందడుగిడవలదు. అనగా విని యతడు వారవనితాలంపటు డగుటచే నతనిని వరింప నిచ్చగింపక చంపిక నందను ముందున కడుగిడ బురికొల్పెను.

నందయు మఱికొంత ముందునకు నడచి మఱియొక మహీపాలుని జూపి యిట్లు నొడివెను. "కన్నియలమిన్నా! ఇదిగో! ఈ

మహారాజును జూచితివా? ఇతడు హైహయపత్తనము నేలువాడు. కార్తవీర్యార్జునుని కులమున కలంకారమైనవాడు. తామరరేకులను బోలు కన్నులు గలవాడు. ప్రతీపు డనుపేర బరగువాడు. శూరుడు. మహారథికుడు. మాననీయుడైన యీ మహారాజును వరింపుము. ఇతనికి బట్టపురాణివై యితనితోఁగూడి రేవానదిలో జలక్రీడలు సేయుచు వినోదింపవచ్చును. నా మాట విని యీతని వరింపుము. వలదు వలదు. మఱియొక చోటికడకు జనవలదు. ఈ వివరణము నాలకించియు జంపిక తన మనము నాతనిపై లగ్నము సేయలేదు.

అంతట నంద యా కన్యకారత్నమును దోడుకొని సుమంత్రాదుల నతిక్రమించి శత్రుఘ్నుని సమీపించి యతనిని జూపుచు నామెతో నిట్లు పలికెను. "బాలా! ఇదిగో! యీ వీరాగ్రగణ్యుని విలోకింపుము. ఇతడు కోసలేశ్వరుడగు శ్రీరామచంద్రున కేకోదర తుల్యుడగు శత్రుఘ్ననామధేయుడు. అయోధ్యానగరవాసి. శ్రీరామ చంద్రుని యానతిని శిరసావహించువాడు. వలదు ముందునకు బోవలదు. ఇతనిని వరించి శ్రుతకీర్తికి సోదరివి గమ్ము." ఈ వివరణము నాలించియు నాతని వరింప నిచ్చగింపక చంపిక నందకు ముందునకు సాగిపోవ గంటితో సైగ జేసెను.

పిమ్మట నంద మఱల ముందునకు నడచి భరతుని జూపుచు జంపికతో నిట్లు లనెను. కన్యకామణీ! యితడు శత్రుఘ్నుని యన్న. కైకేయి కడుపున జన్మించినవాడు. శ్రీరాముని సేవావ్రతము నవలంబించినవాడు. శాంతస్వభావుడు, యువకుడు, తనభార్య కెంతయు బ్రియుడు వలదు ఇక ముందున కేగవలదు. ఇతనిని వరించి మాండవి తోడను. నితనితోడను గూడి నౌక నధిరోహించి సరయూనదిలో జలక్రీడలు సేయుము అనగా విని యామె నందను ముందునకు సాగు మనెను.

అప్పు డామె మఱికొంత ముందునకు నడచి లక్ష్మణుని సమీపించి యా కన్యతో "కన్యారత్నమా ! యితడు లక్ష్మణుడు సుమిత్రాగర్భమున నుదయించినవాడు. అయోధ్యానగరవాసి. శ్రీరామసేవావ్రతధారి. మేఘనాదుని సంహరించిన దిట్ట. ఆదిశేషుని యంశమున నావిర్భవించినవాడు. ఇతనిని వరించి యూర్మిళాదేవికి సోదరివి గమ్ము. వలదు ఇక ముందునకు సాగవలదు. అని చెప్పెను. అ పలుకుల నాలకించి వా రందఱును శ్రీరామసేవాతత్పరు లనియు, భార్యలతో గూడియున్నవా రనియు, ఛత్రము, చామరము మున్నగు రాజలాంఛనములు లేనివా రనియు దలపోసియు, దాదిమాటలలోని వలదు వలదన్న మాటనుబట్టియు నిరాకరించి నందను ముందునకు నడవ నాదేశించెను.

అంతట నంద మఱికొంత ముందునకు నడచి శ్రీరామచంద్రుని సమీపించి యా మహాపురుషుని జంపికకు జూపుచు నా మహాభాగుని స్తుతించు తలంపున నిట్లు పలికెను.

"బాలికారత్నమా ! చంపికా ! నీ యదృష్టము పండినది. కావుననే నీవు శ్రీరామచంద్రుని దర్శించుచున్నావు. ఈ మహాపురుషుని దర్శించి స్తుతించు నవకాశమును గన్న నేను గూడ గడుంగడు ధన్యురాలను. మందమతినై యామదానసైన నే నెక్కడ ? సుగుణ సముద్రుడైన యీ శ్రీరామచంద్రు డెక్కడ ? నే నీతని స్తుతించుట కశక్తురాలను. ఈతని మహత్త్వమును వర్ణించుటలో వాల్మీకిమహర్షి యంతటి వాడే కుంఠితు డయ్యెను. ఆ మహర్షి యీ మహాపురుషుని మహత్త్వములోని శతకోట్యంశమును శతకోటి పరిమితములైన శ్లోకములలో నెట్టులో వర్ణింపగలిగెను. అట్టి యీ మహాభాగుని గూర్చి నే నిప్పు డొకింత వర్ణింప బూనుచున్నదాన. నాలకింపుము.

ఇతడు సూర్యవంశమున కలంకారమైనవాడు దశరథ భూపాలుని తనయుడు. కౌసల్యాగర్భమున బొడమినవాడు. శ్రీరాము

చంద్రు డనుపేర బరగువాడు. శ్రీమన్నారాయణుని యవతార మైన వాడు. తాటకాసంహార మొనరించిన వీరుడు. విశ్వామిత్రుని యజ్ఞసంరక్షణ మొనరించినవాడు. అహల్యాదేవి నుద్ధరించినవాడు. శివుని విల్లు విరిచి సీతామహాదేవిని బెండ్లియాడినవాడు. పరశురాముని గర్వము నణచినవాడు. మహారాజులను జయించినవాడు. భరతునకు బ్రాణదానము సేసినవాడు. తండ్రియాజ్ఞచే లక్ష్మణునితోడను, జనకజాతతోడను జని యరణ్యములలో నివసించినవాడు. విరాధుని, ఖరదూషణులను, త్రిశిరస్కుని, మారీచుని, గబంధుని వాలిని సంహరించినవాడు. సముద్రముపై సేతువు నిర్మించి లంక కరిగి యచ్చటి రాక్షసు లందఱతోడను గూడిన రావణుని మట్టుపెట్టినవాడు. సీతను వెంట నిడికొని మఱలి వచ్చి యయోధ్యానగరరాజ్యము నేలినవాడు. తీర్థయాత్రలు సేసినవాడు. అనేకయజ్ఞము లాచరించినవాడు. సీతామహాదేవితోగూడి క్రీడించువాడు. లోకాపవాదభీతిచే నొక సమయమున నామెను బరిత్యజించినవాడు. అనంతరము సభాముఖమున నామె పవిత్రతను గుర్తించి మఱల నామెను స్వీకరించినవాడు. అశ్వముకొఱకై తన తనయులగు కుశలవులతో ఘోరయుద్ధ మొనరించినవాడు. ఏకపత్నీవ్రతధారి. శాంతస్వభావుడు. సత్యభాషణ తత్పరుడు. కదనరంగమున నొక్క బాణమును బ్రయోగించువాడు. ధ్వజమునందు మారుతిని నిలిపినవాడు. కోవిదారధ్వజుడు. బాణధ్వజుడు. వజ్రధ్వజుడు. గరుడధ్వజుడు. పుష్పకవిమానము నెక్కి గరుత్మంతునితో సమానమైన వేగమున, వాయువేగమున బయనించువాడు. అనేక మహారాజులచే నమస్కరింపబడువాడు. శ్రేష్ఠమైన సింహాసనముపై నాసీనుడగువాడు. ఛత్రము, చామరము, మున్నగు రాజలాంఛనములతో. రాజిల్లువాడు. నవఖండములకు, సప్తద్వీపములకు నధిపతియైనవాడు. ఇతనికి దన భార్యమాట బ్రాణతుల్యమైనది. సర్వలక్షణ సంపన్నుడగు నీమహాపురుషుని మెడలో వరమాలను వైచి

వరించి సీతతోడ నాతని గూడి సుఖింపుము. అనగా విని చంపిక యత డేకపత్నీవ్రతధారి యగుటచేతను తా నల్పపుణ్యురా లగుటచేతను, విధివశమునను నామహాపురుషుని వరింప నిచ్ఛగించ లేదు

అనంతర మామె సైగను గ్రహించి నంద యామెను గుశుని సన్నిధికి గొనిపోయి యిట్లు నొడివెను. "కన్యకామణీ! యిదిగో! యితనిని గంటివా? ఇత డల్పవయస్కుడు. శ్రీరామచంద్రుని తనయుడు. సీతామహాదేవి తనయులలో పెద్దవాడు. భార్యను గోరుచున్నవాడు. లవున కన్న. ధనుర్వేదవిశారదుడు. విద్యావినయవివేకవిభూషితుడు. వాల్మీకిమునికడ నేర్చిన విద్యను దండ్రితోడ సంగరమొనరించువేళ బ్రదర్శించినవాడు. దేవతలచేతను, మానవులచేతను గొనియాడబడువాడు. నవరత్నమాల నీతని మెడలో ధరింపజేసి యీతని వరింపుము. అనగా విని హర్షించి చంపిక చిఱునవ్వునవ్వుచు దన కోమలకరములతో నవరత్నమాలిక నాకుశుని గళసీమ నలంకరింప జేసెను. ఆ తరుణమున మంగళవాద్యములు మ్రోగినవి. వందిమాగధులు స్తోత్రపఠనము లొనరించిరి. కుశుడు సిగ్గుపడుచు సభలో దల వంచికొని కూరుచుండెను. అప్పుడు భూరికీర్తిమహారాజు చంపిక నెత్తి సభలోని మహారాజు లందఱును గనుగొనుచుండగా గుశుని యొడిలో గూర్చుండబెట్టెను. మేడపైనుండి జనకజాత గవాక్షమార్గమున నా దృశ్యము నవలోకించి తనతోడి స్త్రీ లందఱితోడను బరమానందము నొనసెను. శ్రీరామచంద్రుడు నమందానంద సంభరితహృదయారవిందు డయ్యెను.

ద్వితీయసర్గము సమాప్తము.

—)o(—

# తృతీయసర్గము

## — చంపికాసుమతుల స్వయంవరవర్ణనము —

శ్రీరామదాసుడు విష్ణుదాసున కిట్లు వివరించును.

అనంతరము సునంద యను దాది వేత్రమును గరమున ధరించి పల్లకిలోనున్న యందాల రాశి యగు సుమతిని బల్లకిలో నుండగనే సభముందు భాగమునుండి యీశాన్యకోణమునుండి సభలో బ్రవేశింపజేసి యాదిక్కున నున్న మహారాజులను గూర్చి యామెకు క్రమముగా నీ విధముగా నెఱిగించెను.

కన్యకామణీ! ఇదిగో! ఇటు చూడుము. ఈనరపాలు డవంతి దేశము నేలువాడు. ఉగ్రబాహుడను పేర బరగువాడు. భూమండల మునం దితనితో దుల్యుడగు వాడు మఱియొకడు లేడు. వలదు ముంద డుగు వేయవలదు. ఇతనికి బట్టమహిషివై క్షిప్రానదీతీరమునందలి యిసుకతిన్నెలపై బటకుటీరములలో నితనితో గూడి క్రీడించుచు సుఖింపుము. ఈవివరణము నాలకించి యందలి రెండవ యర్థమును గ్రహించి యామె యతనిని వరింప నిచ్ఛగింపక సునందను ముంద డుగు వేయ బురికొల్పెను.

అంతట సునంద సుమతి నటనుండి మఱియొక తేని కడకు గొనిపోయి యామెతో గన్యకారత్నమా! ఇతడు విదర్భదేశము నేలు వాడు. ఉత్తముడు. అంగనాథు డనుపేర బరగువాడు. స్త్రీని గోరు చున్నవాడు. చిన్నప్రాయమువాడు. భుజములందు భుజకీర్తులతో శోభిల్లుచున్నవాడు. ఈరాజశ్రేష్ఠుని వరింపుము. పూర్వపుణ్యమువలన నితనిని విడువవలదు. వలదు. ఇతనికి బట్టమహిషివై పయోష్ణీనదీ తరంగములందీతేనితో గూడి జలక్రీడలు గావింపుము అని పలికెను. ఆమె పలుకులలోని వలదు వలదు అన్న మాటలోని యాంతర్యమును

గ్రహించి యతనిని వరింపక సుమతి సునందను ముందడుగు వేయ సైగ జేసెను.

అంతట సునంద యామెను మఱియొక భూమీశుని కడకు గొని పోయి యామెతో నిట్లులనెను. బాలికారత్నమా! ఈనరనాథు ననలోకింపుము. ఇతడు మగధదేశము నేలువాడు. పరంతపు డను పేరి బరగువాడు. ఇతనిని వరింపుము. వలదు. వలదు. మఱియొక మహీపాలుని కడ కరుగవలదు. ఇతనికి బట్టపురాణివై హేమంత కాలమున వేడినీరములతో విలసిల్లు బ్రహ్మతీర్థమునం దితనితో గ్రీడింపుము. ఈ వివరణము నాలకించి వలపు వలదన్న మాటను బ్రయోగించినప్పుడా ఱేనిని వరింపరాదని దాదిచే ముందుగనే సూచింపబడియుండుటచే సుమతి యతనిని వరింపక సునందకు ముందు నకు సాగ సైగ జేసెను.

అప్పుడు సునంద మఱియొక భూపాలుని కడకు జని యాతని జూపుచు సుమతితో నిట్లు నొడివెను. తల్లీ! సుమతీ! ఇతడు ద్రవిడ దేశాధిపతి. కంబుకంఠు డను పేర బరగువాడు. కాంచీపురమునందు నివసించువాడు. ఉత్తముడు. ఇతనిని వరింపుము. వలదు. వలదు. ఇక మఱియొక ఱేనికడ కరుగవలదు. సువర్ణకమలములతో విరాజిల్లు తీర్థరాజమగు కాంచీపురమునందు వెలుగొందు వరదరాజస్వామిని, నేకాంబరేశ్వరుడను పేర బరగు పరమశివుని నీమహారాజుతో గూడి భజింపుము. అనగా విని యామె పలుకులలోని యంతరార్థము నెఱిగి సుమతి యామెకు ముందునకు సాగ సంకేత మొనరించెను.

అంతట సునంద మఱియొక భూపాలుని సమీపించి సుమతితో 'కన్నియలమిన్నా! ఇదిగో! ఈ నరనాథుని గాంచితివా? ఇతడు కర్ణాటదేశాధిపతి, విజయుడను పేర బరగువాడు. రాజశ్రేష్ఠుడు. తామరపూలను బోలు కరచరణములు, వదనమును గలవాడు. నగు

మొగమువాడు. తామరరేకులవంటి నయనములు గలవాడు. విజయ పురమున నివసించువాడు. నామాట విని యీ మహారాజును వరిం పుము. ఇతనికి బట్టమహిషివై యితనితోడ గూడి కృష్ణానదీజలము లందు విహరింపుము. వలదు. వలదు. ముందునకు బోవలదు.' అని ప్రబోధించెను. అతనిని వరింప నిచ్చగింపక సుమతి యామెకు ముందు వంకకు సాగుమని సైగజేసెను.

ఈ విధముగా సునంద యనేకమహారాజులను గూర్చి స్తుతి రూపముగను, నిషేధరూపముగను రెండర్థములు స్ఫురించు విధమున వర్ణింపగా సుమతి వారిలో నొక్కరిని గూడ వరింపలేదు. అంతట దాది యామెను దోడుకొని పూర్వమందువలె వర్ణనము సేయుచు శ్రీరామచంద్రుని మంత్రికుమారులను గూడ నతిక్రమించి క్రమముగా యూపకేతుని సన్నిధికి జేరి యిట్లు పలికెను. కన్యకారత్నమా! ఇతడు శత్రుఘ్నుని కుమారుడు. యూపకేతు డనుపేర బరగువాడు. మనోహరాకారుడు. శ్రీరామచంద్రుని తనయుల యానతి మీరని వాడు. సావధాన చిత్తురాలవై యీతని నవలోకింపుము. రాజ కుమారీ! వలదు. వలదు. వెడలిపోవలదు అనగా విని యామె యత నిని గూడ వరింపక ముందడుగు వైచెను. ఈ విధముగ సునంద సేయు వర్ణనముల నాలకించుచు గ్రమముగా నామె సుబాహుని, బుష్కరుని, తక్షుని, జిత్రకేతుని, నంగదుని గూడ నతిక్రమించి క్రమముగా లవుని చెంతకు జేరెను.

సునంద యామెతో రాజకుమారీ! ఇదిగో! ఇతని నవలోకించి తివా? యనెను. ఆమె లవు నవలోకించెను. అప్పుడు సునంద యామెతో నిట్లు లనెను. "బాలామణీ! ఇతడు శ్రీరామచంద్రుని తనయుడు. లవు డనుపేర బరగువాడు. భార్యను గోరుచున్నవాడు. ఎలప్రాయము వాడు. సీతామహాదేవిచే లాలింపబడినవాడు. వాల్మీకిమహర్షి యను

గ్రహమున సమస్తవిద్యల నభ్యసించినవాడు. మనోహరాకారుడు. కుశుని సోదరుడు. నీకరిమునందలి వరమాలను బ్రియము మీాఱ సీతసి గళసీమ నలంకరింపజేసి యీాతని వరింపుము. కుశుని యొడిలో జంపిక కూరుచున్న విధముగా నీవీతని యొడిలో గూరుచుండుము.'' సునంద నోడివిన యీావివరణము నాలకించి యానందించి సిగ్గుచే వల వంచికొని సుమతి రెండు చేతులు మీాదికెత్తి నవరత్నమాలను లవుని గళసీమ నలంకరింపజేసెను.

అంతట నవవిధమంగళవాద్యములు మ్రోగినవి. గాయకులు మధురగానములు సేసిరి. వందిమాగధులు స్తోత్రపఠనము లొనరించిరి. వారవనితలు చారుతరనృత్యము లొనరించిరి. భూరికీర్తిమహారా జప్పుడు తన మనోరథము సిద్ధించినదని తలచి పరమానందభరితుడై సత్వరముగా సుమతినెత్తి లవుని యొడిలో గూరుచుండబెట్టెను. లలనా సమేతుడగు లవుని గవాక్షమార్గమున గాంచి సీత పరమానందభరితురా లయ్యెను. రఘునంద డమందానంద కందళిత హృదయారవిందు డయ్యెను.

ఆ తరుణమున భూరికీర్తిమహారాజు స్వయంవర సమాగతులైన యితరరాజన్యుల నందఱను సాదరముగా బూజించి 'మహానుభావులారా! యీావివాహమంగళమును సంపన్నము గావించి మత్కృత చందనతాంబూలాది సత్కారములను స్వీకరించి మీారు మీామీా నెలవుల కరుగదగునని మిమ్ము వేడికొనుచున్నాను.' అని వినయ పూర్వకముగా బ్రార్థించెను. ఆ మహారాజులును గామబాణప్రపీడితులై యుండియు రఘునందను నెదిరించి రణ మొనరింపజాలక సిరి వాసి కళవాసిన మొగములతో, నుత్సాహరహితములైన యంతరంగము లతో దమతమ వాసస్థానములకు దఱలిపోయిరి. తనయులతోడను, దమ్ములతోడను రాఘవుడు గూడ నిజనివాసభవనమున కరిగెను.

మఱుచటి దినమున భూరికీర్తి మహారాజు పురోహితునిచే బురికొల్పబడి శ్రీరామచంద్రుని సన్నిధి కేగుదెంచి నమస్కరించి సవినయముగా 'మహాప్రభూ! రఘునందనా! మన మిప్పుడు సుఖదాయకమైన లగ్నదివసమును, సుముహూర్తమును నిర్ణయించికొనవలసియున్నది. నన్ను మీ పాదసేవకునిగా స్వీకరింపుడు. ఉభయపక్షముల మండపములందు నేయే కార్యము లాచరింపవలెనో యాదేశింపుడు.' అని యతనిని ప్రార్థించెను. అట్లకాక! యని రాఘవుడు ముహూర్తనిర్ణయము సేయుడని వసిష్ఠుని గోరెను. అప్పుడామహర్షి జ్యోతిశ్శాస్త్రవేత్తలచే బరివేష్టితుడై నాటికైదవ దివసమున ముహూర్తమును శోధించి రాఘవున కెఱుగజెప్పెను. అంతట భూరికీర్తి సంతసించి శ్రీమహాగణాధిపతిని, లగ్నపత్రికను బూజించి ముహూర్తనిశ్చయము గావించిన పండితులను, బ్రాహ్మణులను, సోదరులతోడను, తనయులతోడను గూడిన శ్రీరామచంద్రుని గూడ బూజించెను. పిమ్మట నాపరమపురుషునకు నమస్కరించి గృహమున కరిగి మండపాదికమును నిర్మింపజేసెను. శ్రీరామాజ్ఞచే లక్ష్మణుకు గూడ మనోహరములైన మండపాదులను నిర్మింపజేసెను. సముద్రతీరమున విలసిల్లు పురుషోత్తమ రాజధాని యగు వటపురి యాతరుణమున బతాకలతో, ధ్వజములతో, దోరణములతో జూడ ముచ్చట గొలుపుచుండెను.

అనంతరము ముహూర్తమునాటి రేయి సీత మున్నగు మహాత్మమూర్తులు నాలుగు వంకల జలకలశములను స్థాపించి వానిపై దీపముల నమర్చి వాని నడిమిదేశమున కుశుని, లవుని మణిమయపీఠములపై గూరుచుండబెట్టి చక్కగా నూనెరాచి నలుగువెట్టి వారికభ్యంగన స్నానములు సేయించిరి. వారితోబాటు తాముగూడ నభ్యంగ స్నానము గొనరించిరి. శ్రీరామాదులు గూడ నభ్యంగస్నానము లాచరించిరి. పిమ్మట వసిష్ఠమహర్షి స్వస్తివాచనముగా ముత్యాలతో

బెట్టబడిన మ్రుగ్గుపై సీతారాములను, వారి తనయులను గూరుచుం డజేసి వారిచే దొలుత మహాగణాధిపతిపూజనము జేయించెను. క్రమముగా బుణ్యాహవాచనములు సేయించెను. దేశాచారములను, గులాచారములను బాటింపజేసెను. ఇష్టదేవతారాధనము జేయించెను. దేవతాప్రతిష్ఠ జేయించెను. ఆ సమయమున సీతామహాదేవి పుణ్యస్త్రీబృందము నడుమ గూరుచుండెను. పసపుతో, బారాణితో, గుంకుమతో, నలంకరింపబడి యామె చరణకమలము లాతరుణమున జూడ ముచ్చట గొలుపుచుండెను. మండపప్రాంగణమునందు జరీపనితనము గల పచ్చని, యాకుపచ్చని, యెఱ్ఱని నన్నెనన్నెల వస్త్రములను దాల్చి సీతామహాదేవి మున్నగు స్త్రీ లందఱును గలకలలాడుచుండిరి.

పిమ్మట స్వయంవర సమయమునకు వచ్చియుండని మహర్షులెంకఱో కుశలవుల వివాహమంగళవార్త నాలకించి సానందముగా నాయెడకు విచ్చేసిరి. లక్ష్మణుని, సీతామహాదేవిని వెంటనిడికొని శ్రీరామచంద్రుడును నూతనవస్త్రములతో, నాభరణములతో, ధేనువులతో వారి నందఱ సమందానందమున బూజించెను. ఇతర రాజన్యుల నందఱను దోడుకొని స్వయముగా భూరికీర్తిమహారాజు కుశలవులను దన గృహమునకు గొనిపోవ నేగుదెంచెను. అతని కడపటి కుమారుడా తరుణమున మండపమునందున్న కుశుని, లవుని బంగారు తంతువులతో నిర్మింపబడిన దివ్యవస్త్రములతోడను, సువర్ణాభరణాదులతోడను బూజించెను. ఆసమయమున నంగదాదులగు నితర బాలకులు గూడ నమందానందమున నుప్పొంగుచుండిరి. పిమ్మట గుశలవులు గజరాజముల నధిరోహించి వింజామరముల వీచబడుచు నగుమొగములతో బయలువెడలిరి. ఆసమయమున వారవనితలు మనోహరనృత్యము లొనరించిరి. మంగళవాద్యములు మ్రోగినవి.

వందిమాగధులు స్తోత్రపఠనములు సేసిరి. సీతామహాదేవి మున్నగు వారు గూడ గరేణుల (ఆడుయేనుగు) నధిరోహించి పయనము సాగించిరి. మేడలమీద నిలిచి పురస్త్రీలు వారిపై, కుశలవులపై బసపు రాచిన ధాన్యము, ముత్యాలు, లాజలు,(పేలాలు) బంగారు పూవులు వర్షించిరి. ఈవిధముగా ననేకకౌతుకముల నవలోకించుచు, పుష్పవాటికలను బరికించుచు, కృత్రిమవృక్షములను, పతాకలను, ధ్వజములను దర్శించుచు, నగ్నిస్పర్శమున వెలుగు నోషధిమయములైన వృక్షములను విలోకించుచు, నోషధులతో నిర్మించి బండ్లపై నిలుప బడిన కృత్రిమమానవులను, కృత్రిమములైన వ్యాఘ్రములు మున్నగు క్రూరజంతువులను, నాకసముపైకి బోయి మెఱపులవలె వెలుగు నోషధిభవములైన చక్రాదులను, వెన్నెలవెలుగులను విరజిమ్ము నోషధిభవములైన యితర సామగ్రులను గనుగొనుచు కుశలవులు క్రమముగా భూరికీర్తిమహారాజు భవనమును సమీపించిరి. ఛత్రము, చామరము మున్నగు రాజలాంఛనములతో రాజిల్లుచు మహోత్సవ పురస్సరముగా మదకరీంద్రముల నవతరించి వారు మండపప్రాంగణమున నిలిచిరి. ఉభయపక్షముల పురోహితులును బ్రాహ్మణులతో గూడి వారికి మధుపర్కవిధిని, విష్టరవిధిని (ఆసనము) నిర్వర్తించిరి. అనంతరము వసిష్ఠమహర్షి మండపప్రాంగణమున సీతారాములచే వధూపూజనము సేయించెను. పిమ్మట కులగురువు చంపికతోడ కుశుని, సుమతితోడ లవుని వేఱువేఱు వేదికలపై గూరుచుండబెట్టెను. ఆదంపతుల నడుమ సువర్ణమయములైన చిత్రవస్త్రములతో దెఱలు నట్టెను. పురోహితులతో గూడి మహర్షులా సమయమున ననేకమంగళ ఘోషము లొనరించిరి. జనులెల్లరు నా మంగళఘోషముల నాలకించుచు మౌనముగా నుండిరి.

తృతీయ సర్గము సమాప్తము.

—()—

# చతుర్థసర్గము

## — కుశలవుల వివాహవర్ణనము —

శ్రీరామదాసుడు విష్ణుదాసున కిట్లు వివరించును.

శ్లో॥ శ్రీసీతా రఘునాయకశ్చ గిరిజా శంభు ర్గణేశ స్తథా
నందీ షణ్ముఖలక్ష్మణౌ చ భరతః కంజోద్భవ శ్శత్రుహా
సర్వే తే మునయ స్సురాశ్చ దితిజా స్తీర్థాది నద్యో నదాః
దిక్పాలా శ్శశిభాస్కరౌ చ హనుమాన్ కుర్వంతు వో మంగళమ్॥

శ్లో॥ తదేవ లగ్నం సుదినం తదేవ తారాబలం చంద్రబలం తదేవ
విద్యాబలం దైవబలం తదేవ సీతాపతే ర్యత్స్మరణం విధేయమ్॥

శ్రీసీతారాములు, పార్వతీపరమేశ్వరులు, విఘ్నేశ్వరుడు, నందీశ్వరుడు, కుమారస్వామి, లక్ష్మణుడు, భరతుడు, బ్రహ్మదేవుడు, శత్రుఘ్నుడు, మహర్షులు, దేవతలు, రాక్షసులు, పవిత్రములైన నదీనదములు, దిక్పాలకులు, చంద్రసూర్యులు, హనుమంతుడును మీకు శుభమును జేకూర్తురుగాక!

శ్రీరామచంద్రుని సంస్మరణమే శుభలగ్నము, అదియే తారాబలము. అదియే చంద్రబలము. అదియే దైవబలము. అదియే విద్యాబలము.

ఈ విధముగా పురోహితులు మంగళఘోషములు సేయుచు, మంగళవాద్యములు మ్రోగుచుండగా 'ఓమ్ పుణ్యాహమ్' అని స్మరించి దంపతుల నడుమ బట్టిన తెఱలను దొలగించి యథావిధిగా వారిచే పాణిగ్రహణము సేయించిరి. లాజాహోమము జేయించిరి. ఆ తరుణమున మండపప్రాంగణమున మహావాద్యములు మ్రోగినవి. వారవనిత లాడిరి. వందిమాగధులు గొంతెత్తి బిగ్గఱగా మంగళగీత

ములనాలపించిరి. భూరికీర్తియు, శ్రీరామచంద్రుడు నాసమయమున బరమానందముతో ననేకదానము లొసరించిరి.

అనంతరము కుశుడును, లవుడును దమతమ భార్యలను గటి ప్రదేశమున నెత్తికొని సీత, యూర్మిళ మున్నగు సీమంతినులతో గూడి భోజనగృహమున కరిగిరి. అచ్చట గౌరీశంకరుల నారాధించి యగ్రసించన మను విధిని నిర్వర్తించిరి. పిమ్మట బుణ్యస్త్రీలచే బరి వేష్టితులై కుశుడు చంపికతోడను,లవుడు సుమతితోడను గూడి భోజనములు సేసిరి. ఉపనయనకాలమందు దల్లితోడను, వివాహకాల మందు భార్యతోడను గూడి భోజనము సేయవలయును. అన్యుల తోడ గూడి భుజింపరాదు. భుజించినచో జాతిత్యము గలుగునని శాస్త్రము సెప్పుచున్నది. ఈ విధముగనే శ్రీరామచంద్రుడు గూడ సోదరులతోడను, జారులతోడను, మిత్రులతోడను, మహారాజుల తోడను గూడి భూరికీర్తి మహారాజు గృహమున భోజనము సేసెను. భూరికీర్తియొక్క కోడండ్రచే వందనపూర్వకముగా బ్రార్థింపబడి సీతామహాదేవి కూడ బలువురు స్త్రీలతో గూడి భోజనము చేసెను. అనంతరము భూరికీర్తి మహారాజు సానందముగా ననేకములగు నుత్సవ ములు సేయించెను. తమ చుట్టును జేరియున్న ముత్తైదువలచే బరి కొల్వబడి కుశలవులు తమ తల్లియెదుటను, నత్తగారల యెదుటను దమతమ భార్యల చరణతలమున నగుమొగములతో శిరములు వంచి నమస్కారములు సేసిరి. ఆ వధూవరులు రాత్రివేళ బచ్చని వెలుగులో జూడ మచ్చట గొలుపుచుండిరి. నూతనవధూమణు లిరు వురు దమ కుంకుమముచే, బారాణిచే నలంకృతములైన చరణములను దమతమ భర్తల యొడిలో నుంచిరి. ఈవిధముగా ననేకవినోదములతో నుత్సవములతో మూడు దినసము లతిక్రమించెను. నాల్గవనాటి రాత్రి వెదురుపాత్రములలో వెలిగించబడిన దీపములతో నా బాలకుల

కిరుపురకు నీరాజనము లర్పించబడెను. పిమ్మట నా బాలకులు తమ తమ భార్యలను వీపుపై నెక్కించికొని మండపప్రాంగణమున నృత్యము సలిపిరి. తల్లి, యత్తగారు, నితరస్త్రీలు నా వినోదమును గని యానందించిరి. శ్రీరామచంద్రునితోడ వియ్యమందు భాగ్యము గలిగినందుల కెంతయో హర్షించి భూరికీర్తిమహారాజు కుశలవులకు దండిగా గట్నముల నొసగెను. కుశలవులకు వేలువేలుగా నొక లక్ష గజరాజములను, లక్ష పల్లకులను, నైదులక్షల గుఱ్ఱములను, ద్రవ్య పూరితములైన లక్ష రథములను, ననేకవస్త్రాభరణములను, గోవులను, దాసదాసీజనమును సమర్పించెను. ఈ విధముగా భూరికీర్తిమహా రాజుచే గారవింపబడి శ్రీరామచంద్రుడు భార్యాసమేతులగు తనయు లను గజారూఢుల గావింపజేసి సీతను, సోదరులను, బంధుగులను, మిత్రులను, మహారాజులను దోడుకొని యథాపూర్వముగా నుత్సవ ములు సాగుచుండ నిజమండపమున కరిగెను. పిమ్మట రఘునందనుడు వటపురిలో నొక మాసము కాలము గడపెను. సీతతోడ నొక నధి రోహించి సముద్రమునందు విహరించెను. అనంతరము దనవారిని, బరివారమును, నూత్నవధువులను దోడ్కొని సుఖముగా దమ నగర మగు నయోధ్యకు దరలిపోయెను.

శ్రీరామాగమనవార్తను విని నగరరక్షణమునకై నిలుపబడిన సచివుడు నగరము నంతను బతాకలతో, ధ్వజములతో, దోరణము లతో, జక్కగా నలంకరింపజేసెను. తూర్యములు మ్రోగుచుండ, నృత్యములు సాగుచుండ గజరాజమును ముందిడికొని శ్రీరామ చంద్రున కెదురుగా జనెను. పిమ్మట వాద్యములు మ్రోగుచుండ దనయులతోడను, సీతతోడను, సోదరులతోడను, గ్రొత్తకోడండ్ర తోడను, మిత్రులతోడను, సోదరుల భార్యలతోడను, పౌరులతోడను బలగములతోడను గూడి మార్గమునందు నృత్యాదికము నవలోకిం చుచు శ్రీరామచంద్రుడు నగరప్రవేశము గావించెను. ఆతరుణమున

వారవనితలాడిరి. వందిమాగధులు పాడిరి. పత్నీసమేతులై గజరాజముల నధిరోహించి యున్న కుశలవులపై బురస్త్రీలు పుష్పవృష్టులు గురియించిరి.

ఈవిధముగా శ్రీరామచంద్రుడు బాలురతో స్వగృహమున ప్రవేశించి మహాలక్ష్మీపూజనము గావించెను. అనేకదానము లొసగెను. మిత్రులను, పౌరులను, నిష్టజనులను, భూపాలురను జండాలుర పర్యంతముగా గలవారి నెల్లరను నూతనవస్త్రాభరణాదికము నొసగి గౌరవించెను. పిమ్మట భూరికీర్తియొక్క మంత్రులను, సైన్యమును దగినవిధముగా బూజించి వారిదేశమున కంపివైచెను. అనంతరము జానపదులకు మిత్రులకు, వానరులకు, విభీషణాదులకును వారివారి నెలవులకు వెడలిపోవ ననుమతి యొసగెను. అప్పుడు వారందఱును నవ్యవస్త్రాభరణములతో, వాహనములతో, సమతము కోశములతో (ధనాగారము) శ్రీరామచంద్రుని బూజించి తమతమ సైన్యములతో దమతమ దేశములకు వెడలిపోయిరి. పిమ్మట రఘునందనుడు కోశం ద్రతోడను, గొడుకులతోడను, భార్యతోడను, సోదరులతోడను గూడి సర్వవిధసుఖసంపదల దేలుచు జిరకాల మప్రతిమానముగాను, ధర్మబద్ధముగాను రాజ్య మేలెను.

అనంతరము సంవత్సరము మొత్తముమీద శ్రావణబహుళపక్షమున వచ్చు నమావాస్య మొదలు పర్యాయముగా వచ్చు పదునాఱు పర్వదినములందును భూరికీర్తిమహారాజ శ్రీరామచంద్రు నంతఃపురపరివారసమేతముగా, సపుత్రమిత్రబాంధవముగా తన నగరమునకు గొనిపోయి యథావిధిగా నవ్యవస్త్రాలంకార వాహనములతో నారాధించి కొన్ని దినములవఱకు దమ యింట నిలిపికొని యంపెను.

శిష్యా! విష్ణుదాసా! సంవత్సరము మొత్తముమీద వచ్చు పదునాఱు పండుగదినములను వివరించుచుంటి నాలకింపుము. శ్రావణ

మాసమునందలి యమావాస్య, భాద్రపదశుద్ధచతుర్థి, విజయదశమి తోడిరెండుదినములు, దీపావళికి సంబంధించిన నాలుగు దినములు, మార్గశిరశుద్ధపంచమి, షష్ఠి, మకరసంక్రాంతి, రథసప్తమి, చైత్రశుద్ధపక్షమున వచ్చు వాలుతాళనీప్రతిపత్తిథి (పాడ్యమి) అక్షతదియ, శ్రావణశుద్ధపూర్ణిమ, శ్రావణశుద్ధపంచమి- ఈపదునాలుగును మహాపర్వదినములు. ఈదినములందు భూరికీర్తిమహారాజు శ్రీరామచంద్రుని దన గృహమునకు గొనిపోయి సాదరముగా బూజించెను.

విష్ణుదాసా! యీవిధముగా నీకు నేను బూర్వము విస్పష్టవిధముగా కుశలవుల వివాహచరిత్రమును సంపూర్ణముగా వర్ణించి వినిపించితిని. ముందుముందు శ్రీరామచంద్రుడు వైకుంఠారోహణము సేయు శుభసమయమున నయోధ్యానగరమునందు సరయూనీరములలో కుశుడు చంపికతో జలక్రీడలు సేయును. పరమోజ్జ్వలమైన యతని చేతి సువర్ణకంకణమా సమయమున సరయూజలమధ్యమున బడిపోవును. ఆనీరములందు కుముదుడను నాగునిసోదరి కుముద్వతియను నామె నివసించుచుండును. ఆమె యాకంకణమును గొని తన గృహమునకు వెడలిపోవును. తోడనే కుశుడు కంకణమునకై సరయూజలమును శుష్కింపజేయనెంచి వింట బాణమును సంధించును. అప్పుడు సరయువు కుముదుని కడకేగి తనను రక్షింపుమని యతనిని వేడికొనును. అంతట కుముదుడు క్రుద్ధుడైన కుశుని గాంచి యడలి సోదరిని వెంటనిడికొని యతనికడకు జనుదెంచి యామెను భార్యగా స్వీకరింపుమని యతని కర్పించవైచును. ఆమెతో బాటు కంకణమును, మఱికొన్ని రత్నములను సమర్పించి యతనితో సఖ్యము జేసికొనును. ఈవిధముగా ముందుముందు కుముద్వతి యనుపేర మఱియొక భార్య ప్రాప్తించును. ఆమెయందు కుశున కతిథి యనుపేర నుత్తముడగు నొక్క తనయు డావిర్భవించును. చంపికయందు గొమరితలే కాని కొడుకు లుద్భవింపరు. అతిథివలన సూర్యవంశము ముందుముందు

చిరకాలము విస్తరిల్లును. ఈవిధముగా కుశుని యిరువురు భార్యల యుదంతము నీకు వివరించితిని. పిమ్మట కుశుడు తనభార్యతోడను, లవుడు తనభార్యతోడను సమతము మందిరములందు క్రీడించుచు హాయిగా గాలము గడపసాగిరి.

చతుర్థసర్గము సమాప్తము.

— ౦౦ —

## పంచమ సర్గము

### శ్రీరామచంద్రుడు జలదేవతల బారినుండి గంధర్వకన్యలను, నాగకన్యలను విడిపించుట.

శ్రీరామదాసుడు విష్ణుదాసునకీ విధముగా వివరించును.

ఒకనాడు శ్రీరామచంద్రుడు సీతామహాదేవిని, తనయులను, సోదరులను, పౌరులను, మంత్రివర్గమును, శిష్టజనమును దోడుకొని పుష్పకవిమానమున నధిరోహించి మార్గమునందనేక కౌతుకముల నవలోకించుచు, సీతకు జూపి యామె నానందపఱచుచు దండకారణ్యము నందలి యగస్త్యమహాముని యాశ్రమమున కరిగెను. అతని యాగమనవార్త నాలించి కుంభసంభవు డెదురుగా జని యతనిని సపరివారముగా దన యాశ్రమమునకు దోడుకొనిపోయెను.

పిమ్మట నామహర్షి స్నానమొనరించి యేకాంతమున గూరుచుండి మహాలక్ష్మియగు నన్నపూర్ణామహాదేవిని ధ్యానించెను. ఆ మహానుభావుని తపముచే ప్రసన్నురాలై పరమేశ్వరి యతని యెదుట ప్రకటమై పాయసభరితమైన యొకపాత్రము నాతని కొసగి యాతనితో 'నోమునిరాజా! నీభార్య యీపాత్రమునుండి యభిలషితములైన సమస్తపక్వాన్నములను వెలికి దీసి యందఱకును వడ్డింపవచ్చును.,

అనిచెప్పి యంతర్ధానము నందెను. పిమ్మట లోపాముద్ర యాయక్షయపాత్రమునుండి శీఘ్రముగా జిత్రవిచిత్రములగు దివ్యాన్నములను వెలికి దీసి బ్రాహ్మణబృందములతో గూడిన శ్రీరామచంద్రునకు వడ్డించెను. ఆపదార్థముల నారగించి శ్రీరామచంద్రుడు పరితృప్తుడయ్యెను. అప్పు డగస్త్యమహర్షి శ్రీరామచంద్రునకు రత్నఖచితములైన రెండు సువర్ణకంకణములను, సీతామహాదేవికి రెండు దివ్యకుండలములను గానుకగా నర్పించెను. ఈవిధముగా నామహామునిచే బూజింపబడి శ్రీరామచంద్రుడా మహర్షిని గూడ దన పరివారముతో బాటు పుష్పకము నెక్కించి మరల దండకారణ్యములోని వింతలను, విశేషములను విలోకించుచు నిందందు బరిభ్రమించెను. నానావిధములైన వృక్షములను, పర్వతములను, నదులను, పక్షికులములను, మృగములను జనకజాతకు జూపుచు దిరుగుచుండగా నాపరమపురుషున కొక్కచో బంచాప్సరసరస్సను పేరబరగు నొక సరస్సు గానవచ్చెను. ఆ సరస్తీరమున దిగి రాఘవుడు సానందముగా నారేయి నచ్చట నివసించెను.

సీతామహాదేవితో మంచముపై గూరుచున్న శ్రీరామచంద్రున కచ్చట నంతలో నప్సరసల నాట్యము, మధురగానమును వినవచ్చెను. రాఘవునితోడ నున్నవార లందఱును గూడ నా నాట్యగానముల నాలకించిరి. కాని వారి కచ్చట నెందును నచ్చరలేమలు గానరాలేదు. అప్పుడు రఘునందనుడీ నాట్యగానము లెచ్చటనుండి వినవచ్చుచున్నవో సవిస్తరముగా నెఱుగజెప్పుడని యగస్త్యుని గోరెను. అంతట నగస్త్యు డిట్లు నొడువ నారంభించెను.

రఘునందనా! ఈవిషయము మీ రెఱుగనిది గాదు. అయినను నాముఖమున నెల్లరకు వినిపింపజేయు నన్నడుగుచుంటిరి. కావున నొడువుచుంటి నాలకింపుడు. పూర్వమొక సమయమున మనోహర

ములైన యాకారములు గలిగి యింకను రజోధర్మమును గాంచని కన్యలైదుగురు గంధర్వరాజు కొమరితలీ సరోవరమునందు సానందముగా క్రీడించిరి. అంతలో నాసరోవరము లోపలనుండి యింకను యౌవన మంకురింపని ప్రాయమునందున్న నాగకన్యలేడుగురు వెలికి వచ్చిరి. వీరికి, వారికి సఖ్య మేర్పడెను. నాటినుండియు నాకన్యలు క్రీడార్థమీ సరస్తీరమునకు వచ్చిపోవ మొదలిడిరి. ఇచ్చటనే యొక ముని తప మొనరించికొనుచు బర్యాయముగా వారిని దన సమీపమునకు రావలదని హెచ్చరించెను. అయినను బాల్య చాపల్యమున ప్రేరేపింపబడియు, నామునియొక్క తపోభంగమునకై యింద్రునిచే బురికొల్పబడియు నా బాలికలా మునివాక్యము నొక్కింతయు లెక్కసేయక నిరంతరముగా నతని కడకు వచ్చుచునే యుండిరి. అప్పుడా ముని వారిని శపించినచో దన తపశ్శక్తి క్షీణించునని యెంచి శాపమీయ కక్కఱలేకుండ వారిని దండించు విధాన మాలోచించెను. తన మాటను మన్నించు జలదేవతలను బిలిచి 'జలదేవతలారా! మీరీ బాలికలను మీగృహమునకు దీసికొనిపొండు' అని వారి కాదేశించెను. ముని వాక్యానుసారము జలదేవతలా బాలికలను మధ్యాహ్నసమయమున బలాత్కారముగా బట్టి తమ గృహమునకు గొనిపోయిరి. అచ్చట కన్యలెవ్వరును జేరజాలరు. గంధర్వులును, నాగులు నచ్చటకు జేరలేకపోయిరి. తపఃపరిసమాప్తి యైనంతనే యాముని స్వర్గమునకు వెడలిపోయెను. ఆ బాలికలా జలదేవతల చెఱలోనే యుండిపోయిరి. రాఘవా! ఈయుదంత మాధునికమైనది. ఆశ్చర్యజనకమైనది. ఆ బాలికలిప్పటికి నాజలదేవతల జలాంతర్గత గృహమునందే యున్నారు. వారి నాట్యగానధ్వనియే మనకు వినవచ్చుచున్నది. ఇది యా నాట్యగానధ్వనుల యుదంతము. ఆలించితివి గదా! ఇటుపైనెట్టు లుచితమైన నట్టు లాచరింపుడు."

ఈవిధముగా నగస్త్యమహర్షిచే బురికొల్పబడి రఘునందను డానందముతో లక్ష్మణుని బిలిచి 'లక్ష్మణా! చాపము నిటు దెమ్ము. బాణప్రయోగము జేసి జలదేవతలను గాల్చివైచి క్షణములో నాగ కన్యలను, గంధర్వకన్యలను జలాంతరమునుండి యుద్ధరించెదను' అని యతని కాదేశించెను. వెంటనే లక్ష్మణుడు ధనువు, నమ్ములపొదిని దెచ్చి రాఘవున కందించెను. అప్పుడు శ్రీరామచంద్రుడు కోదండము నెక్కుబెట్టి టంకారము గావించి యమ్ములపొదినుండి నిజనామాంకిత మైన శరమును గొని కేల ధరించెను. తోడనే ధరణి గంపించెను. సప్తసముద్రములును గలగుండువడెను. ప్రళయవాయువులు సెల రేగెను. దిక్కులన్నిటియందును బెనుధూళి గ్రమ్మెను. నక్షత్రము లూడిపడెను. వన్యమృగము లడలి యందందు బరుగులు వెట్టెను. పర్వతములు దద్దరిల్లెను. మేఘములు నెత్తురులను వర్షించెను. ఈ మహాప్రళయము నెఱిగి శ్రీరామధనుష్టంకారము నాలకించి యడలున వడనడ వడకుచు నాజలదేవతలా కన్నియలను దోడుకొని శ్రీరామ చంద్రుని సన్నిధికి బరుగిడి వచ్చిరి. వచ్చి యా జలదేవతలు, నాబాలి కామణులును రఘునందనునకు బ్రణమిల్లిరి. ఆ పంద్రెండుగురు కన్య లను రాఘవున కప్పగించి జలదేవత లాతని నిట్లు ప్రార్థించిరి. "మహా బాహూ! రఘునందనా! మా యపరాధమును మన్నింపుడు. మాపై నెత్తిన శరము నుపసంహరింపుడు. సూర్యవంశమునం దాడువారిపై శరప్రయోగము జేయువారెవ్వరును జన్మించియుండలేదు. సీతాశపథ కాలమున దొల్లి మీరు గూడ నాడుది యగుటచే భూదేవిని రక్షించి యుండలేదా? బ్రాహ్మణహననము జేసిన హేతువుచేతనే యాడుది యైనను దాటకపై శరప్రయోగము గావించితిరి. అదియు లోక కల్యాణము నపేక్షించి చేసిన కార్యము." ఇట్లు ప్రార్థింపగా నాలించి మందహాసము జేసి శ్రీరామచంద్రుడు యథాపూర్వకముగా దన శర మునాదలి శరము నమ్ములపొదిలో జేర్చివైచెను. పిమ్మట నాజలదేవ

తలచే బూజింపబడి సంతుష్టుడై వారికి వారివారి నెలవులకు వెడలిపోవ సెల వొసగెను. ఇంతలో నచ్చటకు దమ కొమరిత లుద్ధరింపబడిన వార్త నాలించి గంధర్వులు, నాగులును బరుగిడి వచ్చిరి. సీతారాము లకు బ్రణమిల్లి యగస్త్యమహర్షికి గూడ నమస్కరించి శ్రీరామ చంద్రున కనేకములగు కానుకల నర్పించి దోయిలి గట్టుకొని వినయ భావము విస్తరిల్ల నామహాపురుషునితో నిట్లుపలికిరి.

పంచమసర్గము సమాప్తము

— 0⁰0 —

## షష్ఠ సర్గము

### లక్ష్మణాదుల పుత్రులతోడ గంధర్వులయు, నాగులయు బంద్రెండు గురు కొమరితలకు బెండ్లిసేయ నిశ్చయించుట

శ్రీరామదాసుకు విష్ణుదాసున కిట్లు వివరించును.

"రాజీవనయనాభిరామా! శ్రీరామా! మీరు దయామయు లగుటచే మా బాలికలకు విముక్తి గలిగించితిరి. ఇంతవఱకు రజో ధర్మము నెఱుగని మాయీ బాలికలకు మీకుటుంబమునం దుద్భ వించిన బాలురతోడ వివాహములు సేయగోరుచున్నాము. ఇప్పుడు మేమెల్లరమును ధన్యుల మైతిమి. మా కులము పావనమైనది. మీ యనుగ్రహమున మే మెల్లరమును దరించితిమి. ఏడు జన్మములలో మేము చేసికొన్న పుణ్యముల ప్రభావమున మీతో మాకు బంధుత్వ మేర్పడుగాక!" ఇట్లు గంధర్వులు, నాగులును బ్రార్థింపగా నాలించి రఘునందనుడు వారి యభిలషితమునకు సమ్మతించి యగస్త్యమహర్షి దెస కవలోకించెను. అప్పుడు రాఘవునితో నగస్త్యు డిట్లనెను. రాఘవా! ముందుముందు గుముదుని సోదరి కుముద్వతి యనునామె కుశునకు మఱియొక భార్య గాగలదు. చంపికకు దనయుడు గలుగడు. కుశుని

వలన గుముద్వతి కతిథి యనుపేర నొక తనయు డావిర్భవించును. ముందుముం దతడే రాజ్యకర్తయు, వంశకర్తయు గాగలడు. కావున మీరీ నాగకన్యల నేడుగురను గుశునకు దప్పించి శేషించిన యేడుగురు కుమారులకు నిచ్చి పెండ్లి సేయుడు. గంధర్వకన్యల నేవురను యూపకేతుని, గుశుని, లవుని దప్పించి శేషించిన యేవురకు నిచ్చి పెండ్లి సేయుడు. ముందుముందు యూపకేతువు వేఱొక కన్యను రాక్షస వివాహ విధానమున బెండ్లి యాడగలడు. ఈ విధముగా మీ తనయు లందఱును దమతమ భార్యలతో హాయిగా క్రీడింపగలరు. వారి వలన మీకు జాలమంది పౌత్రులు, ప్రపౌత్రులును గలుగగలరు. ప్రపౌత్రునియొక్క ప్రపౌత్రుని మొగము జూచిన తరువాత మీరు సీతతోడను, భ్రాతలతోడను, బురజనులతోడను వైకుంఠమునకు వెడలిపోవగలరు.'' ఈ విధముగా నగస్త్యుడాడిన మాటల నాలకించి యట్లు సేయుటకు సమ్మతించి శ్రీరామచంద్రుడా బాలికల పేర్లేమని గంధర్వులను, నాగులను బ్రశ్నించెను. చంద్రిక, చంద్రవదన, చంచల, చపల, అచల యని గంధర్వుడు తన యేవురు కొమరితల పేర్లను దెలిపెను. ఆ పేర్లను విని రాఘవుడు నాగులవంకకు జూచెను. అప్పుడు నాగులు కంజానన, కంజనేత్ర, కంజాంఘ్రి, కళావతి, కాళిక, కమల, మాలతి, యని తమ యేడుగురు కొమరితల పేర్లను దెలిపిరి. ఈ విధముగా నా బాలికల పేర్లను దెలిసికొని వారిని బుష్పకవిమానమునం దెక్కించికొని స్వజనముతోడ నారాత్రి యందు శయనించెను. పిమ్మట బ్రాతఃకాలమున మేలుకాంచి యా గంధర్వులను, నాగులను బిలిచి వారితో నిట్లు పలికెను. నాగులారా! గంధర్వులారా! నేను మానవలోక నివాసి నగుటచే నాయీ పరివారమును వెంటబెట్టుకొని వివాహములకై మీలోకమగు రసాతలమునకు గాని, గంధర్వలోకమునకు గాని రాజాలను. కావున నామాట నాలించి మీ రందఱును మీ మీ లోకముల కరిగి మీమీ పుత్రమిత్రకళత్ర బాంధవాదుల నంద

అను దోడ్కొని వివాహార్థము సుఖముగా మా యయోధ్యానగరము నకు విచ్చేయుడు. ఇప్పుడు నేను ముందుగా బతాకాధ్వజసమలంకృతమైన పుష్పకవిమానము నధిరోహించి యయోధ్య కేగెదను.' అనగా విని వారెల్లరు నట్లకాక! యని తమతమ నెలవులకు దరలిపోయిరి. శ్రీరామచంద్రుడును నా బాలికలతోడను, బాలురతోడను, భార్యతోడను, సోదరులతోడను బుష్పకము నధిరోహించి యాకాశమార్గమున నొక్కయామము కాలములో నయోధ్యకు జేరెను. పురనారీమణులచే నీరాజనము లందికొనుచు దన గృహమున బ్రవేశించెను. ఆ బాలికల నందఱను వసిష్ఠ మహర్షి గృహమున కంపివైచెను.

అనంతరము సభామధ్యమున నాసీనుడై సౌమిత్రిని బిలిచి యతని కిట్లు లాదేశించెను. "లక్ష్మణా! తమ యంతఃపురపరివారములతో, పౌరులతో, జానపదులతో పెండ్లికి రావలసినదని మహారాజులకు, మిత్రులకు, మునీశ్వరులకు నాహ్వానపత్రికల నంపుము. అయోధ్యానగరము నలంకరింపజేయుము. కందకముల నేడింటిని శోధింపజేయుము. భవనములకు వెల్లలు వేయింపుము. గోడల మీద జిత్తరువులను లిఖింపజేయుము. దేవాలయము లన్నిటికి నందముగా వెల్ల వేయించి చిత్రములను లిఖింపజేయుము. ధ్వజములను నాటింపుము పతాకలను గట్టింపుము. ఎల్లయెడల దోరణములను గట్టింపుము. బంగారు వేదికలను గల్పింపజేయుము. మండపములను నిర్మింపజేయుము. ఏనుగులను, గుఱ్ఱములను, బల్లకులను నలంకరింపజేయుము, గంధర్వులకై, నాగులకై, యన్నవస్త్రపూరితంబులై, సమస్తవస్తు సంభారసంభరితంబులగు గృహముల నేర్పఱింపుము. నేను జెప్పకున్నను నీ కావశ్యకములని తోచిన యేర్పాటు లన్నియు గావింపుము." ఈ యాదేశము నాలించి యట్లకాక! యని లక్ష్మణు డెల్ల యేర్పాటులును గావించెను.

పిమ్మట గంధర్వరాజును, నాగు లేడుగురును దమతమ బంధుమిత్ర పరివారములతో సానందముగా సాకేతనగరమునకు బయనమైరి. నాగులు మానవరూపములను దాల్చి యేనుగులపై, గుఱ్ఱములపై, రథములపై నారూఢులై బయలువెడలిరి. గంధర్వులు బలగములతో, బరివారములతో బయలుదేఱిరి. క్రమముగా వారును, వీరును సాకేతనగరము నందలి యుద్యానవనమునకు జేరిరి. వారి యాగమనము నెఱిగి రాఘవుడు బహుళములైన మంగళవాద్యములతో, నచ్చరలేమల యాటపాటలతో వారి కెదురుగా జని నగరములోనికి గొనివచ్చి వారికై ప్రత్యేకింపబడిన భవనములలో వారిని విడియుజేసెను. పిమ్మట నొకనాడు వారితోడ సభలో సుఖముగా నాసీనుడై శ్రీరామచంద్రుడు జ్యోతిశ్శాస్త్రవేత్తలను, వసిష్ఠుని, బురోహితుల నన్యులను మఱికొంతమందిని రావించి వేఱువేఱుగా వివాహమంగళములను నిర్వర్తించుటకై సంవత్సరమధ్యమున శుభముహూర్తములను శోధించి తెలియజెప్ప బ్రార్థించెను. అప్పుడు జ్యోతిశ్శాస్త్రవేత్తలు ముహూర్తశోధన మొనరించి వైశాఖ మాసమున రెండుపక్షములందును రెండు ముహూర్తములను, జ్యేష్ఠమాసము నందలి రెండుపక్షములందును రెండు ముహూర్తములను, మార్గశీర్ష మాసమునందు రెండు ముహూర్తములను, మాఘమాసమునందు మూడు ముహూర్తములను, ఫాల్గుణమాసమునందు మూడు ముహూర్తములను నిర్ణయించి తెలియజెప్పిరి. లవునకు, నంగదునకు వైశాఖ మాసమునందును, చిత్రకేతునకు, పుష్కరునకు జ్యేష్ఠమాసము నందును, తక్షునకు, సుబాహునకు మార్గశీర్షమాసమునందును, యూపకేతునకు, నంగదునకు, చిత్రకేతునకు మాఘమాసము నందును, పుష్కరునకు, తక్షునకు, సుబాహునకు ఫాల్గుణమాసము నందును పెండ్లిండ్లు సేయదగునని గణకులు దెలియజెప్పిరి. ఈవిధ

ముగా క్రమముగా బండ్రెండు ముహూర్తములను నిర్ణయించిన మీదట నాగగణకులను రాఘవుడు ఘనముగా సత్కరించెను.

—: షష్ఠ సర్గము సమాప్తము :—

## సప్తమ సర్గము

### —నాగకన్యలయు, గంధర్వకన్యలయు వివాహములు—

శ్రీరామదాసుడు విష్ణుదాసున కిట్లు వివరించును.

అనంతరమా గణకులు, వసిష్ఠుడు, పురోహితులును గూడి రాఘవుని సమక్షమున బాలికలను గూడ విభజించిరి. వారు కంజాననను లవునకు, కంజాక్షి నంగదునకు, కంజాంఘ్రిని జిత్రకేతునకు, కళావతిని బుష్కరునకు, గాళికను తక్షునకు, గమలను సుబాహునకు, మాలతిని యూపకేతునకు నిచ్చి పెండ్లి సేయదగునని నాగకన్యల విభాగము దెలుగజెప్పిరి. పిమ్మట జంద్రిక నంగదునకు, జంద్రవదనను జిత్రకేతునకు, జంచలను బుష్కరునకు, జపలను తక్షునకు, నచలను సుబాహునకు నిచ్చి పెండ్లిసేయదగునని గంధర్వకన్యల విభాగము దెలుగజెప్పిరి. ఈవిధముగా నిర్ణయములు జరిగిన పిదప రాఘవుడా గణకుల నంపివైచి లోనికి జని సీతామహాదేవికీ యుదంతము దెలుగ జెప్పెను.

పిమ్మట నసంఖ్యాకులుగా మునీశ్వరులు, సప్తద్వీపములందలి మహారాజులును దమతమ పుత్రమిత్రకళత్రాదులతో, పౌరులతో, జానపదులతో నానావాహనముల నధిరోహించి యయోధ్యకు విచ్చేసిరి. వారితో గిటకిటలాడుచు నయోధ్య చూడముచ్చట గొలుపు చుండెను. విభీషణాదు లేగుదెంచిరి. వానరులతో దోడ్కొని సుగ్రీవు డరుగుదెంచెను. తన యిరువురు కొడుకులను వెంటనిడికొని భూరికీర్తి

మహారాజు నెదురుగు దెంచెను. జనకమహారాజు,యుధాజిత్తును నెదురుదెంచిరి. కౌసల్యాసుమిత్రల బంధువు లెల్లరు నేగుదెంచిరి.

అనంతరము శ్రీరామచంద్రుడు వైశాఖమాసములో శుక్లపక్షమునందు సుముహూర్తదివసమున బ్రాహ్మణులతోడను, పురోహితులతోడను గూడి యభ్యంగిస్నాన మొనరించెను. లవునకు మంగళస్నానము సేయింపుడని సీత మున్నగువారి కాదేశించెను. తోడనే వారు లవునకు నలుగు పెట్టి యభ్యంగము సేయించి తాము గూడ నభ్యంగస్నాన మాచరించిరి. పిమ్మట రాఘవుడు దేవకప్రతిష్ఠ గావించెను. తొలుత యథావిధిగా మహాగణాధిపతిని బూజించెను. పుణ్యాహవాచనములు సేయించెను. సానందముగా మహర్షుల నారాధించెను. అనంతరము ముహూర్తసమయమునకు నాగుల భవనమున కరిగి యథావిధిగా లవునితోడ గంజనయనకు వివాహమంగళమును నిర్వర్తించెను. నాల్గవ దివసమున వెదురుపాత్రములందు నిలుపబడిన రత్నదీపముల నీరాజనము లందికొని సీతామహాదేవితోడ మండపమునందు విరాజమానుడయ్యెను. పిమ్మట నిజమందిరమున కరిగి మహోత్సవములతో లవునిచే మహాలక్ష్మీపూజనము సేయించెను. ఆ తరుణమున ననేకదానము లొనరించెను. అనంతరము మహారాజులు, నాగులు, గంధర్వులు, మిత్రులు, పౌరులు, జానపదులు మున్నగు వారందఱు శ్రీరామచంద్రుని, లక్ష్మణాదులను, గుశుడు మున్నగు బాలకులను నూతనవస్త్రాభరణములతో జక్కగా బూజించిరి. పిమ్మట రాజపత్నులు, నాగపత్నులు, గంధర్వపత్నులు, నితరనారీమణులును నవ్యవస్త్రాభరణాదికముతో సీతామహాదేవి మున్నగు కాంతారత్నములను బూజించిరి. సీతామహాదేవియు దనను బూజించినవారి నందఱను మఱల నూతనవస్త్రములతో, నాభరణములతో గౌరవించెను. శ్రీరామచంద్రుడు గూడ దనను బూజించినవారి నందఱను

మఱల ఘనముగా వస్త్రములతో, నాభరణములతో, వాహనములతో సత్కరించెను.

ఈ విధముగా వైశాఖమాసములో, శుక్లపక్షమున యథావిధిగా లవునకు వివాహమంగళమును నిర్వర్తించి యథాపూర్వముగా మహోత్సవములతో నంగదునకు వివాహము గావించెను. జ్యేష్ఠమాసములో శుక్లపక్షమున చిత్రకేతునకు, కృష్ణపక్షమున పుష్కరునకు వివాహవిధులను నిర్వర్తించెను. అప్పుడు మహారాజులు మున్నగువారి నందఱను ఘనముగా గారవించి వారివారి నెలవుల కరుగ సెలవొసగి యంపివైచెను. మఱల వారి నందఱను మార్గశీర్షమాసమున రావించి తక్షునకు, సుబాహునకు వైభవోపేతముగా వివాహమంగళములను నిర్వర్తించి వారివారి నెలవుల కంపివైచెను. పిమ్మట మఱల వారి నందఱను మాఘమాసమున రావించి యూపకేతునకు, నంగదునకు, చిత్రకేతునకు మహోత్సవపురస్సరముగా పెండ్లిండ్లు సేసి వారిని వారివారి నెలవుల కంపివేయక నిలిపివైచెను. అనంతరము ఫాల్గుణమాసమున పుష్కరునకు, తక్షునకు, సుబాహునకు మహావైభవపురస్సరముగా వివాహవిధులను సంపన్నము గావించెను. ఈ విధముగా రఘునందనుడు పండ్రెండు వివాహములను జేసి మహారాజు లందఱచేతను బూజింపబడి మగుడ దాను వారిని బూజించి వారివారి నెలవుల కంపివైచెను. మునీశ్వరులను గూడ దగిన విధముగా గారవించి యంపివైచెను. గంధర్వరాజు, నాగు లేడుగురును సాకేతమునందే నిలిచిపోయిరి. శ్రీరామచంద్రుని వీడి వారు స్వస్థలముల కరుగ నిచ్ఛగించలేదు. వారు తమ రాజ్యములను రక్షించుటకు దమతమ మంత్రుల నంపివైచిరి. ముందు ముందు గాలాంతరమున శ్రీరామచంద్రుడు వైకుంఠమునకు వెడలిపోయిన తరుణమున నా గంధర్వరాజునకు, నాగులకును సాంతానికలోకములు ప్రాప్తించును.

సంవత్సరము మొత్తముమీద వచ్చు ప్రతి పర్వదినమునందును శ్రీరామచంద్రుడు పుత్రమిత్రకళత్రభ్రాతృపరివారములతో, పౌర జానపదవర్గములతో నరిగి గంధర్వులయింట, నాగుల యింట విందులు గుడుచుచుండును. అట్టి తరుణములం దెల్లవేళల నయోధ్యలో ప్రతి గృహమునందును మహోత్సవములు సంపన్నము లగుచుండును. ఎల్ల వారలు నానందపూర్వకముగా గాలమును వెడలించుచుండిరి. ఎందును నెవ్వరు నమంగళమున్న దెఱుగరు. అనంతరము రఘునాథు డనమండుగురు కొమరులకును వేఱువేఱుగా నెనిమిది భవనములను నిర్మింపజేసి శాంతులు సేయించి వారివారి భార్యలతోడ వారి నందు ప్రవేశపెట్టెను. లక్ష్మణాదులను వారివారి భార్యలతోడ వేఱువేఱు భవనములందు బూర్వమే ప్రవేశపెట్టియుండెను. సుమిత్ర తన తనయు డగు లక్ష్మణుని భవనములో సుఖముగా నివసించును. కైకేయి యొక మాసము భరతు నింటను, మఱియొక మాసము శత్రుఘ్ను నింటను హాయిగా గాలము గడపుచుండును. కౌసల్య సీతామహా దేవిచే సేవింపబడుచు సానందముగా శ్రీరామచంద్రు నింట వసించును. ఈ విధముగా రామాదిసోదరులును, కుశాదిబాలకులును వేఱువేఱుగా దమతమ వాహనములతో, సేవకులతో, దాసీజనముతో, గోధనాదికములతో సుఖముగా గాలము గడుపుచుండిరి.

లక్ష్మణాదిసోదరులును, కుశాదిబాలకులును ప్రతిదినము ప్రాతఃకాలమున మేలుకాంచి, నిత్యకృత్యములను నిర్వర్తించికొని, స్నాన మొనరించి తమతమ గృహములలో హోమములు, శివారాధనము, గోబ్రాహ్మణ పూజనము మున్నగు కార్యక్రమములను జక్కగా నిర్వర్తించికొని శ్రీరామచంద్రుని సన్నిధి కరుగుదురు. సీతారాములకు భక్తితో బ్రణమిల్లి దివ్యసింహాసనములపై నాసీను లగుదురు. కుశాదుల భార్యలు గూడ స్నానమొనరించి దుర్గారాధ

నము జేసికొని సీతామహాదేవి సన్నిధి కరిగి నమస్కరించి యామె సెలవు నంది యాసనములపై గూరుచుందురు. పిమ్మట లక్ష్మణాదులును, కుశాదులును దమ గురువు ముఖమున బురాణగాథల నాలకించి తమతమ గృహముల కరుగుదురు. తరువాత శ్రీరామచంద్రుని గృహమున కాహ్వానింపబడి పోయి యచ్చట నుపాహారములను, మధ్యాహ్నభోజనములను నారగింతురు. ఈ విధముగనే వారిభార్యలు గూడ సీతామహాదేవిచే బిలువబడి పోయి యామె గృహమున నుపాహారములను, భోజనములను సేవింతురు. ఒక్కొక్క తరుణమున నానందము మీఱ సీతారాములను దమ గృహమునకు రావించికొని విప్రులతోడగూడి వా రుపాహారముల నారగించి భోజనములు సేయుచుందురు. ఈ విధముగా సీతారాములు లక్ష్మణాదులతోడను, బాలకులతోడను గూడి నిరంతరసుఖముల దేలియాడిరి. ఎన్నడు నెవ్వరికి నెవ్వరితోడను నెట్టి కలహమును సంభవించలేదు.

సప్తమ సర్గము సమాప్తము

—()—

# అష్టమ సర్గము

## శత్రుఘ్నుని కుమారుడగు యూపకేతుడు మదనసుందరిని హరించుట.

శ్రీరామదాసుడు విష్ణుదాసున కిట్లు వివరించును.

అనంతరకాలమున దక్షిణదేశమునందలి శివకాంతిపురము నందా పురము నేలు కంబుకంఠమహారాజు తన కొమరితకు స్వయంవరము సేయ సంకల్పించి వేలువేలుగా మహారాజుల కెల్లరకు నాహ్వానపత్రికల నంపెను. అప్పు డా మహారాజు లందఱును గుశునితోడను

లవునితోడను దమకు గలిగిన పూర్వవైరమును దలపోసి యా మహారాజునకు వేలువేలుగా బత్రములను వ్రాసి పంపిరి. అందలి పత్రములందును శ్రీరామచంద్రుని కొమరులు స్వయంవరమునకు రానున్నచో మేమెల్లరమును రాగలము. కానిచో రాజాలము అను నొక విషయము లిఖింపబడియుండెను. ఆవిషయము నెఱిగి కంబుకంఠమహారాజు శ్రీరాముని తనయులతో దనకుగూడ సంభవించిన పూర్వవైరమును మనమున నుంచికొని శ్రీరాము నొక్కని బిలువక శేషించిన మహారాజుల నందఱ నాహ్వానించెను. అనంతరము శ్రీరామచంద్రుడు, నతనికొమరులు స్వయంవరమునకు బిలువబడలేదని యెఱిగి సప్తద్వీపములందలి మహారాజు లందఱును నిస్సంకోచముగా శివకాంతిపురమున కేగుదెంచిరి.

అనంతరము కంబుకంఠుని కొమరితను మేడపై నుండగా జూచి యాకాశమార్గమున నెటకో పోవుచున్న నారదుడు క్రిందకు దిగి యామెకడకు జనుదెంచెను. ఆమెయు సఖియలతోగూడి యా దేవర్షికి బూజానమస్కారములు గావించి 'మునిరాజా! మీ రెటనుండి విచ్చేసితిరి? ఎటకు బోవుచుంటిరి? మీ దర్శనమున నేను బవిత్రురాలనైతిని' అని ప్రశంసాపూర్వకముగా నతనిని బ్రశ్నించెను. అంతట నారదుడు మందహాసము జేయుచు నిట్లు బదులు పలికెను. "బాలికామణీ! నేను స్వర్గలోకమునుండి చనుదెంచుచున్నాను. అయోధ్యలో శ్రీరామచంద్రుని తనయుల యిండ్లలో వేలువేలుగా భోజనములు సేయు తలంపున నాకాశమార్గమున బయలుదేఱితిని. ఇంతలో మీ శివకాంతిపురము వెలుపల సైన్యములను గాంచి యివి యెవరివై యుండును? అని యాలోచించితిని. పిమ్మట దెరువరుల మొగమున నీకు స్వయంవర మని తెలిసికొంటిని. అప్పుడు నేను నా మనములో శ్రీరామచంద్రుడు బాలకులతోడ నెట్లును స్వయంవరమున కేగుదేరును

గదా ! ఆ స్వామి నిచ్చటనే దర్శింపవచ్చును. సగుదేరకపోయినచో నప్పుడే యయోధ్య కరుగవచ్చును. శ్రీరామచంద్రుడు, బాలకులును రాకుండ స్వయంవర మెట్లును సంపన్నముగాదు. ఆ ప్రభువు నిచ్చటనే దర్శించెదగాక ! నే నిప్పుడు ముందున కరుగుట నిరర్థకము'' అని తర్కించికొంటిని. పిమ్మట నిచ్చటకు వచ్చి చూడగా నాకా ప్రభువు గానరాలేదు. శ్రీరామచంద్రు డేల రాలేదని యిచ్చటకు జేరిన మహారాజుల నడిగితిని. వారి ముఖమున వారి యభిప్రాయము నెఱిగిన మీదట నామనమున నెంతయో ఖేదము జనించినది సోదరులతోడను, బాలకులతోడను శ్రీరామచంద్రు నీ స్వయంవరమునకు రావింపకుండుటకే నీ తండ్రియు, నీ మహారాజులును నిశ్చయించికొని యున్నారు. ఇప్పుడు నేను నా స్వామిని దర్శించుటకు సాకేతనగరమునకు వెడలి పోవుచున్నాను. శ్రీరామచంద్రునివంటి మహాప్రభువునకు గోడలివి గాలేని నీవు మిక్కిలి దురదృష్టవంతురాలవు. ఇంతకును గర్మము యొక్క గతి యెంతయు విచిత్రమైనది.'' ఇట్లు నొడివి యా బాలికకడ సెలవు గొని నారదుడు వెడలిపోవ నుద్యమించెను.

అప్పు డా బాలిక ఖిన్నమైన మనస్సుతో, గన్నీరునిండిన కన్నులతో, గమలిపోయిన వదనకమలముతో, నదరుచున్న యధరములతో, రోమాంచితమైన శరీరముతో, గద్గదికగన్న కంఠస్వరముతో 'మునికులభూషణా! ఏవిధముగా బ్రయత్నించిన నేను శ్రీరామచంద్రుని కోడలిని గాగలనో యావిధముగా మీరే కార్యసాధనము జేయవలయును. నేను మిమ్మే శరణుజొచ్చితి' ననుచు నా మునిరాజు చరణములపై శిరము నుంచి జాలిగలుగునట్లు విలపించెను. అంత నా దేవర్షి 'బాలా ! చింతింపకుము. లెమ్ము ! లెమ్ము ! నీవు శ్రీరామచంద్రుని కోడలివి గాగలవు. అందులకు దగిన విధముగా నేను బ్రయత్నము జేసెదను'. అని యామె నూఱడించి తన మార్గమున దాను జనెను.

ఇంతలో నయోధ్యానగరమునుండి రథము నధిరోహించి యూపకేతుడు వనములను గనుగొనుచు దమసాతీరమునకు జేరెను. అతనితోడ గొంత సైన్యముగూడ నుండెను. ఆ బాలకు డా నది చెంత కరిగి సంధ్యావందనము సేసికొన గూరుచున్నంతలో నతనికి నారద మహర్షి గానవచ్చెను. తోడనే యత డా మహర్షిని బూజించి యెట నుండి యేగుదెంచితిరి? అని ప్రశ్నించెను. అంతట నామహర్షి సవిస్తరముగా గాంతిపురమునందలి యుదంత మంతయు నా బాలకున కెఱిగించెను. అప్పుడా బాలకుడు "మునికులోత్తమా! మహారాజుల కంద ఱకు శ్రీరామచంద్రుని యెడల నే ద్వేషభావ ముదయించినదో యది వారి కెంతయో యనర్థహేతువని వారు శీఘ్రముగా దెలిసికొనగలరు. కదనరంగమున నాకంబుకంఠుడు మున్నగు భూపాలుర సత్త్వ మేపాటిదో నేను గనుగొనెదగాక! మీ యనుగ్రహమున నవశ్యముగా వారి నందఱను జయించి యా బాలికను గొనివచ్చెదను" అని సక్రోధముగ, ససంభ్రమముగా బలికి యా మునిరాజుకడ సెలవుగొని సైన్యమును వెంట నిడికొని యయిదవ దినసమునకు గాంతిపురము జేరెను.

నారదుడును సంతుష్టాంతరంగుడై శ్రీరామచంద్రుని దర్శనమునకు వెడలిపోయెను. అచ్చట రాఘవు డాతని బూజించి భోజనమునకు రమ్మని పిలిచెను. భోజనము సేయువేళ భోజనశాలలో రఘునందనునకు యూపకేతుడు గానరాలేదు. అప్పుడు రాఘవుడు లక్ష్మణుని బిలిచి 'లక్ష్మణా! ఏమి కారణముననో యీనాడు యూపకేతుడు భోజనమునకు రాలేదు. ఎచ్చటనున్నాడో వెదకి పిలిచికొని రమ్ము' అని యతని కాదేశించెను. తోడనే లక్ష్మణుడు యూపకేతుని గృహమున కరిగి యతడెందు జనెనని యతని భార్యయగు మాలతిని బ్రశ్నించెను. కొంతసైన్యమును దోడుకొని వనమధ్యమున కరిగె నని యామె బదులు పలికెను. ఆ విషయమును లక్ష్మణు డరిగి రాఘవునకెఱుగ జెప్పెను. అనంతరము సానందముగా మునిరాజుతోడ భోజనాదికము

నిర్వర్తించికొని శ్రీరామచంద్రుడు సభాస్థలి కరిగి సింహాసనముపై నాసీనుడయ్యెను. 'నారదా! నామాట విని నీ విక్కడ నైదు లేక యేడు దినములవఱకు నిలిచిపొమ్ము.' అని నారదుని గోరెను. నారదు డందులకు సమ్మతించెను. పిమ్మట రాత్రివేళ సుపాహారము సేయు తరుణమున మఱల యూపకేతుని గానక శ్రీరామచంద్రుడు లక్ష్మణా! వెంటనే యూపకేతుని బిలిచికొనిరమ్ము. ఆ పిల్లవా డీనాడు నాకు గానరాలేదు.' అని లక్ష్మణున కాజ్ఞాపించెను. అట్లకాక! యని లక్ష్మణుడు మఱల జని మాలతి నడిగెను. ఆమె యత డింతవఱకు నింటికి రాలేదని బదులు పలికెను. అప్పు డత డారాటపడుచు బోయి యా యుదంతము నన్న కెఱిగించెను. రాఘవు డది విని సోదరులతోడ మిక్కిలి కలత జెందెను. ఈ సమాచారము నాలకించి సీత కలవరపాటుతో బరుగిడి వచ్చి శ్రీరామచంద్రునితో బిల్లవాడు కానరాలేదని తెలిసినమీదట గూడ మీరందఱును మౌనభావము వహించి యూరకుంటిరేల యని తన యారాటమును బయలుపఱచెను. అప్పుడు వారందఱు నాత్రము జెందుచు సుపాహారములను సేవించుట మాని యూపకేతుని వెదక నుద్యమించిరి. అప్పుడు వారందఱి యారాటమును గాంచి నారదుడు కాంతిపురములో జరుగుచున్న మదనసుందరీ స్వయంవర సమాచారమును, యూపకేతు డచ్చటి కేగిన యుదంతమును వారి కెఱిగించెను. అప్పుడు రాఘవుడు శాంతించి యించుక మనమున సంతసించి లక్ష్మణుని వంకకు దిరిగి "లక్ష్మణా! చతురంగబలమును, గుశాదులను దోడ్కొని వెంటనే శత్రుఘ్నుని యూపకేతునకు బాసటగా నంపుము" అని యతని కాదేశించెను. అట్లకాక! యని లక్ష్మణుడా రాత్రి వేళ విశాలమైన వాహినితో, గుశాదిబాలకులతో శత్రుఘ్నుని యూపకేతుని చెంత కంపివైచెను. అన్నకు నమస్కరించి రథము నధిరోహించి శత్రుఘ్ను డాఱవనాటికి గాంతిపురము పొలిమేరలకు జేరెను.

ఇంతలో నక్కడ గాంతిపురములో స్వయంవరసమాగతులైన రాజన్యు లందఱు నానందము మీఱ నాసనముల నధిష్ఠించి యుండగా మదనసుందరి పల్లకినెక్కి కమలిన మొగముతో, గలతజెందు మనముతో నారదుని పలుకులను దలపోయుచు సభాస్థలి కరుగుదెంచెను. వృద్ధురాలైన దాది మహారాజుల నందఱను నామెకు జూపుచుండెను. ఇంతలో యూపకేతువు వాహనము వహించి వేగముగా నరుగుదెంచి సమ్మోహనాస్త్రమును బ్రయోగించి సభనంతను మోహింపజేసి వైచెను. ఆ యస్త్రముయొక్క ప్రభావమున మోహితులై వాహకులు పల్లకిని గ్రిందకు దింపివైచిరి. అప్పుడు రథమునుండియే యూపకేతువా పల్లకిని సమీపించి మదనసుందరికి దనపేరు జెప్పి సంతోషము గలిగించెను. అంతట నామె తన చేతిలోని నవరత్నమాలనాతని గళసీమ నలంకరింపజేసి యాతని వరించెను. అప్పు డామెను రథముపై నెక్కించుకొని యూపకేతుడు కాంతిపురము వెలుపలకు జని నిలిచెను. ఆమెతో "నీవు భయపడవలదు. నేను మహారాజుల నందఱను జయించి నిన్ను దీసికొని నగరమున కేగుదెంచెదను." అని చెప్పెను. ఆమాట విని యామె 'స్వామీ! మీరొంటరిగా నున్నవారు. మీసైన్యము కూడ నల్పముగా నున్నది. ఆవంక మహారాజు లసంఖ్యాకులుగా నున్నారు. వారి సైన్యములు గూడ నసంఖ్యాకములుగా నున్నవి. మీరొక్కరు వారితో నెట్లు పోరగలరు? వలదు. సంగరము సేయవలదు. నన్ను శీఘ్రముగా సాకేతమునకు జేర్పుడు. అచ్చటనుండి విశాలమైన సైన్యముతోడ శ్రీరామచంద్ర ప్రభువుకు దోడ్కొని వచ్చి యప్పుడు ఘోరయుద్ధము సేయుడు. నామాటను మన్నింపుడు. సాహసింపవలదు. మిమ్ములను మఱియు మఱియు వేడుచున్నాను.' అని బదులు పలికెను.

ఆమె మాటల నాలించి భయపడవలదని యామెను మఱియు మఱియు నూఱడించి యూపకేతుడు మహారాజులపై బ్రయోగించిన

సమ్మోహనాస్త్రము నవలీలగా నుపసంహరించెను. అప్పుడు మహారాజు లందఱును దేఱుకొని లేచి బాలికను శత్రుఘ్నుని తనయుడు హరించికొనిపోయె నని యూ వారి మొగమున నాలకించి చంపికాసుమతుల స్వయంవరములో సంభవించిన పూర్వవైరముచే దర్పించి తమతమ సైన్యములను వెంటనిడికొని రథముల నధిరోహించి వడిగా జని వరమాలను దాల్చి రథారూఢుడై మదనసుందరితో గూడియున్న యూపకేతుని దర్శించిరి. తోడనే వారును, వారి సైనికులును గూడ యాతనిపై ననేకశస్త్రములను బ్రయోగించిరి. యూపకేతుడును వెంటనే మహాధనువును కేల ధరించి యొక్కమాఱు భయంకరటంకారము గావించి యందు వాయవ్యాస్త్రమును సంధించి వారి నందఱను సైనికులతో, వాహనములతో నెగసి పది దిక్కులయందును జెదరి పడునట్లు లేసెను. ఆ సమయమున గంబుకంఠుడు గూడ జంపికాసుమతుల స్వయంవరమునందు గలిగిన పూర్వవైరమును, నేటి నిజకన్యాపహరణమును దలపోసి క్రోధమున గనలుచు దన సైన్యమును దోడ్కొని దుందుభిఘోషములతో క్షణములో ముందునకు వచ్చెను. యూపకేతుడు గూడ నాదుందుభిఘోషము నాలించి కాంతిపురముయొక్క యుత్తరపు ద్వారమునకు ముందు బోరాటమునకు సన్నద్ధుడై నిలిచెను. ఒక్కమాఱు కర్ణములు పగులునట్లు భయంకర ధనుష్టంకారము గావించి యా ద్వారములోపలనుండి వెలుపలకు వచ్చు వీరుల నందఱను గ్రమముగా శరవర్షము గురియించి నిహతుల గావింప నారంభించెను. క్షణములో శవములతో నాద్వారము నిరుద్ధమయ్యెను.

యూపకేతుని యా మహాపరాక్రమము నవలోకించి కంబుకంఠుడు వెనుకంజవేయక యా శవములను ద్రొక్కికొనుచు రథారూఢుడై శేషించిన సేనతో ముందునకు వచ్చెను. వచ్చి యూపకేతునితో "నోయీ! యీ దోమలను జంపి మహాపౌరుషవంతుండవని భావించుకొను

చుంటివా? అట్లుకాదు. మగటిమి గలవాడవేని నాతో సమరము సేయుము" అని బీరములు పలికెను. పిమ్మట యూపకేతునిపై నేడు బాణములను ప్రయోగించెను. తనదెసకు వచ్చు నారసములను వెంటనే యూపకేతుడు తనవాడి యలుగులతో నీరసముల గావించి తొమ్మిది బాణముల నెడమీయక ప్రయోగించి కంబుకంఠుని వింటిని, సారథిని, ధ్వజమును, గవచమును, గిరీటమును ముత్తుమురు గావించి యశ్వములను గూడ నవనిపై గూల్చెను. అప్పుడు కంబుకంఠుడు పాదచారియై గదాదండమును జేకొని యూపకేతుని దెసకు బరుగువెట్టెను. తోడనే యూపకేతుడు వాడి యలుగులతో నాతని గదాదండమును సహస్రశకలములు గావించెను. అప్పుడు కంబుకంఠుడు సత్వరముగా బిడికిలి బిగపట్టి యాతని వక్షస్స్థలమున నొక్క వజ్రముష్టి ప్రహారము జేసెను. తోడనే యూపకేతు డాతని బలిమిని బట్టి తన రథమునకు జెందిన ధ్వజముకడకు జేర్చి కట్టివైచెను. వడిగా గరమున గరవాలమును ధరించి యాతని సిరమును దఱిగివేయ సమకట్టెను. అప్పుడు మదనసుందరి మనమున గలవర మధికము గాగా, నుత్సాహ మంతరింప వడవడ వడకుచు గన్నుల గన్నీరు గార్చుచు 'స్వామీ! మన వివాహమంగళమునకు ముందు నాతండ్రి ప్రాణములను హరింతురా? ప్రథమకబళమున మక్షికాపాతము విధముగా (మొదటి ముద్దలో నీగ పడుట) సుఖారంభమున దుఃఖకర్మమునకు బూనుకొందురా? వలదు. వలదు. నాతండ్రిని సంహరింపవలదు. మిమ్ము ప్రార్థించుచున్నాను' అని యూపకేతుని ప్రార్థించెను. తోడనే యతడు చిఱునవ్వు నవ్వి కరమునందలి కరవాలమును విడిచి తన సారథిని రథమును నడప బురికొల్పెను.

సైన్యమును దోడ్కొని యయోధ్యామార్గమున గొంత దవ్వరిగినమీదట నాతనికి ముందు మార్గమున సైన్యముల దుందుభి నిర్ఘోషము వినవచ్చెను. తోడనే [illegible] వింటిని సిద్ధము జేసికొని

ముందు మార్గమున నీసైన్యమెవరిదని మనములో క్షణము చింతిం
చెను. పిమ్మట తనపేరు గల బాణమును వింట సంధించి యాసైన్యము
దిక్కునకు ప్రయోగించెను. ఆబాణ మేగి యోజనము దూరములో
నున్న సైన్యమునడుమ శత్రుఘ్నుని చరణప్రాంతమున బడెను. శత్రు
ఘ్నుడా బాణమును గ్రహించి యందలి పేరును గ్రహించి యూప
కేతువు ముందు మార్గమునం దున్నాడని తెలిసికొని తన పేరు గల
బాణమును దాను గూడ యూపకేతుని దెసకు ప్రయోగించెను. ఆ
బాణము యూపకేతుని తలపైనుండి పోయి యాతని వెనుక బడెను.
అతడా బాణమును జూచి పరమానందము నొంది దుందుభులను
మ్రోగింపజేయుచు వడిగా జని రథమునుండి దుమికి కంబుకంఠుని
జూపుచు భార్యతోడ చంద్రికి ప్రణమిల్లెను. అప్పుడు శత్రుఘ్నుడా
కంబుకంఠుని మిత్రునిగా భావించి బంధవిముక్తుని గావింపజేసెను.
కంబుకంఠుని ముఖముననే జరిగిన యుదంతమంతయు దెలిసికొనెను.
పిమ్మట కంబుకంఠుడు మిత్రభావముతో శత్రుఘ్నుని ప్రార్థించి
తన నగరము కాంతిపురమునకు దోడ్కొనిపోయెను. ఆ పురము
వెలుపల నిలిచి శత్రుఘ్నుడు కంబుకంఠుని సుముఖత నెఱిగి శ్రీరామ
చంద్రుని శీఘ్రముగా దోడ్కొనిరమ్మని దూతలను బుచికొల్పెను.
తోడనే యుగపత్తమున దూతలు నానందపూర్వకముగా రఘునంద
నుని దోడితెచ్చుటకు రయమున మిథిల నయోధ్యకు జనిరి.

— అష్టమసర్గము సమాప్తము —

— °0° —

# నవమసర్గము

## శ్రీరామచంద్రుని వంశవిస్తారము

శ్రీరామదాసుడు విష్ణుదాసుని కీర్తి వర్ణించుట.

దూతలయోధ్యకేగి శుభసమాచారము శ్రీరామచంద్రున
కెఱిగించిరి. రాఘవుడా యుదంతమును జనకునకు దెల్పించెను. అనం

తర మంతఃపుర పరివారముతో, పౌరులతో, మిత్రులతో, బలగ ముతో, నారదునితో గూడి శ్రీరామచంద్రుడు కాంతిపురమున కేగు దెంచెను. ఆ మహామహుని యాగమనవార్త నాలించి కంబుకంఠుడు సవినయముగా నెదురుగా జని ప్రణమిల్లి యతనిని బూజించెను. గజా రూఢుడై చనుదెంచు యూపకేతువు బూజించి మెల్లగా నగరము లోనికి గొనిరాదొడగెను. ఆ సమయమున వారవనిత లాడిరి. తూర్యఘోషములు సెలరేగెను. కాంతిపురములోని కాంతామణులు మేడలపై నిలిచి శ్రీరామచంద్రుని మీదను, యూపకేతుని మీదను బూలవానలు గురియించిరి. పిమ్మట క్రమముగా రాఘవుడు తమకై ప్రత్యేకింపబడిన నివాసగృహమునకు జేరి శుభముహూర్తమున వైభవోపేతముగా మహోత్సవములతో యూపకేతుని వివాహ మంగళమును సంపన్నము గావించెను. అనంతరము కంబుకంఠునిచే బూజాసత్కారముల నందికొని యేనుగులు, గుఱ్ఱములు, రథములు, కాల్బలము మున్నగువానిని, దాసదాసీజనమును, బరివారమును, నూత్నవధువగు మదనసుందరిని దోడ్కొని యయోధ్యకరిగి నగర ములో బ్రవేశించెను. ఆతరుణమున గూడ మంగళవాద్యములు మ్రోగినవి. వారకాంత లాడిరి. మేడలపై నిలిచి స్త్రీలు రాఘవునిపై బూలు వర్షించిరి. పురస్త్రీల నీరాజనము లందికొనుచు క్రమముగా రఘునందనుడు నిజమందిరమున బ్రవేశించెను. పిమ్మట మహాలక్ష్మి పూజనము సేయించి యనేక దానములు సేసెను. నూతనవస్త్రాభర ణములతో మిత్రులను గారవించి వారివారి నెలవుల కరుగ వారికి సెల వొసగెను.

పిమ్మట లవాదు లేడురుగురును దమతమ భార్యలతోడ సుఖిం చుచు హాయిగా గాలము గడపసాగిరి. కుశుడు చంపికతో క్రీడించుచు నానందముగా సమయము బుచ్చసాగెను. ఇట్టులుండగా సనతికాల మున నతనికి జంపికయందు దొమ్మండుగురు కొమరిత లుదయించిరి.

ముందుముందతనికి కుముద్వతియందు వరుసగా నెనమండుగురు కొడుకు లుద్భవింతురు. చంపకమాలిని యనుపేర నొక కొమరిత కూడ నావిర్భవించును. పెద్దకొడుకు అతిథి యనుపేర రాజ్యపరిపాలనము సేయును. సుమతి మున్నగు పదునలుగురు స్త్రీలును వేఱువేఱుగా క్రమముగా నెనమండుగురు కొడుకులను, నొక్కొక్క కొమరితను గాంచిరి. మనోహరములైన యాకారములు గల యా నూటపండ్రెండుగురు మనుమలను, నిరువదిముగ్గురు మనుమరాండ్రను సీతారాములు వాత్సల్యముతో లాలించి పాలించిరి. ముందుముందు కుముద్వతికి గలుగు కొడుకులతో గలిపినచో శ్రీరామచంద్రునకు నూటయిరువది మంది మనుమలు, నిరువదినలుగురు మనుమరాండ్రు నగుదురు. ఆకన్యల కందఱకు రాజకుమారులతోడ బెండిండ్లు సేయబడెను. మనుమలకు సచ్చరిత్రలైన రాజకన్యలతోడ వివాహములు సేయబడెను. కొందఱు కన్యలకు స్వయంవరవిధానముచేతను, గొందఱకు రాక్షసవివాహపద్ధతిచేతను, గొందఱకు గాంధర్వపద్ధతిచేతను, గొందఱకు సాధారణవివాహపద్ధతిచేతను బెండిండ్లు సంపన్నము లయ్యెను. వారి సంతతులను గణింప నెవరికిని శక్యము గాదు. ఈవిధముగా యూపకేతుని కడపటి వివాహమును బూర్తిసేయించి నారదు డత్యంతభక్తియుక్తాంతరంగుడై సభామధ్యమున నిలిచి తొల్లి సూతు డుపదేశించిన శ్రీరామసహస్రనామములతో శ్రీరామచంద్రుని స్తుతించెను. పిమ్మట నాపరమపురుషుని కడ సెలవు గైకొని యాకాశమార్గమున వెడలిపోయెను.

శిష్యా! విష్ణుదాసా! ఆలకించితివిగదా! ఈవిధముగా శ్రీరామచంద్రుడు సాకేతనగరములో నుండి చిరకాల మనేకభోగముల ననుభవించెను. ఆభోగముల నెవడు వర్ణింపగలడు? మహాతపోనిధి యగు వాల్మీకిమహర్షి మాత్రమే శతకోటిశ్లోకపరిమితమైన శ్రీమద్రామాయణమును రచించి యందు శ్రీరామచంద్రుని చరితల నన్నిటిని

వర్ణింప సమర్థుడయ్యెను. మహామంగళకారణమైన యా శ్రీరామచరిత్రము నాలకించినవాడ నగుటచేతనే నేను నీముందు నా యోపిన విధముగా నా చరిత్రమును నింత వర్ణించి వినిపింప గలిగితిని. ఈవిధముగా రఘునందను డయోధ్యలో బుత్రులతో, పౌత్రులతో, ప్రపౌత్రులతో, పౌత్రుల పౌత్రులతో గూడి సీతామహాదేవి మానసమును రంజింపజేసెను.

విష్ణుదాసా! ఇదిగో! ఇది వివాహకాండము. ఇది తొమ్మిది సర్గములు గలది. ఆలకించిన సమస్తశుభములను జేకూర్చునది. ఈ కాండమును భక్తితో నాలకించినవారు తమ పుత్రపౌత్రకళత్రములతో నెన్నడును వియోగమును బొందరు. ధనమును గోరువాడు ధనమును, గామితములను గోరువాడు కామితములను, మోక్షమును గోరువాడు మోక్షమును బొందును. వివాహమును గోరువారీ కాండమును బఠించిన నుత్తమురాలగు భార్యను బడయుదురు. పతిని గోరు కన్య స్నానము జేసి భక్తితో నీకాండమును శ్రవణము జేసినచో మనోహరుడగు పతిని బడయును. భార్య గలవాడీ కాండమును భక్తితో నాలకించినచో నిహలోకమునందు భార్యతో సుఖించి పరలోకమున నచ్చరలతో నానందించును. భర్త గలస్త్రీ యీ కాండమును భక్తితో నాలకించినచో దన భర్తతోడ నెన్నడు వియోగమును బొందదు. భార్యను గోరువారు పదునేడు దినముల కొక్క పర్యాయముగా నీవివాహకాండము నొక సంత్సరము కాలము పారాయణము జేసినచో వారు మూర్ఖులైనను సుందరీమణి యగు భార్యను బడయుదురు. మొదటిదినమున నొకసర్గము, రెండవ దినమున రెండుసర్గములుగా దినమున కొక సర్గముగా నెచ్చించుచు దొమ్మిదవ దినమున దొమ్మిది సర్గములు బఠించి పదియవ నాడెనిమిది సర్గములు, పదునొకండవనాడేడు సర్గములుగా దినమున కొక సర్గమును దగ్గించుచు మొత్తము పదునేడు దినములు పఠించిన నొక పారాయణము పూర్తి

యగును ఇది యొక పద్ధతి. ఇట్లు కానిచో మొదటి దినమున గాండ మంతయు నొక మాటును, రెండవ దినమున రెండుమారులుగా నెచ్చించుచు దొమ్మిది దినములు పఠించి పదియవనాటినుండి దిన మున కొక పర్యాయము పఠనమును దగ్గించుచు పారాయణము జేయవచ్చును. ఇది మఱియొక పద్ధతి. ఈవిధముగా నొక సంవత్సరము కాల మనుష్ఠానము జేసిన మానవుడు నగుమొగము గలదియు, నంద మైన నాసిక కలదియు మహాసౌందర్యరాశియు నగు భార్య నవశ్య ముగా బడయగలుగును.

ఈవివాహకాండము పరమపవిత్రమైనది. ఆనందదాయకమై నది. శుభములను జేకూర్చునది. భార్యను బ్రసాదించునది. మనోహర మైనది. వీనులకు విందు గలిగించునది. మానవులు నిరంతరము శ్రవ ణము జేయవలసినది ఆనందరామాయణమునకు మధ్యమం దున్న యీ యాఱవ కాండమును భక్తితో శ్రవణము జేయు మానవుల సమస్తకామితములును సిద్ధించును.

— న వ మ స ర్గ ము స మా ప్త ము —

వి వా హ కా ం డ ము స మా ప్త ము.

— ♦ —

# శ్రీమదానంద రామాయణము

## ప్ర థ మ స ర్గ ము

## రా జ్య కాం డ ము

## పూ ర్వా ర్థ ము

### —శ్రీ రా మ స హ స్ర నా మ స్తో త్ర ము —

'గుణగుణరేణ్యా! శ్రీరామదాసా! మీరు వివాహకాండము నందలి కడపటి సర్గమునందు నారదమహర్షి సూతునకు చెప్పిన

శ్రీరామసహస్రనామస్తోత్రముతో శ్రీరామచంద్రుని స్తుతించె నని చెప్పియుంటిరి. ఆస్తోత్రమును మునుల సమక్షమున నేవిధముగా జెప్పెను? ఆస్తోత్ర మెట్టిది? నాకు విశదముగా నెఱుఁగజెప్పుడు' అని యొకనాఁడు విష్ణుదాసుఁడు రామదాసుని బ్రశ్నించును. అంతట రామదాసు డిట్లు నొడువ నారంభించును.

శిష్యా! విష్ణుదాసా! మంచి ప్రశ్న మొనరించితివి. నీకు శ్రీరామ సహస్ర నామస్తోత్రమును వివరించుచుంటి నాలకింపుము. నీ విప్పుడు నన్ను బ్రశ్నించిన విధముగనే పూర్వము నైమిషారణ్యమున శౌనకుఁడు సూతుని బ్రశ్నించెను. అప్పుడు సూతుఁ డిట్లు నొడివెను.

ఒకానొక సమయమున లోకరక్షణదీక్షాతత్పరులై యొకరి భుజమున నొకరు చేయి వైచికొని యింద్రాదిదిక్పాలకులచే సేవింప బడుచు పార్వతీపరమేశ్వరులు సుఖముగా గూర్చుండియుండగా పార్వతి బరమేశ్వరుని గ్రమముగా ననేకధర్మములను గూర్చి పృచ్ఛజేసి తెలిసి కొనెను. పిమ్మట నామె 'స్వామీ! జగత్స్వామీ! సర్వలోకసుఖంకరా! శంకరా! మీయనుగ్రహమున నేనెన్నియో ధర్మములను దెలిసికొంటిని. పాపములకు బ్రాయశ్చిత్త విధానము లన్నియు నెఱిఁగితిని. ఇప్పుడు నాకు బ్రహ్మహత్యా మున్నగు మహాపాతకములకు బ్రాయశ్చిత్తవిధానము నెఱుఁగజెప్పుడు, అని మఱల మహాదేవుని బ్రార్థించెను. అంతట మహాదేవు డిట్లు నొడువ నారంభించెను.

దేవీ! సావధానమానసురాలవై యాకర్ణింపుము. నే నిప్పుడ త్యంతగోపనీయమును, మహాపాపప్రణాశనము నగు సనత్కుమార విఘ్నేశ్వరసంవాదమును వినిపించుచున్నాను.

"ఒకానొక తరుణమున సనత్కుమారుఁడు విఘ్నేశ్వరుని దర్శించి 'స్వామీ! మీరు సర్వధర్మములు నెఱిఁగినవారు. సర్వవిఘ్నములను హరింపగలవారు. బ్రహ్మహత్యామహాపాతకమును హరింప

గల ధర్మమేదియో నాకెఱుగజెప్పుడు. మూడు లోకములందును మీరు దక్క నన్యు లెవ్వరును ధర్మప్రబోధము సేయలేరు' అని ప్రశ్నించెను. అంతట విఘ్నేశ్వరు డిట్లు వివరించెను.

"సనత్కుమారా! లోకకల్యాణకరమైన యుత్తమప్రశ్న మొనరించితివి. ఈ ప్రశ్నము మూలమున నేను బూర్వమం దొనరించిన కర్మమును దలపునకు దెచ్చితివి. పూర్వము నేను నడగొండవలె నుండు నేనుగనై యావిర్భవించితిని. అప్పుడు వృక్షములను లెక్కింటిని పెకలించి యెందఱో మునులను నిహతుల గావించితిని. అప్పుడెల్ల యెడల బ్రాహ్మణుల హాహాకారములు చెలరేగెను. ఆవిధముగా వేలకొలది హత్యలు గావించి పతితుడనైతిని. తెలివి వాసి మృతప్రాయుడనై పతితుడనై పడియున్న నన్ను గాంచి నాతండ్రి సర్వలోకమహేశ్వరుడు, సర్వహృదయములందు బ్రకాశించువాడు నగు శ్రీరామచంద్రు నారాధించి ప్రత్యక్షము గావించికొనెను. అప్పుడు శ్రీరామచంద్రుడు నాతండ్రితో నిట్టులనెను. దేవా! మహాదేవా! నేను మీయెడల బ్రసన్నుడ నయితిని. మూడు లోకములందు నలభ్యమైనదానిని గోరినను మీకొసంగెదను. అనగా విని శంకరుడు దేవా! శ్రీరామచంద్రా! బ్రహ్మహత్యామహాపాతకముచే నావిష్టుడై నా పుత్రుడు బాధ నొందుచున్నాడు. నాయందు మీకు గరుణ గలదేని మీరు వానిని బాపరహితుని గావింపుడు.' అని శ్రీరామచంద్రుని బ్రార్థించెను. అట్లకాక! యని రఘునందను డప్పుడొక్కమాఱు కరుణాకటాక్షవీక్షణములతో నావంకకు జూచెను. తోడనే నాలో జైతన్య ముదయించినది. నిర్మలజ్ఞాన మంకురించినది. అప్పు డనేక గద్యపద్యములతో స్తుతించి యాపరమపురుషునకు బ్రణమిల్లితిని. తోడనే ప్రసన్నుడై శ్రీరామచంద్రుడు నాతో విఘ్నేశ్వరా! నీకు వేయి బ్రహ్మహత్యాపాతకములను హరింపగల ప్రాయశ్చిత్త విధానము నుపదేశించుచున్నాను. నా సహస్రనామస్తోత్ర

మును జపించినచో గోటిబ్రహ్మహత్యాపాతకములు హరించిపోఁగలవు.' అని పలికి నా కత్యంతగోపనీయమైన శ్రీరామసహస్రనామస్తోత్రమహామంత్రము నుపదేశించెను. దానిని గ్రహించుటతోడనే నేను శాపరహితుడనైతిని. నాఁటనుండియు నేను దేవతలకుఁ బూజ్యుడనయితిని. కావున నో సనత్కుమారా! నీవు గూడ నీ శ్రీరామచంద్రుని సహస్రనామస్తోత్రమును గ్రహించి లోకములందు వెల్లడిసేయుము." ఇట్లు పలికి విఘ్నేశ్వరుఁడు సనత్కుమారునకా మహాస్తోత్రము నుపదేశించెను. అంతట సనత్కుమారుఁడు 'మహాగణాధిపా! మీ యనుగ్రహమున శ్రీరామసహస్రనామస్తోత్రమును బడసి ధన్యుడనైతిని. అనుగృహీతుడనైతిని. కృతకృత్యుడనైతిని." అని కృతజ్ఞతను బ్రకటించి యాగణాధిపతికి బ్రదక్షిణనమస్కారము లాచరించెను. అది మొదలుగా నా మహాస్తోత్రమును నిరంతరముగా జపించి పుణ్యపావనహితుడై పరమసిద్ధిని బొందెను."

ఇట్లు పరమశివుఁడు నోడువగా విని పార్వతి "స్వామీ! సమస్తకామితములను సిద్ధింపజేయు నా సహస్రనామస్తోత్రమును నే నాలకింపగోరుచున్నాను. నాపై గృప గలదేని నాకాస్తోత్రము నుపదేశింపుడు." అని తన స్వామిని బ్రార్థించెను. అప్పుడు పరమశివు డిట్లు నోడువ నారంభించెను.

దేవీ! పరమగోపనీయమైన శ్రీరామసహస్రనామస్తోత్రము నుపదేశించుచున్నాను. ఆలకింపుము. ఈస్తోత్రమునకు వినాయకుడు ఋషి. అనుష్టుప్పు ఛందస్సు. శ్రీరామచంద్రుడు దేవత.

ఓమ్ అస్య శ్రీరామసహస్రనామమాలామంత్రస్య వినాయక ఋషిః. అనుష్టుప్ ఛందః. శ్రీరామో దేవతా. మహావిష్ణురితి బీజమ్. గుణభృన్నిర్గుణో మహా నితి శక్తిః. సచ్చిదానందవిగ్రహ ఇతి కీలకమ్ శ్రీరామప్రీత్యర్థే జపే వినియోగః

శ్రీరామచంద్రాయ అంగుష్ఠాభ్యాం నమః. సీతాపతయే తర్జనీభ్యాం నమః. రఘునాథాయ మధ్యమాభ్యాంనమః, భరతాగ్రజాయ అనామికాభ్యాం నమః, దశరథాత్మజాయ కనిష్ఠికాభ్యాం నమః, హనుమత్ప్రభవే కరతల కరపృష్ఠాభ్యాం నమః

శ్రీరామచంద్రాయ హృదయాయ నమః. సీతాపతయే శిరసే స్వాహా. రఘునాథాయ శిఖాయై వషట్. భరతాగ్రజాయ కవచాయ హుం. దశరథాత్మజాయ నేత్రత్రయాయ వౌషట్. హనుమత్ప్రభవే అస్త్రాయ ఫట్.

అ థ ధ్యా న మ్

శ్లో॥ ధ్యాయే దాజానుబాహుం ధృతశరధనుషం బద్ధపద్మాసనస్థం
పీతం వాసో వసానం నవకమలదళస్పర్ధినేత్రం ప్రసన్నమ్
వామాంకారూఢసీతాముఖకమలమిలల్లోచనం నీరదాభం
నానాలంకారదీప్తం దధత మురుజటామండలం రామచంద్రమ్॥

శ్లో॥ వైదేహీసహితం సురద్రుమతలే హైమే మహామండపే
మధ్యే పుష్పమహాసనే మణిమయే వీరాసనే సుస్థితమ్
అగ్రే వాచయతి ప్రభంజనసుతే తత్త్వం మునిభ్యః పరం
వ్యాఖ్యాంతం భరతాదిభిః పరివృతం రామంభజే శ్యామలమ్॥2

శ్లో॥ సౌవర్ణమండపే దివ్యే పుష్పకే సువిరాజితే
మూలే కల్పతరో స్స్వర్ణపీఠే సింహాష్టసంయుతే ॥
మృదుశ్లక్ష్ణాంతరే తత్ర జానక్యా సహ సంస్థితమ్
రామం నీలోత్పలశ్యామం ద్విభుజం పీతవాససమ్ ॥
స్మితవక్త్రం సుఖాసీనం పద్మపత్ర నిభేక్షణం
కిరీటహారకేయూరకుండలైః కటకాదిభిః॥
భ్రాజమానం జ్ఞానముద్రాధరం వీరాసనస్థితం

స్పృశంతం స్తనయో రగ్రే జానక్యా స్సవ్యపాణినా ॥
వసిష్ఠవామదేవాద్యై స్సేవితం లక్ష్మణాదిభిః
అయోధ్యానగరే రమ్యే హ్యభిషిక్తం రఘూద్వహమ్ ॥
ఏవం ధ్యాత్వా జపే న్నిత్యం రామనామసహస్రకం
హత్యాకోటియుతో వాఽపి ముచ్యతే నాత్ర సంశయః ॥

ఓమ్ రామ శ్శ్రీమాన్ మహావిష్ణు ర్జిష్ణు ర్దేవహితావహః
తత్త్వాత్మా తారకం బ్రహ్మ శాశ్వత స్సర్వసిద్ధిదః 1
రాజీవలోచన శ్శ్రీమాన్ శ్రీరామో రఘుపుంగవః । రామభద్ర
స్సదాచారో రాజేంద్రో జానకీపతిః ॥ (2) అగ్రగణ్యో వరేణ్యశ్చ
వరదః పరమేశ్వరః । జనార్దనో జితామిత్రః పరార్థైకప్రయో
జనః ॥ (3) విశ్వామిత్రప్రియో దాంతః శత్రుజి చ్ఛత్రుతాపనః ।
సర్వజ్ఞ స్సర్వవేదాది శ్శరణ్యో వాలిమర్దనః ॥ (4) జ్ఞానభవ్యోఽ
పరిచ్ఛేద్యో వాగ్మీ సత్యవ్రత శ్శుచిః । జ్ఞానగమ్యో దృఢప్రజ్ఞః
ఖరధ్వంసీ ప్రతాపవాన్ ॥ (5) ద్యుతిమా నాత్మవాన్ వీరో జిత
క్రోధోఽరిమర్దనః । విశ్వరూపో విశాలాక్షః ప్రభుః పరివృఢో
దృఢః ॥ (6) ఈశః ఖడ్గధర శ్శ్రీమాన్ కౌసల్యేయోఽనసూయకః ।
విపులాంసో మహోరస్కః పరమేష్ఠీ పరాయణః ॥ (7) సత్యవ్రత
స్సత్యసంధో గురుః పరమధార్మికః । లోకేశో లోకవంద్యశ్చ
లోకాత్మా లోకకృ ద్విభుః ॥ (8) అనాది ర్భగవాన్ సేవ్యో జిత
మాయో రఘూద్వహః । రామో దయాకరో దక్ష స్సర్వజ్ఞ స్సర్వ
పావనః । (9) బ్రహ్మణ్యో నీతిమాన్ గోప్తా సర్వదేవమయో
హరిః । సుందరః పీతవాసాశ్చ సూత్రకారః పురాతనః ॥ (10)
సౌమ్యో మహర్షిః కోదండీ సర్వజ్ఞ స్సర్వకోవిదః । కవి స్సుగ్రీవ
వరద స్సర్వపుణ్యాధికప్రదః ॥ (11) భవ్యో జితారిషడ్వర్గో మహో
దారోఽఘనాశనః । సుకీర్తి రాదిపురుషః కాంతః పుణ్యకృతా
గమః ॥ (12) అకల్మష శ్చతుర్బాహు స్సర్వావాసో దురాసదః ।

స్మితభాషీ నివృత్తాత్మా స్మృతిమాన్ వీర్యవాన్ ప్రభుః ॥ (13)
ధీరో దాంతో ఘనశ్యామః సర్వాయుధవిశారదః । అధ్యాత్మ
యోగనిలయ స్సుమనా లక్ష్మణాగ్రజః ॥ (14) సర్వతీర్థమయ
శ్శూరస్సర్వయజ్ఞఫలప్రదః । యజ్ఞస్వరూపో యజ్ఞేశో జరామరణ
వర్జితః ॥ (15) వర్ణాశ్రమగురు ర్వర్ణీ శత్రుజి త్పురుషోత్తమః । శివ
లింగ ప్రతిష్ఠాతా పరమాత్మా పరాత్పరః ॥ (16) ప్రమాణ
భూతో దుర్జ్ఞేయః పూర్ణః పరపురంజయః । అనంతదృష్టి రానందో
ధనుర్వేదో ధనుర్ధరః ॥ (17) గుణాకరో గుణశ్రేష్ఠ స్సచ్చిదానంద
విగ్రహః । అభివాద్యో మహాకాయో విశ్వకర్మా విశారదః ॥ (18)
వినీతాత్మా వీతరాగ స్తపస్వీశో జనేశ్వరః । కల్యాణః ప్రకృతిః
కల్పః సర్వేశ స్సర్వకామదః ॥ (19) అక్షయః పురుష స్సాక్షీ కేశవః
పురుషోత్తమః । లోకాధ్యక్షో మహాకార్యో విభీషణవరప్రదః ॥ (20)
ఆనందవిగ్రహో జ్యోతి ర్హనుమత్ప్రభు రవ్యయః । భ్రాజిష్ణుస్సహనో
భోక్తా సత్యవాదీ బహుశ్రుతః ॥ (21) సుఖదః కారణం కర్తా భవ
బంధవిమోచనః । దేవచూడామణి ర్నేతా బ్రహ్మణ్యో బ్రహ్మ
వర్ధనః ॥ (22) సంసారతారకో రామః సర్వదుఃఖవిమోక్షకృత్ ।
విద్వత్తమో విశ్వకర్తా విశ్వకృ ద్విశ్వకర్మ చ ॥ (23) నిత్యో నియత
కల్యాణ స్సీతాశోకవినాశకృత్ । కాకుత్స్థః పుండరీకాక్షో విశ్వా
మిత్రభయాపహః ॥ (24) మారీచమథనో రామో విరాధవధ
పండితః । దుస్స్వప్ననాశనో రమ్యః కిరీటీ త్రిదశాధిపః ॥ (25)
మహాధను ర్మహాకాయో భీమో భీమపరాక్రమః । తత్త్వస్వరూప
స్తత్త్వజ్ఞ స్తత్త్వవాదీ సువిక్రమః ॥ (26) భూతాత్మా భూతకృ
త్స్వామీ కాలజ్ఞానీ మహావపుః । అనిర్విణ్ణో గుణగ్రాహీ నిష్క-
లంకః కలంకహా ॥ (27) స్వభావభద్ర శ్శత్రుఘ్నః కేశవ స్స్థాణు
రీశ్వరః ॥ భూతాది శ్శంభు రాదిత్య స్స్థవిష్ఠ శ్శాశ్వతో ధ్రువః ॥ (28)
కవచీ కుండలీ చక్రీ ఖడ్గీ భక్తజనప్రియః । అమృత్యు ర్జన్మ

రహిత స్సర్వజిత్సర్వగోచరః ॥ (29) అనుత్తమో౽ప్రమేయాత్మా
సర్వాత్మా గుణసాగరః । సమ స్సమాత్మా సమగో జటాము
కుటమండితః ॥ (30) అజేయ స్సర్వభూతాత్మా విష్వక్సేనో మహా
తపాః । లోకాధ్యక్షో మహాబాహు రమృతో వేదవిత్తమః ॥ (31)
సహిష్ణు స్సద్గతి శ్శాస్తా విశ్వయోని ర్మహాద్యుతిః । అతీంద్ర ఊర్జితః
ప్రాంశు రుపేంద్రో వామనో బలిః ॥ (32) ధనుర్వేదో విధాతా
చ బ్రహ్మా విష్ణుశ్చ శంకరః । హంసో మరీచి ర్గోవిందో రత్న
గర్భో మహాద్యుతిః ॥ (33) వ్యాసో వాచస్పతి స్సర్వదర్పితాసుర
మర్దనః । జానకీవల్లభ శ్శ్రీమాన్ ప్రకటః ప్రీతివర్ధనః ॥ (34)
సంభవో౽తీంద్రియో వేద్యో నిర్దేశో జాంబవత్ప్రభుః । మదనో
మన్మథో వ్యాపీ విశ్వరూపో నిరంజనః ॥ (35) నారాయణో౽గ్రణీ
స్సాధు ర్జటాయుః ప్రీతివర్ధనః । నైకరూపో జగన్నాథ స్సురకార్య
హితః ప్రభుః ॥ (36) జితక్రోధో జితారాతిః ప్లవగాధిపరాజ్యదః ।
వసుద స్సుభుజో నైకమాయో భవ్యః ప్రమోదనః ॥ (37) చం
డాంశు స్సిద్ధిదః కల్ప శ్శరణాగతవత్సలః । అంగదో రోగహర్తా చ
మంత్రజ్ఞో మంత్రిభావనః ॥ (38) సౌమిత్రివత్సలో ధుర్యో వ్యక్తా
వ్యక్త స్వరూపధృక్ । వసిష్ఠో గ్రామణీ శ్శ్రీమా ననుకూలః
ప్రియంవదః ॥ (39) అతుల స్సాత్త్వికో ధీర శ్శరాసనవిశారదః ।
జ్యేష్ఠ స్సర్వగుణోపేత శ్శక్తిమాం స్తాటకాంతకః ॥(40) వైకుంఠః
ప్రాణినాం ప్రాణః కమఠః కమలాధిపః । గోవర్ధనధరో మత్స్య
రూపః కారుణ్యసాగరః ॥ (41) కుంభకర్ణప్రభేత్తా చ గోపీగోపాల
సంవృతః। మాయావీ వ్యాపకో వ్యాపీ రైణుకేయబలాపహః॥(42)
పినాకమథనో వంద్య స్సమర్థో గరుడధ్వజః । లోకత్రయా
శ్రయో లోకభరితో భరతాగ్రజః ॥ (43) శ్రీధర స్సద్గతి ర్లోక
సాక్షీ నారాయణో విభుః । మనోరూపీ మనోవేగీ పూర్ణః పురుష
పుంగవః ॥(44)యదుశ్రేష్ఠో యదుపతి ర్భూతావాస స్సువిక్రమః।

తేజోధరో ధరాధార శ్చతుర్మూర్తి ర్మహానిధిః ॥ (45) చాణూర
మర్దనో వంద్య శ్శాన్తో భరతవందితః । శబ్దాతిగో గభీరాత్మా
కోమలాంగః ప్రజాగరః ॥ (46) లోకోర్ధ్వగ శ్శేషశాయీ క్షీరాబ్ధి
నిలయోఽమలః । ఆత్మజ్యోతి రదీనాత్మా సహస్రార్చి స్సహస్ర
పాత్ ॥ (47) అమృతాంశు ర్మహీగర్తో నివృత్తవిషయస్పృహః ।
త్రికాలజ్ఞో ముని స్సాక్షీ విహాయసగతిః కృతీ ॥ (48) పర్జన్యః
కుముదో భూతావాసః కమలలోచనః । శ్రీవత్సవక్షా శ్శ్రీవాసో
వీరహా లక్ష్మణాగ్రజః ॥ (49) లోకాభిరామో లోకారిమర్దన స్సేవక
ప్రియః । సనాతనతమో మేఘశ్యామలో రాక్షసాంతకః ॥ (50)
దివ్యాయుధధర శ్శ్రీమా నప్రమేయో జితేంద్రియః । భూదేవ
వంద్యో జనకప్రియకృ త్ప్రపితామహః ॥(51) ఉత్తమ స్సాత్త్విక
స్సత్య స్సత్యసంధ స్త్రివిక్రమః । సువృత్త స్సుగమ స్సూక్ష్మ స్సు
ఘోష స్సుఖద స్సుహృత్ ॥ (52) దామోదరోఽచ్యుత శ్శార్ఙ్గీ
వామనో మధురాధిపః । దేవకీనందన శ్శౌరి శ్శూరః కైటభ
మర్దనః ॥ (53) సప్తతాలప్రభేత్తా చ మిత్రవంశప్రవర్ధనః । కాల
స్వరూపీ కాలాత్మా కాలః కల్యాణదః కలిః ॥ (54) సంవత్సర
ఋతుః పక్షో హ్యయనం దివసో యుగః । స్తవ్యో వివిక్తో నిర్లేప
స్సర్వవ్యాపీ నిరాకులః ॥(55) అనాదినిధన స్సర్వలోకపూజ్యో నిరా
మయః । రసో రసజ్ఞ స్సారజ్ఞో లోకసారో రసాత్మకః ॥ (56) సర్వ
దుఃఖాతిగో విద్యారాశిః పరమగోచరః । శేషో విశేషో
విగతకల్మషో రఘుపుంగవః ॥(57) వర్ణశ్రేష్ఠో వర్ణభావ్యో వర్ణో
వర్ణ్య గుణోజ్జ్వలః । కర్మసాక్షీ గుణశ్రేష్ఠో దేవ స్సురవరప్రదః ॥
(58) దేవాధిదేవో దేవర్షి ర్దేవాసురనమస్కృతః । సర్వదేవమయ
శ్చక్రీ శార్ఙ్గపాణీ రఘూత్తమః ॥ (59) మనో బుద్ధి రహంకారః
ప్రకృతిః పురుషోఽవ్యయః । న్యాయో న్యాయీ నయీ శ్రీమా
న్నయో నగధరో ధ్రువః ॥(60) లక్ష్మీవిశ్వంభరో భర్తా దేవేంద్రో

బలిమర్దనః। బాణారిమర్దనో యజ్వాఽనుత్తమో మునిసేవితః॥
(61) దేవాగ్రణీ శ్శివధ్యానతత్పరః పరమః పరః। సామగేయః
ప్రియ శ్శూరః పూర్ణకీర్తి స్సులోచనః॥ (62) అవ్యక్తలక్షణో
వ్యక్తో దశాస్యద్విపకేసరీ। కళానిధిః కళానాథః కమలానందవర్ధనః॥
(63) పుణ్యః పుణ్యాధికః పూర్ణః పూర్వః పూరయితా రవిః। జటిలః
కల్మషధ్వాంతప్రభంజనవిభావసుః॥(64) జయీ జితారి స్సర్వాది
శ్శమనో భవభంజనః। అలంకరిష్ణు రచలో రోచిష్ణు ర్విక్ర
మోత్తమః॥ (65) ఆశు శ్శబ్దపతి శ్శబ్దగోచరో రంజనో లఘుః।
నిశ్శబ్దపురుషో మాయీ స్థూల సూక్ష్మో విలక్షణః॥(66) ఆత్మ
యోని రయోనిశ్చ సప్తజిహ్వ స్సహస్రపాత్। సనాతనతమ
స్స్రగ్వీ పేశలో విజితాంబరః॥ (67) శక్తిమాన్ శంఖభృన్నాథో
గదాధరరథాంగభృత్। నిరీహో నిర్వికల్పశ్చ చిద్రూపో జిత
సాధ్వసః॥(68) సనాతన స్సహస్రాక్ష శ్శతమూర్తి ర్ఘనప్రభః।
హృత్పుండరీకశయనః కఠినో ద్రవ ఏవ చ॥(69) సూర్యో గ్రహ
పతి శ్శ్రీమాన్ సమర్థోఽనర్థనాశనః। అధర్మశత్రూ రక్షోఘ్నః
పురుహూతః పురుష్టుతః॥ (70) బ్రహ్మగర్భో బృహద్గర్భో ధర్మ
ధేను ర్ధనాగమః। హిరణ్యగర్భో జ్యోతిష్మాన్ సులలాట స్సువి
క్రమః॥(71)శివపూజారత శ్శ్రీమాన్ భవానీ ప్రియకృ ద్వశీ నరో
నారాయణ శ్శ్యామః కపర్దీ నీలలోహితః॥ (72) రుద్రః పశుపతి
స్స్థాణు ర్విశ్వామిత్రో ద్విజేశ్వరః। మాతామహో మాతరిశ్వా
విరించి ర్విష్టరశ్రవాః॥ (73) అక్షోభ్య స్సర్వభూతానాం శ్చండ
స్సత్యపరాక్రమః। వాలఖిల్యో మహాకల్పః కల్పవృక్షః కలా
ధరః॥ (74) నిదాఘ స్తపనో మేఘ శ్శుక్రః పరబలాపహృత్।
వసుశ్రవాః కవ్యవాహః ప్రశస్తో విశ్వభోజనః॥(75)రామో నీలో
త్పలశ్యామో జ్ఞానస్కందో మహాద్యుతిః। కబంధమథనో దివ్యః
కంబుగ్రీవ శ్శివప్రియః॥(76)సుఖ నీల స్సునిష్పన్న స్సులభ శ్శిశి

రాత్మకః। అసంస్పృష్టోఽతిథిః శూరః ప్రమాథీ పాపనాశకృత్ ॥ (77) పవిత్రపాదః పాపారి ర్మణిపూరో నభోగతిః । ఉత్తారణో దుష్కృతిహా దుర్ధర్షో దుస్సహో బలః ॥ (78) అమృతేశోఽమృత వపు ర్ధర్మీ ధర్మః కృపాకరః । భగో వివస్వా నాదిత్యో యోగా చార్యో దివస్పతిః ॥ (79) ఉదారకీర్తి రుద్యోగీ వాఙ్మయ స్సదస న్మయః । నక్షత్రమాలీ నాకేశ స్స్వాధిష్ఠాన షడాశ్రయః ॥ (80) చతుర్వర్గ ఫలం వర్ణ శక్తిత్రయఫలం నిధిః । నిధానగర్భో నిర్వ్యాజో నిరీశో వ్యాలమర్దనః ॥ (81) శ్రీవల్లభ శ్శివారంభ శ్శాంతో భద్ర స్సమంజసః । భూశాయీ భూతకృ ద్భూతిర్భూ షణో భూతవాహనః (82) అకాయో భక్తకాయస్థః కాలజ్ఞానీ మహాపటుః । పరార్థవృత్తి రచలో వివిక్త శ్శ్రుతిసాగరః ॥ (83) స్వభావ భద్రో మధ్యస్థ స్సంసార భయనాశనః । వేద్యో వైద్యో వియద్గోప్తా సర్వామర మునీశ్వరః ॥(84) సురేంద్రః కారణం కర్మ కరః కర్మీ హ్యధోక్షజః । ధైర్యోఽగ్రధుర్యో ధాత్రీశ స్సంకల్ప శ్శర్వరీపతిః ॥ (85) పరమార్థ గురు ర్దృష్టి శ్శుచి రాశ్రితవత్సలః । విష్ణు ర్జిష్ణు ర్విభు ర్యజ్ఞో యజ్ఞేశో యజ్ఞపాలకః ॥ (86) ప్రభవిష్ణు ర్గ్రసిష్ణుశ్చ లోకాత్మా లోకపాలకః । కేశవః కేశిహా కావ్యః కవిః కారణ కారణమ్ ॥(87) కాలకర్తా కాలశేషో వాసుదేవః పురుష్టుతః। ఆదికర్తా వరాహశ్చ వామనో మధుసూదనః । (88) నారాయణో నరో హంసో విష్వక్సేనో జనార్దనః । విశ్వకర్తా మహాయజ్ఞో జ్యోతి ష్మాన్ పురుషోత్తమః ॥ (89) వైకుంఠః పుండరీకాక్షః కృష్ణ స్సూర్య స్సురార్చితః । నారసింహో మహాభీమో వజ్రదంష్ట్రో నఖా యుధః ॥ (90) ఆదిదేవో జగత్కర్తా యోగీశో గరుడధ్వజః గోవిందో గోపతి ర్గోప్తా భూపతి ర్భువనేశ్వరః ॥ (91) పద్మనాభో హృషీకేశో ధాతా దామోదరః ప్రభుః త్రివిక్రమః స్త్రిలోకేశో బ్రహ్మేశః ప్రీతివర్ధనః ॥(92) సన్న్యాసీ శాస్త్రతత్త్వజ్ఞో మందరో

గిరిశో నతః । వామనో దుష్టదమనో గోవిందో గోపవల్లభః ॥(93) భక్తప్రియోఽచ్యుత స్సత్య స్సత్యకీర్తి ర్ధృతి స్స్మృతిః। కారుణ్యం కరుణో వ్యాసః పాపహా శాంతివర్ధనః ॥ (94) బదరీనిలయ శ్శాంత స్తపస్వీ వైద్యుతప్రభః । భూతావాసో మహావాస శ్శ్రీనివాస శ్శ్రియః పతిః ॥ (95) తపోవాసో ముదావాస స్సత్యావాసః సనాతనః । పురుషః పుష్కరః పుణ్యః పుష్కరాక్షో మహేశ్వరః ॥(96) పూర్ణమూర్తిః పురాణజ్ఞః పుణ్యదః ప్రీతివర్ధనః । పూర్ణరూపః కాలచక్రప్రవర్తన సమాహితః ॥ (97) నారాయణః పరంజ్యోతిః పరమాత్మా సదాశివః । శంఖ చక్రీ గదీ శార్ఙ్గీ లాంగలీ ముసలీ హలీ ॥ (98) కిరీటీ కుండలీ హారీ మేఖలీ కవచీ ధ్వజీ । యోద్ధా జేతా మహావీర్య శ్శత్రుఘ్న శ్శత్రుతాపనః ॥(99)శాస్తా శాస్త్రకరః శాస్త్రం శంకర శ్శంకరస్తుతః । సారథి స్సాత్త్విక స్స్వామీ సామవేద ప్రియ స్సమః ॥ (100) పవనః సంహిత శ్శక్తి స్సంపూర్ణాంగ స్సమృద్ధిమాన్ । స్వర్గదః కామద శ్శ్రీదః కీర్తిదః కీర్తిదాయకః ॥ (101) మోక్షదః పుండరీకాక్షః క్షీరాబ్ధికృత కేతనః । సర్వాత్మా సర్వలోకేశః ప్రేరకః పాపనాశనః ॥ (102) వైకుంఠః పుండరీకాక్ష స్సర్వదేవ నమస్కృతః । సర్వవ్యాపీ జగన్నాథ స్సర్వలోక మహేశ్వరః ॥ (103) సర్గస్థిత్యంత కృ ద్దేవ స్సర్వ లోక సుఖావహః । అక్షయ శ్శాశ్వతోఽనంతః క్షయవృద్ధి వివర్జితః ॥ (104) నిర్లేపో నిర్గుణ స్సూక్ష్మో నిర్వికారో నిరంజనః । సర్వోపాధి వినిర్ముక్త స్సత్తామాత్ర వ్యవస్థితః ॥ (105) అవికారీ విభు ర్నిత్యః పరమాత్మా సనాతనః । అచలో నిశ్చలో వ్యాపీ నిత్య తృప్తో నిరాశ్రయః ॥ (106) శ్యామో యువా లోహితాక్షో దీప్తాస్యో మితభాషణః । ఆజానుబాహు స్సుముఖ స్సింహస్కంధో మహాభుజః ॥ (107) సత్త్వవాన్ గుణసంపన్నో దీవ్యమానః స్వతేజసా । కాలాత్మా భగవాన్ కాలః కాలచక్రప్రవ

ర్త కః ॥ (108) నారాయణః పరంజ్యోతిః పరమాత్మా సనాతనః । విశ్వకృ ద్విశ్వభోక్తా చ విశ్వగోప్తాచ శాశ్వతః ॥ (109) విశ్వేశ్వరో విశ్వమూర్తి ర్విశ్వాత్మా విశ్వభావనః । సర్వభూత సుహృచ్ఛాంతః సర్వభూతాను కంపనః ॥ (110) సర్వేశ్వరేశ్వర స్సర్వస్సర్వదాఽఽశ్రితవత్సలః । సర్వగ స్సర్వ భూతేశ స్సర్వభూతాశయ స్థితః ॥ (111) అభ్యంతరస్థ స్తమస శ్ఛేత్తా నారాయణః పరః । అనాది నిధన స్స్రష్టా ప్రజాపతిపతి ర్హరిః ॥ (112) నారసింహో హృషీకేశః స్సర్వాత్మా సర్వదృగ్వశీ । జగత స్తస్థు షశ్చైవ ప్రభు ర్నేతా సనాతనః ॥ (113) కర్తా ధాతా విధాతా చ సర్వేషాం పతి రీశ్వరః ! సహస్రమూర్ధా విశ్వాత్మా విష్ణుర్విశ్వదృ గవ్యయః ॥ (114) పురాణ పురుష శ్శ్రేష్ఠః సహస్రాక్షస్సహస్రపాత్ । తత్త్వం నారాయణో విష్ణు ర్వాసుదేవ స్సనాతనః ॥ (115) పరమాత్మా పరంబ్రహ్మ సచ్చిదానంద విగ్రహః । పరంజ్యోతిః పరం ధామ పరాకాశః పరాత్పరః ॥ (116) అచ్యుతః పురుషః కృష్ణ శ్శాశ్వత శ్శివ ఈశ్వరః । నిత్య స్సర్వగత స్స్థాణురుద్ర స్సాక్షీ ప్రజాపతిః ॥ (117) హిరణ్య గర్భ స్సవితా లోకకృ ల్లోకభు గ్విభుః । ఓంకార వాచ్యో భగవాన్ శ్రీభూలీలాపతిః ప్రభుః ॥ (118) సర్వలోకేశ్వర శ్శ్రీమాన్ సర్వజ్ఞ స్సర్వతోముఖః । స్వామీ సుశీల స్సులభ స్సర్వగ స్సర్వశక్తిమాన్॥(119) నిత్యస్సంపూర్ణ కామశ్చ నైసర్గికసుహృ త్సుఖీ । కృపాపీయూషజలధిః శరణ్య స్సర్వశక్తిమాన్ ॥ (120) శ్రీమా న్నారాయణస్స్వామీ జగతాం ప్రభు రీశ్వరః మత్స్యః కూర్మో వరాహశ్చ నారసింహోఽథ వామనః ॥ (121) రామో రామశ్చ కృష్ణశ్చ బుద్ధః కల్కీ పరాత్పరః । అయోధ్యేశో నృపశ్రేష్ఠః కుశబాలః పరంతపః ॥ (122) లవబాలః కంజనేత్రః కంజాంఘ్రిః పంకజాననః సీతాకాంత స్సౌమ్యరూప శ్శిశుజీవనతత్పరః ॥ (123) సేతుకృ

చ్చిత్రకూటస్థః శబరీ సంస్తుతః ప్రభుః । యోగిధ్యేయ శ్శివధ్యేయ శ్శాస్తా రావణదర్పహా ॥ (124) శ్రీశ శ్శరణ్యో భూతానాం సంశ్రితాభీష్టదాయకః । అనంత శ్శ్రీపతీ రామో గుణభృ న్నిర్గుణో మహాన్ ॥ (125)

—()—

దేవీ! పర్వతరాజకుమారీ! ఇవి శ్రీరామచంద్రుని సహస్ర నామములు. ఇవి గాక యింకను నసంఖ్యాకములైన నామములు కలవు. ఇం దొక్కొక్కనామము సమస్తపాపములను హరింపగలదు. సహస్ర నామఫలమును బ్రసాదింపగలదు. సమస్త్యైశ్వర్యముల నొసగగలదు. సర్వసిద్ధులను సమకూర్పగలదు. భుక్తిముక్తుల నొనగూర్పగలదు. మహామంత్రాత్మకమగు నీస్తోత్రమును దొల్లి విఘ్నేశ్వరుడు సన త్కుమారున కుపదేశించెను. నేను దాని నిప్పుడు నీ కుపదేశించితిని. ఈస్తోత్రమును బఠనముగాని, శ్రవణముగాని, చేసినవాడు బ్రహ్మ పదమును బొందును. శ్రీరామనామ మనెడు సింహముయొక్క గర్జ నమును విననంతమాత్రకే మహాపాతకము లను నేనుగులు బలముతో దర్పించియుండును. బ్రహ్మహత్య, నురాపానము, దొంగతనము, గురుతల్పశయనము, శరణాగతహత్య, మిత్రునెడల విశ్వాసఘాతము, మాతృహత్య, పితృహత్య, భ్రూణహత్య, వీరహత్య మున్నగు నవియే కాక యింకను గోటకోటి సంఖ్యాకములైన యుపపాతకము లేవియేవి కలవో యవి యన్నియు నొక సంవత్సరకాలము శ్రీరామ చంద్రుని సన్నిధినీ స్తోత్రమును బ్రతిదినము జపించినచో బటాపంచ లగును. అట్లు జపించినవా డిహలోకమునందు నిర్బాధముగ సుఖముల ననుభవించి యంతమునందు మోక్షము నొందును.

"ఓయి శౌనకమహర్షీ! ఈవిధముగా బరమేశ్వరుడు పార్వతికి సహస్రనామస్తోత్రము నుపదేశించి యుండెను. దాని నిప్పుడు నీ కుప దేశించితి," నని సూతుడు శౌనకునితో జెప్పెను.

"శిష్యా!విష్ణుదాసా! నీవు కోరిన విధముగా సూతుడు జెప్పిన శ్రీరామసహస్రనామస్తోత్రమును నీ కిప్పు డుపదేశించితిని. ఈస్తోత్రముతో సభాసీనుడైన శ్రీరాముని నారదుడు స్తుతించెను. ఈస్తోత్రము పాపములను బరిహరించునది. సుఖములను బెంచునది. భవభయము లను హరించునది. భక్తజనులను రక్షించునది. కళత్రపుత్రపౌత్రులను గాపాడునది. సమస్తసంపదలను సమకూర్చునది.

ప్రథమసర్గము సమాప్తము.

—)<sup></sup>o<sub>o</sub>o(—

## ద్వితీయసర్గము

కల్పవృక్షము, పారిజాతము పుడమికి దిగివచ్చుటకు గారణము.

'గురువరేణ్యా! శ్రీరామదాసా! మీరు శ్రీరామసహస్రనామస్తోత్రమును జపించువేళ శ్రీరామచంద్రుని కల్పవృక్షముక్రింద సువర్ణపీఠముపై నాసీనుడై యున్నట్లు భావనము జేయవలె నని చెప్పియున్నారు. ఆ పరమపురుషుడు మానవలోకమువాడుగదా! స్వర్గమునందుండు కల్పవృక్షము పుడమిపై కెట్లు వచ్చినది? నాపై గరుణజూపి నాయీ సందేహమును నివారింపుడు! అని విష్ణుదాసుడు రామసుని బ్రశ్నించును. అప్పుడు రామదాసుడీ విధముగా వివరించును.

విష్ణుదాసా! మంచిప్రశ్న మొనరించితివి. సావధానచిత్తుడవై యాలకింపుము. ఒకనాడు శ్రీరామచంద్రుని దర్శించు సంకల్పముతో నరువదివేలమంది శిష్యులను వెంట నిడికొని దుర్వాసు డేగుదెంచెను. వచ్చువేళ నతడు తనలో శ్రీమహావిష్ణువే మానవరూపమున శ్రీరామచంద్రుడుగా బుడమిపై నవతరించియున్నాడు. కావున నతని పౌరుష మెట్టిదో జనముల ముందు వెల్లడి జేసెదగాక!' యని తర్కించికొనెను

క్రమముగా నతడు సాకేతములో బ్రవేశించి యెనిమిది ద్వారముల నధిగమించి పోయి సీతామహాదేవి భవనమును సమీపించి సింహ ద్వారము చెంత నిలువబడెను. శిష్యసమేతుడైన యా మహర్షిని గాంచి బెత్తములను జేత దాల్చిన సేవకులు చని యేకాంతమునం దున్న శ్రీరామచంద్రున కాతని యాగమనము నెఱిగించిరి. ఆవార్త నాలించినంతనే రాఘవు డెదురుగా జని యా మునిరాజును శిష్యసమేతముగా సాదరముగా లోనికి గొనివచ్చి వారికి గూరుచుండ నాసనము లర్పించెను. అప్పుడాసనముపై సుఖముగా నాసీనుడై దుర్వాసుడు మధురవచనములతో శ్రీరామచంద్రునితో నిట్టులనెను. "రఘునందనా! వేయేండ్లుగా నే నుపవాసము చేయుచున్నాను. ఆవ్రతము నీనాడు పరిసమాప్తము జేయుదును. కావున నాకును, నాశిష్యులకును క్షణకాలములో జింతామణివలన గాని, కామధేనువువలన గాని, యగ్ని సహాయమున గాని సిద్ధము సేయబడని యన్నమును బ్రసాదింపుము. అది నామనమున కిష్టమైన యాహారము. అదియు వివిధములైన పక్వాన్నములతో గూడి యుండవలెను. అంతియేకాదు. నీ గృహస్థధర్మమును నిలిపికొన నిచ్ఛగింతువేని నాకు శివారాధనము సేసికొనుటకు మానవు లెన్నడును జూచియెఱుగని పూవులను సమకూర్పగోరుదును. నా యభీష్టమును నెఱవేర్పజాలనిచో నీవిషయమున నశక్తుడనని నొడువుము. నేనిప్పుడే వెడలిపోయెదను." అనగా విని రఘునందనుడు చిఱునవ్వునవ్వి సవినయముగా మీయభిలషితమును దప్పక నెఱవేర్తునని బదులు పలికెను. అప్పుడు మునిరాజిట్టులైనచో నేను సరయూనదికి బోయి స్నానాదికము నిర్వర్తించికొని సత్వరముగా మఱలి వచ్చెదను. ఇంతలో నాయభీష్టమును సఫలము సేయ జనకజాతను, లక్ష్మణాదులను సన్నద్ధుల గావింపుమని చెప్పి శిష్యులను దోడుకొని వెడలి పోయెను.

ఈవిషమసమస్య నాలకించి లక్ష్మణాది సోదరులు, సీతామహాదేవి, కుశాదిబాలకులు నెల్లవారును భయచకితులైరి. వారు రాఘవునివంకకు జూచుచు దమలోదాము 'ఔరా! యీమహర్షి యెంత దుస్సాధమైన కోరికను వెల్లడించెను? ఇప్పుడు శ్రీరామచంద్రు డేమి సేయును? అని చెప్పికొనదొడగిరి.

మహర్షి నదీస్నానమున కేగినమీదట రఘునందనుడు లక్ష్మణునిచేత నొక లేఖ వ్రాయించి దాని నొక బాణమునకు గట్టి వింట సంధించి విడిచిపెట్టెను. వాయువేగమున నా బాణ మమరావతి కరిగి దేవసభలో దేవబృందపరివేష్టితుడై యున్న యింద్రుని సమక్షమున బడెను. ఆశరమును బరికించి సురరాజు భయచకితుడయ్యెను. ఈ బాణ మెవరి దనుచు దాని చెంత కరిగి యందు రామునామము నవలోకించెను. ఆనామమా బాణపుచ్ఛమునందు సువర్ణముతో రచింపబడి యుండెను. తోడనే సురరా జది శ్రీరామచంద్రుని బాణమని యెఱిగి దానియందు గట్టబడిన పత్రమును విప్పి దానికి నమస్కరించి చదివికొన నారంభించెను. అంతలో నా బాణము రయమున మీఱి వెనుకకు మఱలివచ్చి యథాపూర్వకముగా రాఘవుని యమ్ముల పొదిలో బ్రవేశించెను. ఇంద్రుడా పత్రమును భయవిస్మయములతో నిట్లు చదివి సభాసదుల కందఱకును వినిపించెను. "ఇంద్రా! నీవు స్వర్గమునందు సుఖముగా నుంటివని తలంచుచున్నాను. నేను నిన్ననయము స్మరించుచున్నాను. ఈ పత్రము మూలమున నాయాదేశ మెఱిగి దాని ప్రకారముగా నాచరింపుము. విషయమేమనగా, నాకస్మికముగా నా భవనమున కరువదివేలమంది శిష్యులతో దుర్వాసమహర్షి చనుదెంచి యున్నాడు. అతడు వేయేండ్లుగా నాకలి గొని యున్నవాడు. అతడు మహాక్రోధనుడు. మహాతపోధనుడు. అతనికి, నతని శిష్యులకు నితరమహర్షులకును నేను గామధేనువువలన, జింతామణివలన, నగ్నిసహాయమున సిద్ధము చేయబడని యన్నమును బెట్టుటకు సమ్మతించి

యున్నాను. అతడు నన్ను నరులు చూచి యెఱుగని పూవులను గూడ గోరియున్నాడు. నేను గూడ నట్లుకాక! యని సమ్మతించి వారిని స్నానము సేయనంపితిని. కావున జాలము సేయక వేగముగా సముద్రమున నుండి పుట్టిన కల్పవృక్షమును, పారిజాతమును నాకడ కంపుము. అట్లు లంపకుంటివేని రావణుని తలలను ఖండించిన బాణమునకై ప్రతీక్షించుము." ఇట్లు చదివి వినిపించి సురరాజు సురలందఱి తోడను మంత్రణము జేసి వారినందఱను దోడుకొని కల్పవృక్షమును, పారిజాతమును వెంట నిడికొని విమానము నధిరోహించి తక్షణమే సాకేత నగరమున కేతెంచెను. అతని యాగమనము నెఱిగి లక్ష్మణుడతని కెదురుగ జని యతనిని దోడ్కొని సభాగతుడైన శ్రీరామచంద్రుని సన్నిధికి మఱలివచ్చెను. అప్పు డింద్రుడు కల్పవృక్షమును, పారిజాతమును శ్రీరామచంద్రునకు సమర్పించి నమస్కారము జేసి యొక యాసనముపై నాసీను డయ్యెను.

ఇంతలో నచ్చట దుర్వాస మహర్షి యొక శిష్యుని బిలిచి శిష్యా! నీవు వెంటనే పోయి శ్రీరామచంద్రు డేమి చేయుచుండెనో కనుగొనుము. మనము కోరిన యన్నము సిద్ధము చేయబడినదో లేదో, యతడు చింతాక్రాంతుడై యుండెనో లేక మౌన భావము వహించి యుండెనో, నేను గోరిన పదార్థముల నన్నిటిని సమకూర్చుచుండెనో లేదో రహస్యముగ గమనించి వడిగ మఱలి వచ్చి నాకు దెలుపుము." అని యతని కాదేశించెను. అట్లకాక! యని యతడు రహస్యముగ శ్రీరామచంద్రుని భవనమున కరిగెను. అచ్చట నతనికి గల్పవృక్షము, పారిజాతము, దేవతలు, దేవరాజు, నానందభరితులై యున్న సీతారాములును గానవచ్చిరి. తోడనే యతడు మౌనముగ జని యాసమాచారము నా మునిరాజున కెఱిగించెను. శిష్యుని మాటల నాలించి దుర్వాసుడు మిక్కిలి విస్మయము నొందెను.

అనంతరమా మునిరాజు శిష్యసమేతుడై శ్రీరామచంద్రుని గృహమున కరిగెను. అతనిని జూచి రాఘవుడు దేవబృందముతోడ గూడి యతనికి ప్రత్యుత్థానము, నమస్కారము గావించి లోనికి గొనివచ్చి కూరుచుండ నాసన మర్పించెను. పిమ్మట సీతను, లక్ష్మణాదులను వెంట నిడికొని యా మహర్షిని శిష్యసమేతముగా బూజించెను. శివారాధనమునకై యతడు కోరిన విధముగా మానవు లెన్నడును జూచియెఱుగని పారిజాతకుసుమముల నతని కర్పించెను. ఆ పూవులను గొని యా మునిరాజు మానసముగా శివుని, దేవతలను బూజించెను. పిమ్మట శ్రీరామచంద్రుడు పదార్థములను వడ్డింప లక్ష్మణునిచే సీత నెచ్చరింపజేసెను. అప్పుడు జనకజాత దివ్యాభరణ విభూషితురాలై కాలియందెలు గల్లుగల్లుమనుచుండగా జని యా కల్పవృక్షమును, బారిజాతమును భక్తితో బూజించెను. అనంతరము కోట్లకొలది పాత్రములను దెచ్చి యా కల్పవృక్షముక్రింద నుంచి యా వృక్షరాజము నిట్లు ప్రార్థించెను. 'పాలసముద్రమున బ్రభవించి దేవతల కభీష్టసిద్ధిని గలిగించుచున్నయో కల్పవృక్షమా! శిష్యసమేతుడగు దుర్వాసునకు దృప్తి గలిగింపుము.' ఇట్లు ప్రార్థించిన వెంటనే యా వృక్షరాజమా పాత్రములను క్షణములో వివిధములగు జిత్రాన్నములతో నింపివైచెను. ఊర్మిళ, చంపిక మున్నగువారితోడ గూడి సీతామహాదేవి యా పదార్థములను వెంటనే బంగారు పాత్రములలో వడ్డించెను. మఱికొంత, మఱికొంత యని మాటిమాటికి రఘువీరునిచే గోరబడుచు నామునిరాజు పదార్థములను సానందముగా శిష్యులతోడ గూడి యారగించి తృప్తిజెందెను. పిమ్మట జేతులు గడిగికొని శ్రీరామచంద్రునివలన దాంబూలమును, దక్షిణను గూడ స్వీకరించెను. పిమ్మట దేవతల సమక్షమున రాఘవుని సన్నుతించి యతనితో నిట్లనెను.

"రాజీవనయనాభిరామా! శ్రీరామా! నీవు సాక్షాత్తు జగదీశ్వరుడవు. రావణుని సంహరింప బుడమిపై నవతీర్ణుడవైతి వని నే నెఱుగుదును. జనముల ముందు నీ పురుషకారమును బయల్పఱచుటకై కామధేనువువలన, చింతామణివలన, నగ్నివలన సిద్ధముగాని యన్నము గానలెనని నిన్ను యాచించితిని. నరులు చూచి యెఱుగని విరులను గూడ నపేక్షించితిని. ఎవని క్రీగంటి వీక్షణము మాత్రమున బ్రహ్మాదిదేవత లావిర్భవించుటయు, నంతరించుటయు సంభవించుచుండునో, యట్టివాని కేకార్యమైన దుస్సాధ మెట్టులగును? పాలసముద్రములో మునిగిపోవుచున్న మందరపర్వతమును వెన్నుపై నిలుపనెంచి నీవు మహాకూర్మరూపమును ధరించితివి. అప్పుడు నీ సహాయమున దేవతలు పదునాల్గు రత్నములను బడయుగలిగిరి. లక్ష్మీదేవి, చంద్రుడు, కామధేనువు, కౌస్తుభరత్నము, నమృతము, విషము నైరావతము, నచ్చరలు, కల్పవృక్షము, ధన్వంతరి, యుచ్చైశ్శ్రవము, (ఇంద్రుని గుఱ్ఱము) పారిజాతము, సుర, (మద్యము) జ్యేష్ఠాదేవి యనబడు నీ పదునాల్గు రత్నములను నీవు దేవతలకు బంచి యిచ్చితివి. శంకరాదులగు దేవత లందఱు నీ యాజ్ఞకు లోబడి ప్రవర్తిల్లుచుందురు. వారి కందఱకు జీవనోపాయములను వేలు వేలుగా నీవే కల్పించితివి. అట్టి నీకు నే నభిలషించిన వస్తువును నాకు సమర్పించుట దుర్ఘట మెట్టులగును? నీ పురుషకారమును నే నిప్పు డవలోకించితిని. జనులచే నెల్లవారిచేత నవలోకింపజేసితిని. నీవు సమస్త లోకములను సృజించువాడవు. పెంచువాడవు. ఉపసంహరించువాడవు. మమ్ములను రక్షించువాడవు గూడ నీవే. రఘునందనా! నా యపరాధమును సైరింపుము." ఇట్టులా మునిరా జనేకవిధముల రాఘవుని సన్నుతించి యతనికడ సెలవు గైకొని శిష్యులను వెంట నిడికొని సానందముగా తన యాశ్రమమునకు నరిగిపోయెను.

అనంతరము శ్రీరామచంద్రు డమరులను గాంచి యమరులారా! కల్పవృక్షమును, పారిజాతమును గొని స్వర్గమున కరుగుడని వారి కనుమతి నొసగెను. ఆమాట నాలించి సురగురువగు బృహస్పతి 'శ్రీరామచంద్రా! మీరీ పుడమిపై నున్నయంతకాలము నీకల్పవృక్ష పారిజాతములు మీచెంతనే నిలుచుగాక! మీరు వైకుంఠమున కరుగు దెంచిన నాఁడవి కూడ భువినుండి దివికి జనుదేఁజగలవు' అని తన సమ్మతి నెఱుఁగఁజెప్పెను. అట్లకాక! యని రాఘవు డతని పలుకుల నభినందించి యావృక్షములను రెంటిని బుష్పకవిమానమునందు బ్రతిష్ఠించెను. పిమ్మట నాతనిచే బూజల నందికొని యింద్రాదుల మందానందమున స్వర్గమునకు వెడలిపోయిరి.

విష్ణుదాసా! యీవిధముగా గల్పవృక్షపారిజాతములు దివినుండి భువికి దిగివచ్చుట సంభవించినది. నీవు కోరిన విధముగా నీ యుదంతమును సాంతముగా నీకు వినిపించితిని. సాకేతనగరమునందా వృక్షరాజముల మూలమున సీతతోడ గూడి శ్రీరామచంద్రుడు పరమసుఖమును బొందెను. చిరకాలమా కల్పవృక్షముక్రింద దివ్యపర్యంకముపై సీతామహాదేవితోడ గూడియుండి నానావిధభోగముల ననుభవించెను. ఆకారణముననే నేను వెనుకటి సర్గములో శ్రీరామచంద్రుని గల్పవృక్షము నీడలో దివ్యపీఠమున నాసీనుడై యున్నట్లు భావించి ధ్యానింపవలె నని చెప్పియుంటిని. నాటినుండియు నాపారిజాతవృక్షముయొక్క యంశమున బుట్టి యెన్నియో పారిజాతవృక్షము లీనాటికిని బుడమిపై గన్నులపండువు సేయుచున్నవి. పారిజాతపుష్పముతో సమానముగా శ్రీరామచంద్రునకు బ్రీతి గలిగించు పుష్పము మఱియొకటిలేదు. కల్పవృక్షముయొక్క యంశమున బుట్టినవి రావిచెట్లు. వానిని సేవించుటవలన సమస్తకామితములును సిద్ధించును. ఇతర యుగములలో బుణ్యమెక్కువ. అయినను నాయుగములవారికి

రాపిచో సత్యంతభక్తిశ్రద్ధలతో నారాధించెడివారు. ఈకలియుగమునందు బాపమెక్కువ అయినను నీయుగమువారీ వృతములను బూజింపగోరరు.

ద్వితీయసర్గము సమాప్తము.

— 0⁰0 —

# తృతీయ సర్గము

## —రామోపాసకకృష్ణోపాసకుల సంవాదము—

'గురువరేణ్యా! శ్రీరామదాసా! పుడమిపై శ్రీమహావిష్ణు వెత్తిన పది యవతారములలోను రామావతారము, కృష్ణావతారము నుత్తమములైన వని తొల్లి పెద్దలు చెప్పగా నాలకించితిని. ఆరెంటియందును గూడ నే యవతారము మేలైనదో యెఱుగజెప్పుడు. మీరేది మేలైనదన్న దాని చరితలనే నిరంతర మాలకింపబూనెదను' అని విష్ణుదాసుడు శ్రీరామదాసుని బ్రశ్నించును. అప్పుడు రామదాసు డిట్లు నొడువును.

విష్ణుదాసా! నీవు చక్కని ప్రశ్నమొనరించితివి. వివరించుచున్నాడను. సావధానచిత్తుడవై యాలకింపుము. ఆరెండవతారములందును రామావతార ముత్తమమైనది. ఈవిషయమున దొల్లి యిరువురు బ్రాహ్మణులకు వివాదము సంఘటిల్లెను. పరమపావనమైన యాగాథను నీకిప్పుడు వినిపించెదను.

పూర్వమయోధ్యారాజ్యమున రాముడను పేరుగల బ్రాహ్మణుడొకడుండెను. అట్లే ద్వారకానగరమున కృష్ణుడను పేరబరగు బుద్ధిమంతుడగు విప్రుడొక డుండెను. అతడురాముని, నితడుకృష్ణుని నిరంతరము భక్తితో గొలుచుచుండువారు. వా రిరువురును మాఘమాస

మున ప్రయాగక్షేత్రమున కేగుదెంచిరి. అప్పుడు వారి కిరువురకును మైత్రి యేర్పడెను. వారిరువురును త్రివేణిలో స్నానము జేసి తమతమ యిష్టదైవతముల నారాధించికొని పురాణశ్రవణము జేయుటకై యొక పౌరాణికుని సమక్షమునకు బోయి కూర్చుండిరి. ప్రాసంగిక ముగా నచ్చట నాతని మొగమున వారు శ్రీరామచంద్రుని చరితల నాలకించిరి. ఆచరితల నాలకించి శ్రీరామభక్తుడైన కారణమున రాముడను బ్రాహ్మణు డెంతయో సంతోషించి యా పౌరాణికుని భక్తితో బూజించెను. అది గని సహింపజాలక క్రోధమున మండి పడుచు గృష్ణోపాసకుడా రామోపాసకునితో నిట్టులనెను.

"ఓయీ బ్రాహ్మణోత్తమా! బ్రదుకులో నెక్కువభాగము మహాక్లేశముల ననుభవించినవాడుగదా! రాఘవుడు. అతని చరితము నాలకించినంత మాత్రమున నంత యుప్పొంగిపోవుచుంటి వేమి? పైగా వ్యర్థముగా బౌరాణికుని కూడ బూజించితివి. నీ వెందులకును గొఱగాని మూర్ఖుడవుగా గానవచ్చుచున్నావు. ఏమి? చెవులకింపుగా నుండు పరమపావన చరిత్రము వేఱొకటి లేనేలేదా? శ్రీకృష్ణపర మాత్మ చరిత్ర మనేక క్రీడావిశేషములతో నిండియుండి వీనుల కెంత యింపుగా నుండునో యెఱుగుదువా?"

రామోపాసకుడు — (చిఱునవ్వునవ్వి) ఏమేమి? శ్రీకృష్ణపర మాత్మ చరిత్ర మింపైనదా? దురితములను హరించునదా? నా రఘు రాముని చరిత్ర యట్టిది కాదా? అట్టులైన సవిస్తరముగా వివరింపుము. ఈ సభాసదులు కూడ నాలకింతురు.

కృష్ణోపాసకుడు — బాగుగా నడిగితివి. సావధానచిత్తుడవై యాకర్ణింపుము. ఈసభాసదులు నాకర్ణింతురు. నీ రాముని చరితము మహాదుఃఖముల కాలవాలమైనది. నా శ్రీకృష్ణుని చరితము జనుల కనుం దానందము నొనగూర్చునది. నీ రాముని జననమునకు ముందే

యతని తండ్రికి శ్రవణుని మాతాపితరుల వలన శాపము ప్రాప్తించినది. ఆ శాపమునకు గూడ ముందతని మాతాపితరులను రావణుడు లంకానగరమున కెత్తికొని పోయెను. వింటివా? సీరాముని చరిత్రము దుఃఖములతో నెట్టులారంభమైనదో? కాని నా శ్రీకృష్ణ పరమాత్మ జన్మించుటకు ముందతని మాతాపితరులను గంసుడు పరమానంద సంధాయకములగు వివాహ మంగళ కార్యక్రమములతో సాదరముగా బూజించెను.

రామోపాసకుడు :— ఓరి దుర్మతీ! నా మాట వినుము. అది శాపముకాదు. అది వరము. తత్ప్రభావముననే పుత్రులులేని భూపతికి బుత్రు డుదయించెను. రావణు డతని తల్లిదండ్రులను గొనిపోయినప్పటికిని నాప్రభువగు శ్రీరామచంద్రునకు వెఱచి విడిచిపుచ్చెను. ఇది నాస్వామి జన్మమునకు ముందు ప్రదర్శించిన పురుషకారము. క నీ కృష్ణుని చరిత మెట్టిదియో యదియు వినిపింతు నాలకింపుము. అతడు జన్మించుటకు ముందే అతని తల్లిదండ్రులకు గారాగృహము ప్రాప్తించినది. రాజభోగముల ననుభవింపరాదని యదువంశమునకు శాపము ప్రాప్తించినది. అతని పుట్టువు కూడ చెఱసాలలోనే సంఘటిల్లినది. అతడు జన్మించిన తోడనే తల్లిదండ్రులకు వియోగము ప్రాప్తించినది. అతని మూలమున మేనమామచే నతని సోదరులకు మరణము సంభవించినది. అతనిని బెంచిన తల్లిదండ్రులు క్షత్రియులును గారు. వైశ్యులును గారు. చిన్నతనమునందే యత డొక గోవులను గాచికొనువాని తనయుడై ప్రవాసక్లేశము ననుభవింపవలసివచ్చెను. అతడు పరులచే బెంచబడినవాడు. బలభద్రుని కన్న జిన్నవాడు. ఈవిధముగా నీకృష్ణుని జరిత్రమును బరిశీలించినచో నం దంతటను దుఃఖములే కానవచ్చును గాని సుఖ మొక్కటియు గానరాదు.

కృష్ణోపాసకుడు:—తనను దాను గాపాడుకొనుటకై నీ రాము డొక యాడుదానిపై బాణమును బ్రయోగించెను. చిన్నతనముననే తల్లిదండ్రుల నెడబాసి పోయి వారికి దీరని వియోగక్లేశమును గలిగించెను.

రామోపాసకుడు:— నా రాముడు బ్రాహ్మణులను సంహరించు తాటక యను పేర బరగు క్రూరురాలిని సంహరించెను. విశ్వామిత్రుని యజ్ఞసంరక్షణమునకై దశరథుడు స్వయముగా సానందముగా దన తనయుల నిరువుర నాముని కర్పించెను. ఇక నీకృష్ణుడో! అత డాత్మ రక్షణమునకై పూతన యను నాడుదాని ప్రాణములను హరించెను. స్వాత్మరక్షణమునకై వ్రజపురమునం దతి డెంతయో జీవహింస జేసెను. గోపకులతో సాంగత్యము నెఱపెను. గోపకుల రక్షణమునకై పాటుపడెను. గోవధ మొనరించెను. సర్పమును సంహరించెను. పక్షిని దెగటార్చెను. గుఱ్ఱమును జంపెను. గాడిదను పొరిమాల్చెను. వృషభమును సంహరించెను. దొంగతనము జేసెను. జూద మాడెను. వనములో దిరుగాడెను. శీతవాతాతపబాధలకు దాళజాలక కంబడి గప్పుకొనెను. ఆకలి దప్పికలతో నలమటించెను. గోపాలుర యుచ్ఛిష్టము నారగించెను. తినకై వనములో బ్రాహ్మణ స్త్రీల కడకు బోయి యన్నము యాచించెను. అనాదిగా వచ్చు నింద్రధ్వజ పూజనము మున్నగు పెద్దల యాచారముల నంతరింప జేసెను. పరస్త్రీ గమనము పాపహేతువని యతనికి దోచనే లేదు. తనకన్న నెక్కుడు వయస్సుగల స్త్రీలతో క్రీడించెను. దిగంబర స్త్రీలను దర్శించెను. అగ్నిప్రాశనము జేసెను. త్రాటితో గట్టబడెను. జంటగానుండు నర్జునవృక్షములను బెకలించెను. మట్టిని భుజించెను. పర్యుషితాన్నము (చలిది) నారగించెను. మాటిమాటికి వెన్నకొఱకేడ్చి తల్లిచే ప్రహారముల ననుభవించెను. గోగ్గోపికలయొద్దనంతకు

ముందున్న ప్రేమబంధము నొక్కమ్మాడిగ ద్రెంచివైచి తా నంతకు ముందున్న తావును వీడిపోయెను. చాకలివానిని జంపెను. క్షత్రియుని వలె యుద్ధము జేసెను. గజహత్యయు, మల్లహత్యయు గావించెను. యుద్ధము జేసి మేనమామ ప్రాణములను హరించెను. ఆప్తులైన వారి యెడల నిష్ఠురత్వము వహించి రాజ్యమును సంపాదించెను. ఇతర రాజుల యాజ్ఞకు లోబడెను. కుబ్జయను దాసితో గ్రీడించెను. యుద్ధములో నోటమి బొంది శత్రువునకు వెన్నుజూపెను. పాఱిపోయి యొక కొండపై దల దాచికొనగా నెఱిగిన శత్రువులచేత నాకొండకు నిప్పు వెట్టబడెను. అంతట స్వస్థలమును బాసి పాఱిపోయెను. సముద్ర తీరమున నివసించెను. బలాత్కరించి యొక స్త్రీని హరించెను. భామా సురుని ద్రవ్యమును హరించెను. తన వంశమువారి నంతయుం దివ బాండుకుమారుల కుపదేశము జేసెను. జనములచే దొంగ యను నిందారోపణమునకు గుఱిసేయబడెను. ఒక వృక్షమునకై యుద్ధ మొనరించెను.

కృష్ణోపాసకుడు:—ఓరి మూరకుడా! యిక నీ ప్రలాపములను జాలింపుము. సీరాముడు కాముకుడై కులగోత్రము లెఱుగరాని కన్యను బెండ్లియాడి వర్ణసంకరము సేయలేదా? ఆకన్యకు దల్లి యెవరు? తండ్రియెవరు? శివుని విల్లు విరిచి యాశివుని యెడల నపచారము సేయ లేదా? పరశురాముని గౌరవమును హరింపలేదా? ముద్గలుని యను మతిలేకుండ నతని యాశ్రమములోని మూలికలను హరింపజేయలేదా అంతియేకాదు. అతడు దిక్కుమాలినవాడై యడవులలో దిరుగాడెను. తనకై పశువులను హింసించెను. అడవిలో నాశ్రమవాసము జేసెను. వన్యపదార్థముల నారగించెను. మాంసమును భుజించెను. వింటిని జేత బట్టి బోయవృత్తి నవలంబించెను. శీతవాతాతపబాధల ననుభ వించెను. పాదచారియై చరించెను. చర్మములను ధరించెను. జటా

వల్కలములను దాల్చెను. గోళ్ళను, గడ్డమును బెంచెను. వృక్షమూలముల నాశ్రయించెను. అపాత్రుడై (చెంబు కూడ లేనివాడు) చరించెను. నీరాముని భార్యను రాక్షసు డెత్తికొనిపోయెను. భార్యకొఱకు రోదించెను. దాసియగు శబరిచే బూజింపబడెను.

రామోపాసకుడు :— రావణుడెత్తికొనిపోయిన సీత యచ్చమైన సీత గాదు. ఛాయాస్వరూపిణి. ఆమెనే నారాముడు రావణుని చెఱనుండి విడిపించెను. నారాముని బూజించినది దాసిగాదు. మునులను సేవించుచు జీవితమును ధన్యము గావించి కొన్న శబరి. నా స్వామి యనుగ్రహమున నామె జీవన్ముక్తురాలై మోక్షమును బొందినది. నీ కృష్ణుని భార్యల నర్జునుని కడనుండి యతని నోడించి హరించి యిప్పటికిని శత్రువు లనుభవించుచున్నారు. నీ కృష్ణు డాడుదానిచేత నోటమి బొందినవాడు. ఆఁడుదానిచేత దానము సేయబడినవాడు. నారదునికడనుండి యాఁడుదానిచేత గొనబడినవాడు. భార్యలందఱి యభిలాషములను సఫలము సేయుటకు రేయెల్ల నిదురలేక బాధపడువాడు. అతఁడు, నతని యన్నయు దమకన్న నెక్కువ ప్రాయము గలిగి తల్లులని భావింపదగిన తన్వంగులతో గ్రీడించిరి.

కృష్ణోపాసకుడు :— తమ్మునితో గూడి నీరాముడు గూడ క్రూరజంతుభీతిచే గునుకు లేక బాధ నొందినాడు. సుగ్రీవున కతని యన్న పెండ్లాము నప్పగించినాడు. వానరులతో నెయ్యము నెఱపినాడు. దుందుభి శవమును దాకినాడు. వ్యర్థముగా వాలిని సంహరించినాడు. వానరుల సహాయమును స్వీకరించినాడు. వానరుని వాహనముగా నుపయోగించికొన్నాడు. వ్యర్థముగా దాళవృక్షములను గూల్చినాడు. సముద్రమును నిరోధించినాడు. లంకను గాల్పించినాడు.

రామోపాసకుడు :— నీ కృష్ణుడు గర్భదరిద్రుడగు కుచేలునితో సఖ్యము జేసినాడు. నారామునకు సాయపడిన వానరులు కేవలము

వానరమాత్రులు గారు. వారు దేవాంశసంభవులు. శ్రీకృష్ణుడు వ్యర్థముగా గపటము జేసి జరాసంధుని సంహరించలేదా? వ్రేపల్లెలో వెట్టిగొల్లల సహాయమును స్వీకరించలేదా? వనములో నొక వెట్టిగొల్లని వాహనముగా జేసికొని క్రీడించలేదా? కాశీకానగరమును గాల్చలేదా? మిత్రుడనదగు రుక్మిని వికారరూపము గలవానినిగా జేయలేదా? శివపూజాధురంధరుడగు బాణాసురునితో యుద్ధము సేయలేదా? స్వయముగా శివునితోడనే సమరము సాగించలేదా? చేదిదేశాధిపతి యగు శిశుపాలునిచే దూషింపబడలేదా? అతని పౌత్రులిరువురు పరులచే నోడింపబడలేదా? పారిజాతపుష్పము నర్పించుట మున్నగు చేష్టల మూలమున భార్యలయందు భేదభావమును ప్రదర్శించలేదా? ఏల వసరెదవు? నోరుమూసికొని యూరకుండుము.

కృష్ణోపాసకుడు :— ఏమేమి? మించి మించి మేల మాటలాడెదవు? శ్రీరాముని కొడుకు (శత్రుఘ్నుని కొడుకు) యుద్ధములో మామను బట్టి బంధించలేదా? శ్రీరాముడు శివపూజాధురంధరుడగు రావణునితో రణ మొనరించలేదా? బ్రహ్మహత్య సేయలేదా? కుంభోదరమహర్షిచేత నిందింపబడలేదా? తన కార్యమును సాధించికొనుటకై రావణుని తమ్మునితో మైత్రి సేయలేదా? పరునిచే హరింపబడి చిరకాలము పరు నింట నున్న భార్యను మహాప్రసాదముగా స్వీకరించలేదా? భార్యయెడల నిష్ఠురత్వమును ప్రదర్శించలేదా? వలచివచ్చిన కలువకంటులకు నైరాశ్యమును గలిగించలేదా? యానము నెక్కి యాత్రలు సేయలేదా? ఏకాంతమున వేశ్యలను స్పృశించలేదా? మహాపతివ్రత యగు సీతపై దోషారోపణము సేయలేదా? పుత్రుని జంప నాదేశ మీయలేదా? శూద్రుని, సింహమును సంహరింపలేదా?

రామోపాసకుడు :— ఓయి మూర్ఖబ్రాహ్మణా! కడపట శ్రీకృష్ణుడు తన వంశమే నిర్మూలము గావలెనని శపించెను. అతని

ద్వారకానగరము సముద్రముచే ముంపబడెను. అతడు తన వంశము వారిచే మద్యము ద్రావించి యొకరి నొకరు చంపికొని చచ్చునట్లు చేసెను. తత్కారణముగా నంతిమసమయమున దన మిత్రమగు నర్జునకు దర్శన మీయలేదు. ఏకాకిగా స్వస్థానమున కరిగెను. అవసాన సమయమున నల్పుడగు వ్యాధునిచే బాణమున గొట్టబడెను.

కృష్ణోపాసకుడు :— సీరాముడు కన్నకొడుకులతోడనే సమర మొనరించెను. సీతను నేను త్యజించితి నని లోకమును వంచించి రహస్యముగా వాల్మీకి మున్యాశ్రమమున కరిగి సీతాపుత్రులను సందర్శించెను. దండకారణ్యములో దిరుగాడుచు దన తండ్రికి దెలికపిండితోడను, నింగుదీఫలపు గుజ్జుతోడను బిండప్రదానము గావించెను. ఐరావణుని భోగపత్ని మంచమును స్పృశించెను. రావిచెట్టును ఖండించి పాపపరిహారార్థ మొక మహాయజ్ఞము చేసెను. తన మంత్రులకు శేషించిన యాయువు పూర్తి యగుటకై తన కొడుకులచే యమ ధర్మరాజుతో బోరాటము సేయించెను. కేవల మొక పూర్వ నాఘ్రాణించినంతమాత్రమున భార్యను శిక్షించెను. నాకృష్ణుడు చిన్నతనమున నవలీలగా బూతన యను రక్కసి నుక్కడించెను. తృణానన్తుడు మున్నగు రక్కసుల బెక్కురను బరిమార్చెను. అవలీలగా చిటికెన వ్రేలిపై గోవర్ధనగిరి నెత్తెను.

రామోపాసకుడు :— నా రాముడు బాల్యమున నవలీలగా దాటక యను రక్కసి నుక్కడంచెను. మారీచాది రాక్షసుల నెందఱనో మట్టుపెట్టెను. పర్వతములను నీటిపై దేలించెను.

కృష్ణోపాసకుడు :— నా కృష్ణుడు వ్రేపల్లెలో గోపికలను మోహింపజేసెను. మదనమోహిని యగు రాధికను మోహితురాలిగ గావించెను.

రామోపాసకుడు :— నారాముడు తన రూపసంపదచే మోహితలై దేవపత్నులు రాత్రివేళ దనచెంతకు రాగా వారిని మాతృమూర్తులుగా గౌరవించెను. వారికి వరముల నొసగి కృతకృత్యులుగా గావించెను. వారే యా వరప్రభావమున గృష్ణావతారమునందు గోపికలై యావిర్భవించిరి. నారాముని తాంబూలోచ్ఛిష్టమును భక్తితో సేవించి యొకదాసి యతని వరప్రభావమున గృష్ణావతారమునందు రాధికయై జన్మించెను. కావున నేకపత్నీవ్రతధారి యగు నా రాముడు ధన్యచరిత్రుడు.

కృష్ణోపాసకుడు :— నాకృష్ణుడు సలక్షణముగా యథావిధిగా బదునాఱువేల నూటయెనమండుగురు భార్యలను పెండ్లియాడెను.

రామోపాసకుడు :— వారంగలును నా రాముని రూపసంపదచే మోహితలైనవారు. వారిని నాస్వామి తల్లులనుగా గౌరవించెను నీకృష్ణుడు రతికాముకుడై స్త్రీలను మోహింపజేసెను.

కృష్ణోపాసకుడు :— నాకృష్ణుడు కువలయాపీడ మను గజరాజము నవలీలగా సంహరించెను.

రామోపాసకుడు :— నారాముడు నాగేంద్రుని శత్రువగు నష్టాపదు డనువాని నవలీలగా నంత మొందించెను.

కృష్ణోపాసకుడు :— నా కృష్ణుని ప్రభావమున యమునానది ఖండితమైనది.

రామోపాసకుడు :— నారాముని ప్రభావమున గంగానది ఖండితమైనది.

కృష్ణోపాసకుడు :— నాకృష్ణుడు స్వర్గమునుండి పారిజాత వృక్షమును బుడమికి గొనివచ్చెను.

రామోపాసకుడు :— నా రాముడు కల్పవృక్షమును, పారిజాతమును గూడ దివినుండి భువికి దీసికొని వచ్చెను.

కృష్ణోపాసకుడు :— నా కృష్ణుడు తన గురువుగారియొక్క మరణించిన యేడుగురు కుమారులను సురక్షితముగా యమపురమునుండి కొనివచ్చి గురువున కప్పగించెను.

రామోపాసకుడు :— సాకేతనగరములో నా రాముడు గూడ మరణించినవారి నేడుగురను బ్రదికించెను.

కృష్ణోపాసకుడు :— నా కృష్ణుని పురుషకారముచే విప్రకుమారులు జీవించిరి.

రామోపాసకుడు :— నారాముని పురుషకారమున మంత్రియగు సుమంత్రుడు పునరుజ్జీవితు డయ్యెను.

కృష్ణోపాసకుడు :— నాకృష్ణుడు ద్రౌపదిచే గోరబడి ఫలములు లేని వృక్షమున ఫలములను సంధించెను.

రామోపాసకుడు :— నా రాముడు సీత కోరగా జెట్టునుండి విడివడిన తులసీదళమును మరల జెట్టుతోడ సంధించెను.

కృష్ణోపాసకుడు :— దుర్వాసు డొకనాడు వనములోనికి వచ్చి గోపికల నన్నము గోరగా నతని యభిలాషమును సఫలము గావించి గోపికల కాతనివలన గలుగు నాపదను దొలగించెను. ఈ పురుషకారము నానాడు జను లందఱును సందర్శించిరి.

రామోపాసకుడు :— ఆదుర్వాసుడే యన్నమును గోరగా నారాముడు గూడ నట్లే తన పురుషకారము నెల్లర ముందును వెల్లడి జేసెను.

కృష్ణోపాసకుడు :— నా కృష్ణు డనేకరూపములను దాల్చెను.

రామోపాసకుడు :— నా రాముడు ననేక రూపములను దాల్చెను.

కృష్ణోపాసకుడు :— నా కృష్ణుడు తన మిత్రునకు బంగారు నగరము నర్పించెను.

రామోపాసకుడు :— మిత్రునకు బంగారు నగరమును నా రాముడు నర్పించెను.

కృష్ణోపాసకుడు :— నా కృష్ణుడు సూర్యగ్రహణ కాలమున గురు క్షేత్రమున స్నాన మొనరించెను.

రామోపాసకుడు :— సూర్యగ్రహణకాలమున గురుక్షేత్ర మునందు నారాముడును స్నానమాచరించెను. నా రాము డాడిన ప్రతిమాటయు సత్యము. నీకృష్ణు డాడిన మాటలలో నెన్నియో యసత్యము లున్నవి. శత్రుసంహారమునకు నారాముని బాణ మొక్కటి చాలును. శత్రువర్గముపై నీకృష్ణు డేసిన శరములలో నెన్నియో విఫలములై య వున్నవి. నా రామున కొకతెయే భార్య. నీకృష్ణున కనేకభార్యలు. తన భార్యయొక్క శయ్యను దప్ప నా రాము డితరస్త్రీశయ్య నెఱుగడు. నీకృష్ణుడు తన భార్యల శయ్యలనే కాక యెందఱో యితరస్త్రీల శయ్యలను బావన మొనరించినాడు. మధ్య దేశములో సరయూతీరమునందలి సాకేతనగరమున నా రాముడు నివసించెను. పడమట సముద్రతీరమున ద్వారకలో నీకృష్ణుడు నివ సించెను. నా రామునకు ముగ్గురు సోదరులు. నీకృష్ణున కొక్కడే సోదరుడు. కామధేనువు, కల్పవృక్షము, పారిజాతము, చింతామణి, పుష్పకవిమానము, నగస్త్యముని యొసగిన కంకణద్వయము, నైరా వతము కులమున బుట్టిన నాలుగు దంతములు గల యేనుగు నను నివి నారాముని కడనుండు రత్నములు. నీకృష్ణుని కడ రెండు మణులు, పారిజాతము నను మూఁడే రత్నము లున్నవి. అట్టి కృష్ణు నేల వ్యర్థ ముగా గొనియాడుదువు? నారాముడు సప్తద్వీపాధిపతి. సమస్త మహారాజులచేతను వందనముల నందికొన్నవాడు. నాస్వామికి నీశ్వ రత్వము, జగదీశ్వరత్వము రెండును సమానములు, కావున నారాము నితో నీకృష్ణుని సమానునిగా భావింపవలదు. నారామునకు గుంతి

తము గాని కోదండమున్నది. అక్షయతూణీర మున్నది. నా రాముకు బ్రాహ్మణుల కోరికలను సఫలము జేయుటయే వ్రతము. నారాముకు సింహాసనము, ఛత్రము, చామరములు మున్నగు రాజలాంఛనము లున్నవి. పుష్పకవిమాన మున్నది. తనతో సమానులగు నుత్తములైన తనయు లున్నారు. నారామునిచే బ్రాహ్మణుల కొసగబడిన దానము లిప్పటికిని వారిచే ననుభవింపబడుచున్నవి. అత డొసగిన రామనాథపురరాజ్య మిప్పటికి నట్లే నిలిచియున్నది. శ్రీకృష్ణు డొసగిన దానమేదైన నిప్పటివఱకు నిలిచియున్నదేమో నాకు దెలుపుము. శంకరుడు గూడ నిరంతరము నారాముని నామమును జపించుచుండును. కాశికానగరములో బరమశివుడు నిరంతరము నాస్వామియొక్క తారకనామమును మరణింపనున్నవారి చెవులలో నుపదేశించుచుండును. ఆ కారణముననే జనులు గూడ రామనామమును స్మరించికొనుమని మరణింప బోవువారి కుపదేశించు చుందురు. జీవునకు ముక్తి గలిగించుటకై రామనామస్మరణము జేయుచు శవవాహకులు శవమును గొని పోవుదురు. అంతటి మహిమగలవా డగుటచేతనే యా రాము నిప్పుడిట్లు కొనియాడుచున్నాను. ఆ మహాపురుషుని చరిత్రమును శ్రీమద్రామాయణమనుపేర నూఱుకోట్ల శ్లోకములలో వాల్మీకిమహర్షి ముందే రచించినాడు. కృష్ణాదుల చరిత్రములు గూడ నం దంతర్గతములైనవే.

శిష్యా! విష్ణుదాసా! వినుచుంటివి గదా! ఇట్టులా రామోపాసకకృష్ణోపాసకు లిరువురును బరస్పరము వాదించికొనుచుండగా వారి కాశ్చర్యజనకముగా నాకాశవాణి వినవచ్చెను. దాని నందఱు నాలకించిరి. శ్రీరామచంద్రుని ముం దితరదైవతముల ప్రశంస యుక్తము గాదను నా యాకాశవాణి నాలకించి యెల్లరును గరతాళధ్వనులు సేయుచు జయజయధ్వానములు గావించిరి. దేవతలు విమా

నములపై నిలిచి యా రామోపాసకునిపై బూలవానలు గురియించిరి. అప్పుడు కృష్ణోపాసకుడు సిగ్గుపడి తల వంచికొని తనను మన్నింప నారామోపాసకుని మఱియు మఱియు వేడికొనెను. రామోపాసకు డతనిని బ్రహ్మానుపురస్సరముగా కౌగిలించికొని యతనితో మధురవచనములతో నిట్లు లనెను.

"బ్రాహ్మణోత్తమా! కృష్ణా! రఘునందనుడు నందనందనుని కన్న భిన్నమైనవాడు గాడు. అట్లే నందనందనుడు రఘునందనుని కన్న భిన్నమైనవాడుగాడు. అయినను నయోధ్యానగరము నేలిన బాలరాముని వంకకే నా మనము పరుగులిడును. ఆ కారణముననే రాము నధికునిగా గొనిగూడితిని. రామకృష్ణు లిరువురును సమానులని యెఱిగి యుండియు నీయెడల గలిగిన యీసు కారణముగా నేను శ్రీకృష్ణనిందన మొనరించితిని. రాముడే కృష్ణుడు. కృష్ణుడే రాముడు. ఏదో వినోదముగా నాయిరువురయందు నంతరమును బ్రదర్శించితిని ఆరామకృష్ణులయందు భేదబుద్ధిని బ్రదర్శించు మానవుడు నిస్సందేహముగా నరకమును బొందును. నీ గర్వమును హరించుటకే యాకాశవాణి రాఘవుని యాధిక్యమును బ్రకటించినది."

ఇట్లు పలికి రామోపాసకుడు కృష్ణోపాసకున కూఱట గొలిపి సభాసదులచే బూజింపబడి సభామధ్యమున మానము వహించి కూర్చుండెను. అనంతరము మాఘమాసాంతమున వారిరువురును దమతమ దేశములకు దఱలిపోయిరి. కావున నోశిష్యా! విష్ణుదాసా! అవతారములలో రామావతారమునకు సాటియైన యవతారము మఱి యొకటి లేదు. కావున నీ వనయము నారాముని చరితలనే యాలకించుము. నిండుభక్తితో నతనినే భజించికొనుము.

తృతీయ సర్గము సమాప్తము.

—()—

# చతుర్థసర్గము

## శ్రీరాముడు నాలుగురుస్త్రీలకు వరము లొసగుట - మూల కాసురోపాఖ్యానము

శ్రీరామదాసుడు విష్ణుదాసున కిట్లు వివరించును.

ఒకానొక సమయమున ననేకజనపరివేష్టితుడై శ్రీరామచంద్రుడు సభలో నాసనముపై నాసీనుడై యుండి యెదురుగా నున్న ద్రాక్షపందిరిపై నొక కాకమును జూచెను. ఆ కాకము రెండు కన్నులు గలిగియుండియు నందు బని సేయు నొంటి కన్ను గలదై, కడుదైన్యము వహించినదై, కృశించినదై, కావుకావుమని యరచుచున్నదై, యూరాటము నొందుచున్నదై, చంచలమై మాటిమాటికి రఘునందనుని వంకకే చూచుచుండెను. దానిని గాంచి దానిపై దొల్లి తాను జూపిన క్రోధమును దలచికొని కరుణామయుడై రాఘవుడు దానిని సుఖముగా దన కడకు రమ్మని యాదేశించెను. ఆ రామాజ్ఞ నాలించి యా కాకమా ద్రాక్షపందిరిపై నుండి యెగసి సభలోనికి వచ్చి కావుకావు మనుచు నాపరమపురుషుని ముందు నిలిచెను. అప్పుడు దానిపై గరుణ జనింపగా రాఘవుడు దానితో నో కాకమా! పోయిన కన్నొక్కటి దక్క నితరములైన వరములేవైన గోరుకొనుము మిచ్చెద నని పలికెను. అంతట నా కాకము 'మహాప్రభూ! మీ కృపాదృష్టి యెల్లప్పుడు నాపై బ్రసరించుచుండుటకన్న మించిన వర మేమున్నది? ఇతరములగు వరములన్నియు నిహలోకమునందు మాత్రమే సుఖమును గలిగించునవి. అట్టివానితో నాకు బనియేమి? యని బదులు పలికెను. అప్పుడు రఘునందనుడా కాకముతో నిట్టులనెను.

"కాకమా! ద్వీపాంతరములందు సైతము జరగినవియు, జరగుచున్నవియు, జరగబోవునవియు నగు వృత్తాంతము లన్నియు నీకు

నయనగోచరుఁడు లగుగాక! నావరప్రభావమున నీవిటుపై భావి కార్యము లన్నియు నెఱుఁగగలవు. నీ గమనములను బట్టి జనులు శకునములను జూచికొందురుగాక! నీవు స్థిరముగా నిలిచిన దానిని దలచి కొన్న కార్యములు స్థిరముగా నిలుచుననియు, సత్వరముగా నెగసి పోయిన గార్యములు సత్వరముగా నెఱవేరు ననియు జనులు నీమూలమున శకునములను దెలిసికొందురుగాక! గ్రామప్రవేశసమయమున, గృహప్రవేశసమయమున నీవు ఎడమప్రక్కగా గాక కుడిప్రక్కగా బోయినచో మహాశుభము చేకూరునని జనులు తెలిసికొందురుగాక! ప్రేతము నుద్దేశించి పదియవ దినమున బడవైచిన పిండమును నీవు తాకకున్నచో నాప్రేతమున కుత్తమగతి కలుగకుండు గాక! పదియవ నాటి పిండమును నీవు తాకకపోయినచో ప్రేతమున కేదియో కోరిక యున్నదనియు, నది పూర్తి సేయబడవలయు ననియు జనులెఱుఁగుదురు గాక! ప్రేతముయొక్క వంశములో నెవడైన నాప్రేతముయొక్క మనోరథమును సఫలము గావించినప్పుడే నీవాప్రేతమునకై పెట్టబడిన పిండమును స్పృశించెదవు గాక! అంతియేకాదు. నీకు మఱియొక వరమును గూడ బ్రసాదించుచున్నాను. జనులు పుస్తకములలో, బత్రములలో నేదైన విషయమును వ్రాసికొనునప్పు డొక వాక్యమును గాని, పదమును గాని మఱచిపోయినప్పు డక్కడ బంక్తిక్రింద నీ పాదమును (కాకపాదము, దీనినే వాడుకలో హంస పాదు అని కూడ నందురు). లిఖించి మఱచిపోయిన విషయమును పైనగాని, ప్రక్కనుగాని వ్రాసికొందురుగాక! నీ కాకపాదచిహ్నమును గాంచినంతనే యచ్చట వ్రాతలో నేదియో విషయము విస్మృతమయ్యెననియు, నది ప్రక్కనో, పైనో వ్రాయబడియుండు ననియు జను లెఱుఁగుదురు గాక!॥

ఈ విధముగా బలికి యా కాకమునకు వరము లొసగి రాఘవుడు మహానందము వహించెను. ఆ కాకము గూడ సంతుష్టమై శ్రీరాము.

చంద్రునకు బ్రణమిల్లి యిచ్చవచ్చిన దిక్కున కెగసిపోయెను. ఈ విధముగా రఘునందను డనేక చరిత్రముల నాచరించెను.

ఒకనాటి రేయి శ్రీరామచంద్రుడు పారిజాతవృక్షము క్రింద బంగారు పర్యంకముపై నొంటరిగా శయనించి నిదురించుచుండెను. రజస్వలయై యస్పృశ్యురాలైన కారణమున సీత యానాడు పతి చెంతకు జేర వీలులేకపోయెను. ఆసమయమున శ్రీరామచంద్రుని ద్వారపాలకులు, రక్షకభటులు, దాసదాసీ జనవర్గము నెల్లవారు నెందో శ్రీరామకీర్తనము జరగుచుండగా భక్తిభావప్రేరితులై యది వినుటకా యెడకు వెడలిపోయిరి. అప్పుడా యదను దమ కార్యసిద్ధి కనుకూలమైన దని తలపోసి యయోధ్యలోని పౌరుల స్త్రీలు నూఱుగురు దమలో దా మాలోచించుకొని దివ్యములై తేజరిల్లు వస్త్రములతో, నాభరణములతో, యౌవనమదమును వెలిబెట్టు నంగములతో హేమకుంభములను బోలు పయోధరములతో, జంద్రబింబములను బోలు వదన మండలములతో, జిలుకముక్కులను బోలు నందమైన ముక్కులతో, బాములను దలపించు పాదములతో, లేడి చూపులను బోలు చపలములైన చూపులతో, నిగనిగలీను మనోహరములైన పట్టువస్త్రములతో, గల్లుగల్లుమని రవళించు బంగారు కాలి యందెలతో దొలిప్రాయపు మెఱుగులను విరజిమ్ము నెమ్మోవి లావణ్యములతో బుష్పకవిమానమునం దొంటరిగా బవళించి నిదురించుచున్న శ్రీరామచంద్రుని సన్నిధి కరిగిరి. ఒక వెలది వీవన గొని రాఘవునకు వీవ నారంభించెను. ఒక పూవుబోడి స్వామి గళసీమ నలంకరింప జేయుటకై పూలమాలను గేల ధరించెను. ఒక తన్వంగి తాంబూలపాత్రమును గరిమున ధరించెను. ఒక జలజాక్షి జలకుంభమును గేల ధరించెను. ఒక నెలత నిష్ఠీవనపాత్రమును (ఉమ్మివేయు పాత్రము) బట్టెను. ఒక చాన చంద్రనపాత్రమును వహించెను.

ఒక యన్నవలమిన్న దివ్యాన్నమును గైకొనెను. ఒక పడతి పక్వాన్ననైవేద్యమును బట్టుకొనెను. రంభను బోలు నొక రమణీమణి రంభాఫలము మున్నగు ఫలములను ధరించెను. ఇంతలో నొక యింతులమిన్న పాదసంవాహనము సేయు తలంపున శ్రీరామచంద్రుని పాదమును జేతితో స్పృశించెను. సీత యస్పృశ్యురాలుగదా! ఇప్పుడు నా పాదము నెవరు స్పృశించిరి! అని తలపోయుచు వెంటనే రఘునందనుడు మేలుకాంచి లేచి కూరుచుండెను. అతనికి దన ముందు దివ్యసువర్ణాభరణవిభూషితలైన నూఱుగురు పౌరస్త్రీలు గానవచ్చిరి. వారందఱును లేచి కూర్చున్న శ్రీరామచంద్రుని జూచి పుడమిదాక శిరములు వంచి నమస్కరించి వివిధవచనములతో నామహాపురుషుని వినుతించిరి. మీరింత రాత్రివేళ నిచ్చటకేల యరుదెంచిరో తథ్యము వాకొనుడని రాఘవుడు వారిని బ్రశ్నించెను. ఆమాట నాలకించి పురస్త్రీ లందఱును సిగ్గుపడుచు దలవంచికొని మౌనముగా నిలువబడిరి. వారిలో నొక్క నారీమణి సిగ్గువిడిచి 'స్వామీ! శ్రీరామచంద్రప్రభూ! మే మందఱ మెందుల కేగుదెంచితిమో యది మీ రెఱుగ జాలని యంశముగాదు. మి మ్మిప్పట్టున మాపై కృప జూప గోరుదుము. మమ్ముల నుపేక్షింపదగదని దోయిలి గట్టుకొని వేడికొనుచున్నాము.' అని బదులు పలికెను. అప్పుడు వారి యభిప్రాయము నెఱిగి శ్రీరామచంద్రుడు మధురవచనములతో వారి కిట్లు నచ్చబలికెను. "కాంతలారా! నేనీ పుట్టువున నేకపత్నీవ్రతము నవలంబించినవాడను. మీరందఱును నాకు దల్లులవంటివారు, సీతకన్న భిన్నమైన యే యన్నువయైనను నాకు దల్లితో సమానురాలు. నేను మహారాజనై రాజ్యపాలనము సేయుచుండగా నారాజ్యములో నెందును నధర్మమునకు దావుండరాదు. కావున శీఘ్రముగా మీ మీ గృహములకు మఱలిపొండు. మీ యీ ప్రథమాపరాధమును క్షమించితిని." అనగా విని శ్రీరామచంద్రుని యీ వాగ్బాణములచేతను,

గామబాణములచేతను గొట్టబడి యా యతివ లందఱు నతితరసన్నై రాశ్యే సంక్షోభము నొంది మూర్ఛాక్రాంతలై పుడమిపై గూలిరి. అప్పుడు వారిని గాంచి యాశ్రమము నొందుచు గరుణాళుఁడై రఘునందనుడు మఱల వారితో మగువలారా! నా మాట వినుడు. ఒక్కపర్యాయము నన్ను బొందినంత మాత్రమున మీకు దృప్తియు గలుగదు. నాకు వ్రతభంగము నగును. కావున నిదిగో! నా మాటల నాలింపుడు. నేను బూర్వము యజ్ఞము సేయువేళ నాగురువునకు నూఱు బంగారు సీతామూర్తులను దానము జేసియుంటిని. తత్ఫలముగా ద్వాపరయుగమున శ్రీకృష్ణరూపమున మీతోడ జిరకాలము క్రీడింతును. మీరానా డనేకమహారాజులకు గొమరితలై జనియింపుదు. అప్పుడు భౌమాసురుడు (భూదేవి కుమారుడు) మిమ్ముల నందఱను హరించును. నాడు వానిని సంహరించి మిమ్ముల నందఱను వాని బారినుండి విడిపించి ద్వారకానగరములో యథావిధిగా బెండ్లియాడుదును. ఆనాడు నేను బదునాఱువేల నూటయెనమండుగురు స్త్రీలను బరిణయ మాడెదను.'' అని పలికెను. ఆపలుకుల నాలకించి సంతసించి యాపురస్త్రీలందఱును రఘునందనునకు బ్రణమిల్లి వహానముగా దమతమ గృహములకు మఱలిపోయిరి.

అనంతరము శ్రీరామచంద్రుడు దాసీజనమును బిలిచెను. ఒక్కతెయు గానరాలేదు. సేవకవర్గమును బిలిచెను. ఒక్కడును గానరాలేదు. రక్షకభటులను బిలిచెను. ఒక్కడును గానరాలేదు. ద్వారపాలకులను బిలిచెను. వారును గానరాలేదు. అప్పుడు విమానము నుండి క్రింద కవతరించి లక్ష్మణుని బిలిచెను. ఆ పిలుపు నాలకించి యూర్మిళ పతిని మేలుకొలిపెను. అప్పు డతడు ఊర్మిళామందిరమునుండి వెలికి వచ్చెను. రఘునందను డతనితో లక్ష్మణా! సేవకులందఱు నెటకేగిరో కనుగొనుమని చెప్పెను. అట్లకాక! యని యత

డరిగెను. ఇంతలో శ్రీరామచంద్రునకు నగరము వెలుపలనుండి యొక స్త్రీరోదనము వినవచ్చెను. అది విని రఘునందను డత్యంతవిస్మయము నొందెను. లక్ష్మణు డరిగి తన దూతలను బిలిచి వెంటనే శ్రీరామ చంద్రుని సేవకులను బిలిచికొనిరండని వారి కాదేశించెను. వారు కీర్తనస్థలమున కరిగి రాముని సేవకులకు లక్ష్మణాదేశము నెఱిగించిరి. అప్పుడా రామసేవకులలో గొందఱు శ్రీరామసంకీర్తనము నసంపూర్ణ ముగా విడచి స్వామి సన్నిధి కెట్లు రాగలమని ప్రతిప్రశ్న మొనర్చిరి. మఱికొందఱు 'మనము సేవకులము. అనయము ప్రభుని యాజ్ఞను పాలించుటయే మనధర్మము. అట్లుకానిచో మనకు పాతకము సంక్ర మించు' నని పలికిరి. శ్రీరామసంకీర్తనము స్వామ్యాజ్ఞాభంగము వలన గలిగిన దోషమును గూడ హరింపగలదని మఱికొందఱు వాకొనిరి. మనము కీర్తనమధ్యమున నుంటిమని యెఱిగినచో స్వామి యానందించునని కొందఱు పలికిరి. ఈ విధముగా బలువిధములుగా వాకొని యెవ్వరును ప్రభువు సన్నిధి కరుగలేదు.

అంతట లక్ష్మణుని దూతలు పోయి శ్రీరామచంద్రునకా సమా చారము నెఱిగించిరి. అప్పు డీషత్క్రోధము వహించి లక్ష్మణునితో 'లక్ష్మణా! నేను గీర్తనమధ్యమున నున్న వారిని దండింపజాలను. అయినను సేవకు లిట్టు లుపేక్ష సేయుట యుక్తముగా లేదు. కావున వారికి గొంచెపు శిక్ష విధించెదను' అని పలికి యా స్త్రీరోదనమును మఱల నాలకించి పుష్పకవిమానము నెక్కి యాస్త్రీ యున్న దిక్కున కరిగెను. అక్కడ సరయూతీరమున గాటుకవలె నల్లగా నున్న స్త్రీ యేడ్చుచుండుట గాంచెను. నీకు గలిగిన కష్ట మేమి? నీ వెవరవు? నీయుదంతము నెఱుగజెప్పు మని యామెను బ్రశ్నించెను. అప్పుడామె యీవిధముగా బలికెను 'శ్రీరామచంద్రా! నే నిచ్చటనుండి చిర కాలముగా రోదించుచున్నాను. నాకున్న యీమహత్పుణ్యముయొక్క

ప్రభావమున నారోదనము మీ చెవుల బడినది. నేను దొల్లి బ్రహ్మచే సృజింపబడినదానను, నిద్ర యను పేర బరగుదానను. ఆ బ్రహ్మ నాకు కుంభకర్ణునియందు జిరకాలము సుఖనివాసమును గల్పించెను. ఆ కుంభకర్ణుడు మీచే సంహరింపబడినాడు. నా నివాసస్థానము చెడుటచే నేను వెంటనే బ్రహ్మకడ కేగితిని. అతడు మీకడ కేగ నాకాదేశించెను. తోడనే నేసీ నగరమున కరుగుదెంచితిని. నగరరక్షకులకు వెఱచి నగరములో బ్రవేశింపజాలనిదాననైతిని. ఇచ్చటనే యీ సరయూనదీతీరమున రోదనము సేయుచు నిలిచిపోయితిని. కావున నో మహాప్రభూ! నేను సుఖముగా నివసింపదగు స్థానమేదియో నాకెఱుగజెప్పుడు.' అనగా విని యంతకు ముందు సేవకులు తన మొతల జూపిన నిర్లక్ష్యమైఖరిని దలపోసి యీమెతో క్రోధము వహించి యామెతో నిట్లుపలికెను. "నిద్రాదేవీ! నా మాట లాలింపుము. నీకు నివాసస్థానములను నిర్దేశించుచున్నాను. పాపాత్ములైన మానవులు కీర్తనము, వేదపఠనము, పూజనము, జపము, తపము, ధ్యానము హోమాదికములు సేయుట, పురాణశ్రవణము మున్నగు పుణ్యకార్యములు సేయువేళ వారి నావహింపుము. ఇంకను జడునియందు, బాలకునియందు, గర్భిణియైన స్త్రీయందు, నుపవాసానంతరము భోజనము జేసినవారియందు, విద్యార్థియందు, నలసినవానియందు, జాగరము సేయగోరువారియందు నీకు స్థానమొసగితిని. పొమ్ము." శ్రీరామచంద్రుని యీ పలుకుల నాలకించి యామె సంతసించెను. అప్పుడు రఘునందనుడు స్వస్థానమునకు మఱలి వచ్చి సుఖముగా నిద్రించెను. నాటినుండియు పైని పేర్కొనబడిన జనులయందు నిద్ర సుఖముగా వాసము సేయదొడగెను. ఆకారణమున పాపాత్ములు పుణ్యకర్మములకు బూనుకొన్నవేళ నిద్ర వారిని బాధించును. నాడు మొదలు సేవకులు, నరులును బుడమిపై కీర్తనము, పూజనము సేయువేళ

వారిలో వేవ్వరలో నేరొకడో నిద్రను జయించి తన కార్యమును బూర్తి సేయగలుగును.

శిష్యా! విష్ణుదాసా! నీకిప్పుడు సీతామహాదేవి కీర్తిని విస్తరిల్ల జేయు మఱియొక గాథను వినిపింతు నాలకింపుము.

కుంభకర్ణుని కొడుకు నికుంభుడు. వాని భార్య గర్భవతి. ఆమె పురుటికై ద్వీపాంతరమునందు నివసించుచున్న తన తండ్రి గృహమున కరిగెను. రావణాదిరాక్షసుల మరణానంతరం మామెకు చాంద్రకు డను తనయుడు జన్మించెను. అతడు క్రమముగా పెరిగి పెద్దవా డయ్యెను. ఆకాలముననే శ్రోణానదీతీరమున మాయాపురిలో నూఱు తలలు, రెండు నూఱుల చేతులును గల రావణు డొక డుండెను. అతని సహాయమున చాంద్రకుడు విభీషణునితో బోరి యతని నోడించెను. ఇరువురు గూడి లంకారాజ్యమును వశపఱచికొని తాము పరిపాలింప నారంభించిరి. అప్పుడు విభీషణుడు శ్రీరామచంద్రుని సన్నిధి కరిగి యతనితో మొఱ పెట్టికొనెను. తోడనే సీతను, విభీషణుని వెంటనిడికొని శ్రీరామచంద్రుడు శీఘ్రముగా లంకానగరమున కరిగెను. అరిగి యారావణునితో గొంతసేపు పోరాటము సాగించెను. పిమ్మట సీతామహాదేవి పూనుకొని వానితో ఘోరయుద్ధ మొనరించి వానిని, చాంద్రకుని గూడ దెగటార్చి లంకారాజ్యమును విభీషణున కప్పగించెను. అప్పుడు సీతారాము లయోధ్యకు మఱలి పోయిరి.

అనంతరకాలమున నొకనాడు శ్రీరామచంద్రుడు కొలువుదీరి యుండగా విభీషణుడు మంత్రులను వెంబడను, భార్యాపుత్రులను వెంట నిడికొని వచ్చి ప్రభువునకు నమస్కరించి విషణ్ణమైన వదనముతో, దడబడుచున్న కంఠస్వరముతో లంకానగరవృత్తాంతము నీ విధముగా విన్నవించెను.

"రాజీవనయనాభిరామా! శ్రీరామా! శరణాగతుని నన్ను రక్షింపుడు. పూర్వము కుంభకర్ణునకు మూలానక్షత్రమున నొక కొడుకు పుట్టెను. ఆపిల్లవాని నతడు తన సేవకులచే వనములో నొక చెట్టుమొదట బరిత్యజింపజేసెను. ఆ పిల్లవానిని గొన్ని యీగలు తమ వమనజలబిందువులతో బోషించినవి. అత డిప్పుడు పెరిగి పెద్దవాడై మీవలన దనవంశ మంతయు నిర్మూలమైనదని తెలిసికొని పోయి ఘోరతప మొనర్చి బ్రహ్మదేవుని బ్రసన్నుని గావించికొని యాతనివలన వరములను బడసెను. ఆవరములచే గర్వించి పాతాళతలమున నున్న రక్కసుల నందఱను వెంటనిడికొని లంకానగరమున కేగుదెంచెను. నే నాతనితో నాఱు మాసములవఱకు ఘోరయుద్ధ మొనరించితిని. కడపట నాతడు నన్ను జయించి నానగరమును వశపఱచికొనెను. అప్పుడు నేను మంత్రులను, భార్యాపుత్రులను వెంట బెట్టికొని భూగర్భమునందలి గుప్తమార్గమున బాఱిపోయి లంకానగరమున కొక యోజనము దూరమున రాత్రివేళ వెలికి వచ్చి మీ సన్నిధి కేగుదెంచితిని. మూలానక్షత్రమున బుట్టి తరుమూలమున పెరిగినవా డగుటచేత నతడు మూలకాసురుడను పేర బ్రసిద్ధి కెక్కెను. యుద్ధము సేయువేళ నతడు నాతో 'విభీషణా! తొలుత నిన్ను దున ముట్టించి లంకానగరమును వశపఱచికొని యనంతరము నాతండ్రిని, నావంశము వారి నందఱను మట్టుపెట్టిన యీ శ్రీరామచంద్రుని రణభూమిలో సంహరించి నాతండ్రి ఋణమును దీర్చికొందును' అని పలికినాడు. కావున మీతో బోరుటకై యత డిచ్చటకు గూడ నేగుదెంచగలడు. వింటిరిగదా! ఇటుపై నేది యుక్తమని తోచిన నది సేయుడు."

విభీషణు డాడిన యీ పలుకుల నాలకించి శ్రీరామచంద్రుడు మిక్కిలి విస్మయము నొందెను. వెంటనే లక్ష్మణుని బిలిచి లక్ష్మణా!

దూతలను బంపి జగతీతలమునందలి రాజ్యముల నేలుచున్న మహా
రాజుల నందఱను బిలిపింపుము. అని యతని కాదేశించెను. అట్ల
కాక! యని లక్ష్మణుడు వెంటనే దూతలను నానాదిక్కుల కంపెను.
వారును రయమున బోయి మఱలి వచ్చి శ్రీరామచంద్రునితో మహా
ప్రభూ! కొందఱు మహారాజులు మీయాజ్ఞను మన్నించిరి.
కొందఱు మన్నించలేదు. దానికి గారణ మేమనగా జంబికాసుమతుల
స్వయంవరకాలమున గలిగిన దుఃఖ మిప్పటికిని వారి మనముల
నెడబాయలేదు. యూపకేతుని బాణప్రహారములకు గుఱియై మదన
సుందరీ స్వయంవరకాలమున బరాభవమునొందిన రాజన్యు లెల్లరు
నా దుఃఖము నిప్పటికిని మఱువలేదు. వారు మీయాజ్ఞను మన్నించుట
కిచ్చగింపలేదు. మీయాజ్ఞను మన్నించువారగు సుగ్రీవాది మహా
రాజు లెల్లరును తమతమ బలగములను వెంటనిడికొని వచ్చేసిరి అని
చెప్పిరి. ఆదూతల పలుకుల నాలకించి శ్రీరామచంద్రుడు వారితో
అవును! ఆ రాజాధములు, నా బాణప్రహారములను గోరుచున్నవారు.
తొలుత మూలకాసురుని నిర్మూలించి పిమ్మట వారికడ కేగెదను అని
పలికెను.

అనంతర మొక శుభదినమున సైన్యమును, సోదరులను వెంట
నిడుకొని మూలకాసుర సంహారార్థము పయనమై నగరము వెలుపలకు
జేరెను. కొంత సైన్యముతోడ నగరరక్షణమునకై యూపకేతుని
నిలిపివైచెను. కుశుడు మున్నగు నేడుగురు బాలకులును గూడ
శ్రీరామచంద్రునితోడ బయనమైరి. తన సైన్యము నంతను రాఘ
వుడు పుష్పకవిమానము నెక్కించెను. ఇంతలో నానావాహనముల
నధిరోహించి తమతమ విశాలవాహినులను వెంట నిడికొని మహారాజు
లెల్లరు వచ్చుటకు విచ్చేసిరి. వారి నందఱను గూడ రాఘవుడు వారి
వాహినులతోడ బుష్పకవిమానము నధిరోహింపజేసెను. పదునెని

మిది పద్మముల సంఖ్యలోనున్న వానరుల సైన్యమును వెంటగొని రాముని సెలవుగొని సుగ్రీవుడు గూడ విమానము నధిరోహించెను. పిమ్మట సీతను దోడుకొనక శ్రీరామచంద్రు డొంటరిగనే విమానము నెక్కి మార్గమధ్యమునం దనేకదేశముల నవలోకించుచు లంకానగర మున కరిగెను. తొల్లి తీర్థయాత్రలు సేయువేళ బయన మెట్లుసాగెనో యిప్పుడు కూడ నావిధముగనే సాగెను.

శ్రీరామచంద్రుని యాగమనము నాలించి మూలకాసురుడు బ్రహ్మచే బడసిన వరములచే దర్పించి పదికోట్ల సైనికుల బలగమును దోడ్కొని మహావీరాగ్రగణ్యుడగు రాఘవునితో రణ మొనరింప నగరము వెలుపలకు వచ్చెను. అప్పుడు రాక్షసులు పాదములతో ప్రహరించి వానరులను సంహరింప నారంభించిరి. వానరులు ఱాల తోడను, వృక్షములతోడను బ్రహరించి రక్కసుల నుక్కడంప నారంభించిరి. ఈ విధముగా నేడు దినముల వఱకు దుములయుద్ధము జరిగెను. ఆ యుద్ధములో మరణించిన వానరుల నందఱను బూర్వ మందువలె హనుమంతుడు ద్రోణపర్వతమును గొనివచ్చి సంజీవన మూలికలతో బ్రదికించెను. రాక్షససైన్యము మూడువంతు లంత రించి యొక్కవంతు మిగిలెను. అది గమనించి మూలకాసురుడు క్రుద్ధుడై తన మంత్రులను, సేనాపతులను బురికొల్పెను. తోడనే వారు తమతమ బలగములతో ముందునకు వచ్చిరి. వారు మగదుర రామభటులను శతఘ్నులతో, జేతి యంత్రసాధనములతో, భిందిపాల ములతో, భుశుండులతో, బరిఘములతో, బట్టిసములతో, శూలము లతో, గుంతములతో, గరవాలములతో నుఱుమాడ నారంభించిరి. వారిని శ్రీరామభటులును దాళవృక్షములతో, దమాలవృక్షము లతో, సాలవృక్షములతో, ఱాలతో బ్రహరింపజొచ్చిరి. ఈవిధ ముగా మఱల భయంకరయుద్ధము సాగెను. కడపటకు రామభటులా

రాక్షసమంత్రులను, సేనాధిపతులను నందఱను క్షణములో యమపురి
కంపివైచిరి.

తనవా రందఱును మరణింపగా జూచి మహాక్రోధమున మండి పడుచు మూలకాసురుడు స్వయముగా దివ్యరథము నధిరోహించి యల్పసైన్యమును వెంటగొని ముందునకు వచ్చెను. అతని యాగమనము నవలోకించి వేనవేలు శ్రీరామపక్షమునందలి మహారాజు లాతనిపై దుందుభినిర్ఘోషము సేయుచు శరపరంపరలను గుమ్మరించిరి. వారి నందఱను రాక్షసరాజు క్షణములో మూర్ఛాక్రాంతులను గావించెను. వారు మూర్ఛితులు గాగా జూచి రామాజ్ఞచే దమ తమ బలగములతో సుమంత్రుడు మున్నగు మంత్రులు ముందునకు వచ్చిరి. మూలకాసురుడు శరములను గురియించి వారిని గూడ మూర్ఛాక్రాంతుల గావించివైచెను. పిమ్మట కుశుడు మున్నగు బాలకులు ముందునకు వచ్చిరి. వీరికి, రాక్షసేశ్వరునకు నడుమ దుములయుద్ధము జరిగెను. కుశుడు గన శరపరంపరచే మూలకాసురుని వాని మేడ నడుమకు విసరివైచెను. అప్పుడా మూలకాసురుడు లేచి యొడలు దులిపికొని యజేయమైన రథమును, శస్త్రములను సాధించికొన నెంచి యభిచారహోమములు సేయ సంకల్పించికొని యొక గుహాలో బ్రవేశించి ద్వారము లన్నియు మూసివైచెను. ఆ గుహాలోపలనుండి హోమధూమము వెలికి రాగా జూచి విభీషణుడు కల్పవృక్షముక్రింద విరాజమానుడై యున్న శ్రీరామచంద్రుని సమీపించి 'స్వామీ! అదిగో! ఆ దుష్టు డభిచారహోమము సేయుచున్నాడు. వానిప్రయత్నమును వమ్మొనరించుటకై వెంటనే వానర వీరుల నంపుడు. హోమము పరిసమాప్తమైనచో నత డజేయుడు గాగలడు' అని యతని కెఱుగ జెప్పెను.

ఇంతలో దేవబృందపరివేష్టితుడై బ్రహ్మ యా యెడ కేగు దెంచెను. రఘునందను డతనిని సాదరముగా బూజించెను. అప్పుడు బ్రహ్మ రాఘవునితో నిట్లనెను. రాఘవా! ఈ రాక్షసుడు తొల్లి తప మొనర్చి నావలన దన కే పీరునిచేతను మరణము గలుగకుండునట్లు వరమును బడసినాడు. కావున వీనికి బురుషునివలన మరణము గలుగదు. స్త్రీవలన గలుగును. అంతియేకాదు. మఱియొక కారణము గూడ నున్నది. తొల్లి యితడు బ్రాహ్మణుల సమక్షమున సీత యను పేర బరగు చండిక మూలమున దన వంశము నిర్మూలమైన దని వాకొనెను. తోడనే వారిలో నొక మునివరుడు కుపితుడై 'ఓరి రాక్షసాధమా! నీవెవరిని జండిక యని నిరసించితివో యామెయే నిన్ను సంహరింపగలదు." అని వానిని శపించెను. వెంటనే యశడా మునివరుని జంపివైచెను. అతనికి వెఱచి తక్కిన బ్రాహ్మణులు మౌనము వహించిరి. కావున నా మునిశాపము, నేనొసగిన వరమును గారణములుగా నారక్కసుడు సీతచేత మరణము నొందును. కావున వెంటనే సీతామహాదేవిని రావించి యామెచే నీ రాక్షసుని సంహరింప జేయుము" ఇట్లు పలికి బ్రహ్మ రాఘవునికడ సెలవు గొని తన నెలవునకు దఱలిపోయెను. అప్పుడు శ్రీరామచంద్రుడు విభీషణా! మూలకాసురుని హోమమున కిప్పుడు విఘ్నము గలిగింపవలదు. సీత యేగుదెంచిన మీదట గల్పింపవచ్చును" అని నొడివెను. పిమ్మట గరుత్మంతుని బిలిచి "పక్షిరాజా! నీవు హనుమంతుని వెంట బెట్టుకొని వెంటనే యయోధ్య కేగి సీతను మూపుపై నెక్కించికొని మఱలి రమ్ము. హనుమంతుడు నీ వెంట బయనించి దుష్టుల బారినుండి యామెను గాపాడును" అని యతని కాదేశించెను. అట్లకాక! యని వారిరువురును రాఘవునకు బ్రణమిల్లి వెంటనే వేగముగా నయోధ్యకు వెడలిరి.

చ తు ర్థ స ర్గ ము స మా ప్త ము.

—)$^0{}_0{}^0$(—

# పంచమసర్గము

## సీతామహాదేవి విరహవేదన

శ్రీరామదాసుడు విష్ణుదాసున కిట్లు వివరించును.

అక్కడ నయోధ్యలో శ్రీరామచంద్రు నెడబాసిన సీత దుస్సహమైన విరహవేదనకు గుఱియై క్షణమైన సుఖమును, శాంతిని బడయజాలకుండెను. ఒకవేళ నామె మేడలోపల గూర్చుండును. ఒక సమయమున మేడమీఁద గూర్చుండును. ఒకప్పుడామె యాభరణముల నన్నిటిని బరిత్యజించి ద్రాక్షపందిరిక్రింద గూర్చుండును. ఒక తరుణమున నామె వారవనితల నృత్యముల నవలోకించును. మఱియొక సమయమున శ్రీరామచంద్రుని విజయమును గోరి కార్తవీర్యుని బూజించును. ఒక తఱి దులసికి, శివునకు, నశ్వత్థవృక్షమునకు (రావి) ప్రదక్షిణము లాచరించును. బ్రాహ్మణులచే మన్యుసూక్తములను బఠింపజేయును. గోడమీఁద గోమయముతో నాంజనేయుని మూర్తిని గల్పించి యారాధించి ప్రతిదినము దన్వ్రేలితో నతని తోకను బెంపొందించును. శ్రీరాముని విజయమును గోరి యామె విప్రులచే శతరుద్రీయసూక్తమును బఠింపజేయును. నిత్యము నియతవ్రతురాలై దుర్గాపూజన మొనరించును. స్థండిలమునందు (నేలమీఁద బిండినిగాని, బియ్యమునుగాని వర్తులాకారముగా బరచుట) విఘ్నేశ్వరుని, హనుమంతుని, శివుని బ్రతిష్ఠించి ద్వారములన్నియు మూసివైచి కిటికీల గుండా వారిపై జలము నభిషేకించును. రాఘవుని మంచముపై గార్తవీర్యుని యంత్రములను స్థాపించి యారాధించును. ఒకప్పుడు సర్వాలంకారములను బరిత్యజించి సఖియలచే బరివేష్టితురాలై విరహాగ్నిచే బరితప్తురాలగుచు జలయంత్రముల చెంత నిదురించుటకు బ్రయత్నించియు నిదుర నందకుండును. ఒకవేళ మేడమీఁద నిలిచి

కాకమును గాంచి కాకమా! శ్రీరామచంద్రప్రభువు శీఘ్రముగా వచ్చి నాకు దర్శన మొసగునేని నీవున్న తావునుండి వడిగా నెగసి పొమ్ము. కాకున్న స్థిరముగా నుండుము." అని శకున మడుగును. ఆ పలుకు నాలకించి యాకాక మెగసి పోవును. దానితో నామె కొంత యూరట బొందును. ఒక తరుణమున నామె వాయుదేవునితో వాయుదేవా! నీవు శ్రీరామచంద్రుని యంగములను స్పృశించి వచ్చి నన్ను దాకుము అని వాకొనును. ఒకప్పుడు చంద్రుని జూచి చంద్రా! నీవు నీ చల్లని కిరణములతో శ్రీరామచంద్రుని, నన్నును స్పృశించి నాకు సుఖమును గల్గింపుము" అని ప్రార్థించును. శుక్లపక్షమునందు విదియనాడు చక్కగా స్నానము జేసి సర్వాలంకారములను దాల్చి సఖియలచే బరివేష్టితురాలై సీత మేడ పై భాగమునకు బోయి చంద్రుని జూచి సంతసించి "యీ చంద్రు నీనాడు నాస్వామి తప్పక దర్శించును. నేనును దర్శించితిని. దీనినిబట్టి నాకు శీఘ్రముగా స్వామితోడ సంయోగసుఖము ప్రాప్తించును" అని తలపోసికొనును. శ్రీరామచంద్రుడు వెడలినప్పటి నుండియు ననసూయాదేవి యర్పించిన సుంగధద్రవ్యాదికమును మాత్రము దాల్చెను. పసపు, కాటుక, మున్నగువానితో దన నలంకరించికొనలేదు. చందనమును, బుష్పమాలికలను, బూలపాన్పును, నామె స్వీకరింపలేదు. శ్రీరాముని దర్శింపవలె నను సంకల్పముతో నామె యెన్నియో శకునములను జూచును. ఆ శకునములచే శీఘ్రముగా శ్రీరామచంద్రునితోడ సమాగమసుఖము ప్రాప్తించు నని తలచికొని సంతృప్తి బొందును. శ్రీరామచంద్రుని విడచి సీత యెన్నడును బరగృహమునకు బోలేదు. ఒకప్పుడు నొంటరిగా గూర్చుండలేదు. ఒడలికి నలుగు బెట్టికొనలేదు. మధురాన్నముల నారగింపలేదు. తాంబూలమును సేవింపలేదు. గీతముల నాలింపలేదు. తల దువ్వుకొనలేదు. శ్రీరామవిరహాగ్నిచే వేగుచు నామె యెన్నడు బరపురుషునితో భాషింపలేదు. మంగ

మున జిలునగవును వెలయింపలేదు. సిరమెత్తి యెవరిని జూడలేదు. పరుల కంట బడలేదు. ఒకప్పుడును సంతోషము నెనయలేదు. రాముడు లేనివేళ బర్యంకముపై శయనింపలేదు. విరహవేదనచే బాలిపోయిన మొగము నెన్నడు నద్దములో జూచికొనలేదు. చిన్నెలు, వన్నెలు గల చీరలను, రవికెలను దాల్పలేదు. ద్వారదేశమున గడపలదగ్గఱ నిలువలేదు. సరయూస్నానము సేయ నరుగలేదు. వనములలో, నుప వనములలో, నారామములలో విహరింపలేదు. వివిధములైన వస్తువుల నొసగి బ్రాహ్మణపత్నులకు ముదము నొదవించెను. అనేకనియమము లను, వ్రతములను బాటించెను. అనేకదేవతల నారాధించెను.

"హనుమా! నీకు వడియముల మహామాల నర్పించెదను. గణాధిపా! నీకు బూర్ణముతో బూరింపబడిన మోదకములను, సిద్ధా న్నమును నైవేద్యముగా నర్పింతును. దుర్గాదేవీ! నీకు బలిదానము గావించెదను. చండికాదేవీ! నీకు బలిదీపముతో, మాషములతో, (మినుములతో జేయబడి పిండివంట) గూడిన యన్నమును, నాలు కకు జెందిన రక్తమును సమర్పించెదను. శ్రీరామచంద్రుడు తనయుల తోడ సత్వరముగా, సురక్షితముగా మఱలివచ్చినచో వరుసగా నయిదు శనివారము లుపవసించెదను. భోజనములో మధురపదార్థము లను, నేతిని బరిహరించెదను. ఈ విధముగా నొక మాసమువఱకు నీనియమములను బాటించెదను. మహేశ్వరీ! కృష్ణపక్షమునందు దదియనాడుగాని, చవితినాడు గాని నెలకొక్కమాఱు నువ్వుల పరి మాణమును బెంచుచు వానితో బెల్లమును గలిపి భుజించెదను. సఖి యలతోడ గూడి సత్వరముగా నవరాత్రవ్రతము నాచరించెదను. శీఘ్రముగా శ్రీరామచంద్రప్రభుని దర్శనము నాకు బ్రాప్తించినచో నో సూర్యదేవా! ప్రతిభానువాసరమున నిన్ను భక్తితో బూజించె దను." అని యీవిధముగా సీత యనేకవిధములగు మొక్కుబడులు

మ్రొక్కెను. అనేక వ్రతముల నాచరించెను. బ్రాహ్మణులచే నర్ఘ్యప్రదానములు సేయించెను. ఆమె పగటి వేళను నిదురించలేదు. రాత్రివేళను నిదురించలేదు. ఈవిధముగా జనకజాత దినదినము శ్రీరామ విరహానలమున సంతప్తమగు చిత్తముగలదై క్షీణమైన సుఖశాంతుల నెనయజాలకుండెను.

ఈ విధముగనే యూర్మిళ మున్నగు సువిదలును, జంపిక మున్నగు చానలును గూడ తమతమ పతుల నెడబాసిన కారణమున వారియందే మనస్సులను లగ్నము గావించి విరహానలమున గ్రాగు చిత్తములతో క్షీణమైన సుఖమును బొందజాలకుండిరి. వారందఱు విరహావేదనచే మణిమయంబగు పుడమిపై బడి దొరలసాగిరి. వారిలో నొక్కతెయు నానందము మీఱ క్రీడామయూరము నాడింపదు. ఒక్కతెయు కుతూహలము మీఱ బంజరములోని చిలుకకు బాఠములు నేర్పదు. ఒక్కతెయు ముంగిస నాడింపదు. ఒక్కతెయు గోరువంకను మాటలాడింపదు. అత్యంతసంతాపము గారణముగా నొక్కతెయు సారసపక్షులతో నాడుకొనదు. వారెవ్వరును విలాసముల చెంతకు బోలేదు. తమ మందిరములలో నానందింపలేదు. సఖియలతో వినోదవచనము లాడలేదు. వీణావాదనము నాలకింపలేదు. కల్పతరుకుసుమముల పరిమళము నాఘ్రాణింపలేదు. ఆపూవులనుండి వెలువడిన మకరందము నాస్వాదింపలేదు. వారందఱును యోగినులవలె జూడ్కిని నాసాగ్రమున నిలిపి తమ మగలయందే మనసులను లగ్నములను గావించి యేదియో యలక్ష్యధ్యానానుసంధానము సేయుచున్న వారివలె నుండిపోయిరి. చంద్రకాంతమణిమయమై చల్లని నీటిబిందువులను రాల్చు కిటికీచెంత కొంతసేపు కూర్చుందురు. కొంతసేపు జలయంత్రముల నవలోకించుచుందురు. ఒకచో దిగుడుబావిలోని తామరాకులతో బొమ్మ సేర్పఱింతురు. సఖియలచే క్షణ

కాల మరటియాకుల వీవనలచే వీచబడుదురు. ఈ విధముగా వారు దిన మొక్క యుగముగా గడపుచు, విరహాజ్వరసంతాపమును భరించుచు నెట్టులో ప్రాణములను నిలిపికొనుచుండిరి.

ఇంతలో సీతామహాదేవి యొనరించిన నియమములు, వ్రతములు నన్నియు ఫలించి గరుత్మంతుడు, నాంజనేయుడు నయోధ్యకు జేరిరి. సీత కెడమభుజము, నెడమకన్ను నదరెను. అది శుభసూచకమని యెంచి యామె యానందమును నొందెను. అంతలో గరుత్మంతుడు, నాంజనేయుడును యూపకేతుని సమీపించి శ్రీరాముని సందేశము నాతని కెఱిగించిరి. అతడు సీతామహాదేవి కెఱిగించెను. ఆమెయు సమందానందము నొంది యానాడే ఋత్విజులను, పురోహితుని, నగ్నిహోత్రమును వెంట నిడికొని గరుత్మంతుని మూపు నధిరోహించెను.

పతివెంట లేనివేళ నగ్నిహోత్రముతోడ స్త్రీ పొలిమేరలను దాటరాదను నియమ మున్నది. కాని యాకాశమార్గమున బయనించుచుండుటచే సీతకు దోష ముంటదు. ఏదైన భయంకరపరిస్థితి సంప్రాప్తమైనవేళ నగ్నిహోత్రములను వెంట నిడికొని స్త్రీలు ప్రవాసము గూడ జేయవచ్చును. అట్టివేళ బతుల నెడబాసియున్నను సతులకు దోష ముంటదు. భూతలముపై నున్న జనులు, బ్రాహ్మణాదివర్ణములవారు నెన్నడును దేవతల ననుకరింపరాదు.

అనంతరము హనుమంతుని రక్షణమున సీత మార్గమధ్యమున వివిధములగు దేశములను విలోకించుచు సానందముగా లంకానగరమున కరిగెను. అరిగి గరుత్మంతుని మూపుపైనుండి క్రిందకు దిగి పుష్పకవిమానమునందు గల్పవృక్షమునీడలో విరాజమానుడై యున్న శ్రీరామచంద్రుని గాంచి సమీపించి సిరము వంచి యామహా

పురుషునకు భక్తితో ప్రణమిల్లెను. ఆమెను గాంచి రఘునందనుడు దేవీ! నీముఖ మట్లు వివర్ణమై యున్నదేమి? నీ శరీర మట్లు కృశించిన దేమి? యని ప్రశ్నించెను. అతని పలుకు నాలకించి యామె సిగ్గు పడుచు నగుమొగముతో సవినోదముగా స్వామీ! నాయీదశకు మీ విరహమే కారణము. మీరు నన్నెడబాసినప్పటినుండియు నేను యుక్తముగా నిదురించలేదు. మేల్కొనలేదు. తినలేదు. త్రాగలేదు. వియోగినినై యోగినివలె కేవలము మిమ్మే ధ్యానించుచు కాలము గడపుచుంటిని. నా కన్నులకు నిద్రాదారిద్ర్యము ప్రాప్తించినది. మందభాగ్యురాల నగుటచే స్వప్నమునందు గూడ నాకు మీ మొగము గానరాలేదు. మీ మొగమునకు ప్రతినిధియగు చంద్రుడు గనుపించినను విరహిణినైన నేను దాపమును బాపికొననెంచనైన నాచంద్రుని దిక్కునకు జూడలేదు. ముంగురులచే గప్పబడిన చెవులు గలదాననై మీ పలుకులను బోలియున్నను గోకిలపలుకుల నాలకింప నిచ్చగింపలేదు. విరహానలమున వేగుచున్నదాన నగుటచే మీయంగసంస్పర్శమువలె మధురమైనను నగురుధూపపు వాయువు నాఘ్రాణించలేదు. విరహాగ్నిచే బరితప్తురాలనగుచు క్షణమైన సుఖశాంతులను గనక మీ విజయమును గోరి యనేక యమనియమవ్రతాముల నాచరించుచు బ్రొద్దు బుచ్చితిని' అని బదులు పలికెను. ఆమె పలుకుల నాలకించి రాఘవుడు మందహాసము జేసి యామెను బిగియార గౌగిలించికొనెను. కరములతో నామె వక్షస్థలమును స్పృశించెను. పెదవులను ముద్దుగొనెను.

అనంతరము మఱుచటి దినమున శ్రీరామచంద్రుడు స్నానము జేసెను. సీతయు స్నాన మాచరించెను. అప్పుడామెకు రాఘవు డస్త్ర విద్యను, శస్త్రవిద్యను, నస్త్రముల యాహ్వాన విసర్జనములను నేర్పి క్షణములో నామెను ధనుర్విద్యావిశారదురాలిని గావించెను. రామాజ్ఞచేత లక్ష్మణుడు రథమును సిద్ధము జేసెను. అందు దాను

కుడు సారథిగా నుండెను. ధ్వజమునందు గరుత్మంతుడు విరాజమానుడై యుండెను. అందనేకశస్త్రాస్త్రములు, గదాపద్మాదులు నింపబడియుండెను. అందు శైబ్యము, సుగ్రీవము, మేఘపుష్పము, వలాహకము నను నాలుగు గుఱ్ఱములు పూన్పబడియుండెను. అందు దివ్యమైన ఛత్రము, హేమదండము, తెల్లనివి రెండు చామరములు, బంగారు చీలలు నమర్చబడియుండెను. ఆ రథము నవలోకించి రఘునందనుడు సీతతో దేవీ! నీవీ రథము నధిరోహించి చని మూలకాసురుని నిర్మూలింపు మని నొడివెను. అట్లగాక! యని సీత తనలో నుండి తామసగుణప్రధానమైన తన ఛాయామూర్తిని వెలువరించి యామె నాకార్యమునకు బురికొల్పెను. తోడనే తామసస్వరూపిణి యగు నా ఛాయాసీత రాఘవునకు బునఃపునః ప్రణామము లాచరించి ఘుర్ఘురధ్వని సేయుచు రథము నధిరోహించెను. ఇంతలో శ్రీరాముని ప్రేరణముచే వానరులందఱు లంకలోనికి జని మూలకాసురు డొనరించు హోమవిధానములకు విఘాతము గలిగించి యతని నట నుండి కదలజేసి ప్రభువు చెంతకు మఱలివచ్చిరి. అంతట మూలకాసురుడును రథము నధిరోహించి రణరంగమునకు బయలువెడలెను. త్రోవలో నతని కిరీటము జాఱి క్రింద బడెను. అయినను నతడు దర్పితుడై వెనుకకు దిరుగ నిచ్ఛగింపక రయము మీఱ రణరంగమున కరిగెను. అప్పటికీ ఛాయాసీతయు లక్ష్మణాదులను, విశాలమైన సైన్యమును వెంటనిడికొని వచ్చి రణభూమిపై నిలిచెను.

పంచమసర్గము సమాప్తము

—()—

# షష్ఠ సర్గము

## శ్రీరామచంద్రుడు రాజ్యమును విభజించుట

శ్రీరామదాసుడు విష్ణుదాసున కిట్లు వివరించును.

ఛాయాసీత శార్ఙ్గధనువును గేల ధరించి యొక్కమాఱు భయంకరటంకారము గావించెను. అరాళములైన కోరలతో, కరాళములైన కన్నులతో, విద్యుల్లతలవలె బచ్చనైన కేశములరాశితో, తాళవృక్షములను బోలు తొడలతో, జేటలను బోలు పాదములతో, గుహాముఖమును బోలు నోటితో, మేఘమును బోలు ఛాయతో, రెపరెపలాడు నాలుకతో, నొడలినిండ బెచ్చు పెరిగిన రోమజాలముతో, దెఱవబడిన నోటితో, బృహదాకారమగు సిరముతో వెలుగొందు నా భయంకరస్వరూపిణిని గాంచి యడలొంది తడబడుచున్న కంఠస్వరముతో మూలకాసురుడు "నీ వెవరవు? ఇచ్చటి కేల వచ్చితివి? ఎందులకు యుద్ధము సేయగోరుచుంటివి? నాకు విశదముగా నీ యుదంతము నెఱిగింపుము. ప్రాణములపై నాస గలదేని వెంటనే నా యెదుటనుండి దూరముగా బొమ్ము. స్త్రీలముందు నేను బౌరుషమును బ్రదర్శింపను" అని యామెను బలుకరించెను పుష్పకవిమానమునందలి సీతారాములు మాటిమాటికి దనవంకకు జూచుచుండ నామె తన కంఠస్వరముచే బర్వతములను బ్రకంపింపజేయుచు 'మూలకాసురా! సీత యను పేర బరగు నే చండిక మూలమున నున్న నీ వంశమంతయు నిర్మూలమైనదో యా చండికను నేనే. నీవు తొల్లి నాయెడల బక్షపాతము జూపిన బ్రాహ్మణుని బరిమార్చితివి. ఇప్పుడు నిన్ను రణభూమిపై నసువులు దొరగ గూలనేసి యా బ్రాహ్మణుని ఋణమును దీర్చికొందును." అని యా యసురునకు బదులు పలికెను.

పిమ్మట నామె ధనువు నెక్కు వెట్టి మూలకాసురునిపై నైదు బాణములను బ్రయోగించెను. అంతట నా యసురుడును ధనువును గేల ధరించి యామెపై గొన్ని బాణములను గురియించెను. వారి కిరువురకు నడుమ సాగుచున్న యా మహాయుద్ధమును హనుమంతుని చే బ్రకాశింపబడిన మహారాజులు, వానరులును బుష్పకవిమానము నందలి యట్టాలికలపై నిలిచి కనుగొనదొడగిరి. కల్పవృక్షము నీడలో సువర్ణమణిమయపర్యంకముపై గ్రిందను, వెనుకను మృదులములైన దిండు లమరియుండ సానందముగా గూర్చుండి దాసికామణులచే వీవనల వీవబడుచు సీతారాములు గూడ నాభయంకరసంగ్రామ దృశ్యము నవలోకించుచుండిరి. మూలకాసురుని దెసనుండి వచ్చు బాణములను దన వాడి యలుగులతో వమ్ముగావించి ఛాయాసీత వానిపై మఱల బాణములను బ్రయోగించెను. నాలుగు బాణములతో వాని గుఱ్ఱములను వధించి మూడు బాణములతో వాని కిరీటమును, గవచమును, ధనువును దుత్తుమురు గావించెను. తోడనే యతడు పాదచారియై పోయి మఱియొక రథము నధిరోహించి మఱలి వచ్చి యామెపై నాగ్నేయాస్త్రమును బ్రయోగించెను. ఆమె మేఘాస్త్రమున దానిని వారించెను. అతడు మఱల నామెపై బర్వతాస్త్రమును బ్రయోగించెను. ఆమె వాయవ్యాస్త్రమున దానిని వారించెను. అతడు మఱల సర్పాస్త్రమును బ్రయోగించెను. దాని నామె క్షణములో గారుడాస్త్రమున విఫలము గావించెను. ఈ విధముగా నా మహాయుద్ధ మేడు దివసముల పర్యంతము గొనసాగెను. కడపటకు మహాభయంకరస్వరూపిణి యగు నా ఛాయాసీత మూలకాసురునిపై నమోఘమగు చండికాస్త్రమును బ్రయోగించెను. ఆసమయమున ధరిణి యంతయు దద్దఱిల్లెను. సముద్రము లన్నియు ఘూర్ణిల్లి యవధుల నతిక్రమించెను. దిక్కులయందు ధూళి గ్రమ్మెను. అతిరయమున బోయి యా చండికాస్త్ర మాతని సిరమును దఱిగి

నై చెను. వాని తలయు, మొండెమును లంకానగరములో రాజద్వారము ముందు బుడమిపై గూలెను. అప్పుడు లంకలోని రాక్షసు లంద ఱును హాహాకారము లొనరించిరి. దేవత లమందానందమున నంబ రమునపై నిలిచి దుందుభులను ప్రయోగించిరి. ఛాయాసీతమీదను, సీతారాములమీదను బూలవానలు గురియించిరి. అనంతరమా ఛాయాసీత సీతారాముల కడ కరిగి వారికి నమస్కరించి సీతామహా దేవి శరీరమునందు లయము నొందెను. ఆ తరుణమున మంగళవాద్య ములు ప్రయోగినవి. అచ్చర లాడిరి. వందిమాగధులు స్తోత్రపఠనములు గావించిరి. నటులు మున్నగువారు గీతముల నాలపించిరి. అనంత రము దేవతాబృందములను వెంట నిడికొని బ్రహ్మ శ్రీరామచంద్రుని సన్నిధి కేగుదెంచెను. సీతారాములకు భక్తితో బ్రణమిల్లి పరమా నందము తోడ సీతామహాదేవి నీ విధముగా స్తుతించెను.

బ్రహ్మోవాచ

శ్లో॥ జనకరాట్సుతే రాఘవప్రియే కనకభాసురే భక్తపాలికే।
దశరథాత్మజ ప్రాణవల్లభే తవ పదాంబుజాలిః శిరోఽస్తు మే॥ 1
మూలకాసుర ప్రాణఘాతికే రామరక్షితే రామసేవితే।
రామమోహిని స్యందన స్థితే త్వత్పదాంబుజాలిః శిరోఽస్తు మే॥ 2
రామమంచకాధిష్ఠితే రమే రామవీక్షితే రామలాలితే।
రామసంస్తుతే రామరంజితే త్వత్పదాంబుజాలిః శిరోఽస్తు మే॥ 3
లోకపావని శ్రీరజే వరే భూమికన్యకే లోకపాలితే।
పద్మలోచనే ధరాత్మజే పరే త్వత్పదాంబుజాలిః శిరోఽస్తు మే॥ 4
కంజలోచనే నాగగామిని స్వీయసత్సుఖే రమ్యరూపిణి।
రుక్మభూషితే మౌక్తికాంకితే త్వత్పదాంబుజాలిః శిరోఽస్తు మే॥ 5
జలరుహాసనే చిత్రవాసిని త్వమవసి సర్వదా స్వీయసేవకాన్।

మురరిపూన్ సదా దుఃఖదాయికే త్వత్పదాంబుజాలిః
శిరోఽస్తు మే ॥ 6
త్వన్ముఖేక్షణా ద్రక్షసాం పతిః ప్రాప సంక్షయం రామసత్ప్రియే ।
త్వద్దృగీక్షణా ల్లజ్జితా మృగీ త్వత్పదాంబుజాలిః శిరోఽస్తు మే॥ 7
కుశలవాంబికే జలరుహాననే జలరుహేక్షణే పాపదాహికే ।
మధుర సుస్వనే నూపురస్వనే త్వత్పదాంబుజాలిః శిరోఽస్తు మే॥ 8
ఘ్రాణ ముత్తమం తే స్మితాననే తేఽధరః శుభో బింబసన్నిభః ।
అద్య వై త్వయా మూలకాసురో మారితో రణే తారితా
వయమ్ ॥ 9
బ్రహ్మణేరితం నవక ముత్తమం భాస్కరోదయే పఠతి యః
పుమాన్ ।
సర్వవాంఛితం లభతి సోఽత్ర నా ప్రాప్య చాత్సుఖం రామ
సన్నిధిమ్ ॥

ఈ విధముగ స్తుతించి యమరులతో గూడి బ్రహ్మ దివ్యము లైన వస్త్రములతోడను, నాభరణములతోడను సీతారాములను బూజించి తాను గూడ శ్రీరామ చంద్రునిచే బూజల నందికొని యతనికడ సెలవుగొని తన సత్యలోకమునకు వెడలిపోయెను.

అనంతరము విభీషణుడు శ్రీరామచంద్రుని గాంచి వినయ వినమ్రుడై దేవా! మీ రింతకు మున్నెన్నడును లంకానగరము లోపలకు రాలేదు. ఇప్పుడు వచ్చి నా గృహమును బావన మొనరించి నన్ను గృత కృత్యుని గావింపుము అని ప్రార్థించెను. అట్లకాక యని సమ్మతించి శ్రీరామచంద్రుడు విమానము మీదనుండి లంకానగర మధ్యమున నున్న తన మిత్రుని గృహమున కరిగెను. పిమ్మట నారాజ్యమునందు విభీషణునకు బట్టాభిషేకము గావించెను. ఆ సమయ

మున లంకానగరమునం దెల్ల యెడలను నాశ్చర్యజనకములైన మహో త్సవములు సంపన్నను లయ్యెను. అనంతరము విభీషణుడు సీతామహా దేవిని, శ్రీరామచంద్రుని, లక్ష్మణాదులను గూడ నూత్నవస్త్రము లతో, నాభరణములతో, రత్నములతో సాదరముగా సంపూజించెను. తన సర్వస్వమును శ్రీరామచంద్రున కర్పించెను. తొల్లి రావణునిచే బూజింపబడిన కపిలవరాహమూర్తి శ్రీరామచంద్రున కెంతయు నానందమును ఘటించెను. ఆమూర్తిని గూడ విభీషణుడు రాఘవున కర్పించివైచెను. ఆమూర్తిని బూర్వము కపిలమహర్షి తన మనస్సం కల్పముచే సృష్టించెను. చిరకాల మాతని సేవించి యాతని కడనుండి యామూర్తి నింద్రుడు గైకొనెను. ఆయింద్రుని జయించి రావ ణుడా మూర్తిని దన నగరమునకు గొనివచ్చి చిరకాల మారాధించెను. ఆమూర్తినే విభీషణు డిపుడు శ్రీరామచంద్రున కర్పించెను. ఆ మూర్తిని రాఘవుడు పుష్పకవిమానమునందు స్థాపించెను.

అనంతరము సీతామహాదేవి శ్రీరామచంద్రుని, మఱదులను, దనయులను దోడుకొని యానందము మీఱ నశోకవనమున కరిగి చిరకాలము తన కాశ్రయ మొసగిన శింశుపావృక్షము నవలోకిం చెను. తనయెడమచేతితో శ్రీరామచంద్రుని కుడిచేతి చిటికెనవ్రేలిని బట్టుకొని యావనమునం దెల్లయెడల బరిభ్రమించెను. తానుపూర్వ మెందెందు స్నాన మాచరించెనో యేయేతావుల గూర్చుండెనో యవి యన్నియు రాఘవునకు జూపెను. పిమ్మట దివ్యవస్త్రములతోడను, నాభరణములతోడను త్రిజట కానందము గలిగించి రాఘవుని యెదుట విభీషణునిభార్యయగు సరమను సంబోధించి 'సరమా! ఈమెయే తొల్లి రాక్షసీ గ్రహముల బారినుండి నన్నురక్షించినది. సర్వకాలములందు నీ వీమెను నాతో సమానముగా గారవించుము'! అని పలికి త్రిజటహస్తము నామెచేతిలో నుంచెను. పిమ్మట గ్రమముగా రాఘవునితో గూడి

యామె తన వాసస్థానమునకరిగెను. ఇట్లు నికుంభిల మొదలగు ననేక ప్రదేశముల నవలోకించి విభీషణుని దోడుకొని పుష్పకవిమానము నధిరోహించి శ్రీరామచంద్రుడు పయన మయ్యెను. ఆసమయమున లంకానగరరక్షణభారము విభీషణుని మంత్రి కప్పగింపబడెను. అప్పుడు శ్రీరామచంద్రుడు కోదండమును గేల ధరించి లంకానగరమునకు జుట్టును బ్రదక్షిణముసేయు విధమున ద్రిప్పి విభీషణునితో రాక్షసేశ్వరా! నీరక్షణము కొఱకే నేను జాపము నిట్లు ద్రిప్పితిని. నాచాపరేఖ నెవ్వరు నతిక్రమింపలేరు. ఇదిగో నానామాంకితమైన బాణము. దీనినిగూడ స్వీకరింపుము. ఇది నీప్రాణములను రక్షించును. ఇది నీచేత నుండగా నాచాపరేఖ నిన్ను నిరోధింపజాలదు.' అని పలికి తన బాణ మొకటి యాతని కొసగెను. అనంతరము విమానమున నుండి యనేకనరపాలుర పూజల నందికొనుచు ననేకదేశముల నవలోకించుచు గ్రమముగా దన నగరమున కరిగెను.

ఆసమయమున ననేకమంగళవాద్యములు మ్రోగినవి. అచ్చరలాడిరి. పురజనులను వెంటనిడికొని యూపకేతుడు రాఘవునకెదురుగా జనెను. పౌరకాంతలు మేడలపై నిలిచి సీతారాములపై బూలవానలు గురియించిరి. ఈవిధముగా నరిగి నగరపాలకులతోడ రఘునందనుడు క్రమముగా సభామందిరమున బ్రవేశించెను. సీతామహాదేవి సంతుష్టాంతరంగముతో దన మందిరమున బ్రవేశించెను. శ్రీరామచంద్రుడు దాను గొనివచ్చిన కపిలవరాహమూర్తిని దన గృహమున బ్రతిష్ఠించెను. ఒకనాడు సంతుష్టాంతరంగుడై యామూర్తిని శత్రుఘ్నున కర్పించెను. సీతయు దాను ముందేమేమి మ్రొక్కులు మ్రొక్కికొనెనో యవి యన్నియు యథావిధిగా బూర్తిజేసెను. అనేకవిధులగు నుద్యాపనవిధానముల నాచరించెను.

ఒకనాడు యమునాతీరమునందు నివసించు మహర్షు లంగీరసు భార్గవుని, చ్యవనమహర్షిని ముందిడికొని యనేకశిష్యబృందపరివేష్టితులై లవణాసురునకు వెఱచి యుభయమును గోరుటకై శ్రీరామచంద్రుని సన్నిధి కేగుదెంచిరి. వారి నందఱను ప్రత్యుత్థానము, నాసనము మున్నగువానితో గౌరవించి రాఘవుడు వారితో "మహర్షులారా! మీరందఱును నాయందలి ప్రేమముతో నన్ను దర్శింప నేగుదెంచినవారగుట నా కమందానందకారణమైనది. నేను ధన్యుడనైతిని. మీకై యెంతటి దుష్కరకార్యమైనను నేను దప్పక నెఱవేర్తును. నన్ను మీ కింకరునిగా దలపోసి మీ యాగమనకారణమును నా కెఱిగింపుడు. బ్రాహ్మణులే నాకు దైవతములు" అని సవినయముగా బలికెను.

ఆపలుకుల నాలకించి యానందించి చ్యవనమహర్షి రాఘవునితో నిట్లు నొడివెను. రఘునందనా! నొడువుచున్నాడ నాలకింపుము. పూర్వము కృతయుగమునందు మధు వను పేరుబరగు మహారాక్షసుడుండువాడు. అతడు ధర్మాత్ముడు. దేవబ్రాహ్మణులను బూజించువాడు. ఆతనియెడల బ్రసన్నుడై శివు డతనికొక మేలైన శూలము నొసగి రాక్షసేశ్వరా! దీనితో నీ వెవరిని గొట్టిన నాతడు వెంటనే భస్మీభూతుడగునని యతనితో జెప్పెను. ఆమధువు పూర్వము నీచేత సంహరింపబడెను. ఆకారణముననే నీవు మధుసూదనుడవుగా బేర్కొనబడుచున్నావు. ఆమధువు భార్య కుంభీనసి. ఆమెయందతనికి లవణుడను తనయు డావిర్భవించెను. తనతండ్రివలన శూలమును బడసి యతడు మహాపరాక్రమశాలియు, దురాత్ముడు దుర్ధర్షుడు, దేవబ్రాహ్మణులను హింసించువాడు నయ్యెను. వాడుపెట్టు బాధలకు దాళలేక మేమిప్పుడు నిన్ను శరణుచొచ్చితిమి.' ఇట్లు పలుకుచున్న యామునివచనముల నాలకించి రాఘవుడు మునివరులారా! భయపడకుడు. శీఘ్రముగా నాలవణాసురుని జెండివైచెదను. మీ రెల్లరు నిశ్చింతముగా మీమీ నెలవుల కరుగుడు అని పలికి వారి నూరార్చెను.

అనంతరము సభలో నున్న శత్రుఘ్నుని గాంచి శత్రుఘ్నా! మధురారాజ్యమున కధిపతిగా నీకు బట్టాభిషేకము గావించెద నేమందువు? అని ప్రశ్నించెను. నాకు రాజ్యము వలదు. నేనందులకు సమ్మతింపను. నన్ను మీ చరణారవిందముల కెడము సేయవలదు' అని యతడు మఱియు మఱియు వేడికొనసాగెను. అప్పుడు రాఘవుడు భరతునితో గూడ నదియే మాట పలికెను. అందుల కతడును సమ్మతింప లేదు. అప్పుడు రాఘవుడు భూవరులతోడను, భూసురులతోడనుగూడి సుబాహునకు, యూపకేతునకు నభిషేకముజేసెను. పిమ్మట నిజనామాంకితమైన బాణ మొకటి శత్రుఘ్నున కొసగి యతని కిట్లులాదేశించెను. శత్రుఘ్నా! నేనొసగిన యీ బాణముతో నింద్రుడు వృత్రాసురుని సంహరించిన విధముగా క్షణములో నీవా లోకకంటకుడగు లవణాసురు నంత మొందింపగలవు. ఆ లవణాసురుడు ప్రతిదినము నింటిలో దన తండ్రికి శివు డొసగిన శూలమును బూజించి యనంతరము భక్షణార్థమై మృగములను వేటాడుటకు వనములోని కరుగును. అతడు వనమునుండి మఱలివచ్చుటకు ముందే యతని పురద్వారమును నిరోధించి నిలిచియుండుము. అతడు వచ్చి నిన్నుజూచి క్రుద్ధుడై నీతోడ బోరాటమునకు దలపడును. అప్పుడీ బాణముతో వాని నంత మొందింపుము. ఆవిధముగా వాని నంత మొందించి మధువనమను పేర బరగు నచ్చటి వనములో యమునానదీతీరమున మధురానగర మను పేర నొక నగరమును నెలకొల్పుము. అందు సుబాహు నతని యిరువురు భార్యలతోడను, బుత్రులతోడను, గొంత సైన్యముతోడను బ్రతిష్ఠింపుము. అట్లే యూపకేతు నతని భార్యలతోడను, బాలకుల తోడను, బలగములతోడను విదిశానగరమునందు బ్రతిష్ఠింపుము. పిమ్మట నాకడకు వచ్చివేయుము. ఇప్పుడు నీవెనుక నయిదువేల గుఱ్ఱములు, నిరువదియైదు వందల రథములు, నాలుగువందల యేనుగులు, ముప్పదివేల కాల్బలము నేగుదెంచును. నీవు మఱలి వచ్చినమీదట

నేను మఱల మహారాజులను జయించుటకు వెడలగోరుచున్నాను. కావున నేను జెప్పిన పనులన్నియు నిర్వర్తించి సత్వరముగా మఱలి రమ్ము." రాఘవుడీ విధముగా నొడివి సిరమును మూర్కొని శత్రుఘ్నునంపెను. అతడును బ్రాహ్మణులచే నాశీర్వచనముల నభినందింపబడి యన్నకు నమస్కరించి మధువనమునకు వెడలిపోయెను. అన్న యొసగిన కపిలవరాహమూర్తిని గూడ బూజించికొనుటకు వెంట గొనిపోయెను.

ఈవిధముగా శ్రీరామచంద్రుడు ముందుగా శత్రుఘ్ను నంపివైచి తరువాత సుబాహు యూపకేతులను వారివారి భార్యలతో, బాలకులతో, బలగములతో, దాసదాసీజనవర్గములతో, గోధనములతో నంపివైచెను. మధువనమున కరిగి శత్రుఘ్నుడు రాఘవుడు నొడివిన విధముగనే యాచరించెను. శీఘ్రముగా లవణాసురుని సంహరించి మధురానగరమును నెలకొల్పెను. ఆ మధురారాజ్యమునకు సంబంధించియుండు విధమున ననేకవిశాలజనపదముల నేర్పఱచెను. ఆమధురలో భార్యాపుత్రులతోడ సుబాహుని బ్రతిష్ఠించెను. అట్లే భార్యాపుత్రులతోడ యూపకేతుని విదిశానగరమునందు బ్రతిష్ఠించెను. తాను గొంతకాలము మధురలో నుండెను. తాను గొనివచ్చిన కపిలవరాహమూర్తిని సుబాహున కిచ్చివైచెను. ఆమూర్తి యిప్పటికి నామధురలోనే నెలకొనియున్నది. అనంతరము శత్రుఘ్నుడు సైన్యమును వెంటనిడికొని శ్రీరామచంద్రుని సన్నిధికి మఱలివచ్చెను. వచ్చి సమాచారమంతయు రాఘవున కెఱుగజెప్పెను.

అనంతర మొకనాడు మేనమామ యగు యుధాజిత్తు పిలువగా భరతుడు శ్రీరాముని సెలవంది విశాలమైన సైన్యమును వెంటనిడికొని పోయి యసంఖ్యాకులగు గంధర్వనాయకుల నోడించి రెండు నగరములను నెలకొల్పెను. అందు బుష్కరావతి యను నగరమునందు రాఘ

వునిచే ముందుగనే యభిషేకింపబడిన పుష్కరుని భార్యాపుత్రుల తోడను, దాసదాసీజన వర్గములతోడను బ్రతిష్ఠించెను. అట్లే ముందుగా రాఘవునిచే నభిషేకింపబడిన తక్షుని దక్షశిల యను నగరమునందు బ్రతిష్ఠించెను. పిమ్మట లక్ష్మణుని కుమారులను నిరువురను వెంటనిడికొని పోయి పడమట నున్న దుర్మార్గులను మల్లురను జయించి శ్రీరామచంద్రుని సన్నిధికి మఱలివచ్చెను. అప్పుడు రాఘవుడు లక్ష్మణుని గాంచి యతనితో లక్ష్మణా! మహాబలపరాక్రమ సంపన్నులగు నంగదునకు, జిత్రకేతునకు గూడ నే నభిషేకము జేసితిని కావున వీరికై గజాశ్వము, ధనరత్నకము నను రెండు నగరముల నేర్పఱచి భార్యాపుత్రాదులతోడ వీరి నందు బ్రతిష్ఠించి సత్వరముగా నాకడకు మఱలి రమ్ము." అని యతని కాదేశించెను, ఆ రామాజ్ఞను బురస్కరించుకొని లక్ష్మణు డట్లే గజదళము, నశ్వదళము, వాహనములు మున్నగువానిని వెంట నిడికొనిపోయి శత్రువుల నందఱను జయించి గజాశ్వనగరమున నంగదుని, ధనరత్నకనగరమున జిత్రకేతుని వారివారి పరివారములతోడను, దాసదాసీజనవర్గములతోడను బ్రతిష్ఠించి మఱలివచ్చి శ్రీరామసేవాపరతంత్రు డయ్యెను.

అనంతరము శ్రీరామచంద్రుడు జ్యోతిష్కులను రావించి పూజించి తన దిగ్విజయ యాత్రకు ముహూర్తనిశ్చయము సేయుడని కోరెను. వారును దారాచంద్రబలములను శోధించి యొక మంచి ముహూర్తమును నిర్ణయించిరి. అప్పుడు రాఘవుడు వారికి దగిన విధముగా బూజాసత్కారములు గావించి వారి నంపివైచెను.

పిమ్మట లక్ష్మణుని బిలిచి "లక్ష్మణా! నేను సామంతనరపాలకులను వెంట నిడికొని భూమండలమునందలి మహారాజులను జయింప బయనము సేయగోరుచున్నాను. పుష్పకమునందుండియే పయనము

సాగించెదను. కావున శీఘ్రముగా సైన్యములను సన్నద్ధము గావింపుము. అనేకశస్త్రములు, యంత్రములు, శతఘ్నులు, వాహనములు మున్నగువానిని బుష్పకముపయి కెక్కింపుము. ధనధాన్యతృణాదుల రాశులను బుష్పకములో జేర్పింపుము. నగరరక్షణమునకై కొంత సైన్యముతోడ సుమంత్రుని నియమింపుము." అని యతని కాదేశించెను. అనంతరము శ్రీరామచంద్రుడు సీతానివాసగృహమునకు వెడలిపోయెను. లక్ష్మణుడును రాఘవు డాదేశించిన విధముగా సర్వమును సన్నద్ధము గావించెను.

—: షష్ఠ సర్గము సమాప్తము :—

—) o$_0$o (—

# సప్తమసర్గము

## —శ్రీరామచంద్రుని భారతదేశవిజయము—

రామదాసుడు విష్ణుదాసున కిట్లు వివరించును.

అనంతర మేకాంతమున శ్రీరామచంద్రుడు భూతలమునందలి మహారాజులను జయించుటకు దనయులను, సోదరులను, సామంతరాజులను దోడుకొని పయనము కానున్న సమాచారమును, సీతామహాదేవి కెఱిగించెను. ఆమాట నాలించి యామె సిగ్గుపడుచు 'స్వామీ! నేను మీవెడబాటును భరింపజాలను. కావున నేను గూడ మిమ్మనుసరించి భూతలమును దర్శించుట కేగుదెంచెదను.' అని రాఘవుని గోరెను. అట్లకాక! యని రాఘవు డామెను లాలించెను. ఇంతలో మాండవి మొదలగు స్త్రీలును, గురులవుల భార్యలును గూడ నీసమాచారము నాలకించి సీత చెంతకు బరుగిడి వచ్చి' అమ్మా మే మెల్లరమును మామా పతుల యెడబాటును భరింపజాలము

కావున మమ్ములను గూడ మీవెంట గొనిపొండు.' అని యామెను ప్రార్థించిరి. ఆమాటలను సీత శ్రీరామచంద్రున కెఱిగించెను. వారు గూడ దమతోడ నేగుదెంచుటకు రాఘవుడు సమ్మతించెను. అప్పుడు సీత వారితో మీకోరిక సఫలమైనది. కావున నానందముగా మీమీ గృహముల కరుగుడు. అని చెప్పెను. ఆమాట విని పరమానందము నొంది వా రందఱును సీతకు నమస్కరించి కాలియందెలు గల్లుగల్లు మనుచుండగా దమతమ గృహముల కరిగిరి.

అనంతరము శ్రీరామచంద్రుడు సీతతోడ నారేయిని సుఖముగా వెడలించి బ్రాహ్మముహూర్తమున వందిమాగధుల స్తోత్రపఠనములతో మేలుకాంచెను. సత్వరముగా నిత్యకృత్యములను నిర్వర్తించికొని స్నానముచేసి నిత్యనియమములను బాటించెను. శివారాధనము జేసెను. పురాణగాథల నాలకించెను. అనేకదానము లొనరించెను. ప్రయాణమునకు ముందు చేయవలసిన విధిని నిర్వర్తించెను. మహాగణాధిపతిని బూజించెను. ఆభ్యుదయికశ్రాద్ధము యథావిధిగా నిర్వర్తించెను. కామధేనువును, గల్పవృక్షమును, బుష్పకవిమానమును, బారిజాతమును, మణిద్వయమును వేఱువేఱుగా బూజించెను. అందఱతోడను గూడి భోజనము జేసెను. దివ్యవస్త్రములను దాల్చి యాయుధములను గట్టుకొని తల్లులకు నమస్కరించి పల్లకి నెక్కి సోదరులతోడను, సామంతరాజులతోడను బుష్పకవిమానము కడ కరిగెను. తన సమస్తపరివారముతోడను బుష్పకము నధిరోహించెను. సీత మున్నగు స్త్రీలును, కౌసల్య మున్నగు తల్లులును గూడ సుఖముగా బుష్పకము నధిరోహించిరి. శిష్యా! విష్ణుదాసా! యాత్రాకాండమునందు విమానరచన నేవిధముగా వర్ణించితినో యిప్పుడు కూడ నది యట్లే శోభిల్లుచుండెను. ఆసమయమున, మంగళవాద్యములు మ్రోగినవి. వందిమాగధులు స్తోత్రపఠనములు సేసిరి. వార

వనితలు చారుతరనృత్యము లొనరించిరి. నటులు మధురగీతముల నాలపించిరి. అప్పుడు రాఘవుడు తూరుపువంకకు గదలుమని బుష్పకమున కాదేశించెను. అట్లే కాక! యనియావిమాన మాకాశమార్గమున బయలువెడలెను. రాఘవునకు బ్రణమిల్లి సుమంత్రుడు నగరరక్షణమునకై నగరములో నిలిచిపోయెను.

తూర్పు దేశమునందలి మహారాజు లందఱును శ్రీరామచంద్రుని యాగమనవార్త నాలకించి దోయిలి గట్టుకొని యతని కెదురుగా జని నమస్కరించి యనేకములగు కానుకల నొసగి పూజించి తమతోడ నతని దమతమ రాజ్యములలోనికి గొనిపోయిరి. రామాజ్ఞచే నతనిసైన్యములును, మహారాజులును బుష్పక విమానమునందే నిలిచిపోయిరి. రాముని గొనిపోయిన మహారాజు లందఱును దమతమ ధనాగారముల నతని కర్పించిరి. అనంతరము శ్రీరామచంద్రుడు విమానము నధిరోహించి మగధరాజ్యము నతిక్రమించెను. క్రమముగా ననేక దేశముల నవలోకించుచు భూరికీర్తిమహారాజు నగరమున కరిగెను. అతనిచే బూజల నందికొని క్రమముగా దక్షిణముగా సముద్రతీరమార్గమున ద్రావిడదేశమున కరిగెను. పిమ్మట గృష్ణానదీతీరము నందలి యాయా ప్రదేశముల నవలోకించుచు గ్రమముగా కాంతిపురమునకు జేరెను. అచ్చట కంబుకంఠుడుగూడ ధనము మున్నగునవి యర్పించి రాఘవుని బూజించెను. అనంతరమా మహాపురుషుడు డారవారదేశమును, జోళదేశమును దర్శించి యచ్చటి నగపాలకులచేత బూజల నందికొని ముందునకు సాగెను. కేరళదేశమునకు, నాంధ్రదేశమునకు, గర్ణాటకదేశమునకు గూడ నరిగెను. విజయపురమునందు విజయుడను రాజుచే బూజింపబడెను. కొంకణదేశము నందలి నరపతులను జయించి మహారాష్ట్రదేశమున కరిగెను. క్షణములో దేవగిరిదుర్గమును స్వాధీనము జేసికొనెను. ఇతరములైన

దుర్గముల నెన్నిటినో వశపఱచికొనెను. విరాటదేశమును గాంచి వింధ్యపర్వతప్రాంతమునందలి వివిధదేశముల నవలోకించుచు బోయి రేవానదీతీరమున విలసిల్లు నోంకారేశ్వరుని దర్శించెను. మాళవదేశమునందలి మహారాజుల నందఱను జయించి ఉజ్జయిని కరిగెను. యుద్ధములో నుగ్రబాహుని జయించి హైహాయపత్తనమున కరిగెను. అచ్చట ప్రతీపుని గెలిచి హస్తినాపురమున కేగెను.

ఇంతలో సోమవంశమునందు జన్మించిన మహారాజులు మువ్వురును, బుహూరవసుడను మహారాజొకడును నానావాహనముల నధిరోహించి యల్పసైన్యమును వెంట నిడికొని శ్రీరామచంద్రునితో యుద్ధము సేయ నేగుదెంచిరి. వారు పుష్పకముపై నున్న రాఘవునిపై ననేకశస్త్రములను వర్షించిరి. వారితోడ మూడుదినములవఱకు మహాభయంకరయుద్ధ మయ్యెను. ఆసమయమున గంగానది యంతయు నెత్తుటితో నిండిపోయెను. నాల్గవ దివసమున రాఘవుడు వారిని జయించి వారి పురములో ప్రవేశించెను. వానరవైద్యుడగు సుషేణుని గజపురమునందు వానరసైన్యముతో నిలిపెను. చంద్రవంశపు రాజులను మువ్వురను జెఱసాలలో బంధించెను. పిమ్మట సుగ్రీవాదులను దోడుకొని సుబాహుడు పరిపాలించుచున్న మధురారాజ్యమున కరిగెను. సుబాహుని గాంచి విదిశానగరమున కేగి యూపకేతుని దర్శించి, యాతనిచే బూజల నందికొనెను. కురుక్షేత్రమును, బుష్కరక్షేత్రమును జూచి రాఘవు డాకాశమార్గమున మరుదేశము నతిక్రమించి గుర్జరదేశమునకు జేరెను. ప్రభాసక్షేత్రమును బరికించెను. మల్లదేశమును గాంచెను. గజాశ్వనగరమున కేగి యంగదుని జూచెను. ధనరత్నకనగరమున కరిగి చిత్రకేతుని దర్శించెను. ఆనర్తదేశమున కేగి యచ్చటివారిచే బూజలనందికొనెను. పుష్కరావతి కరిగి పుష్కరుని గాంచెను. తక్షశిల కేగి తక్షుని దర్శించెను. భరతుని మేనమామ

యగు యుధాజిత్తు కడ కరిగి యతనిచే బూజల నందికొనెను. మఱల నాకాశమార్గమున శకదేశమున కేగెను. యవనదేశమునందలి మహారాజుల నందఱను జయించెను. మఱల ననేకదేశముల నవలోకించుచు దామ్రదేశమున కరిగెను. పిమ్మట మాయాపురిని జూచి కలాపగ్రామమున కరిగెను. అందఱకు నారాధ్యదైవతములగు నరనారాయణులను, వారి నారాధించు నారదమహర్షి ని సందర్శించెను. వారిని బూజించి యచ్చటివారిచే బూజింపబడెను. భారతమను దేశమున కరిగి యచ్చటి మహారాజును యుద్ధములో సంహరించి వాని స్థానమున స్వజను నొక్కని రాజును గావించెను. పిమ్మట దొమ్మిదివేల యోజనముల వైశాల్యము గలిగిన పుణ్యదేశమున కేగెను. దానికి ముందు హిమాలయమును గాంచెను. అది రెండువేల యోజనముల వైశాల్యము గలిగి మనోహరమైనది. డెబ్బదిమూడువేల యోజనముల నిడివి గలది. అక్కడగూడ రాఘవు డనేకకౌతుకముల నవలోకించెను. జనకజాతకు గూడ జూపించెను.

సప్తమ సర్గము సమాప్తము

—()—

## అష్టమ సర్గము

### శ్రీరామచంద్రుని జంబూద్వీప విజయము

శ్రీరామదాసుడు విష్ణుదాసున కిట్లు వివరించును.

అనంతరము శ్రీరామచంద్రుడు కింపురుషవర్షమున కేగెను. అది 9000 యోజనముల వైశాల్యము గలది. అందనాదిగా శ్రీరామచంద్రు డారాధ్యదైవము. హనుమంతు డారాధకుడు. అచ్చట రాఘవు డనేకకౌతుకముల నవలోకించి యచ్చటి రాజబృందములచే

బరివేష్టితుడై నవవిధవాద్యములు మ్రోగుచుండగా బుష్పకము నెక్కి ముందునకు సాగెను. పిమ్మట హేమకూటపర్వతము నీక్షించెను. అది యత్యంతమనోహరమైనది. రెండువేల యోజనముల వైశాల్యమును, 81000 యోజనముల నిడివియు గలది. మిక్కిలి సమున్నతమైనది. అనేకధాతువులతో విరాజిల్లుచున్నది.

దాని నతిక్రమించి రాఘవుడు హరివర్షమున (దేశము) కరిగెను అది 9000 యోజనముల పరిమితి గలది. అందు నరసింహమూర్తి యారాధ్యదైవము. ప్రహ్లాదు డారాధకుడు. అదియు నత్యంత మనోహరమైనదే. అచ్చటి మహారాజుల నెల్లరను జయించి వారినుండి రాఘవుడు ధనాగారము లను గానుకలుగా స్వీకరించెను. అచ్చటి రాజపత్నులచే నీరాజనము లందికొనెను. అచ్చటి కౌతుకముల నెన్నిటినో చూపి సీత నానందపఱచెను. పిమ్మట మఱల బుష్పకము నెక్కి ముందునకు సాగి నిషధపర్వతమును గాంచెను. అది 2000 యోజనముల వైశాల్యము, 9000 యోజనముల నిడివియు గలిగి యత్యంతమనోహరముగా నలరారు చుండును.

అనంతరము రఘునందనుడు మేరుపర్వతమునకు నాలుగు దిక్కులయందును సమానమైన పరిమాణము గల యిలావృతవర్షమనుపేర బరగు ఖండమున కరిగెను. అచ్చట మేరుపర్వతమునకు దక్షిణముగా దాని శాశ్రయభూతమగు మేరుమందరపర్వతముపై మిక్కిలి యెత్తైన జంబూవృక్షమును గాంచెను. దానిని బట్టియే యాద్వీపము జంబూద్వీప మనుపేర బ్రసిద్ధి కెక్కెను. దాని నతడు సీతకు గూడ జూపెను. ఆమేరుపర్వతమునకు పడమరగా దాని కాశ్రయ భూతమై సుపార్శ్వపర్వత మున్నది. దానిపై మిక్కిలి యున్నతమై విశాలమై పూవులతో మనోహరమైన కదంబవృక్ష మున్నది. దానిని గూడ రాఘవుడు జూచెను. అట్లే మేరుపర్వతమున కుత్తరముగా దాని కాశ్రయ

భూతమై కుముదపర్వత మున్నది. దానిపై నత్యంత సమున్నతమై విశాలమై మనోహరమైన వటవృక్షము విరాజిల్లుచున్నది. దానిని రాఘవుడు తాను గాంచి తన భార్యకు గూడ జూపెను. ఆమేరువునకు దూర్పుగా దాని కాశ్రయభూతమగు మందరపర్వతముపై మిక్కిలి యెత్తుగా విశాలముగా స్థూలముగా నుండు సహకారవృక్షము పక్వములైన ఫలములతో నిండి చూచువారి కానందము గలిగించుచుండును. దానిని రాఘవుడు జూచి సీతకు జూపెను. ఆయిలావృతవర్షమునం దారాధ్యదైవమగు సంకర్షణదేవునకు, నారాధకుడగు రుద్రునకు సిరము వంచి నమస్కరించెను. అచ్చట నివసించు మహారాజులచే వందనముల నందికొని యటనుండి తూరుపువంకకు బయనము సాగించెను. పిమ్మట గంధమాదనపర్వతమును గాంచెను. అది 2000 యోజనముల వైశాల్యమును, 34000 యోజనముల నిడివియుగలది.

అనంతరము భద్రాశ్వవర్షమున కరిగెను. అది 31000 యోజనముల విస్తీర్ణతగలది. అందు హయగ్రీవు డారాధ్యదైవము. భద్రాశ్వు డారాధకుడు. అచ్చట రాఘవుడు కొందఱ మహారాజులను రణరంగమున జయించెను. కొందఱు రణముతో బని లేకయే వశవర్తులైరి. ఆ యందఱివలనను బన్నులను స్వీకరించి యతడు పడమటివంక కేగెను. మేరువునకు బడమరగా నున్న మాల్యవంత మను పర్వతమును గాంచెను. అది 2000 యోజనముల వైశాల్యమును, 3400 యోజనముల నిడివియు గలిగి చూడ ముచ్చట గొలుపుచుండును.

పిమ్మట రాఘవు డింకను బడమరగా నరిగి కేతుమాలవర్షమును గాంచెను. అది 31000 యోజనముల విస్తీర్ణతయు, 34000 యోజనముల నిడివియు గలది. అచ్చట గామదేవు డుపాస్యుడు. లక్ష్మీదేవి యుపాసకురాలు. అచ్చటి మహారాజు లందఱిచేతను బూజల నందికొని రాఘవుడు పరమానందము నొందెను. అనంతరము మేరువున

కుత్తరముగా నున్న నీలపర్వతము నవలోకించెను. అది 2000 యోజనముల విస్తీర్ణతయు, 90000 యోజనముల నిడివియు గలది.

అనంతరము రఘునందనుడు ముందునకు సాగి రమ్యకవర్షమును జేరెను. దాని పరిమాణము 9000 యోజనములు. అందు మత్స్యమూర్తి యుపాస్యుడు. మను వుపాసకుడు. అచ్చటి మహారాజుల వలన మహాధనరాశులను గానుకలుగా గొని సీత కానందము గలిగించుచు రాఘవుడు ముందునకు సాగెను. అచ్చట కుత్తరముగా శ్వేత పర్వత మున్నది. అది 2000 యోజనముల విస్తీర్ణతయు, 81000 యోజనముల నిడివియు గలిగి మనోహరముగా నుండును.

పిమ్మట రాఘవుడు హిరణ్మయవర్షమున కేగెను. దాని పరిమాణము 9000 యోజనములు. అచ్చట కూర్మమూర్తి యారాధ్యమూర్తి. సూర్యభగవాను డారాధకుడు. అచ్చటి మహారాజపత్నులెల్లరును సీతామహాదేవి చరణారవిందములపై సిరములు వంచి యామెకు నమస్కారములు సేసిరి. ఆవర్షమున కుత్తరముగా 2000 యోజనముల విస్తీర్ణతయు, 73000 యోజనముల నిడివియు గలిగి మనోహరముగా భాసిల్లు శృంగవంత పర్వతమును రాఘవు డవలోకించెను.

అనంతరము శ్రీరామచంద్రుడు ఉత్తరకురువర్షమున కరిగెను. అది 9000 యోజనముల పరిమాణము గలది. అందు వరాహమూర్తి యారాధ్యదైవతము. భూదేవి యారాధకురాలు. అచ్చటి మహారాజులను రణరంగమున జయించి స్వాధీనపఱచికొని రాఘవుడు వారిచే బూజల నందికొనెను.

పిమ్మట రఘునందనుడు లవుని జంబూద్వీపాధిపతిని గావింప మనములో నిశ్చయము జేసికొని యాయధికారమునందు గొన్ని దినముల పర్యంతము విజయుడను పేర బరగు తన మంత్రిని నియమించెను.

ఈజంబూద్వీపమునందును, సప్తద్వీపములందు నంతర్గతములై యేయే వర్షములు గలవో యవి యన్నియు ప్రియవ్రతమహారాజు పౌత్రుల (కొడుకు కొడుకు) పేర్లతో ప్రసిద్ధిగాంచినవి. ఆయా వర్షములందు జన్మించిన మహారాజు లాయా వర్షముల పేర్లతోనే వ్యవహరింప బడుదురు. కావున వేఱువేఱుగా వారిపేర్ల నిచ్చట నుదాహరించుట లేదు. ఈవిధముగా జంబూద్వీపము విస్తీర్ణతను బట్టియు, నిడివిని బట్టియు మొత్తము మీద లక్షయోజనముల పరిమాణము గలిగి సుందరమై సమవర్తులమై తామరపూరేకలవలె నొప్పు తొమ్మిది వర్షములతో గూడి యలరారుచుండును. అట్టి జంబూద్వీపము నంతను శ్రీరామచంద్రుడు స్వాయత్తము జేసికొనెను.

మేరుపర్వతమునకు ముందుభాగమున నష్టదిక్పాలకులకును జెందిన యెనిమిది నగరము లున్నవి. ఇంద్రుడు, నగ్నిహోత్రుడు, యముడు, నిరృతి, వరుణుడు, వాయుదేవుడు, కుబేరుడు, నీశానుడు ననబడు నీ యెనమండుగురు దిక్పాలకులను గూడ వశ మొనర్చికొని యెంచి రాఘవుడు సపరివారుడై ముందునకు సాగెను. ఆయేడు వర్షములును విస్తీర్ణతను బట్టియు, నిడివిని బట్టియు 2500 యోజనముల పరిమాణము గలవి. మేరుపర్వతము శిరస్థానమున లక్షయోజనముల యౌన్నత్యము గల్గి మూలస్థానమున ముప్పదిరెండువేల యోజనముల విస్తీర్ణతగల్గి, క్రిందిభాగమున బదునాఱు వేల యోజనముల విస్తీర్ణత గలిగి, పదునాఱువేల యోజనముల పర్యంతము భూమిలో ప్రవేశించి భూమికి వెలుపల నెనుబదినాలుగు వేల యోజనముల పరిమాణము గలిగియు మొత్తము పూవు వలె గానవచ్చును. ఆ మేరుపర్వతమునకు ముందున్న యష్టదిక్పాలకుల నగరములకు నడుమ బ్రహ్మపురి ప్రకాశించుచున్నది. అది పదివేల యోజనముల పరిమాణము గలది. అన్ని వర్షములకు బొలిమేరలయుండున్న యెనిమిదిపర్వతములును బదవేల

యోజనముల యౌన్నత్యము గలవి. ఆపర్వతముల నిడివి యెంతయో యావర్షముల నిడివియు నంతియే.

సగరచక్రవర్తి కుమారులచే గుఱ్ఱమును వెదకుటకై భూమి నంతను త్రవ్వు వేళ గల్పింపబడిన యుపద్వీపములు జంబూద్వీపమునకు సంబంధించినవి యెనిమిది గలవు. స్వర్ణప్రస్థము, చంద్రశుక్లము, ఆవర్తనము, రమణకము, మందరహారిణము, పాంచజన్యము, సింహళము, లంక, యను పేర్లతో నా యుపద్వీపములు వ్యవహరింపబడుచుండును. అందు లంక యొక్కటి దక్క దక్కినవాని నొక్కొక్కటిగా నచ్చటిపాలకులతోడ శ్రీరామచంద్రుడు స్వాధీనపఱచికొనెను. భారతవర్షము, ఇలావృతవర్షము దక్క దక్కిన యేడువర్షములందు నసంఖ్యాకములైన నదులును, బర్వతములును గలవు. వాని విస్తీర్ణత వర్ణింప నలవి కానిది. ఇలావృతవర్షమునందలి ముఖ్యనదులు పేర్కొనబడుచున్నవి. అరుణోదము, జంబూనది, పయోదము, దధినదము, ఘృతనదము, మధునదము, గుడనదము, అన్ననదము, వస్త్రనదము, శయ్యానదము, ఆసననదము, ఆభరణనదము, అనునవి యచ్చటి నదములు. ఇవిగాక మధురప్రవాహము గల నదులై యున్నవి. సీత, అలకనంద, చక్షువు, భద్ర అనునవి నాలుగు నిలావృతవర్షమునకు సంబంధించిన ముఖ్యనదులు. ఇవి మేరువునుండి నాలుగు దిక్కుల యందును క్రిందకు బడుచుండునవి. అందు సీతానది, తూర్పు సముద్రమునను, చక్షుర్నది పడమటి సముద్రమునందును, భద్రానది యుత్తరసముద్రమునందును, నలకనంద దక్షిణసముద్రమునందును బ్రవేశించుచున్నవి. ఈభారతవర్షమున నదులు, పర్వతములు ననేకములు గలవు. మలయము, మంగళప్రస్థము, మైనాకము, త్రికూటము, ఋషభము, కుటకము, సహ్యము, దేవగిరి, ఋష్యమూకము, శ్రీశైలము, వేంకటగిరి, మహేంద్రగిరి, వారిధరము, వింధ్యము, శుక్తిమం

తము, ఋక్షగిరి, పారియాత్రము, ద్రోణపర్వతము, చిత్రకూటము, గోవర్ధనము, రైవతకము, కకుభము, నీలపర్వతము, గోకాముఖము, ఇంద్రకీలము, కామగిరి యనునవియే కాక యింకను నెన్నియో పర్వతము లున్నవి. వాని కటిప్రదేశమునుండి ప్రభవించిన నదీనదములు గూడ నసంఖ్యాకములుగా నున్నవి. చంద్రవంశ, తామ్రపర్ణి, అవటోద, కృతమాల, వైహాయసి, కావేరి, వేణి, పయస్విని, శర్కరావతి, తుంగభద్ర, కృష్ణ, భీమరథి, గోదావరి, నిర్వింధ్య, పయోష్ణి, తాపి, మహి, సురస, నర్మద, చర్మణ్వతి, సింధునదము, శోణనదము, మహానది, వేదస్మృతి, ఋషికుల్య, త్రిసామ, కౌశికి, మందాకిని, యమున, సరస్వతి, దృషద్వతి, గోమతి, సరయూనది, రోధస్వతి, సప్తవతి, సుషోమ, శతద్రువు, చంద్రభాగ, మరుధన్వ వితస్త, అసిక్ని, విశ్వ అను నవి యన్నియు మహానదులు.

ఈవిధముగా శ్రీరామచంద్రుడు ఉపద్వీపములతో గూడిన జంబూద్వీపము నంతను స్వాయత్తము గావించికొని యాజంబూద్వీపమునకు గందకమువలె భాసిల్లుచు లక్ష యోజనముల విస్తీర్ణతగల లవణసముద్రమును లంఘించి విమానారూఢుడై ప్లక్షద్వీప మనుపేర బరగు మఱియొక ద్వీపమునకు జేరెను.

— అష్టమసర్గము సమాప్తము —

—)$^0{}_0{}^0$(—

# నవమసర్గము

— శ్రీరామచంద్రుడు ప్లక్షాది ద్వీపముల నాఱింటిని జయించుట —

శ్రీరామదాసుడు విష్ణుదాసున కిట్లు వివరించును.

అనంతరము శ్రీరామచంద్రుడు మహోహారమైన ప్లక్షద్వీపమును జేరెను. అది రెండు లక్షల యోజనముల పరిమాణము గలది.

ఏడువర్షములతో గూడియున్నది. అచ్చట సూర్యభగవాను డారాధ్య దైవము. బ్రాహ్మణు లారాధకులు. అచ్చట సువర్ణమయమైన ప్లక్ష వృక్షము (జువ్వి) ఉన్నది. దానిని బట్టియే యది ప్లక్షద్వీప మనబడినది. ఈద్వీపము జంబూద్వీపమునకు, లవణసముద్రమునకు వెలుపల నున్నది.

పిమ్మట రాఘవు డాకాశ మార్గమున క్షణములో మేరువునకు దూర్పుగానున్న శివవర్షమున కరిగెను. అచ్చట సర్వపాపప్రణాశిని యగు నరుణానదిలో స్నాన మొనరించి యా వర్షము నేలువాని కడ కరిగెను. అతనికి రాఘవునకు నడుమ నప్పుడు ఘోరయుద్ధము జరిగెను. అయిదు మాసములలో నతనిని జయించి యచ్చటి మహారాజులచే బూజల నందికొని రఘునాథుడు క్రమముగా వజ్రకూటపర్వతమున కరిగెను. అది రెండు సముద్రముల నడుమ నుండి రెండు వర్షములకును సీమాచలముగా భాసిల్లుచున్నది. దాని నతిక్రమించి రఘునందనుడు యువయసవర్షమున కేగెను. అచ్చట నృష్ణానదిలో స్నాన మాచరించి తద్వర్ష పాలకుని దర్శించెను. అతనిచే బూజల నందికొని యచ్చటి మహారాజులతోడ బుష్పకము నెక్కి ముందునకు సాగి యుపేంద్రసేనపర్వతము నవలోకించెను. క్రమముగా దానినిగూడ నతిక్రమించి సుభద్ర వర్షమున బ్రవేశించెను. అచ్చట నాంగిరసీనదీ జలములందు స్నానము జేసెను. తద్వర్ష పాలకునివలన ధనరాశులను గానుకగా స్వీకరించెను. అచ్చటి నరపతులను వెంటనిడికొని ముందునకు సాగి జ్యోతిష్మంతగిరిని దర్శించెను.

ఆపర్వతమును గూడ నతిక్రమించి రాఘవుడు క్రమముగా శాంతివర్షమున బ్రవేశించెను. అచ్చట సావిత్రీనదిలో స్నాన మాచరించెను. తద్వర్ష పాలకుని జయించెను. ఇతరమహారాజుల నందఱను

జయించెను. అటనుండి ముందునకు సాగి సువర్ణ పర్వతమును సందర్శించెను.

పిమ్మట రాఘవుడు క్షేమవర్షమున కేగెను. సుప్రభాతా నదిలో స్నాన మాచరించెను. తద్వర్ష పాలకునివలన ధనరాశులను గ్రహించెను. హిరణ్యష్ఠీవ మను పర్వతము నీక్షించెను. దాని నతిక్రమించి యమృతవర్షమును జేరెను. అచ్చటి పాలకునిచేతను, నితర మహారాజులచేతను బూజింపబడెను. ఋతంభరా నదిలో స్నాన మాచరించెను. మేఘమాలపర్వతము నవలోకించెను. క్రమముగా దాని నతిక్రమించి యభయవర్షమున బ్రవేశించెను. క్షణములో నచ్చటి పాలకుని జయించెను. సత్యంభరానదిలో స్నానమొనరించెను. ప్లక్షద్వీపాధిపతి యగు సుచంద్రుడను నరపతిని ఘోరయుద్ధ మొనరించి జయించెను. అతనిని, నచ్చటి యితర మహారాజులను దోడ్కొని ముందునకు సాగెను. మణికూటపర్వతమును గాంచెను. దాని నతిక్రమించి రెండులక్షల యోజనముల పరిమాణము గలిగి ప్లక్షద్వీపమునకు గందకమువలె భాసిల్లు నిక్షురసోద మను మహాసముద్రమును లంఘించి నాలుగులక్షల యోజనముల పరిమాణముగల శాల్మలీ ద్వీపమున బ్రవేశించెను.

ఆశాల్మలీద్వీపమునందు శాల్మలీవృక్ష మున్నది. దానిని బట్టియే యాద్వీపమున కాపేరు గలిగినది. అందు సోము డారాధ్య దైవము. ఆద్వీపములో నివసించువా రారాధకులు. మేరువునకు దూర్పుగా నంచేడు వర్షములున్నవి. అవి సురోచనము, సౌమనస్యము, రమణకము దేవవర్షము, పారిభద్రము, ఆప్యాయనము, అవిజ్ఞాతము, ననునవి. ఆద్వీపమునందు అనుమతి, సినీవాలి, సరస్వతి, కుహూనది, రజని, రాక, నంద, యనునవి ముఖ్యనదులు అందు శతశృంగము, వామదేవము, కుందము, కుముదము, పుష్పవర్షము, సహస్రశ్రుతి,

స్వరసము నను నేడును సీమాప్రాంతమున వెలుగొందు పర్వతములు. ఈయేడు వర్షములందును వర్షపాలకుల నెల్లరను జయించి ద్వీపాధిపతిని సుబాహు డనువానిని బాధాక్రాంతుని గావించికొని రాఘవుడు ముదము నొందెను. అనంతరము నాలుగు లక్షల యోజనముల పరిమాణము గల సురోద మను సముద్రమును దరించి కుశద్వీపమును జేరెను.

కుశద్వీప మెనిమిది లక్షల యోజనముల పరిమాణము గలది. అచ్చట నివసించువారి కందఱకును జాతవేదసుడు (అగ్ని) ఆరాధ్య దైవము. అందు దేవతలచే నేర్పఱచబడిన కుశస్తంబ మున్నది. దానిని బట్టియే యాద్వీపము కుశద్వీప మనబడినది. అందేడు వర్షము లున్నవి. అవి వసువు, వసుదానము, దృఢరుచి, నాభిగుప్తము, సత్యవ్రతము, వివిక్తము, వామదేవము ననునవి. రసకుల్య, మధుకుల్య, మిత్రవింద, శ్రుతివింద, దేవగర్భ ఘృతచ్యుత, మంత్రమాల యనునవి వరుసగా నాయేడు వర్షములందును గల నదులు. చతుశ్శృంగము, కపిలము, చిత్రకూటము, దేవానీకము, ఊర్ధ్వరోమము, ద్రవిణము, చక్రము ననునవి యేడు సందలి పర్వతములు. ఈ యేడు వర్షముల పాలకులను, కుశద్వీపాధిపతిని మహాసేను డనువానిని గూడ సమరమున జయించి రాఘవుడు తృప్తినొందెను. పిమ్మట నెనిమిది లక్షల యోజనముల పరిమాణము గల ఘృతోదసముద్రమును దాటి క్రౌంచద్వీపమున కరిగెను.

క్రౌంచద్వీపము కుశద్వీపమున కన్న రెండు రెట్లు పెద్దది. అచ్చట క్రౌంచమను పర్వత మున్నది. దానిని బట్టియే యది క్రౌంచ ద్వీప మనబడినది. ఆద్వీపమువారి కందఱకును వరుణు డారాధ్య దైవము. అందు ఆమము, మధురుహాము, మేఘపృష్ఠము, సుధామానము, భ్రాజిష్ఠము, లోహితార్ణము, వనస్పతి యను నేడు

వర్షము (దేశము) లున్నవి. వర్ధమానము, భోజనము, ఉపబర్హణము, నందము, నందనము, సర్వతోభద్రము, శుక్లము ననునవి యేడు నావర్షములందలి సీమాప్రాంతములం దుండు పర్వతములు. అమృత, అమృతౌఘ, ఆర్యక, తీర్థవతి, వృత్తిరూపవతి, పవిత్రవతి, శుక్ల, యను నవి యేడు నావర్షములందు స్నానమాత్రమున సమస్త పాపములను బరి హరింపగలనదులు ఈయేడు వర్షములందలి మహారాజులవలనను రాఘ వుడు పన్నులను స్వీకరించి బూజల నందికొనెను. క్రౌంచద్వీపాధిపతిని గదనమున జయించి యాతనివలన నేనుగులు, నొంటెలు, నరదములు, తురగములు, ధనాగారములు మున్నగా ననేకములగు కానుకలను గ్ర హించి పరితృప్తుడయ్యెను అనంతరము వందిమాగధులు స్తోత్రపఠన ములు సేయుచుండగా గ్రౌంచద్వీపముతో సమానమైన పరిమాణము గల క్షీరోద సముద్రమును లంఘించి ముప్పదిరెండు లక్షల యోజన ముల పరిమాణము గలదగు శాకద్వీపమునకు జేరెను.

అందు శాకవృక్ష మున్నది. దానిని బట్టియే యది శాకద్వీప మనబడినది. అచ్చటి వారికి వాయుదేవు డారాధ్యదైవము. అందు పురోజవము, మనోజవము, పవమానము, ధూమ్రానీకము, బహు రూపము, చిత్రరూపము, విశ్వాధారము నను నేడు వర్షములున్నవి. అనఘ, ఆయుర్ద, ఉభయస్పృష్టి, అపరాజిత, పంచనద, సహస్రశ్రుతి నిజధృతి యనునవి యేడు నావర్షములందు బ్రసిద్ధి గన్ననదులు. ఉరుశృంగము, బలభద్రము, శతకేసరము, సహస్రస్రోతము, దేవ పాలము, మహానసము, ఈశానము నను నీయేడు నావర్షములందు సీమాప్రాంతములందు వెలుగొందు పర్వతములు. ఈయేడు వర్షము లందలి మహారాజులవలన బూజల నందికొని సుందరుడను పేర బరగు మహాబలశాలియైన యా శాకద్వీపాధిపతితో నేడు దినముల వఱకు రణ మొనరించి కడకు రాఘవు డాతని వశవర్తిని గావించికొని యతని

చేత గూడ బూజింపబడి ప్రయాణభేరిని ప్రమోగింపజేసెను. క్రమముగా ముందునకు సాగి ముప్పది రెండు లక్షల యోజనముల విస్తీర్ణత గల దధిమండోదసముద్రమును లంఘించి యిరువది నాలుగు లక్షల యోజనముల పరిమాణము గలదగు పుష్కరద్వీపమున ప్రవేశించెను.

ఆపుష్కరద్వీపము నడుమ మానసోత్తరాచల మనుపర్వతమున్నది. అందు రమణకము, ధాతకి యను రెండు వర్షము లున్నవి. ఆ వర్షముల పాలకులను, సుత్రాంగుడనుపేర బరగు ద్వీపాధిపతిని జయించి రాఘవుడు సుదము నొందెను. ఆద్వీపమునందు బ్రహ్మకు బరమాసనమైన పుష్కరమును (పద్మము) గాంచెను. దానిని బట్టియే యాద్వీపము పుష్కరద్వీప మనబడినది. అచ్చటి జను లచ్చట గర్మమయమూర్తి యగు బ్రహ్మలింగము నారాధింతురు. ఆరెండు వర్షములందును బాపపరిహారము సేయుగల నదులెన్నియో గలవు. అచ్చటి పర్వతము పదివేల యోజనముల పరిమాణము గలిగి యున్నతమై యలరారుచుండును. ఆ పర్వతముపై దూర్పువంక దేవధాని యను పేర నత్యంతమనోహరమై, జ్వలనప్రభాజాజ్వల్యమానమై వెలుగొందు నింద్రుని నగర మొకటి గలదు. అట్లే యాగిరికి దక్షిణమున సంయమిని యను పేర బరగుచు నత్యంతమనోహరమై యముని నగరమొకటి విరాజిల్లుచున్నది. పడమటి దిక్కున నిమ్లోచని యను పేర బరగుచు వరుణుని నగరము భాసిల్లుచున్నది. ఉత్తరదిక్కున గుబేరుని యలకానగరము శోభిల్లుచున్నది. మేరుప్రాంతమున నున్న పురములకన్న నీపురములు భిన్నములైనవి. ఒక మహారాజునకే విధముగా వేలు వేలుగా ననేకస్థానము లుండునో యా విధముగనే యీ పురములు గూడ వేలు వేలుగా నున్నవని యెన్నదగును. అచ్చటి సీమాప్రాంత పర్వతములం దొక్కొక్కటి రెండువేల యోజనముల యౌన్నత్యము

గలది. మొత్తిముమీద నన్నిటిని గలిపినచో బదివేల యోజనముల యౌన్నత్యము సెప్పబడినది. అనంతరము రాఘవుడు పుష్కరద్వీపముతో సమానమైన పరిమాణము గల శుద్ధోదసముద్రమును దాటి సీతామహాదేవికి వినోదమును గలిగింపనెంచియు, దమ దర్శనముచే ముందు ప్రదేశములందున్నవారిని గూడ నుద్ధరింప నెంచియు బుష్పకారూఢుడై ముందువంకకు బయనము సాగించెను.

అట్లు పోవబోవ రాఘవున కొక విశాలమైన భూభాగము గానవచ్చినది. అది 15750000 యోజనముల పరిమాణము గలది. అందొకచో జీవకోటి యున్నది. మఱియొకచో లేదు. అచ్చటివారిచే బూజల నందికొని రాఘవుడు సీతకానందము నొదవించుటకై మఱల ముందునకు సాగెను. మేరువునకు, మానసోత్తరాచలమునకు నడుమనున్న భూభాగము 15741000 యోజనముల పరిమాణము గలది. దానికి ముందు భాగమున నద్దమువలె స్నిగ్ధమై దేవతలచే నధిష్ఠింపబడిన బంగారు భూభాగము రాఘవునకు దృగ్గోచరమయ్యెను. అది 83900000 యోజనముల పరిమాణము గలది. అచ్చటి దేవతలచే బూజింపబడి శ్రీరామచంద్రుడు ముదము నొందెను. అనంతర మింకను ముందునకు బోయి లోకాలోకపర్వతమును గాంచెను. అది విస్తీర్ణతను బట్టియు, నౌన్నత్యమును బట్టియు 125000000 యోజనముల ప్రమాణము గలది. ఎవ్వరు నతిక్రమింపజాలనిది. దానిపై నెనిమిది దిక్కులయందును ఋషభము, పుండరీక పుష్కరచూడము, కుముదము, వామనము, పుష్పదంతము, అపరాజితము, సుప్రతీకము నను నెనిమిది యేనుగు లున్నవి. అవి సమస్త లోకము యొక్కయు స్థితికి గారణభూతములైనవి. ఆ పర్వతము మీదనే సకలలోకకల్యాణమును గోరి పరమమహాపురుషుడగు మహావిభూతిపతి (భగవానుడు) విరాజమానుడై యున్నాడు. ఆ ప్రదేశ

మును గూడ నతిక్రమించి పోవుట కొక్క యోగీశ్వరులకు మాత్రమే శక్యమగునని పెద్దలు చెప్పుదురు. ఈ విధముగా మొత్తముమీద భూగోళ మేబదికోట్ల గుణములు (రెట్టు) పరిమాణము గలది. ఈ విధముగా రాఘవుడు లోకాలోకపర్వతమధ్యగతమైన భూమిని నిరువది యైదుకోట్ల యోజనముల పరిమాణము గలదానిని స్వాధీనమొనర్చికొని యాకాశమార్గమున నటనుండి వెనుకకు మఱలి మార్గమధ్యమున ననేకద్వీపముల నవలోకించుచు జంబూద్వీపమునందలి భారతవర్షమునకు నడుమ నున్న తన రాజధాని యగు నయోధ్యకు సప్తద్వీపములందలి నరపతుల బృందముచే బరివేష్టితుడై యేగుదెంచెను. అయోధ్యను సమీపించి దూతలచే దన యాగమనవార్తను సుమంత్రున కెఱిగించెను.

ఆవార్త నాలకించి సుమంత్రు డయోధ్యానగరమును బతాకలతో ధ్వజములతో దోరణములతో నలంకరింపజేసెను. పౌరులను జానపదులను దోడుకొని పట్టపుటేనుగును ముందిడికొని యెదురుగా జని ప్రణమిల్లి శ్రీరామచంద్రుని నగరము లోనికి గొనివచ్చెను. ఆ సమయమున మంగళవాద్యములు మ్రోగినవి. అచ్చరలాడిరి. వందిమాగధులు స్తోత్రపఠనములు సేసిరి. మేడలపై నిలిచి పురవనితలు పూలవానలు గురియించిరి. నటులు గానము లొనరించిరి. విమానము మీదనుండియే పౌరులవలన గానుకలను, నారీమణుల వలన నీరాజనములను నందికొనుచు రాఘవుడు క్రమముగా రాజద్వారము కడకు జేరెను. అచ్చట వాహనమునుండి క్రిందకు దిగి సభాస్థలి కరిగి రాజబృందములచే బరివేష్టితుడై తన యాసనముపై నాసీను డయ్యెను. అనంతరము తనతోడ నేగుదెంచిన యతిథులకు వాసస్థానములను, వస్తుసామగ్రిని సమకూర్ప లక్ష్మణున కాదేశించెను. పిమ్మట దధిశ్రాద్ధము మున్నగు విధులను సర్వర్తించికొని తనను దాను గృత

కృత్యునిగా దలపోసికొనెను. అతనితో నేగుదెంచిన సప్తద్వీపములందలి మహారాజు లెల్లరు నతనిని బూజించిరి.

అప్పుడు రాఘవుడు లక్ష్మణునితో మంత్రణము జేసి మహారాజులతోడను, బ్రాహ్మణులతోడను గూడి తన సోదరుడగు భరతుని భరతవర్షమున కధిపతిని గావించెను. ఈ భావివిషయమును దలపోసియే వసిష్ఠుడు పూర్వము భరతునకు జాతకర్మ సంస్కారము సేయువేళ భరతుడని పేరిడెను. రాఘవుడు తాను పూర్వము తాత్కాలికముగా భరతవర్షమున కధిపతిగా నియమించిన సేవకుని మఱియొక కార్యరంగమున బ్రవేశపెట్టెను. తన తనయుడగు లవుని జంబూద్వీపమున కధిపతిని గావించెను. ఆ లవుడును విజయు డను మంత్రిని సానందముగా దన మంత్రినిగా జేకొనెను. పర్యాయముగా నా విజయుని దోడుకొని కార్యార్థమై లవుడు తొమ్మిది వర్షములందును రాకపోకలు సాగించెను. భరతుడు తన యౌవరాజ్యపదవియందు శత్రుఘ్ను నభిషేకించెను. అట్లే శ్రీరామచంద్రుడు తన యౌవరాజ్యపదవియందు తన తనయుడగు కుశు నభిషేకించెను. లక్ష్మణుని దన మంత్రులలో ముఖ్యమంత్రిని గావించెను. ఈవిధముగా స్వయముగా రాఘవుడు సప్తద్వీపాధిపతి యయ్యెను. రామునిచే నియమింపబడిన వారందఱును దమతమ కార్యములందు నిమగ్నులైరి. పిమ్మట దనతోడ నేగుదెంచిన మహారాజుల నందఱను గౌరవించి వారివారి నెలవుల కరుగ వారికి సెల వొసగెను. వారును వెడలిపోయిరి. భరతుడు భరతవర్షపాలన భారమును జక్కగా నిర్వహింపసాగెను. అట్లే జంబూద్వీపపాలనభారమును లవుడు నిర్వహింపసాగెను. కుశునితోడను, లక్ష్మణునితోడను గూడి స్వయముగా శ్రీరామచంద్రుడు సప్తద్వీప పరిపాలన భారమును నిర్వహింప నొచ్చెను.

—నవమసర్గము సమాప్తము—

—oOo—

# దశమసర్గము

## శ్రీరామచంద్రుడు సన్యాసిని, శూద్రుని, గృధ్రమును దండించుట.

శ్రీరామదాసుడు విష్ణుదాసున కిట్లు వివరించును.

ఒకనాడు శ్రీరామచంద్రుడు కొలువుదీరి యుండగా రాజద్వారమునకు వెలుపల నొక శునకము మాటిమాటికి మొఱుగ నారంభించెను. అది యాలకించి రాఘవుడు భటునితో నాశునక మల్లేల యరచుచున్నదో యరయుమని చెప్పెను. అట్లకాక! యని యాభటుడు పోయి యాశునకమును బెదరించియు, గద్దించియు దాని నోరు మూయించి మఱల లోనికి వచ్చి 'మహాప్రభూ! అది యూరక యరచుచున్నది. నేను దానిని దూరముగా దఃఖిమినైచితి'నని ప్రభువున కెఱుగజెప్పెను. అట్లే మఱుచటి దినమున మఱల నాశునకపు ప్రోతాత రాఘవునకు వినవచ్చెను. ఆనాడు గూడ నట్లే దానిని భటునిచే రాఘవుడు వారింపజేసెను. మఱల మూడవ దివసమున గూడ నాశునక మట్లే మొఱుగ మొదలిడెను. ఆ యరపు నాలకించి చకితుడై రఘునందనుడు ముందున్న లక్ష్మణుని గాంచి 'లక్ష్మణా! ఈ శునక మీవిధముగా మూడు దినములనుండి మొఱుగుచున్నది. దానిని నాయెదుటకు రావించి దానికొదవిన దుఃఖ మేమియో నీవు దానినడుగు' మని యతనితో జెప్పెను. అప్పుడు లక్ష్మణుడు వెంటనే యాశునకమును సభలో ప్రవేశపెట్టుడని దూతల కాదేశించెను. వెంటనే దూతలరిగి 'ఓ శునకమా! నిన్ను శ్రీరామచంద్ర మహాప్రభువులు పిలుచుచున్నారు. వారి సన్నిధికి రమ్ము! నీపూర్వపుణ్యములు ఫలించి నీకు దైవానుకూల్యము సిద్ధించినది. రమ్ము! రమ్ము!' అని దాని నాహ్వానించిరి. వారి మాటల నాలకించి యాశునకము 'అయ్యలారా! నేను పాపయోనిలో ప్రభవించినదానను. దేవాలయమును, యజ్ఞవాటిక,

హోమశాల, బృందావనము, సభామండపము, మఠము, రాజభవనము, గోశాల, పుణ్యస్థలము, పుణ్యతీర్థము, పాకశాల, రతిస్థానము, స్నానసంధ్యాద్యనుష్ఠానస్థానము మున్నగు పవిత్రస్థలములలో నడుగుపెట్టుటకు మాకధికారము లేదుగదా! అట్టిచో నేనెట్లు సభాస్థలికి రాగలను? మీరు పోయి నా యీమాటలను మీ ప్రభువున కెఱుగజెప్పుడు' అని వారికి బదులు పలికెను. విస్మితులై వారుపోయి యా మాటలను ప్రభువున కెఱుగజెప్పిరి. తోడనే తన పాదుకలను గొనిరా రాఘవుడు దూతల కాదేశించెను. వెంటనే వారు పాదుకలను దెచ్చిరి. వానిని ధరించి, కేలరత్నదండమును గ్రహించి మెడలో ముద్రికారత్నహారముతో, రెండు మాలలతో, సిరమున నవరత్నఖచితసువర్ణకిరీటముతో, బాహువుల బాహుపురులతో, పాదముల నూపురములతో, కరముల కంకణములతో, కర్ణముల కుండలములతో, గళసీమను బదకములతో, గొలుసులతో, మేన దివ్యవస్త్రములతో విరాజిల్లుచు నంద అను దోడుకొని మెల్లగా రాఘవుడు రాజద్వారము వెలుపల నున్న శునకము చెంగట కరిగెను. రత్నదండమును జంకలో నిరికించికొని వ్యత్యస్తపాదుడై సుంత యేటవాలుగా నిలిచి మందహాస మొనరించి ప్రభువు 'శునకమా! నీ కొదవిన దుఃఖ మేమిటో నాకెఱిగింపుము. నారాజ్యములో నే ప్రాణికి నెట్టి దుఃఖము నొదవరాదు.' అని యా శునకమును బలుకరించెను.

అప్పుడు శునకము గాయపడిన పాదముతో నిలిచి ప్రభువునకు బునఃపునః ప్రణామము లాచరించి యతనితో 'మహాప్రభూ! నాకై మీరు శ్రమము వహించితిరి. దయానిధీ! చిరము వర్ధిల్లుడు. నిరపరాధినగు నన్నొక యతీశ్వరుడు బాతితో గొట్టి నా పాదమును గాయపఱచెను. అందుచే నేను మిమ్ము శరణు బొందితిని' అని నొడివెను. ఆమాట నాలకించి రాఘవుడు వెంటనే దూతలచేత నాయతి

రాజును బిలిపించెను. అత్రముతో నాయతీశ్వరుడు శ్రీరామచంద్రుని సమక్షమునకు వచ్చి నిలిచెను. అతనిని గాంచి రాఘవుడు స్వామీ! మీరీ శునకము నేల గాయపఱచితిరి? అని ప్రశ్నించెను. భిక్షకొఱకు నే నిందందు దిరుగుచుండగా నీ శునకము వచ్చి నా భిక్షాన్నమును స్పృశించినది. ఆకారణమున క్రోధము జనించి నేను దీనిని ఱాతితో గొట్టితిని' అని యాయతీశ్వరుడు బదులు పలికెను. అప్పుడు రాఘవుడు 'యతిరాజా! శునకము జ్ఞానహీనమైన ప్రాణి. భక్ష్యము గానవచ్చినచో దానిని స్పృశింపబూనుట దాని స్వభావము. కావున నిందు దాని దోష మిసుమంతయును లేదు. దానిని ఱాతితో గొట్టి మీరే యపరాధ మొనరించితిరి. కావున నీ విషయమున మీరు దండనార్హులు.' అని పలికెను. పిమ్మట శునకమును గాంచి శునకమా! నీ యెడల నపరాధ మొనరించిన యతిరాజును నీకప్పగించితిని. వానికి నీ యిచ్చవచ్చిన దండనమును నీవే విధింపుము. అని దానితో జెప్పెను. అప్పుడు శునకము 'మహాప్రభూ! ఇతనిని శివాలయమున కధిపతిని గావింపుడు. ఇదియే నేనీ యతీశ్వరునకు విధించు దండనము.' అని నొడివెను. సరియు అట్లే చేసెదనులెమ్మని పలికి శ్రీరామచంద్రుడు పూలమాలలతో, నూతనవస్త్రములతో, జందనాదికముతో నా యతిరాజును బూజించి పల్లకి నెక్కించి మంగళవాద్యములు, నాట్యగానములు నుత్సవములు సెలగుచుండగా నొక శివాలయముకడ కంపించి దాని యాధిపత్యమునందు నియమించెను. అప్పు డజ్ఞానవశమున నా యతిరాజు తనకు దైవ మనుకూలించెనని తలచికొని తృప్తినొందెను.

అనంతరము రఘునందనుడు స్వజనముతోడ మఱల దన సభలో బ్రవేశించెను. అప్పుడా కౌతుకము నవలోకించిన పౌరులందఱును మహాప్రభూ! శునకము సన్యాసికి దండన మనుచు శివాలయాధి

పత్యము నొసగిన దేమి? యని రాఘవుని బ్రశ్నించిరి. మీరు పోయి యా శునకమునే ప్రశ్నింపుడు. అదియే మీ సందేహమును నివృత్తము సేయును అని రాఘవుడు వారికి బదులు పలికెను. అట్లకాక! యని వారు పోయి యా శునకమును బ్రశ్నించిరి. అప్పుడు శునకము వారితో నిట్లు నొడివెను. "అయ్యలారా! కష్టపడి పండించికొన్న పొలములోని ధాన్యమును హరించువారు, శివాలయముపై, మఠముపై, నారామముపై, దానగ్రామముపై నాధిపత్యము వహించువారును, అనాథలైన స్త్రీలయు, బాలురయు విత్తములను హరించువారును, క్రూరముగా మాటలాడువారును, గోవులకై, విప్రులకై శివునకై యొసగిన ధనమును హరించినవారును, అన్యాయము లాచరించువారును, రాజభవనములో బ్రవేశించు యాచకులను నిరోధించువారును, బరుల ద్రవ్యములను హరించువారును, ప్రాయశ్చిత్తాధికారము వహించినవారును, బ్రాహ్మణభోజనద్రవ్యమును, హోమద్రవ్యమును హరించువారును, అన్యాయముగా ననేకవిధములగు ద్రవ్యములను హరించువారును మఱుజన్మమున శునకయోనిని బొందుదురు. నా పలు కిది పరమసత్యము. నేను వెనుకటి జన్మమున మఠాధిపత్యము వహించితిని. ఆకారణముననే నా కిప్పుడీ శునకజన్మము ప్రాప్తించినది. అందుచేతనే నేనా సన్యాసికి దండనముగా శివాలయాధిపత్యము నిప్పించితిని." శునక మాడిన యీమాటల నాలకించి తమకు గలిగిన సందేహము నివృత్తము కాగా వారు లెల్లరును సంతోషముతో దమదమ గృహములకు వెడలిపోయిరి. శునకము గూడ దన స్థానమునకు మఱలిపోయెను. దేహాంతమైన మీదట దన పాపము కారణముగా నా సన్యాసి శునకమై జన్మించెను. తొల్లి తాను జేసికొన్న పాపము నంతను ననుభవించి కడపట దన పాపదేహమును బాసి శునకము ముక్తిని బొందెను. ఆ సన్యాసి యయోధ్యలో మరణింపలేదు. ఏదియో పనికై స్థలాంతరమునకు బోయి

యచ్చట మరణించెను. ఆయోధ్యలో మరణించినవారికి బునర్జన్మము లేదు. సన్యాసి శునకమై పుట్టుట యేమి? శునకము ముక్తి నొందుట యేమి! కర్మముయొక్క గతి యత్యంతగహనమైనది. చిత్రమైనది. సన్యాసియెక్కడ! శునక మెక్కడ! శ్రీరామచంద్రు డొక శునకము నకు సైతము చక్కని న్యాయము జేకూర్చెను.

అనంతర మొకనా డయోధ్యలో నివసించు నొక బ్రాహ్మణుని పంచవర్షప్రాయమువాడగు తనయు డాకస్మికముగా మరణించెను. అప్పుడా బ్రాహ్మణుడు సపత్నీకుడై ప్రాతఃకాలయున నా పిల్లవాని శవమును గొని రాజద్వారముకడ కేగుదెంచి బిగ్గఱగా రోదించెను. పుత్రశోకాతిరేకమున వ్యథితుడై క్రోధము వహించి శ్రీరామచంద్రుని సంబోధిచి "రాజేంద్రా! సీతను గాగిలించికొని యెట్లు నిద్రించుచుంటివి? నీరాజ్యములో నెవని యధర్మము కారణము గానో నాప్రియపుత్రుడు మరణించినాడు. ఆ యధర్మము నీవలననే సంభవ మయ్యెనో యన్యునివలన సంభవమయ్యెనో నాకెఱుగరాదు. భూపాలు డధర్మవర్తను డైనవేళ నతని రాజ్యములోని జను లల్పాయుష్కులుగా మరణింతురని పెద్దలు చెప్పగా వినియుంటిని. కావున నధర్మపరాయణుడవైన నీరాజ్యములో నాబిడ్డ యకాలమరణము నొందినాడు. కావున శీఘ్రముగా నాబిడ్డను బ్రతికింప నుపాయ మాలోచింపుము. అట్లుకానిచో మేమిరువురమును జతిని జేర్చికొని మాబిడ్డతోడ నందు బ్రవేశించెదము. తొల్లి నీజనకునకు శ్రవణకుమారుని మూలమున శాపము ప్రాప్తించినది. నీకుగూడ నట్టి శాప మిప్పుడు ప్రాప్తించును.' అని పల్కుచు బోరున నేడువసాగెను. అప్పుడు విప్రపత్ని కూడ సీతను సంబోధించి యామెతో దల్లీ! మగని గాగిలించికొని యెట్లు నిద్రించితివి? నీవును బిడ్డలను గన్న తల్లివేకదా! నాపుత్రశోకమును నీపుత్రశోకముగా భావించి నీపతి

తోడ గూడి నాబిడ్డను బ్రతికించుట కుపాయ మాలోచింపుము.' అని పలికి బోరున నేడువసాగెను. ఆవిప్రదంపతుల రోదనము నాలకించి పురజను లందఱు నార్తము నొందుచు నాప్రేత మునకు జుట్టును జేరి నిలిచిరి. సీతారాములు గూడ వారి పలుకుల నాలకించి యారాటము జెందుచు వందిమాగధులచే స్తుతిపఠనములను మానిపించి శయన మందిరమునుండి వెలికి వచ్చి పాదచారులై వేగముగా రాజద్వారము కడకు విచ్చేసిరి. వారిని గాంచి విప్రదంపతులు మఱియు మఱియు విలపింపసాగిరి. అప్పుడు శ్రీరామచంద్రుడు గద్గదిక మీఱ వారితో 'మీరిరువురును విలపించుట మాని నామాట నాలింపుడు. ఉపాయ మాలోచించి మీకుమారుని శీఘ్రముగా బ్రతికించెదను. మీబిడ్డను బ్రతికింపలేకపోయినచో నాబిడ్డయగు కుశుని మీ కర్పించివైచెదను. నాపలు కిది సత్యము. నిరీక్షించుచుండుడు" అని పలికి వారి నూఱడించెను. సీతయు విప్రపత్నిని గాంచి "అమ్మా! నీబిడ్డను బ్రతికింప గుశు నర్పింతునని శ్రీరామచంద్రులు శపథమొనరించినారు. వింటివి గదా! నీదుఃఖ ముపశమించుటకు నేనుగూడ నొకమాట జెప్పుచుంటి నాలకింపుము. మే మిరువురమును నీబిడ్డను బ్రతికింపలేకపోయినచో నీదుఃఖము శమించుటకై నేను నాబిడ్డయగు లవుని నీకర్పించి వైచెదను. ఆ కుశలవులను జూచికొని నీవు పుత్రశోకమును మఱవగలవు." అని పలికి యామె నూఱడించెను. అనంతరము రాఘవుడా బ్రాహ్మణునితో 'బ్రాహ్మణోత్తమా! నీభార్యతోడ గూడి నీవిచ్చటనే యుండుము. నేను నీపుత్రుని బ్రతికించెదను. విచారింపకుము" అని పలికెను. పిమ్మట లక్ష్మణునిచే నాబాలకుని శవమును, బురుగులు, దుర్గంధము సంక్రమింపకుండుటకై నూనె తొట్టెలో బెట్టించెను.

అనంతరము స్నానము జేసి ఖిన్నమైన మనస్సుతో నెట్లో నిత్యవిధులను నిర్వర్తించికొని సభాస్థలి కరిగి నిజాసనముపై నాసీను

డయ్యెను. పిమ్మట దమ కులగురువగు వసిష్ఠమహర్షిని గాంచి గురువరేణ్యా! రాజ్యపాలనము ధర్మబద్ధముగా సాగుచుండగా నొక బ్రాహ్మణ బాలకుడు పంచత్వము నొందినాడు. ఈవిషయమున నేదైన యుపాయ మాలోచింపుడు" అని ప్రార్థించెను అంతలో కేల వీణ యను మీటుచు నారదు డచ్చటి కేగుదెంచెను. రాఘవు డాతనికి ప్రత్యుత్థాన మొనరించి గొనివచ్చి యాసన మర్పించెను. పిమ్మట సంఘటిల్లిన సమాచార మంతయు నాతని కెఱిగించి యతని నుపాయ మెఱిగింపగోరెను. అంతట నతడు "శ్రీరామచంద్రా! నీ రాజ్యములో నధర్మాచరణమున కెవ్వడును బూనజాలడు. నామాట విని నీవు స్వయముగా నరిగి భూతలమునం దెల్లయెడల బరికింపుము. సర్వకాలములందును సర్వత్ర సంచరించువాడ నగుటచే నీదురవస్థకు గారణ మేదియో నేనెఱుగుదును. అయినను లోకశిక్షణమునకై నీవే స్వయముగా నరిగి యరయదగు నని చెప్పుచున్నాను. అధర్మపరుడైన జనుని స్వయముగా నీవే పరికించి దండింపుము. అధర్మము నణచివైచినంతనే యీబాలకుడు మరల జీవింపగలడు." అని ప్రత్యుత్తర మిచ్చెను.

అట్లకాక! యని రాఘవుడు వెంటనే సీతను, బురజనులను, సోదరులను, గులగురువగు వసిష్ఠుని, దనయులను, మంత్రులను వెంట నిడికొని పుష్పకవిమానము నధిరోహించెను. ఇంతలో ముందుభాగమున నేమియో కోలాహల మయ్యెను. అదివిని చకితుడై రాఘవుడా దెసకు బరికించెను. శృంగవేరపురమునుండి యేగుదెంచిన యొక శవమును, దానితోడ నరుగుదెంచు నొక బ్రాహ్మణవనితయు, నామెను జుట్టుముట్టిన పురజనసమూహమును నతనికి గానవచ్చెను. పుష్పకముపై నున్న రాఘవుని గాంచి యామె కరములతో హృదయదేశమును బాదుకొనుచు "మహాబాహూ! శ్రీరామచన్ద్రా! నీరాజ్య

లోని నీదోషము కారణముగా నాపతి మరణించినాడు. నాకు వైధవ్యము ప్రాప్తించినది. ఈవిషయము నెఱిగిన నీకు లజ్జ కలుగుటలేదా? నాయీభర్తను బ్రతికింపకుంటివేని నేను నిన్ను శపించెదను.” అని పలికి బిగ్గఱగా రోదింపసాగెను. అప్పుడు రాఘవుడు “అమ్మా! కోపపడకుము. నీభర్తను బ్రతికించెదను. ఈకార్యసాధనమునకే నే నిప్పు డరుగుచున్నాను. నీవు నాయింట సుఖముగా నివసింపుము.” అని యామె నూఱడించెను. పిమ్మట నా శవమును గూడ దొల్లిటివలె నూనెతొట్టిలో బెట్టించి సుమంత్రుని గాంచి యతనితో సుమంత్రా! నేను మఱలి వచ్చునంతవఱకు నేశవమును గూడ నగ్నిలోబడ వేయకుండగా పాడవలయును. దుందుభి ప్రయోగించి యెల్లదిక్కుల యందును నెవరి శవమును గూడ జనులు దగ్ధము సేయరాదని చాటింపుము. అని చెప్పెను. అట్లకాక! యని యతఁడా సమాచారమును దూతలచేత నెల్లదిక్కుల యందును జాటింపజేసెను. అనంతరము రాఘవుడు పుష్పకవిమానముపై గూర్చుండి క్రమముగా బడమటిదిక్కును, నుత్తరదిక్కును, దూర్పుదిక్కును మెల్లగా బరికించుచు దక్షిణదిక్కునకు వెడలెను.

ఇంతలో నయోధ్యానగరములోనికి మఱియు నైదు శవములు కొనిరాబడెను. వానిని గూడ శ్రీరాముని యాజ్ఞానుసారముగా సుమంత్రుడు నూనెతొట్టెలలో బెట్టించెను. అందొక్క శవము మధుపురిలో నివసించు నొక క్షత్రియునిది. రెండవ శవము ప్రయాగలో నివసించు వైశ్యునిది. మూడవ శవము హస్తినాపురములో నివసించు నొక తెలికవానిది. నాల్గవ శవము హరిద్వారమున నివసించు నొక లోహకారుని (కమ్మరి) కొడలిది. ఐదవ శవము ఉజ్జయినీ నగరములో నివసించు నొక చర్మకారుని కొమరితది. నీ యైదుగురును నాయువు పూర్తి కాకుండగనే మరణించిరి. ఈవిధముగా నయోధ్యానగరమున నేడు శవములు కొనిరాబడెను.

దక్షిణదిశ కేగిన శ్రీరామచంద్రుడు దండకారణ్యమును బరిశీలించుచు బరిభ్రమించి క్రమముగా రేవానదీజలములచే వ్యాప్తమై యున్న వింధ్యపర్వతప్రాంతమున కరిగెను. అక్కడ నొక వృక్షమున వ్రేలబడుచు నధోముఖుడై ధూమపానము సేయుచు స్వర్గాపేక్షతో నొక శూద్రుడు తప మొనరించుచు రాఘవునకు గనుపట్టెను. వెంటనే వానిని సంహరింప నెంచి రాఘవు డాతని సమీపించి ఓయిశూద్రుడా! నాపలుకుల నాలకింపుము. బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు నన బడు మూడు వర్ణములవారికి మాత్రమే తపము సేయుట కధికార మున్నది. తదితరులకా యధికారము లేదు. ఎల్లవేళల నత్యంత భక్తితో బ్రాహ్మణులను సేవించుటయే శూద్రధర్మము. నీవు పాపాత్ముడవై శూద్రుడవై యుండియు బ్రాహ్మణధర్మము నవలంబించితివి. ఇప్పుడు నిన్ను సంహరించి నీమూలమున మరణించిన వారి నందఱను జీవింపజేసెదను. నీ తపమునకు మెచ్చితిని. నీ కేమి వరము కావలెనో కోరుకొనుము.'' అని పలికెను. ఆ పలుకుల నాల నాలకించి యధోముఖుడై యున్న యా శూద్రు డడలుచు శ్రీరామ చంద్రునకు మఱియు మఱియు నమస్కారములు చేసి యతనితో శ్రీరామచంద్రా! నాయెడల బ్రసన్నుడవైనచో శూద్రుల కుత్తమ గతి గలుగు వరమును నాకు బ్రసాదింపుము. తన్మూలమున నాకును గీర్తి ప్రాప్తించును.'' అని పలికెను. అప్పుడు రాఘవుడు సంతసించి ఓయీ! నా రామనామమును మీశూద్రు లిది మొదలు జపించికొన నచ్చును. సర్వకాలములందును గీర్తింపనచ్చును. చింతనము సేయ వచ్చును. అట్లుచేసిన శూద్రుల కుత్తమగతి కలుగగలదు. ఈవరమును నీ కొసగితిని. నీ వొనర్చిన యీయుపకారము కారణముగా శూద్రు లలో నీకీర్తి విస్తరిల్లగలదు. అనగా విని యా శూద్రుడు మఱల నిట్లు పలికెను. "శ్రీరామచంద్రా! కలికాలమున శూద్రులు మంద బుద్ధులై యుందురు. కృషికర్మాదికము కారణముగా నస్థిరచిత్తులై

యుందురు. అట్టియెడ వారి బుద్ధి జపాదుల యందెట్లు ప్రవర్తిల్లును? కావున నాకిప్పు డందుల కనురూపమైన వరము ను బ్రసాదింపుడు." అతని యీమాటల నాలకించి శ్రీరామచంద్రు డతనితో "నోయీ! పరులకు వందనము సేయువేళ రామరామ యని యుచ్చరించినచో శూద్రుల కుత్తమగతి గలుగగలదు. నీయీ యుపకారమును గూడ వారు నిత్యము స్మరింతురు. నీవిప్పుడు నాచే సంహరింపబడి వైకుంఠ మును జేరగలవు." అని వచియించెను. అప్పుడా శూద్రుడు మఱల "నో మహాప్రభూ! సీతాలక్ష్మణసమేతులై మీరీపర్వతముపై నెల కొని యుండగోరుదును. ఇచ్చట దొలుత నన్ను దర్శించిన మీదట మిమ్ము దర్శించిన వారికి మోక్షము ననుగ్రహింప గోరు దును. అజ్ఞానవశమున దొలుత నన్ను దర్శింపక మిమ్ము దర్శించిన వారిని గూడ నుద్ధరింప గోరుదును." అని రాఘవుని బ్రార్థించెను. తథాస్తు! అని శ్రీరామచంద్రు డందులకు సమ్మతించెను. అతని కచంచలమైన భక్తిభావమును బ్రసాదించి సంతుష్టుని గావించి వెంటనే యతనిని సంహరించెను. తోడనే యయోధ్యలో జేరిన శవము తేకును సజీవము లయ్యెను. విష్ణుదాసా! నాడు మొదలు శూద్రులు పరులకు వందనము సేయువేళ రామరామ యనుచుందురు. ఇట్లా శూద్రుని సంహరించి శ్రీరామచంద్రుడు సానందముగా సీత కనేక కౌతుకములను జూపుచు నిజనగరమునకు మఱలిపోయెను.

ఇంతలో' మార్గమధ్యమున నొక గృధ్రము నొక గ్రుడ్లగూబయు దమలో దాము వాదించికొనుచు శ్రీరామచంద్రుని సన్నిధి కేగుదెం చినవి. మీరెందుకు వాదించికొనుచున్నారు? నాకడ కేల వచ్చితిరి? అని రాఘవుడు వానిని బ్రశ్నించెను. అప్పుడు గ్రుడ్లగూబ మహా ప్రభూ! నేను దొల్లి యీవనములోని కొండపై గృహము నిర్మించి కొంటిని. అందు గొంతకాల ముండి యెటకో బోయితిని. ఇప్పుడందీ

గృధ్రము నివసించుచున్నది. నాగృహమును నా కిమ్మన్న నిచ్చుట లేదు' అని ప్రత్యుత్తర మిచ్చెను. అప్పుడు రాఘవుడు గృధ్రమును గాంచి గృధ్రమా ! దాని గృహమును దానికెందుల కొసగకుంటివి ; అని ప్రశ్నించెను. తోడనే గృధ్రము నిట్టూర్పులు పుచ్చుచు మహా ప్రభూ ! పూర్వమా వనములో నాకొండపై నాగృహమును నేనే నిర్మించితిని. కాలక్రమమున నేను దానివి బరిత్యజించితిని. అందీ గ్రుడ్లగూబ కొన్ని దినములుండి వెడలిపోయినది. ఇప్పుడు మఱల నేనందు నివసించుచున్నాను. తన గృహముగా భావించికొని యిది వ్యర్థముగా జగడ మాడుచున్నది. రాజేంద్రా ! నా కన్యాయము సేయవలదు. మీ వంశములో శాపాత్ము లెన్నడును జన్మింపలేదు.' అని బదులు పలికెను. మీరు గృహమును నిర్మించినవేళ జూచిన వారెవరైన నున్నారా ? అని రాఘవుడు మఱల వానిని బ్రశ్నించెను. ఎవ్వరును లేరని యవి బదులు పలికినవి. అప్పుడు రఘునందనుడు పుష్పకమునందున్న తన వారలను గాంచి యిప్పుడిది యొక విషమ సమస్య సంప్రాప్తమైనది. ఇందు న్యాయమెట్లు సేయవలయును ? గృహము నెవరి కీయవలయును ? అని పలికెను. ఆ పలుకు నాలకించి వారందఱును విస్మయమును బొందిరి. అప్పుడు రాఘవుడు మఱల గ్రుడ్లగూబను గాంచి నీవా గృహము నెప్పుడు నిర్మించితివని ప్రశ్నించెను. ఈ భూమి పుట్టినప్పుడు నిర్మించితి నని యది ప్రత్యుత్తర మిచ్చెను. అప్పుడు రాఘవుడు గృధ్రమువంకకు జూచెను. ఈ భూమి మహాజలరాశిలో మునిగియున్నవేళ బూర్వము చూతవృక్షముపై గృహమును నిర్మించితి నని యది బదులు పలికెను. అప్పుడు రాఘవుడిట్లు పలికెను. ఏమేమి ? మహాజలరాశిలో నాధారరహితముగా గొండ యెట్లు నిలిచినది ? ఆజలరాశిలో నక్షయవటమున్నది. కాని చూతవృక్ష మెటనుండి వచ్చినది ? కావున నో గృధ్రమా ! నీవు వ్యర్థముగా నీ గ్రుడ్లగూబతో జగడమాడుచుంటి వనుట నిక్కువము.

నీవు దుష్టపక్షివి. ఇట్లు పలికి శ్రీరామచంద్రుడా పక్షిని దూతలచేత త్రిశూలాగ్రమున బొడిపించి తన పరమపదమునకు బంపివైచెను. దేహావసానసమయమున శ్రీరామచంద్రుని దర్శనభాగ్యము గలుగుట చేతను, నతని యెదుట మరణించుటచేతను నా గృధ్రము మిక్కిలి ధన్యమైనదని యెఱుగదగును. రాఘవుడా గృహమును గ్రుడ్లగూబ కొసగి నాట్యగానములతో, మంగళవాద్యములతో దన నగరమున బ్రవేశించెను. తోడనే సజీవులైనవా రేడుగురును సాదరముగా శ్రీరామచంద్రుని దర్శింప నేగుదెంచిరి. వారిని గాంచి సీతాసమేతు డగు శ్రీరామచంద్రుడు పరమానందము నొందెను. వా రతనిని వివిధముల గొనియాడిరి. పిమ్మట వారి నందఱను దగిన విధముగా గారవించి రాఘవుడు వారివారి నెలవుల కంపివైచెను. అప్పు డయోధ్యలో మహోత్సవము సేయబడెను. ఈ విధముగా రాఘవు డనేక చరిత్రముల నాచరించెను.

— దశమ సర్గము సమాప్తము —

— ००० —

## ఏకాదశసర్గము

### శ్రీరామచంద్రుడు నలుగురు విప్రకన్యలకు వరము లొసగుట

రామదాసుడు విష్ణుదాసున కిట్లు వివరించును.

ఒకనాడు శ్రీరామచంద్రుడు సీతను, సోదరులను, సైన్యములను, నేనుగులను, గుఱ్ఱములను బదాతులను వెంట నిడికొని వేటాడుట యందలి కుతూహలముచే బ్రేరితుడై వనములను బరికింప నరిగెను. ఆ సమయమున నతడు పాదముల బాదరక్షలతో, సిరమున నీలివర్ణము గల తలపాగతో, నాకుపచ్చని వస్త్రములతో, నీలివర్ణముగల వ్రేలి కవచములతో, గరముల శరచాపములతో, ఖడ్గమును, డాలును,

గవచమును ధరించి యశ్వారూఢుడై మహారాజులతోడను, గాలి బంటులతోడను, గూడి ఘోరారణ్యమున బ్రవేశించెను. జాలరంధ్రములనుండి సీత యతని మాటిమాటి కవలోకించుచుండెను. రాఘవుడు సోదరులతోడను, దనయులతోడను, మహారాజుల తోడను గూడి సానందముగా బొదలలో మృగముల నన్వేషించుచు క్రీడించెను. అదిగో మృగము పరుగిడుచున్నది. కొట్టుడు కొట్టుడు! అని యరచుచు స్వయముగా దనసేవకుల నడుమకు దుమికి దానిని సంహరించుచుండెను. సింహబలుడగు నతడు వనములో మృగముల నన్వేషించుచు నొకప్పుడు డీపంకకు నొకప్పుడు డాపంకకు బరుగులిడుచు వనసౌందర్యమును బరికించుచుండెను.

రాఘవుని, నతని పరివారమును గాంచి నెమళ్ళు లడలి వృక్షశాఖలమీద కెగసిపోవుచుండెను. లేళ్లు బెదరి పరుగు లిడుచుండెను. పులులు ధావించుచుండెను. ఒకచో నక్కలు యూళబెట్టుచుండెను. ఒకచోట గీచుటా లరచుచుండెను. ఒకచో ఖడ్గమృగములు, నొకచో నేనుగులు దిరుగాడుచుండెను. ఒకచో వనభూమి పులిగోళ్ళచే జీల్చబడిన మృగముల నెత్తుటిచే నెఱ్ఱబడియుండెను. బలిసిన స్తనభారము గలిగి తినగలిగి తెగబలిసిన మహిషీ (గేదె, రాణి) గణముతో నిండియుండి యొకచో వనభూమి యంతఃపురప్రదేశమును దలపించుచుండెను. ఒకచో వృక్షచ్ఛాయలు చిక్కనై యుండెను. వన్యపుష్పముల పరిమళము లెల్లయెడల నలముచుండెను. ఒకచో లతాగృహముల ద్వారములు భూమండలపు దోరణములవలె భాసిల్లుచుండెను. ఒకచో జెట్ల తొఱ్ఱలలో గూర్చుండి చిలుకలు గిలకిలారావములు సేయుచుండెను. ఒక్కొక్కచో వనభూమి సింహము నడుగుజాడలతో జెలువారుచుండెను. ఒకచో సగ మెడలిన కుబుసములతోడి మహాసర్పములకు నెలవులైన కలుగులు గానవచ్చుచుండెను. ఒకచో దెఱచిన నోళ్ళుగల యజగరములు, నొకచో గుబుసము విడిచిన

త్రాచుపాములు గోచరించుచుండెను. ఒకచో దావాగ్నిజ్వాలలు చెట్లకొమ్మల కెగఁబ్రాకుచుండెను. దగ్ధము లగుచున్న పొదలలోనుండి తోడేళ్ళు, బులులు వెలి కుఱుకుచుండెను. రాఘవుని సేవకు లొకచో గుక్కల దండును శశకములమీదకు విడచుచుండిరి. వారు సీటిగుంటల చెంత గొంతతడవు సేదదీర్చికొని ముందునకు సాగుచుండిరి.

అనంతరము మధ్యాహ్న సమయమున శ్రీరామచంద్రు డొక సరస్తీరమున సీతకు, సైన్యమునకు నివాసము గల్పించెను. తాను స్వయముగా వేటకాండ్ర బృందముతోఁగూడి సానందముగా మృగ ములను వేటాడుచు గ్రీడించెను. మృగముల వెనుక బరువులు వెట్టుచు బాణములతో వానిని సంహరింపదొడఁగెను. ఈవిధముగా వ్యాఘ్రాది జంతుసంతానమును వేటాడుచుండగా వారి కోలాహలముచే బెదరి వాడియైన కోరలతో మిక్కిలి భయము గొలువుచు నతివేగమున నొక సింహము వనాంతరమునుండి వెలికివచ్చెను. అది యతివేగమున బరుగిడుచుండుటచే నొకప్పు డాకసమున కెగయుచు, నొకప్పుడు పుడమిని దాకుచు తన వెనుక బరుగులు వెట్టు ధనుర్ధారుల బాణము లకు గుఱియగుటలేదు. ఒకచో గంటికి గానవచ్చుచున్నది. ఒకచో గానరాక యదృశ్యమగుచున్నది. దాని ననుసరించి శ్రీరామచంద్రుడు మెలికలు తిరిగి పాఱు కొండవాగు గలిగి, యడుగిడుటకు శక్యము గాకుండ ముండ్లపొదలు మెండుగా గలిగి, తోడేళ్ళు, పులులు మున్నగు క్రూరమృగములచే వ్యాప్తమై, దుర్గమములైన కొండలతో నిండి మిక్కిలి భయంకరముగా దోచు విషమారణ్యమధ్యమున బ్రవే శించెను. దాని వెనుక నత డశ్వారూఢుడై యొంటరిగా నొక ప్రదేశ మునుండి మఱియొక నిర్జనప్రదేశమునకు సాగిపోవుచు గ్రమముగా నాసింగము ననుసరించి యొక కొండగుహలో జొరబడెను. వేటకాండ్రు, లక్ష్మణాదిసోదరులును శ్రీరామచంద్రుని గానక వనములో నింపంచు బరిభ్రమింపనొడగిరి.

అట్లుగుహలో జొరబడిన రాఘవు డొక వాడి యలుగున నా సింహము నవసపై గూలనేసెను. తోడనే యా సింగ మొక దివ్య రూపధారి యగు పురుషుడుగా మాఱి రాఘవునితో నిట్లు పలికెను. 'శ్రీరామచంద్రా! నేనొక విద్యాధరుడను. పూర్వము నేనొక పతి వ్రతామతల్లి యగు మునిపత్నిని బలాత్కారించి కూడితిని. అప్పుడామె క్రోధమున గనలుచు "నోయీ! నీవు నన్ను సింహమువలె బలిమి కొలది నిగ్రహించితివి. కావున సింగమ వయ్యెదవుగాక!" యని నన్ను శపించినది. నే నప్పుడామెను మఱియు మఱియు వేడికొనగా నామె చిరకాలము గడచిన మీదట శ్రీరామచంద్రుని శరాఘాతమున శాప విముక్తిని గందువని చెప్పినది. ఆకారణమున నిప్పుడు నీ శరాఘాత మున శాపవిముక్తుడ నయితిని." ఇట్లు పలికి యావిద్యాధరుడు సానం దముగా స్వర్గమునకు వెడలిపోయెను.

అనంతరము శ్రీరామచంద్రు డశ్వారూఢుడై గుహలో క్షణ కాలము నిలిచెను. అప్పు డతనికా గుహాద్వారమున నొక యోజనము నిడివిగల పెనుశిల యొకటి కానవచ్చెను. దానిని గాంచి విస్మితుడై యతడు ధనుష్కోటితో నాశిలను దూరముగా విసరివైచెను. అప్పుడు గుహలో బ్రవేశించి కొంత దూరము ముందునకు బోవగా నతనికి వెలుతురు గోచరించెను. అచ్చటకు బోయి చూడగా నతనికి నలు గురు స్త్రీ లెడమెడముగా గూర్చుండి తపస్సు జేసికొనుచు గాన వచ్చిరి. తపముచే క్షీణించి వారి దేహము లస్థిచర్మావశిష్టములుగా నుండెను. శ్వాసప్రసారమును బట్టి వారు జీవించి యున్నారని రాఘవుడు తెలిసికొనెను. అతడు నాలుగు మూర్తులై నలుగురి యెదుటను నిలిచి వేఱువేఱుగా "ఓ తారత్నమా! నీతపమునకు మెచ్చితిని. నీకేమి వరము గావలెనో కోరుకొనుము" అని వారిని బలుకరించెను. వారి శరీరములు శ్రీరామచంద్రుని సంస్పర్శమున రక్తమాంసధాతు పరి

పూరితములై యథారూపము నొందినవి. వారు తమ శరీరములను జూచికొని చకితలై కన్నులతో దమయెదుట నిలిచిన నలుగురు రాములను గాంచిరి. ఆనలుగురు రాములును గోటి సూర్యప్రభాభాసమానులై, శరచాపఖడ్గధారులై, యశ్వారూఢులై యేకరూపము గలవారై శోభిల్లుచుండిరి. సమానరూపములు గల యీ నాలుగు మూర్తులను గాంచి విస్మయము నొందుచు 'నశ్వారూఢులైన మీరు నలుగురు నెవరు? ఇచ్చట కేల వచ్చితిరి? మీరు దేవతలా? దానవులా? ఎక్కడ కేగుచుంటిరి? మమ్ముల నెందులకు బలుకరించిరి? మా కృశించిన శరీరములు మనోహరశరీరము లెట్లయినవి? మహారాక్షసుడగు నాదుందుభి సజీవుడై యుండెనా? లేక మరణించెనా? సవిస్తరముగా మీయుదంతము నెఱిగింపుడు" అని యీ నాలుగు మూర్తులను వేఱు వేఱుగా బ్రశ్నించిరి.

అప్పుడు శ్రీరామచంద్రుడు వారితో నిట్లు పలికెను. వనితారత్నములారా! మీరు చూచుచున్న నాలుగు మూర్తులచేతను నే నొక్కడను. నేను రాముడను. సప్తద్వీపాధిపతిని. సూర్యవంశమునందుదయించినవాడను. వేట నిమిత్తముగా వనమున కేగుదెంచిన వాడను. వనములో సింహమును సంహరించితిని. ధనుష్కోటితో గుహాద్వారమును మూసియున్న పెనుశిలను దొలగించి మీచెంత కేగుదెంచితిని. నాహస్తసంస్పర్శమున మీ శరీరములు యథారూపము నొందినవి. దుందుభి వాలిచే నిహతు డయ్యెను. ఆ వాలిని నేను సంహరించితిని. మీకు వరముల నొసగుటకై మిమ్ము బలుకరించితిని. నాకింక ముందునకు బోవలసిన పనిలేదు. ఇటనుండి యిటులె నా నగరమునకు వెడలిపోవుదును. మీప్రశ్నల కన్నిటికి బ్రత్యుత్తరము లిచ్చితిని. మీ రెవరు? దుందుభిని గూర్చి యేల ప్రశ్నించితిరి? విశదముగా మీయుదంతమును నా కెఱిగింపుడు. మీ రేమి కోరుచుంటిరో నాకు దెలియజెప్పుడు.'

శ్రీరామచంద్రుడు జాడిన యీ మాటల నాలకించి దుందుభి నిహతుడైనందులకును, గుహాద్వారమునందలి శిల తొలగింపబడినందులకును వారు పరమానందము నొందిరి. అప్పుడు వారు మనములలో నుప్పొంగుచు శ్రీరామచంద్రునితో నిట్లు పలికిరి. "మేము నలుగురము బ్రాహ్మణకన్యలము. పూర్వము దుందుభి మహారాజులయు, వైశ్యులయు గన్యలను బదునాలువేలమందిని బలిమిగొలది హరించికొనివచ్చెను. ఒక్క దినమున లక్షమంది స్త్రీలను బెండ్లియాడ సంకల్పించికొని యతను స్త్రీలను హరింప మొదలిడెను. తాను హరించిన స్త్రీలను గొని తెచ్చి యీ గుహాలోపల బంధించి గుహద్వారమును బెనుశిలతో మూసివైచి యతడింకను స్త్రీలను హరించి తెచ్చుటకై వెడలెను. అతడు వెడలి చిరకాలమైనది. నాటినుండియు మే మిచ్చటనే యుండిపోయితిమి. ఇటనుండి యింకను ముందునకు బోయినచో నా వైశ్యకన్యలు, రాజకన్యలు వాయుభక్షణము, బర్ణభక్షణము సేయుచు శ్రీమహావిష్ణువును ధ్యానించుచు గానవత్తురు."

వారి పలుకుల నాలకించి శ్రీరామచంద్రుడు మీరు ధ్యానించు శ్రీమహావిష్ణువును నేనే. మీరు సంశయింప బనిలేదని వారి కెఱుగజెప్పెను. వారప్పుడు నీవాడిన మాట నిక్కవమైనచో మాకు నీ విష్ణురూపమును జూపుమని కోరిరి. తోడనే శ్రీరామచంద్రుడు తన నాలుగు మూర్తుల నుపసంహరించి శ్రీమహావిష్ణురూపమున వారికి దర్శన మొసగెను. ఇప్పుడు మీసందేహము దీరెనా? యని వారిని బ్రశ్నించెను. నీదర్శనమున మా భవక్లేశము లన్నియు దీరినవి. మాకు గలిగిన సందేహ మజ్ఞానజనితమైనది. అని వారు పలికిరి. అప్పుడతడు క్షణములో విష్ణురూపము నుపసంహరించి శ్రీరామచంద్రమూర్తిగా వారి నడుమ నిలిచెను. వారి నిచ్చవచ్చిన వరము గోరుకొమ్మనెను. అప్పుడు వారు కామబాణప్రపీడితలై యానందపూర్వక

ముగా 'శ్రీరామచంద్రా! గాంధర్వవిధిచేత మమ్ము బెండ్లియాడి మాకు భర్తవు గమ్ము! చిరకాల మిచ్చట మాతోఁ గూడి క్రీడింపుము. అనంతరము మమ్ములను నీ నగరమునకు గొనిపొమ్ము! అన్యథా భావింపవలదు. ఇది మాకోరిక' యని పలికిరి. వారి పలుకుల నాలకించి రాఘవుఁడు వనితలారా! నా కేకపత్నీవ్రత మున్నది నాపలుకు కసత్యము గాదు." అని వారికి బ్రత్యుత్తరమిచ్చెను. ఆపలుకు విని వారు పుడమిపై బడిపోయిరి. అప్పుడు రఘునందనుడు వారి నూఱడించుచు "వనితలారా! నామాట వినుడు. ద్వాపరయుగమునందు నేను శ్రీకృష్ణ రూపమును దాల్చెదను. అప్పుడు మీరు నాతోడి క్రీడాసౌఖ్యమును బడయగలరు. ఆనాడు మీరు మిత్రవింద, నాగ్నజితి, భద్ర, లక్ష్మణ యను పేర్లతో వ్యవహరింపబడుదురు. ఆనాడు నాతోడ మీకు వివాహమంగళములు గూడ సంపన్నము లగును. ఆనాడు మీరు నాతోడఁగూడి సమస్తభోగముల ననుభవింవగలరు." అని పలికెను. ఆపలుకులు విని వారు కొంత తృప్తిని బొందిరి. శ్రీరామచంద్రుని దమతోడ ముందునకకు రమ్మని ప్రార్థించిరి. అట్లే యత డశ్వారూఢుడై వారి ననుగమించెను. ఒక యోజనము దూర మరిగిన మీఁదట గండకీనదీతీరమున వృక్షసమూహము నీడలో నిమీలితములైన నేత్రములతో, తపముచే గృశించిన శరీరములతో, దగ్ధయౌవనలైన పదునాఱువేలమంది కన్యలు నతనికి గానవచ్చిరి.

— ఏకాదశసర్గము సమాప్తము —

—) $0_0 0$ (—

# ద్వాదశసర్గము

## శ్రీరామచంద్రుడు పదునాఱువేలమంది స్త్రీలకును, గాళింది మున్నగువారికి నలుగురకును వరముల లొసగుట

శ్రీరామదాసుడు విష్ణుదాసున కిట్లు వివరించును.

అప్పుడు శ్రీరామచంద్రుడు వారినందఱను దన కరముతో స్పృశించి పరిపూర్ణ యౌవనసౌందర్యసంపదతో మనోహరాకారలై భాసిల్లునట్లు చేసెను. పూర్వమందువలె విషయము లన్నియు వారికి విశదముగా నెఱుగజెప్పి వారి నిచ్చవచ్చిన వరములను గోరుకొండ నెను. వారును దుందుభి సహాతుడైన వార్త నాలించి పరమానందము నొందిరి. శ్రీరామచంద్రుడు వారికి బదునాఱువేల విష్ణుస్వరూపములను దాల్చి దర్శన మొసగెను. ఆరూపముల నవలోకించి వారతడు సాక్షాత్తు పరాత్పరుడగు శ్రీమహావిష్ణువని తెలిసికొని "స్వామీ! నీవు మాకు బతివి గావలయును. ఇదిమేము గోరు వరము" అని పలికిరి. ఆమాట నాలకించి రాఘవుడు తానేకపత్నీవ్రతధారి నని వారితో జెప్పెను. అప్పుడు వారు తమలో దాము స్వామిని నేను వరించితిని, నీవును వరించితివి, ఆమెయు వరించినది, ఈమెయు వరించినది అనుచు గూడత బలికికొనజొచ్చిరి. వారివైఖరి నవలోకించి రాఘవుడు తనలో నిట్లు చింతించెను. ఏమి? వీరు నేనేకపత్నీవ్రతధారి నని యెఱిగియుండియు నిట్లు మాటలాడుచున్న వారేల? వీరందఱునుగూడి నన్ను బలాత్కార ముగా బొందుటకు మంత్రణము సేయుచున్న వారు.

బ్రహ్మ, రుద్రుడు, నింద్రుడు మున్నగు సురలును, సిద్ధులైన ప్రాచీనమహర్షులును, యోగబలము విశేషముగా గలవారు సైతము స్త్రీలచే నవలీలగా విమోహితులైరన్న నంతకన్న నాశ్చర్య మేముం డును? కాంతల కనుబొమవిండ్లనుండి వినిర్గతములైన చూపులనెడు

తూపులచే మన్మథునిచే గొట్టబడి యెవని మనమనెడు మృగము వత నము నందలేదు? ఎంతవఱకు బురుషుడు వనితోత్సములచేతను, మద్యములచేతను మదించి మాయలో బడకుండునో యంతవఱకే యతని మనోనిగ్రహము నిలుచును. అంతవఱకే యతని కులమునకు బరిగణన ముండును. అంతవఱకే తపఃప్రాగల్భ్యము నిలుచును. అంతవఱకే నియమవ్రతాదులు సాగును. స్త్రీలు తమ మనోహర చరితములచేత ననురక్తుడైన పురుషుని మోహమదగ్రస్తుని గావింప వచ్చును. కాని వీరు ధర్మరక్షణతత్పరుడనైన నన్నే విధముగా మోహింపజేయగలరు? మాంసము, రక్తము, మలమూత్రములు మున్నగు నపవిత్రపదార్థములతో నిండి గుణరహితమైన స్త్రీశరీరము నందు గాముకులు రామణీయకమును గల్పించికొని విమూఢమాన సులై రమింపనారంభింతురు. బుద్ధిమంతులు స్త్రీసాన్నిధ్య మత్యంత భయంకరమైనదని చెప్పుదురు. కావున నీవనితలు నన్ను సమీపించి నంతనే నే నదృశ్యుడ నయ్యెదను గాక! అట్లు చేసినప్పుడే నానిర్మల వ్రతము నిలువగలుగును. అట్లు గాకున్నను నేకపత్నీవ్రతము నవలం బించిన నన్ను వీరేమి సేయగలరు? అయినను వీరేమి చేయుదురో చూచెదగాక!"

ఇట్లు చింతించి శ్రీరామచంద్రు డచ్చట మౌనభావము వహించి నిలిచి యుండెను. ఇంతలో నాయింతు లందఱును రాఘవు నితో స్వామీ! నిశ్చయముగా మేమెల్లరమును నిన్ను వరించిన వారము. ఇంక నిందు మఱియొక విధముగా నాలోచింప బనిలేదు. మహారాజవైన నీ కేకపత్నీవ్రత మేమిటికి! ఒకవేళ నట్టివ్రతమున్నను నది యీనాటికి బరిపూర్ణమై, పరిపక్వదశ నంది ఫలము నొసగు చున్నది." అని పలికి సత్వరముగా నాతని సమీపించి సవ్యాపసవ్య బాహువులతో భుజపాశములను గల్పించిరి. అప్పుడు వారిని గాంచి

రఘునందనుడు కాంతలారా! మీరాడిన మాట పదిలమైన మాట. అనుకూలమైనమాట. ప్రియమైనమాట. అయినను వ్రతధారి నగు నాకా మాట యోగ్యమైనది కాదు. కావున మీరు ఖేదము నొందక మఱలిపొండు! అని పలికెను. ఈపలుకుల నాలకించి వారు మఱల గోకిల కంఠములతో నిట్లు పలికిరి. "స్వామీ! ధర్మమువలన నర్థము, నర్థమువలన గామము, గామమువలన ధర్మఫలము నుదయించునని శాస్త్రములు చెప్పుచున్నట్లుగా బండితులు నొడువుచుందురు. ఆ కామమే యిప్పుడు మీవ్రతప్రాబల్యము గారణముగా మీముందునకు వచ్చినది. కావున మీరు మాతోడగూడి యీస్వర్గభూమిపై వివిధ ములగు సుఖభోగముల దేలియాడదగును." వారి యీమాటల నాలకించి శ్రీరామచంద్రుడు చిఱునవ్వు నవ్వుచు వారితో వనిత లారా! మీరు కోరినచో మీకు వరములను మాత్ర మొసగెదను. నేనిక మఱియొక మాట వినదలప నని వారికి బదులు పలికెను. అప్పుడు వారు మఱల శ్రీరామచంద్రునితో నిట్లు పలికిరి.

'దివ్యౌషధము, బ్రహ్మజ్ఞానము, రసాయనము, సిద్ధి, నిధి, యుత్తమకళ, యుత్తమస్త్రీ, మంత్రము, నన్నము, జలము నను నివి ధర్మానుసారముగా బుద్ధిమంతున కుపేక్షణీయములు గావు. ఒక కార్యము దైవికముగా సిద్ధించినపుడు దానిని నీతిమంతు లుపేక్షింపరు. ఉపేక్షించినచో మఱల నది ఫలప్రదము గాదు. సాంద్రమైన యను రాగము గలిగి, యుత్తమ వంశమున బుట్టువు గలిగి, స్నేహార్ద్రము లైన చిత్తములు గలిగి, మధురములైన వచనములు గలిగి, చక్కని రూపము గలిగి, చిక్కని యౌవనము గలిగి, స్వయముగా వలచి వచ్చిన కన్యకలను ధన్యాత్ములగు పురుషులు మాత్రమే పడయగలుగు దురు. ఇతరులు పడయజాలరు. మహాసౌందర్యరాశులమైన మే మెక్కడ? నీ యేకపత్నీవ్రత మెక్కడ? కావున నిప్పుడు నీవు మమ్ము

లను నిరాకరింపదగదు. గాంధర్వవివాహమున మమ్ము స్వీకరింపుము. కాకున్న మాజీవితములు నిలువవు.

వా రాడిన యీ మాటల నాలకించి రాఘవుడు మఱల వారితో 'నో కాంతారత్నములారా! ధర్మమర్మవివేకము గల బుద్ధిమంతులు ధర్మము నెట్లు త్యజింపగలరు? ధర్మము, నర్థము, కామము, మోక్షము ననునవి చతుర్విధపురుషార్థములు. వీనిని శాస్త్రోక్తమైన పద్ధతిలో ధర్మపూర్వకముగా సేవించిననా డివి ఫలవంతములగును. కాకున్న నిష్ఫలము లగును. కావున నీజన్మమునందు నే నవలంబించిన యేక పత్నీవ్రతమును విడువజాలను! అని పలికెను. అతని యీ పలుకుల నాలకించి వారందఱును గొందఱతని పాదములను గొందఱు భుజము లను బట్టుకొనిరి. తాను వారిచే నీవిధముగా బరివేష్టింపబడుటను గాంచి రాఘవుడు క్షణములో వారి నడుమనుండి యదృశ్యు డయ్యెను. తానంతర్ధానము జెందగా వా రేమి సేయుదురో కనుగొందమని తలచి గుప్తరూపుడై కనుగొనసాగెను. రాఘవుని గానక యాస్త్రీలం దఱును విస్మయము నొందిరి. భయము నొంది యాడులేళ్ళవలె గాతర త్వము నొందిరి. సంభ్రాంతములైన నయనముల నుండి దైన్యమును వెలి బెట్టదొడగిరి. వారి హృదయములం దాక్షణముననే దుర్భరమైన విరహాగ్ని జనించెను. వారి పరితాపమును గాంచి యావనము గూడ గరుణార్ద్రమైనట్లు గానవచ్చెను.

అప్పుడు వా రిట్లు పలికిరి. "స్వామీ! నీ యీ యింద్రజాల మును మానుము. మాయ నుపహరింపుము, సత్వరముగా మాకు దర్శన మొసగుము. మా బ్రదుకు లిప్పుడు తొలి కబళమునందే యీగపడిన ట్లయినవి. అక్కటా! ఎంత కష్టము ప్రాప్తించినది! హా! విధాతా! నీ విట్టి యేర్పాటు నెందులకు జేసితివి? స్వామీ! మాకు దెలిసినది. మాకు మహాపరితాపమును గలిగించుటకే దర్శన

మొసగితివి. నీహృదయము నిర్దయమైనదా? లేక నీవు మమ్ములను బరీక్షించుచుంటివా? నీవు క్రూరుడవా? మా మనములను హరించితివి. నీకు మాయందు నమ్మకము లేదా? మాయం దనురాగము లేదా? మాయావిశారదుడ వగుటచే మమ్ముల నేడిపించుట కిట్లు సేయుచుంటివా? నీకు ఒకరి చిత్తమున బ్రవేశించుటకు సంబంధించిన విజ్ఞానలాఘవ మేదైన నున్నదా? ఏయపరాధము నెఱుగని మాయందు నీకు గోపము జనించినదా? పరుల విరహదుఃఖమును నీవెఱుగవా? నీదర్శనము లభింపనిచో నిశ్చయముగా మా ప్రాణములు నిలువవు. నీ వెచ్చటికి బోయితివో మమ్ములను గూడ నచ్చటికే గొనిపొమ్ము. మాకు దర్శనము నిమ్ము. మాయందు గరుణ జూపుము. సజ్జను లెన్నడును బరుల దుఃఖమును జూచి యూరకుండరు.

ఈవిధముగా విలపించుచు నా స్త్రీ లందఱును గొంతతడవు శ్రీరామచంద్రుని దర్శనమునకై ప్రతీక్షించి యతనిని గానక వనములో నిందందు బరిభ్రమించిరి. మా పతి యగు రాముడు మీకు గానవచ్చెనా! యని వృక్షములను వనచరములను బ్రశ్నింప దొడగిరి. ఓపిప్పలవృక్షమా? నీవు వృక్షముల కధిపతివి. మేము నిన్ను శరణు జొచ్చినవారము. మా రాముడు నీకు గానవచ్చినచో మా కెఱుగ జెప్పుము. ఓతులసీవృక్షమా! మానాథు డగు రాముడు నీకు గానవచ్చెనా? ఓ వానరమా! మా రాముని నీవు గంటివా? మధురధ్వనులను వెలిబెట్టు నో కోయిలా! జానకీకాంతుని నీవు జూచితివా? ఓ కదంబవృక్షమా! దీనజనబాంధవుడు, రమానాథుడు నగు సీతాపతి నీకు గోచరించెనా? ఓమదగజేంద్రమా? పురుషులలో గుంజరమును బోలువాడును, సప్తద్వీపాధిపతియు, శ్రీమంతుడు నగు శ్రీరామచంద్రుని నీ వవలోకించితివా? ఓశుకమా? మాకు జెప్పుము. మా ప్రభువు నీకు గనపడెనా? ఓ నదీమతల్లికా! మౌనముగా నుంటివేమి? సప్తద్వీపాధిపతి

యగు మాప్రభువును నీవు గంటివా? ఓ వాయుదేవా! నిజమైన
జెప్పుము. మా సీతాపతి నీకు గానవచ్చెనా? ఇట్లు వారు శ్రీరామ
విరహముచే సంభ్రాంతములైన చిత్తములతో విలపించి విలపించి
గండకీనదీతీరమునకు బోయి యీవిధముగా గీతము నాలపించిరి,

స్త్రియ ఊచుః

శ్లో॥ కిం ప్రభో! త్వయా జానకీ యదా తేన రక్షసాఽరణ్యమధ్యతః,
స్వస్థలం హృతా గౌతమీతటాత్తత్కృతే త్వయా నైవ
శోచితమ్? ॥ 1

త్వద్వియోగత స్తప్తమానసా స్సర్వతో వనే శోకమాగతాః,
ఏకదా ప్రభో! దేహి దర్శనం దేహి నో వరాన్ మాఽస్తు నై
రతిః ॥ 2

నో వాంఛామో రాఘవ! త్వత్తో రతి మన్య
యద్వద్దత్తం భూసురజాభ్యో వరదానమ్,
తద్వన్న స్త్వం పూరయ కామాన్ వరదానై
ర్వాంఛామ స్తే సేవన మగ్ర్యే జననేఽపి ॥ 3
అస్మాభి ర్యచ్చంచలభావా దపరాద్ధం, తత్సర్వం త్వం మా
స్మర పూర్వం కరుణాతః,
నః ప్రాణా స్తే దర్శనహేతో స్తనుమధ్యే, తిష్ఠంతి త్వాం
పల్లవయాచ్ఞా క్రియతేఽద్య॥
భోభో రాఘవ! మారుష్ట త్వం క్రోధం మా భజ దాసీ ష్వద్య,
పర్యంతం నహి పశ్యంతీత్థం వాంఛామో నహి త్వత్తః కామమ్॥5
దేహి త్వం నిజదర్శనలాభం జన్మన్యగ్ర్యేఽప్యథ నో వరదానం,
పాహి త్వం శరణం హ్యుపయాతా స్సర్వా స్తారయ నః ప్రణ
మామః ॥ 6

రామ! త్వం కిం సదయహృదయ స్త్వసి నః కిం
నాయాత్యద్య శ్రీజనకరుణా హృదయే తే,
ఇత్థం క్రోధం త్వత్పదయుగళే పతితాను
కర్తుం విష్ణో నార్హసి వరదో భవ నోఽద్య॥ 7

బాలే దీనే శ్రీజనవిమలే శనయే స్వే, కుర్వంతీత్థం నో గృహాలు విమలా మతిమంతః,
క్రూరం కోపం త్వం త్యజ వరదో భవ నోఽద్య, వారం వారం కరకమలై స్త్వాం ప్రణమామః॥ 8

హేనాథ! రాఘవ! రమేశ్వర! రావణారే!
సీతాపతే! రిపునిషూదన! కంజనేత్ర!
త్వం దేహి రామ! సుదర్శన మద్య విష్ణో!
దుఃఖార్ణవా త్పరతటం నయ కామినీర్నః॥ 9

త్వత్పాదపద్మవరసేవన మర్థయామః, జన్మాంతరే కురు దయాం కరుణాసముద్ర!
నోచే త్త్వదాద్య పరహా స్స్వజజీవితాని, త్యక్ష్యామ ఏవ నియతం సహసాఽద్య నద్యామ్॥ 10

శ్రీరామదాస ఉవాచ

నారీగీతం రాఘవశ్చాపి శ్రుత్వా, ప్రత్యక్షోఽభూత్కామినీనా మథాగ్రే,
దృష్ట్వా రామం తాస్త్రియశ్చాతితుష్టాః, ప్రోత్ఫుల్లాస్యా స్తం ప్రణేము శ్శిరోభిః॥ 11
నారీగీతం మానవశ్చాపి శ్రుత్వా, సర్వాన్ కామాన్ ప్రాప్నుయా న్నిశ్చయేన,
తస్మా దేతత్సర్వదా కీర్తనీయం, శ్లోకార్కీయం ప్రాపకం ఛందచిత్రమ్ 12॥

భావము: - మహాప్రభూ! మీప్రియపత్ని యగు జానకిని గౌతమీతీరమునుండి రావణాసురుడు హరించి కొనిపోయినవేళ మీ రామెకై విలపింపలేదా! మీ విరహముచే గ్రాగుచున్న మానసములతో మేమీ వనములో బరిభ్రమించుచున్నాము. ఒక్కమాఱు మాకు దర్శన మిండు. మాకు వరముల నొసగుడు. ఇక మీపొందును గోరములెండు. బ్రాహ్మణకన్యల కిచ్చిన విధముగా మాకును వరముల నొసగుడు. ముందు జన్మమునందే మీపాదసేవనమును మేము గాంక్షింతుము. చపలస్వభావము కారణముగా మేమొనరించిన యపరాధమును గరుణతో సైరింపుడు. మీదర్శనమును గోరియే మాప్రాణములు శరీరములందు నిలిచియున్నవి కావున నొక్కమాఱు దర్శన మీయ వేడుచున్నాము శ్రీరామచంద్రా! మాపై గోపమును బరిత్యజింపుడు. ఇట్టి పరిణామము గలుగునని మే మూహింపలేదు. ఇంక మీవలన గామము నాశింపము. మీదర్శనలాభము నొసగుడు. జన్మాంతరమందు ఫలించు వరము నొసగుడు. మిము శ్శరణమంటిమి. మమ్ము రక్షింపుడు. మీకు మ్రొక్కెదము. మమ్ము దరింపజేయుడు. స్వామీ! మీరు నిర్దయులా? మీకు స్త్రీజనముపై గరుణ గలుగదా? మీపాదపద్మములపై వ్రాలిన మాపై గ్రోధమును జూప బాడిగాదు. బుద్ధిమంతులు బాలునియందు, దీనునియందు, స్త్రీజనమునందు, దనయునియందు నీవిధముగా గ్రోధ మెన్నడును జూపరు. కావునమాపై గోపము నుపసంహరింపుడు. వరదులు గండు. కరకమలములు ముకుళించి మీకు బ్రణమిల్లుచున్నాము. నాథా! రాఘవా! రమేశా! రావణాంతకా! సీతాపతీ! శత్రుసంహారణా! పద్మనేత్రా! మా కిప్పుడు దర్శనమిండు స్వామీ! ఆడువారిని మమ్ము దుఃఖసముద్రమునుండి తరింపజేయుడు స్వామీ! జన్మాంతరమందు మీపాదపద్మములను భజింపగోరుచున్నవారము. కరుణాసముద్రా! మాపై దయజూపుడు. దయ

జూపకపోయినచో మీావిరహమునకు దాళలేక యీానదిలోబడి యసువులను బాసెదము.''

ఈనారీగీతము నాలకించి శ్రీరామచంద్రుడు శీఘ్రముగా వారి నడుమ బ్రకట మయ్యెను. అతనిని గాంచి వా రమందానందము నొందిరి. శిరములు వంచి యతనికి నమస్కరించిరి. ఈ నారీగీతము నాలకించిన మానవుడు కూడ సమస్తకామనాసిద్ధిని బొందును. కావున నీ పండ్రెండు శ్లోకములను జను లెల్లవేళల బఠింపదగును.''

అనంతరము రాఘవుడు వారికి వరముల నొసగి వారి నానందపఱచెను. కడపట వారితో నిట్లు పలికెను. 'వనితారత్నములారా! పూర్వము నే ననేకస్త్రీలను బడయనెంచి వ్యాసుని సముఖమున బదునాఱు స్త్రీమూర్తులను సువర్ణమయములైన వానిని జేయించి బ్రాహ్మణులకు దానము జేసితిని. అప్పుడు వారు రాఘవా! పదునాఱుకు బదులు పదునాఱువేలమంది స్త్రీరత్నములను బడసెదవుగాక! యని నన్నాశీర్వదించిరి. కావున వారి యాశీర్వచనానుసారముగా నేను ద్వాపరయుగమున శ్రీకృష్ణరూపమున నుదయించి మిమ్ముల నందఱను ద్వారకానగరమున బరిణయ మాడుదును. ఆనాడు మీా రనేకరాజకన్యలై జన్మింతురు. వాలిచే జంపబడిన దుందుభి యానాడు భౌమాసురుడై (నరకుడు) జన్మించును. అత డిప్పటివలె నప్పుడు కూడ మిమ్ముల నందఱను హరించును. ఆనా డతనిని సంహరించి మిమ్ముల నందఱను విడిపించి పరిణయము జేసికొందును. నాటినుండియు మీారు నాతోడ సానందముగా విహరింపగలరు.' రాఘవు డాడిన యీాపలుకుల నాలకించి వారి మొగములు వికసించినవి. వారు పరమానందము నొందిరి. ఆ సమయముననే శ్రీరామచంద్రు నడుగుజాడలను బట్టి లక్ష్మణాదు లందఱు నాచెంతకు విచ్చేసిరి. పదునాఱువేలమంది స్త్రీల నడుమ నున్న శ్రీరామచంద్రు నవలోకించి మిక్కిలి విస్మయము నొం

దిరి. వారందఱు సతినికి సమస్కరించిరి. రాఘవుని ముఖమున నాస్త్రీల యుదంత మంతయు నాలకించి వారందఱును గూడ బరమానందము నొందిరి. పిమ్మట వారందఱును రాఘవుని ముందు గూర్చుండిరి. ఇంతలో శ్రీరాముని యాజ్ఞచే వేలాదిగా వాహనము లచ్చటకు వచ్చి చేరినవి. వానిపై నాస్త్రీల నందఱ నెక్కించికొని రఘునందనుడు సీతామహాదేవి యున్న శిబిరము దిక్కునకు సాగెను. అచ్చటకు జేరిన మీాసట నాస్త్రీలందఱును సీతామహాదేవికి నమస్కారము జేసిరి. రాఘవుడు వారి యుదంత మంతయు నామె కెఱిగించెను. సీతామహాదేవి వారి నందఱను దివ్యవస్త్రాభరణములతో సత్కరించెను.

అనంతరము శ్రీరామచంద్రుడు తమ శిబిరమునకు సమీాపమున నొక మనోహర సరోవరమును గాంచెను. అది సముద్రముతోడ స్పర్ధ సేయుచున్నది. దట్టముగా బెరిగిన చెట్లనడుమ జెలువారుచున్నది. అమలములైన సలిలములు గలిగియున్నది. నిండార వికసించిన పద్మములతో, మకరందమునకై ముసరు తుమ్మెదపిండులతో గన్నుల పండువు సేయుచున్నది. తామరాకులచే గప్పబడి మరికతములచే గప్పబడిన దానివలె మరువు గొలుపుచున్నది. స్వచ్ఛమైన సజ్జనహృదయమువలె నుండియుండి యుల్లాసము మీాఱ నందు మత్స్యము లెగయుచున్నవి. జలచరముల కదలికలచే నందు మనోహరముగా దరగ లుద్భవించుచున్నవి. అంతర్జలమున క్రూరములైన మకరములతో నిండియది దుర్జనహృదయమును దలపించుచున్నది. ఒకచోట నది దట్టమైన నాచుతో నిండి కృపణుని గృహమువలె జొరశక్యము గాకున్నది. అది రేబవళ్లనేకపక్షిసంతతుల యార్తిని హరించుచున్నది. తన సర్వస్వము నొసగి యుదారహృదయునివలె నావన్నార్తిహరణము సేయుచున్నది. శీతలజలకణములచే ఘన పితరులను వలె బుధులను దృప్తి పఱచుచున్నది. పగటివేళ నెల్ల జీవుల సంతాపమును హరించుచు జంద్రుని దలపించుచున్నది.

అట్టి యామనోహరమైన సరోవరమును గాంచి సంతసించి సీత తోడ గూడి శ్రీరామచంద్రు డందు సుఖముగా స్నాన మొనరించెను. మాధ్యాహ్నిక క్రియలను నిర్వర్తించికొనెను. బంధుజను లందఱ తోడను గూడి సుఖముగా భోజనము జేసెను. వేటకాండ్ర బృందముతో గూడి యా సరోవరతీరమున నానా ప్రసంగములతో బ్రొద్దుబుచ్చెను. అనంతరము వ్యాధు లందఱు వనములో నెల్లెడల వలలను బన్ని వింట బాణములను సంధించి చెట్లపై గూర్చుండి నాల్గు దిక్కులను నిరోధించిరి. శ్రీరామచంద్రుడు గూడ రాత్రివేళ వింట బాణమును సంధించి యొక వృక్షముపై గూర్చుండెను. ఇట్లుండగా నర్ధరాత్రమున నడవి పందుల దండు బయలు వెడలి యా సరోవరము లోని దుంపలను మేసి వలలో జిక్కుకొనెను. అప్పుడు రాఘవుడును, వ్యాధులును గూడి బాణములను బ్రయోగించి వానిని బుడమిపై బడగొట్టిరి. క్షణములో వానిని సంహరించి యానందకోలాహలము జేసిరి. శ్రీరామచంద్రుడు పరుగిడుచున్న వానిని గూడ బాణముతో బడగొట్టి భటులచే శిబిరమునకు దెప్పించెను. ఈవిధముగా రాఘవుడా వనములో సుఖముగా నేను దినములుండి సీతతోడ గూడి వివిధములైన భోగముల ననుభవించి పిమ్మట దన పరివారముతోడ దన నగరమునకు మఱలిపోయెను.

అనంతరము శ్రీరామచంద్రుడు బ్రాహ్మణులను, క్షత్రియులను, వైశ్యులను రావించి వారి వారి కొమరితలను వారి వారి కప్పగించెను. ఈవిధముగా దాను గొనివచ్చిన స్త్రీల నందఱను నవ్యవస్త్రాభరణములతో నలంకరించి వారి వారి యిండ్ల కంపివైచెను. ఆ బ్రాహ్మణులు క్షత్రియులు వైశ్యులును దమ కొమరితలు మఱల జన్మించినట్లు భావించికొని ముదము నందిరి. అనంతరము తమ బిడ్డలను తమతమ నగరములకు గొనిపోయి రామాజ్ఞచే క్షత్రియులు

క్షత్రియ కుమారులతోడను, వైశ్యులు వైశ్యకుమారులతోడను వారికి బరిణయములు గావించిరి. శ్రీరామచంద్రుని యనుగ్రహమున వా రీవిధముగా భర్తృసౌఖ్యమును బడయగలిగిరి. ఇక బ్రాహ్మణకన్యలు నలుగురును దమ తమ తండ్రుల యిండ్ల యందే వ్రతనియమాదు లను బాటించుచు గాలము గడపిరి. వివాహకాల మతిక్రమించిన కారణమున వారి తండ్రులు వారికి బరిణయములు సేయలేదు. జన్మాంతరమున వారి నందఱను శ్రీకృష్ణుడు భార్యలుగా స్వీకరించును.

అనంతరము శ్రీరామచంద్రుడు సీతామహాదేవిని, పౌరులను, జానపదులను, బరివారమును దోడుకొని సుబాహుని కుమారునకు బెండ్లి సేయించుటకై మధురానగరమున కరిగెను. అచ్చట వివాహ మంగళమును బూర్తి సేయించి కొంతకాల మా నగరములో సుఖముగా నుండిపోయెను. ఒకనాడు సీత యాడిన మాట ననుసరించి శ్రీరామ చంద్రుడు రాత్రివేళ యమునానదీతీరమునందలి యిసుకతిన్నెపై హేమ పర్యంకమున సుఖముగా నిద్రించెను. ఇంతలో దాసీవర్గమును, దాస వర్గమును నిద్రామగ్నము గాగా జూచి యమున స్త్రీరూపమును దాల్చి వచ్చి శ్రీరాముని పాదములను మెల్లగా స్పృశించెను. తోడనే రాఘవుడు మేల్కొని తన ముందున్న సూర్యకుమారి యగు యము నను గాంచెను. ఆమె దివ్యవస్త్రాభరణములతో, గల్లుగల్లుమను దివ్య ములైన యందియలతో, నల్లకలువలవలె శ్యామలమైన వన్నెతో, సువర్ణకుంభములను బోలు పయోధరములతో, నగు మొగముతో, నరటిబోదెలను బోలు నూరువులతో, జిలుముత్యాల మాలికలతో, కేయూరములతో, గుండలములతో సున్నితమగు కటిప్రదేశముతో గన్నులపండువుగా గానవచ్చుచుండెను. అట్టి మనోహరస్వరూపిణి యగు నామెను గాంచి ప్రభువు క్షణకాలము తన మనమున నింతటి సౌందర్యరాశిని సృజించిన విధాత యెంతయు ధన్యుడని తలచి

యాశ్చర్య చకితుడయ్యెను. అనంతర మామెను నీరాకకు గారణ మేమని ప్రశ్నించెను. అప్పు డామె బిడియ పడుచు శ్రీరామచంద్రా! నేను జెప్ప నక్కఱలేదు. సర్వమును నీవే యెఱుగుదువు అని బదులు పలికెను. అంతట రాఘవుడు సూర్యకుమారీ! నే నేకపత్నీ వ్రతము నవలంబించినవాడను. ఈ జన్మమున నీకోరిక తీరదు. సీత మేలుకొనులోపలనే యిటనుండి కదలి వడిగా నీ నెలవునకు వెడలి పొమ్మని పలికెను. రాము డాడిన యా ములుకులను బోలు పలుకును విన్నంతనే, హృదయము భిన్నమై యామె పుడమిపై బడి మూర్ఛ నొందెను. అప్పుడు రాఘవుడు మఱల నామెతో లెమ్ము. లెమ్ము. సూర్యతనయా! నామాట నాలింపుము. ద్వాపరయుగమున శ్రీకృష్ణరూపమున నిన్ను బెండ్లియాడుదును. అప్పుడు నాతోడ సుఖమును బడయగలవు అని యూఱటగా బలికెను. ఆపలుకు విని కొంత సంతుష్టిని బొంది రాఘవునకు బ్రణమిల్లి యతనినే ధ్యానించుచు నామె మౌనముగా నటనుండి వెడలిపోయెను. అనంతరము శ్రీరామచంద్రుడు సీతను, సైన్యమును దోడుకొని తన నగరమునకు మఱలిపోయెను. ఈవిధముగా నయోధ్యలో శ్రీరామచంద్రుడు భార్యతోడను, బంధుగులతోడను, తనయులతోడను గూడి శ్రవణమాత్రమున సమస్తపాపములను హరింపగల చరితము లనేకము లాచరించెను.

ద్వాదశసర్గము సమాప్తము.

రాజ్యకాండము పూర్వార్ధము సమాప్తము.

— o o o —

# శ్రీ మదానందరామాయణము

## రాజ్యకాండము - ఉత్తరార్థము

## ప్రథమసర్గము

### శ్రీరామచంద్రుడు తన రాజ్యమునందు నగవును నిషేధించుట

రామదాసుడు విష్ణుదాసున కిట్లు వివరించును.

ఒకనాడు శ్రీరామచంద్రుడు మిత్రవర్గముతో గొలువు దీరి చామరములచే వీవబడుచు, లక్ష్మణునిచే గొలువబడుచు సభలో నాసీనుడై యుండెను. ఇంతలో నచ్చట సభలోనున్న పౌరుడొకడు వారవనితల నృత్యాదికము నవలోకించి పన్నులు బయలుపడ బకబకన నవ్వెను. ఆ నవ్వును వినుటతోడనే రాఘవునకు పూర్వవిషయ మొకటి తలపునకు వచ్చెను. పూర్వము లంకానగరమున రామబాణములచే ఖండితములై రావణుని సిరము లుప్పరమున కెగసి రామునిచే ఖండింపబడితిమన్న యానందమున పన్నులు బయలుపడ నవ్వుచు రామునకు నమస్కరించు తలంపున క్రిందకు బడజొచ్చెను. ఆ సిరములు బయలుపఱచు వికరాళదంతములను గాంచి యవి తనను దినివేయ నేగుదెంచుచున్నవని యెంచి రాఘవుడు వానిని నూటయొక్కమారులు బాణములతో నాకసమున కెగురగొట్టెను. ఆ యుదంత మిప్పుడు తలపునకు వచ్చి రావణుని యాసిర మిప్పుడు సభామధ్యమునకు వచ్చెనా? యని శంకించి శ్రీరామచంద్రుడు సభలో నీవంక నావంక నవలోకించెను. మాయావులైన రాక్షసు లిచ్చట గూడ నున్నవారని శంకించి యెవ్వరైన నవ్వినప్పుడెల్లా పూర్వవృత్తాంతము దలపునకు వచ్చుచుండుటచే బ్రక్కలకు బరికింప నారంభించెను. అనంతర మాతడు తన మనమున క్షణకాల మిట్లు చింతిం

చెను. ఎప్పుడెప్పు డెవరి హాస్యము వినవచ్చినను నాకు వెంటనే రావణ శిరస్సుల హాస్యము తలపునకు వచ్చుచున్నది. మాయావులగు రాక్షసులు నన్నింతకాలము మఱపింపజేసి యిప్పుడు క్రమముగా నన్ను భక్షించుటకు వచ్చుచున్నట్లు తోఁచుచున్నది. హాస్యము మిక్కిలి నింద్యమైన దని నీతిశాస్త్రములు గూడ జెప్పుచున్నవి. కావున భూతలవాసు లెవ్వరు నిటుపై నవ్వరాదని నగవుపై నిషేధమును విధించెదగాక! ఈవిధముగా జింతించి శ్రీరామచంద్రుడు వెంటనే లక్ష్మణుని సంబోధించి 'లక్ష్మణా! ఇటుపై జెఱునవ్వైనన, నవ్విన వారు పురుషులుగాని, స్త్రీలుగాని, మిత్రులుగాని, సోదరులుగాని, కడకు సీతగాని, తనయుడు గాని యెవ్వరైనను దండనార్హులగుదు రని నగరమునందు రాష్ట్రమునందు నెల్లయెడల దుందుభిమ్రోత తోడ జాటింపజేయుము' అని యతని కాజ్ఞాపించెను. అట్లగాక! యని లక్ష్మణుడా విధముగనే చాటింపజేసెను.

ఆ చాటింపు నాలకించి పౌరులు, గ్రామీణులు నెల్లవారును దండనభీతిచే నగు మొగమును బ్రకటింప మానివైచిరి. వారాంగనా నృత్యములందు, నటుల గాన ప్రవృత్తులందు, నవ్వుట మానివైచిరి. హాస్యహేతువులగు నుత్సవములు, వినోదకార్యములు, మాంగళిక కృత్యములు మున్నగునవి సేయుట మానివైచిరి. గడలపై నెక్కి యాడుట, తూర్యఘోషాదికముతోడి మాంగళ్యకృత్యములు, సాంవత్సరికోత్సవములు, యాత్రోత్సవములు, యజ్ఞోత్సవములు, వివాహాదులందు జాటింపబడు వివిధములైన వినోదకార్యములు, వార్తాప్రసంగములు, చిత్రకథాప్రసంగములు మున్నగువాని చెంతకు గూడ బోవుట మానివైచిరి. ఆవశ్యకమైన కార్యమేదియు లేకుండ నొక్కడును సభాగతుడైన ప్రభువును సమీపించుటలేదు. పురాణకథాప్రసంగములు, నీతికథాప్రసంగములు సేయుట నెల్లరును మానవైచిరి.

గర్భాధానకాలమున, బుత్రుడు జన్మించినవేళ, బుత్రునకు నామకర
ణము సేయువేళ నుత్సవములు సేయుట మానివైచిరి. శ్రీరామదండన
మునకు వెఱచి యేకాంతమున గూడ జనులు నవ్వుటలేదు. ఒక్కడును
నగుమొగమును వెలయింపలేదు. ఒక్కడు నలంకారముల చెంతకు
బోలేదు.

అప్పుడు వివిధకర్మముల యధిష్ఠానదేవతలు, నుత్సాహదేవ
తలు నీయుదంతము నింద్రున కెఱిగించిరి. లోకములో దేవతల
కర్మాంగపూజ లెందును బాటింపబడకుంట గమనించి యింద్రుడీ
యుదంతమును బ్రహ్మదేవున కెఱిగించి యతనినీ విషమసమస్యను
బరిష్కరింపగోరెను. అప్పుడు బ్రహ్మ 'నాయనా! శ్రీరామచంద్రుని
ముందు నిలిచి మాటలాడుటకు నాకు శక్తి చాలదు. అతడు నాకు
దండ్రియైన కారణమున నతనికి నేనేమియు నుపదేశింపజాలను. మీ
మేలును గోరి నేనీ సమస్యను యుక్తిచే బరిష్కరించెదను.' అని యా
యింద్రున కూఱట గొలిపెను.

అనంతరము బ్రహ్మ భూలోకమునకేగి యయోధ్యానగరప్రాంత
మున నొక రావిచెట్టును గాంచి యందు బ్రవేశించి యామార్గమున
బోవు బాటసారులను జూచి పక్కున నవ్వెను. ఆ రావిచెట్టునవ్వును
విని చెంతనే కట్టెలను గొట్టుకొని జీవించువా డొకడు బిగ్గఱగా
నవ్వెను. అతడు క్రమముగా గట్టెలమోపును మూపునపై నిడికొని
నగరములోనికి బోయెను. అక్కడ నతనికా రావిచెట్టునవ్వు తలపు
నకు వచ్చి యతడు మఱల బక్కున నవ్వెను. అతని నవ్వు నాలకింపగా
జెంగటనే నిలిచియున్న యొక రాజభటున కెంత ప్రయత్నించినను
నవ్వు నిలువలేదు. అతడు వెంటనే బిగ్గఱగా నవ్వివైచెను. అతడు
క్రమముగా శ్రీరామచంద్రుని సభాస్థలి కేగి కాష్ఠవిక్రేత నవ్వును
దలచికొని మఱల బక్కున నవ్వెను. వాని నవ్వు నాలకించి సభా

సదు లందఱు నవ్విరి. వారి నవ్వును విని సభామధ్యమున సింహాసనముపై నాసీనుడై యున్న శ్రీరామచంద్రుడు గూడ నవ్వును నిలిపికొనలేక బిగ్గఱగా నవ్వసాగెను. అప్పు డతడు తనలో నిట్లు చింతించెను. 'ఇది యేమి? నాకెందులకు నవ్వు వచ్చినది? రాజ్యములో నవ్వినవారి నందఱను దండింతునని ప్రకటనము జేసియుంటిని గదా! ఇప్పుడు నన్నెవరు దండింతురు? నేటినుండియు పౌరులందఱు నవ్వినందులకు దండనము మాకే విధింపబడును. కాని మాయెదుటనే యట్టహాసము జేసిన ప్రభువున కెట్టి దండనము నుండదు గాబోలు! నని నన్నుపహసింపకుందురా? నేటినుండియు నాదండన విధానము నెడల నెవ్వరును గౌరవమును జూపరు. నాయీ నియమము యుక్తమైనది గాదు.' ఈ విధముగా జింతించినమీదట నతని కెంత ప్రయత్నించినను నవ్వాగలేదు. అతడు మఱల బిగ్గఱగా నవ్వెను.

అప్పుడు రాఘవుడు మీరేల నవ్వితిరని సభాస్తారులను ప్రశ్నించెను. మీ భటుని నవ్వుగా విన్న మాకు నవ్వు వచ్చినదని వారు బదులు పలికిరి. నీవేల నవ్వితివని యతడు మఱల భటుని ప్రశ్నించెను. శాస్త్రవిక్రేత నవ్వు తలపునకు వచ్చుటచే దనకు నవ్వు వచ్చినదని యతడు ప్రత్యుత్తర మిచ్చెను. వెంటనే రాఘవుడా శాస్త్రవిక్రేతను దూతలచేత సభాస్థలికి రావించి 'ఓయీ! భయపడకుము. నిజము చెప్పుము. అంగడివాడలో నీవెందులకు నవ్వితివి?' అని యతనిని ప్రశ్నించెను. అప్పుడతడు చకితుడై కంఠము, పెదవులు నిగిరిపోవ వడలుచు, వడవడ వడకుచు మహాప్రభూ! నగరము పొలిమేరలో నున్న రావిచెట్టు నవ్వినది. ఆనవ్వు తలపునకు వచ్చుటచే నాకు నవ్వు వచ్చినదని బదులు పలికెను. అతని మాట నాలించి ప్రభువు విస్మితుడై దూతలారా! మీరీతని దోడుకొని యా రావిచెట్టు కడ కరిగి యితని పలుకు సత్యముగునో కాదో యరసి రండని

దూతల కాదేశించెను. అట్లుకాక! యని వారాతని దోడ్కొని యా రావిచెట్టుకడ కరిగి యది మాటిమాటికి నవ్వుచుండుటను గుర్తించిరి. ఆశ్చర్యచకితులై వారు వెంటనే మఱలివచ్చి యా విషయమును ప్రభువున కెఱిగించిరి. అప్పుడు శ్రీరామచంద్రు డది తన రాజ్యములో దన దండనవిధానమును లోపింపజేయు నొక దుష్టలక్షణ మని తలచి వెంటనే పోయి యారావిచెట్టును ఖండించివేయుడని దూతల కాదేశించెను. ఆ రామాజ్ఞ ననుసరించి వారు కుఠారములను గేల ధరించి సత్వరముగా నారావిచెట్టుకడకు బరుగులు వెట్టిరి. పర్యాయముగా బకపక నవ్వుచున్న వృక్షమును వీక్షించి వా రాశ్చర్యము నంద జొచ్చిరి. వృక్షమును ఖండింప వచ్చిన భటుల నందఱను గాంచి గుప్తముగా నున్న బ్రహ్మ యా వృక్షమునుండి జ్వాలను వెలువరించి వానితో వారిని బ్రహరించెను. గాయపడి నెత్తురు లురలించు శరీరములతో వారు పరుగిడి పోయి యా యుదంతమును బ్రభువున కెఱిగించిరి. అత డత్యంతవిస్మయము నొంది యావృక్షమును ఛేదింప ధనుర్బాణధరులగు వేనవేలు భటులను మఱల నటకు బంపెను. వారు గూడ నావృక్షము చెంగట కరిగి పూర్వమందువలె జ్వాలచే గొట్టబడి ఛిన్నభిన్నములైన గాత్రములతో మఱలివచ్చి యాసమాచారమును బ్రభువునకు నివేదించిరి. అప్పుడా మహాప్రభువు మహాక్రోధమున మండిపడుచు విశాలమైన సైన్యముతోడ సుమంత్రు నంపెను. ఆ సుమంత్రుడును రాఘువునకు బ్రణమిల్లి సేనానమేతుడై వెడలి వృక్షమును సమీపించెను. తోడనే యాతనిమీద గూడ జ్వాలవర్షము మొదలయ్యెను. అతడు ముందున కడు గిడలేకుండెను. అయినను రాఘువునకు వెఱచి సైన్యముతోడ ముందునకే వెడల బ్రయత్నించెను. అతడు వృక్షముకడకు జేరుకొనునంతలో జ్వాలతో నెక్కువగా గొట్టబడి మూర్ఛితుడై పుడమిపై బడిపోయెను. అంతట సైన్యమునందు, నగరమునందును హాహాకారములు సెలరేగెను.

సుమంత్రుని పతనవార్త నాలకించి శ్రీరామచంద్రుడు మఱల విశాలమైన సైన్యముతో బుత్రులను, శత్రుఘ్నుని బంపెను.

అనంతరము రావిచెట్టు జాలతో గొట్టుచున్న విచిత్రవార్త నాలకించి నగరములోని నారీమణు లందఱును మేడలను, గోపురములను, నట్టాలికలను నధిరోహించి మొగములు మీదికెత్తికొని కరములతో గన్నులపై ముసరు ముంగురుల నల్లనల్లన దొలగద్రోసికొనుచు నిద్రాముద్రను వీడని కన్నులను మాటిమాటికి నులిమికొనుచు, గన్నులపై సూర్యకిరణములు ప్రసరింపకుండ జేయడ్డముగా నిడికొని "అదిగో! రావిచెట్టు. అదే జాలతో గొట్టుచున్నది." యని పలుకుచు నన్యులకు జూపుచు నాశ్చర్యముగా దానిను జూచుచుండిరి.

శత్రుఘ్నుడు నగరము వెలుపలకు బయనమైనంతనే ముందుగనే మార్గమునందు వరుసగా రథములు నిలుపబడియున్నవి. ఆ యా రథముల సారథులు బంగారు దండములతో నెంతకొట్టినను దురగములు గదలకుండెను. అప్పుడు శత్రుఘ్నాదు లాశ్చర్యముతో నా విషయమును రాఘవున కెఱిగించిరి. రాఘవు డప్పుడు తనలో నిట్లు చింతించెను. ఇది యాలోచింపవలసిన విషయమే అలోచింపకుంట యనుచితము. ఇందేదియో కారణ ముండియుండును. పురోహితుని బిలిచి యడుగవలయును ఇట్లు తలపోసి రఘునందనుడు సర్వమును దా నెఱిగియుండియు మానుషభావము నాశ్రయించిన వాడగుటచే శీఘ్రముగా బురోహితుని బిలిపించెను. రామాజ్ఞచే నా పురోహితుడగు వసిష్ఠుడు వెంటనే సభాస్థలి కేగుదెంచెను. అతనికి బ్రత్యుత్థానమొనరించి తోడుకొని పోయి యాసన మర్పించి శ్రీరామచంద్రుడు యథావిధిగా బూజానమస్కారములు గావించి యుదంత మంతయు నతని కెఱిగించెను. ఆ విషయము నాలించి వసిష్ఠుడు రాఘవా! ఇందులకు గారణము నెఱుగగోరెదవేని నన్ను గాక నీ చరిత్రమును రచిం

చిన వాఁడగు వాల్మీకిమహర్షిని బ్రశ్నింపు మని బదులు పలికెను. తోడనే రాఘవుఁడు వాల్మీకిని రావించెను. రామాజ్ఞచే బద్ధుఁడై యత డేగుదెంచెను. రఘునందను డతనికి బ్రత్యుత్థాన మొనరించి పూజా నమస్కారములు గావించి సంఘటిల్లిన యుదంత మంతయు నివేదించెను. అప్పుడు వాల్మీకి మహర్షి యిట్లు నొడివెను.

శ్రీరామచంద్రా! స్వయముగా నీవు సర్వము నెఱిఁగియుండియు నేమియు నెఱుఁగనివానివలె నన్నీ విషయమునఁ బృచ్ఛ సేయుచున్నావు. మానుషభావము నాశ్రయించినవాఁడ వగుటచే నన్ను బ్రశ్నించుచుంటివేని నొడువుచున్నాఁడ నాలకింపుము. నీవు నగరమునందు నగవుపై నిషేధమును బ్రకటించితివి. తత్కారణముగా జను లెల్లరును నీదండనీతికి వెఱచి వివాహమహోత్సవములు, కథాప్రసంగములు, మాంగళికకృత్యములు, నానందగీతములు, నాట్యములు, యజ్ఞములు, యాత్రలు, సాంవత్సరికోత్సవములు మున్నగు నానందజనకములైన సమస్త సత్కర్మముల నాచరింప మానివైచిరి. ఈ విధముగా సత్కర్మలోపము మొదలై యిప్పటి కేడాది గతించినది. లోకములో దమ పూజావిధానముల లోపము నెఱిఁగి యుత్సాహదేవతలు, కర్మాంగదేవతలు, నింద్రాది లోకపాలకులును బ్రహ్మదేవుని కడకు బోయి యీ యుదంతము నాతని కెఱిఁగించిరి. అప్పుడు బ్రహ్మ వారికి మేలు సేయనెంచి స్వయముగానచ్చి నిన్ను బ్రార్థింపజాలక యీ యశ్వత్థవృక్షములోపల బ్రవేశించెను. అతఁ డిప్పుడు కూడ నందే నిలిచియున్నాఁడు. ఇట్లు నొడువుచున్న వాల్మీకి పలుకుల నాలకించి రాఘవుడు కుపితుఁడై ఏమి! ఇది బ్రహ్మదేవుని విక్రమమా! అట్టులయిన నాతాపునకు నేను స్వయముగనే యరిగెదను. ఆ సరసిజసంభవుని సత్త్వ మేపాటిదో పరికించెదను అని పలికి తన సేనలకు సన్నద్ధముగా నాజ్ఞ యొసగెను. అప్పుడు వాల్మీకిమహర్షి రఘునందనున కిట్లు ప్రబోధము గావించెను.

రఘునందనా! క్రోధము నుజ్జగించి నా పలుకుల నాలకింపుము. నీవు సచ్చిదానందస్వరూపుడవగు రాముడవు. ఈ యానందమయ చరిత్రమును నేను రచించియున్నాను. దానిని సీతనయుల మొగమున గొంటెము నీవుగూడ నాలకించియుంటివి. దాని నాలకించినంతమాత్రమున మానవు డానందస్వరూపుడగును. నీవు నగవును నిషేధించితివి. సుఖరూపమగు నగవును విడిచి జనులు నీచరిత్రము నెట్లు కీర్తింపగలరు? అంతియేకాదు. మఱియొక్క విషయము నుగ్గడించుచున్నాడ నాలకింపుము. నాచే రచింపబడిన శతకోటిశ్లోకపరిమితి గల రామాయణమును దొల్లి నీవు మూడులోకములవారికై మూడు సమభాగములు గావించియుంటివి. అందు భారతవర్షమునకు ప్రాప్తించిన భాగమునుండి సారవంతములై మనోరంజకములైన గాథలను స్వీకరించి వ్యాసమహర్షి యష్టాదశ పురాణములను, నుపపురాణములను రచించెను. ముందుముం దెందఱో మహర్షులు నా గ్రంథములోని సారమును గ్రహించి షట్శాస్త్రములు మున్నగువాని నెన్నిటినో రచింపగలరు. ఇంకను ముందుముందు భారతవర్షమునకు ప్రాప్తించిన భాగములోని శ్లోకము లెన్నియో యంతరించిపోగా మిగిలిన యిరువది నాలుగువేల శ్లోకముల పరిమితి గలిగిన భాగమును గైకేయీ దౌష్ట్యము కారణముగా నీ పదునాలుగేండ్ల వనవాసము, సీతా వియోగము మున్నగు పరిమిత సన్నివేశములు గలదానిని మాత్రమే నా రచనగా జనులు చెప్పికొందురు. ఈ భావిపరిణామము నెఱిగినవాడ నగుటచేతనే నేను శోకసన్నివేశశ్రవణమును, దాని యుపయోగమును గూర్చి ముందే చెప్పియుంటిని. అనయము యుద్ధచరిత్రమును ప్రాతఃకాలమున, శోకచరిత్రమును మధ్యాహ్నకాలమున, రతిచరిత్రమును నిశాసమయమున, నానందరామాయణము నెల్లవేళల నాలకింపవలెను. యుద్ధచరిత్ర మనగా భారతము. రతిచరిత్రమనగా భాగవతము శోకచరిత్ర మనగా నిరువదినాలుగువేల శ్లోకముల పరిమితిగల నీచరి

త్రము. నీ వొసగిన భావివరము కారణముగా నా శతకోటిశ్లోకపరిమిత రామాయణములోని యంతర్భాగమగు నీ యానంద చరిత్రము తొమ్మిది కాండములు గలిగి, పండ్రెండు వేల నూటతొమ్మిది శ్లోకముల పరిమితి గలిగి మనోహరమై యానందరామాయణ మనుపేర లోకములో నందందు నిలిచియుండును. నీ భావివరము కారణముగా 108 సర్గముల కీర్తనమాలయగు నీయానందరామాయణమును లోకములో నెవ్వరును ఖండింపకుందురు. నీ ప్రసన్నతను గోరి యాచంద్రతారార్కముగా దీనిని గాపాడుదురు. శతకోటి శ్లోకపరిమితమైన నా గ్రంథమును ఖండించి వ్యాసు డష్టాదశపురాణములను రచించినవేళ నా తపః ప్రయత్నమువలన గూడ లోకకల్యాణ మొనగూడగలదని యెఱిగి నే నూరకుంటిని. కలికాలమందు జను లల్పాయుష్కులై మందబుద్ధులై చరింతురు. నా గ్రంథము నాలకింప వారు సమర్థులుగారు. ఈవిషయము నెఱుగుట చేతనే వ్యాసుని ప్రయత్నము నెఱిగి హర్షమునే పొందితిని. కాని యమర్షము నొందలేదు. కావున నో శ్రీరామచంద్రా ! తొమ్మిది కాండములతో శోభిల్లు నాయీ యానందరామాయణమును విహాపము గావింపవలదు. నగవును నిషేధించినచో లోకమంతయు శోకమయ మగును. సిశోక చరిత్రమువలె నిది కూడ శోకమయ మగును. కావున నీకొక్క యుపాయము నుగ్గడించెదను. దాన నీ యాదేశమును విఫలము గాకుండును. దేవతలకు సంతుష్టియు గలుగును. జనులామోదమును బొందుదురు. నా కవిత్వము సత్యము నగును. జనులను నవ్వనిమ్ము. కాని వారు పలువురును బయలుపడకుండ నవ్వదగును. ఏది యేని కౌతుకమును గాంచినప్పుడు వస్త్రముతో నోటిని గప్పికొని నవ్వదగును. నగవు లక్ష్మిసూచకమైనది. సౌఖ్యదాయకమైనది. మంగళప్రదమైనది. నగవుకన్న మిన్న యగునది మఱియొకటిలేదు. నగుమొగముగల నారీమణి యున్న గృహము గృహము గాదు. ఆలయము. అట్టి గృహమునందు లక్ష్మి స్థిరముగా నిలుచును. నగు

మొగము గల పురుషుడు ధన్యుడు. కినుకను వెలిబెట్టు మొగము గల వాడు నింద్యుడగును. క్రోధము నుగ్గడించు మొగము గల యాడుది కూడ నింద్యురా లగును. అతిహాస్యమును మునీశ్వరులు కూడ గర్హింతురు. కావున నోరఘునందనా! నామాటను మన్నింపుము. బ్రహ్మదేవునకు గర్వమును లేదు. నీపై గినుకయు లేదు. అతడు నిన్ను దన తండ్రిగా గారవించువాడు. నే నతని నిన్ను శరణువేడ నీసన్నిధికి గొనినత్తును.

అనియిట్లు ప్రబోధింపగా నాలకించి యామునిచంద్రుని వచనములను మన్నించి యతనియెడల దనకున్న గారవము కారణముగా శ్రీరామచంద్రు 'డట్లకాక! యని తన సమ్మతిని బ్రకటించెను. తోడనే వాల్మీకిమహర్షి తన శిష్యు నొకని నంపి యశ్వత్థవృక్షమునం దంతర్హితుడై యున్న బ్రహ్మదేవు నటకు రావించెను. యుద్ధము సేయనేగిన యాశ్వికదళము వెనుకకు మఱలెను. సైన్యముతోడ మగిడి వచ్చి శత్రుఘ్నుడు శ్రీరామచంద్రుని పార్శ్వభాగమున నిలిచెను. రాఘవుని తనయులు గూడ మఱలివచ్చి తండ్రి చెంత నుపవిష్టులైరి. ప్రభు వాదేశింపగా దూతలు కాష్ఠవిక్రేతను వదలిపైచిరి. ఇంద్రు డమృతమును గురియించి సుమంత్రాదులను బునరుజ్జీవితుల గావించెను. వారు లేచి మఱలివచ్చి శ్రీరామచంద్రునకు బ్రణమిల్లి తమ తమ స్థానములం దాసీనులైరి. అనంతర మమరుల బృందమును వెంట నిడికొని వచ్చి యింద్రుడు కూడ రాఘవునకు గైమోడ్పు గావించెను. అప్పుడు బ్రహ్మదేవుడు భక్తిపురస్సరముగా శ్రీరామచంద్రునకు బ్రణామము గావించి యిట్లు నొడివెను.

మహాప్రభూ! శ్రీరామచంద్రా! నా యపరాధమును సైరింపుము. మేమెల్లరమును నీచే బాలింపబడ దగినవారము. తొల్లి మా క్షేమమును నపేక్షించి నీ వెన్నియో యవతారములను దాల్చి మా శత్రు

వ్రుల నంత మొందించితివి, మహామత్స్యరూపమును దాల్చి వేదముల నపహరించిన శంఖాసురుని బొరిమార్చితివి. మా కమృతమును సమకూర్చు ప్రయత్నమున మునిగిపోవుచున్న మందరపర్వతమును గాంచి కూర్మరూపము నవధరించి దానిని వెన్నుపై నిలిపికొని మాకు సఫలతను జేకూర్చితివి. ఈ పృథివి నాది యని వదరుచున్న హిరణ్యాక్షుని మహావరాహరూపము నవధరించి తెగటార్చి జలమునుండి స్థలమును వెలికి దెచ్చితివి. ప్రహ్లాదుని మాట నిలుపనెంచి నరసింహరూపమున స్తంభమునుండి వెలువడి హిరణ్యకశిపు నంత మొందించితివి. తొల్లి యింద్రుని రాజ్యమును హరించిన బలిచక్రవర్తిని వామనమూర్తివై పాతాళమున కడగద్రొక్కితివి. మున్ను రాజన్యు లెల్లరు నధర్మనిరతులు కాగా నెఱిగి పరశురామ రూపమున ముయ్యేడుమాఱులు విక్రమించి వారి నందఱ నంతమొందించితివి. ఇప్పటి యవతారమున బత్నీహరణము కారణముగా రావణ కుంభకర్ణు లనబడు చెనటి రక్కసులను జెండివైచితివి. వారిరువురును నీ స్వకీయపార్షదులు. వారిని రెండుమాఱులు దేవశాపము నుండి యుద్ధరించితివి. మఱియొక్కపర్యాయ మా యిరువురను ముందుపుట్టువున నుద్ధరింపగలవు."

బ్రహ్మదేవు డాడిన యీ పలుకుల నాలకించి వసిష్ఠుడు స్వయముగా దాను సర్వము నెఱిగియుండియు నచ్చట జేరియున్న జనుల కెల్లరకు నెఱుక గలిగింపనెంచి యా బ్రహ్మ నిట్లు ప్రశ్నించెను.

ప్రథమ సర్గము సమాప్తము

— : —

# ద్వితీయ సర్గము

## -: వాల్మీకి జన్మవృత్తాంతము - బహుళ మంత్ర నిరూపణము :-

కమలసంభవా ! ఆ పార్షదు లిరువురు నెవరు ? ప్రభునిచే వారు రెండు పర్యాయములు నెట్లు లుద్ధరింపబడిరి ? ముందెట్లు లుద్ధరింపబడుదురు ?

వసిష్ఠుని ప్రశ్నము నాలకించి చిఱునవ్వు నవ్వుచు బ్రహ్మ యిట్లు నొడివెను. మునిచంద్రమా ! నీవు స్వయముగా సర్వము నెఱిగియుండియు లోకమున కెఱుక గలిగించుటకే నన్ను బ్రశ్నించుచున్నావు. నీకా పార్షదుల శాపకారణమును సాంతముగా నుగ్గడించుచున్నాడ నాలకింపుము.

ఒకానొక సమయమున నిప్పుడు రాముడని పేరొ్కనబడుచున్న యీ శ్రీమహావిష్ణు వేకాంతమున మహాలక్ష్మితో గూడి సానందముగా సమయము బుచ్చుచుండెను. ఆ సమయమున నా మహాపురుషుని దర్శింపగోరి యమరశ్రేష్ఠులగు నశ్వినీదేవత లిరువురు నేగుదెంచిరి. అప్పుడు జయవిజయు లనబడు విష్ణుపార్షదులు వారిని గాంచి యెదురుగా జని "స్వామి యేకాంతమున నున్నవారు. వారిని దర్శింప నిది యదనుగాదు" అని వాని కెఱుగజెప్పిరి. ఆ క్షణమునందే తమకు స్వామిదర్శనము కావలెనని యశ్వినీదేవతలు పంతము వట్టిరి. లక్ష్మీదేవితోడ నేకాంతవాసము జేయుచున్న స్వామిసన్నిధికి మేమెంతమాత్రము బోజాలము. పోజాలము. పోజాలమని ముమ్మాఱు పార్షదులు నక్కాణించిరి. అంతట నశ్వినీకుమారులు కుపితులై పార్షదులారా ! మీరు ముమ్మాఱు మా మాటను ద్రోసిపుచ్చితిరి. కావున ముమ్మాఱు పుడమిపై జన్మింతురుగాక ! యని వారిని శపించిరి. నిరపరాధులమైన మమ్మక్రమముగా శపించితిరి. కావున మీరుగూడ

నేకపర్యాయ మవనిపై జన్మింతురుగాక! యని వీరుగూడ వారిని శపించిరి. ఈవిధముగా వారొండొరులను శపించుకొని హాహాకారములు చేసిరి. ఈ కోలాహలము నాలకించి శ్రీమహావిష్ణువు వారిని లోనికి రండని యాదేశించెను. లోనికి జని వారు సంఘటిల్లిన సమాచారమంతయు నా పరమపురుషునకు నివేదించి తమకు శీఘ్రముగా విముక్తి గలుగు మార్గము నుపదేశింప నతనిని వేడుకొనిరి. అప్పుడు మహావిష్ణువు నాయందు వైరభక్తి నవలంబించినచో మూడు పుట్టువుల యనంతరము నా సన్నిధికి జేరగలరు. ప్రేమ భక్తి నవలంబించినచో నేడు పుట్టువులు గడచినమీదట నా చెంతకు రాగలరు. ఇందు మీకేమార్గము సమ్మతమైన దానిని మీ రనుసరింపుడు" అని వారి కెఱుగజెప్పెను. వైరభక్తి నవలబించి మేము శీఘ్రవిముక్తినే పొందగోరుచున్నవారమని వారు బదులు పలికిరి. అట్లగాక! యని విష్ణువు వారి నటనుండి యంపివైచెను.

అనంతరము వారు పోయి పుడమిపై జన్మించిరి. వారిలో జయుడనువాడు తొల్లి తొలిపుట్టువున హిరణ్యాక్షుడు గాగా విజయుడనువాడు హిరణ్యకశిపు డయ్యెను. మహావిష్ణువు వారిలో హిరణ్యాక్షుని మహావరాహరూపమును దాల్చియు, హిరణ్యకశిపుని నృసింహరూపము నవధరించియు నంతమొందించెను. మఱుజన్మమున జయుడు రావణుడు గాగా విజయుడు కుంభకర్ణు డయ్యెను. వారి నీ శ్రీరామచంద్రుడే సంహరించెను అశ్వినీదేవత లిరువురు నైరావణ మైరావణులుగా నావిర్భవించిరి. వారు పాతాళమున నివసించుచు నీ రఘునందనునిచేత నసువులను బాసిరి. ముందు ముందు జయుడు శిశుపాలుడుగను, విజయుడు దంతవక్త్రుడుగను బుడమిపై బుట్టుదురు. వారి నీ శ్రీరామచంద్రుడు ద్వాపరయుగమునందు శ్రీకృష్ణుడై యవతరించి యంతమొందించును. ఈ విధముగా మూడు పుట్టువులును జూర్తి

నైనంతనే యా జయవిజయులు యథాపూర్వకముగా మహావిష్ణువు సన్నిధికి జేరగలరు. దేవవైద్యులగు నశ్వినీదేవతలు విముక్తులై స్వస్థానమగు స్వర్గమున నెలకొన్నారు. మునివరేణ్యా! వింటిరిగదా! ఇది విష్ణుపార్షదుల ప్రాచీన శాపకారణము. శ్రీరామచంద్రా! ముందు ముందు జరాసంధుడు, కంసుడు మున్నగు దురాత్ముల కతమున జగతీతల మంతయు దల్లడిల్లువేళ శ్రీకృష్ణరూపమున నవత రించి యా ఖలుల నెల్లరను గడతేర్పగలవు. అట్లే ముందు ముందు గలియుగమునందు బుద్ధరూపమున నవతరించి బౌద్ధుల నందఱను జయింపగలవు. కలికాలాంతమున వర్ణసాంకర్యము నవలోకించి కల్కి రూపము నవధరించి యవలీలగా ఖలుల నందఱను సంహరింపగలవు. మా క్షేమము నుపలక్షించి యీ విధముగా నీ పది యవతారములే కాక యింకను నెన్నియో యవతారములను దొలుత దాల్చితివి. ముందును దాల్పగలవు.

ఇట్లు స్తుతించుచున్న కమలగర్భుని గాఢముగా గౌగిలించికొని తన పార్శ్వదేశమున గూరుచుండ బెట్టుకొని శ్రీరామచంద్రుడు "కమలగర్భా! వాల్మీకిమహర్షి వచనానుసారముగా నిది మొదలు జనులు మందహాసము జేయవచ్చును. తన్మూలమున నీకును, దేవత లకును సుఖము చేకూరగలదు" అని పలికి యతని మూటగొలిపెను. ఆ పలుకు విని బ్రహ్మయు, దేవతలును బరమానందభరితులైరి.

అప్పుడు సభలో శ్రీరామచంద్రుడు వాల్మీకిమహర్షిని గాంచి "మునివరేణ్యా! నే నవతరించుటకు ముందే మీరు నా చరిత్రమును రచించితిరిగదా! ముందుగనే నా చరిత్రము మీ కెట్లు తెలిసినది? ఎవరు మీ కుపదేశించిరి? పూర్వజన్మమున మీ రెవరు? అప్పుడెట్టి పుణ్యకర్మము నాచరించితిరి? నాకు విశదముగా వినిపింపుడు" అని

ప్రశ్నించెను. అప్పుడా మహర్షి యీ విధముగా నోడువ నారంభించెను.

శ్రీరామచంద్రా ! చక్కని ప్రశ్న మొనరించితివి ? నొడువుచున్నాడను. సావధాన మనస్కుడవై యాలకింపుము. నీ నామము యొక్క మహాత్మ్య మెవరికిని వర్ణింప నలవిగానిది. దాని ప్రభావమున నేను బ్రహ్మర్షిత్వమును బడసితిని. నా పూర్వవృత్తమును వినిపించుచున్నాడ నాలకింపుము.

పంపాతీరమునందు దొల్లి శంఖుడను పేర బరగు మహా యశశ్శాలి యగు బ్రాహ్మణోత్తము డుండెను. అతడు తన గురువువలన మహత్తరమైన సిద్ధిని బడసెను. అనంతర మతడు గోదావరిని, పవిత్రమైన భీమరథీనదిని దాటి నీరులేక, జనసంచారములేక కంటకములు కారణముగా నడువ నలవిగాకయున్న యొక ఘోరారణ్యమున బ్రవేశించి ముందునకు సాగిపోవుచుండెను. అది వైశాఖమాసము. ఎండ ప్రచండముగా నుండెను. క్రమముగా మధ్యాహ్న మయ్యెను. అప్పుడు దురాత్ముడై, ధనుర్ధారియై దయాదాక్షిణ్యము లన నెట్టివో యెఱుగనివాడై కాలాంతకునివలె గానవచ్చు నొక బోయవాడా సూర్యప్రభాభాసమాను డగు బ్రాహ్మణుని బరికించెను. అతడు వెంటనే యా విప్రుని సమీపించి ఖడ్గముతో బెదరించి యతనికడ నుండి యతని కుండలములు, ఛత్రము, పాదరక్షలు, వస్త్రములు, కమండలువు మున్నగువాని నన్నిటిని హరించి పొమ్మనెను. ఆ బ్రాహ్మణు డట్లే ముందునకు సాగిపోవ దొడఁగెను. ఆ ప్రదేశము నిర్జనమైనది. ఎండ మండుచున్నది. క్రింద ముసుక యిసుక చంద్రనిప్పువలె గనలుచున్నది. ముందున కడుగిడ శక్యము గాకున్నది. ఆ బ్రాహ్మణునకు బాదములు గాలిపోవదొడగెను. ఆ కారణమున నతఁ డొక చోట దృణములచే గప్పబడిన ప్రదేశమున వస్త్రము పఱచి

కొని దానిపై గూరుచుండెను. మఱల లేచి పాదములు గాలుచుండగా హాహాకారములు సేయుచు ముందుదెసకు బరుగిడ దొడగెను. మఱల గూర్చుండుచుండెను. ఇట్లు బాధపడుచున్న యావిప్రుని గాంచి యా బోయవాడు తనలో నిట్లు తలపోసికొనెను. నావృత్తి చౌర్యవృత్తి. ఆజన్మాంతమున సాధించుకొన్నదెల్ల నాకు స్వకీయమే. చౌర్యవృత్తిచేత వస్తుసంగ్రహమున నెవడెంత సాధించికొన్న నంతయు వానికి స్వకీయ మగుట మా బోయవాండ్ర నిర్ణయము. కావున జౌర్యవృత్తిచేత సాధించికొన్న యీ చెప్పులను మఱల నాబ్రాహ్మణున కిచ్చివైచె దను. ఈ పాదరక్షాదానమున బాపాత్ముడనగు నాకును గొంత శ్రేయము గలుగవచ్చును. ఈ చెప్పు లరిగిపోయి కులుచలైనవి. నాపాద ములకివి యిముడుటలేదు. కావున వీనితో నాకు బనిలేదు. ఇట్లు నిశ్చ యించికొని పరుగిడిపోయి యతడా చెప్పుల నాబ్రాహ్మణున కిచ్చి వైచెను. వానిని స్వీకరించి యతడు బాధానివృత్తిని బొంది సుఖీభవ! యని యా బోయవానిని దీవించి ఓయి బోయవాడా! నీ పూర్వపుణ్య వశమున నీ వైశాఖమాసమున మండువేసవిలో నావంటి బ్రాహ్మణు నకు బాదరక్షాదానము సేయు సంకల్పము నీమనమున జనించినది. అని పలికెను.

నేను బూర్వజన్మమునం దేమి పుణ్యము జేసితినో తెలియ జెప్పుడు మహాత్మా! యని యప్పుడు బోయవాడా బ్రాహ్మణుని బ్రశ్నించెను. అప్పుడు బ్రాహ్మణుడు 'ఓయి వ్యాధుడా! ఇక్కడ నెండ బహుప్రచండముగా నున్నది. ఇక్కడ నీరులేదు. నీడలేదు. కావున నేను దొలుత ననువుగానుండు మఱియొక తావునకు జేరి నీరు ద్రాగి నీడపట్టునకు జేరవలయును. అటుమీదట నీపూర్వవృత్తము నీకు వినిపించెదను' అని బదులు పలికెను. "ఇక్కడకు సమీపమును ననే యొక సరోవరమున్నది. అచ్చట ఫలభారవినమ్రములైన వెలగ

చెల్లున్నియో విలసిల్లుచున్నవి. ఆయెడ మీకు సంతుష్టి కలుగగలదు. రండు! పోవుద' మని వ్యాధుడు దోయిలి గట్టుకొని యా బ్రాహ్మణుని బ్రార్థించెను. అట్లకాక! యని యతఁ డాతని ననుగమించి కొంత దవ్వరిగి యాసరోవరమును జేరెను. అందు స్నానము జేసికొని వస్త్రధారణ మొనర్చికొని మాధ్యాహ్నిక క్రియలను నిర్వర్తించి కొనెను. దేవపూజన మొనర్చికొనెను. ఇంతలో వ్యాధుడు చుట్టుపట్టులనుండి కొన్ని కందమూలఫలములను సేకరించి కొనివచ్చెను. వాని నారగించి కడుపార నీరములు గ్రోలి చిక్కని నీడగల యొక్క తావున హాయిగా నుపవిష్టు డయ్యెను. అప్పుడా వ్యాధుని పూర్వపుణ్యమును గూర్చి యతని కిట్లు నొడువ నారంభించెను.

ఓయి బోయవాఁడా! చెప్పుచున్నాఁడ నాలకింపుము. నీవు పూర్వజన్మమున శాకలనగరమునం దుండు నొక వేదవేదాంగపారంగతుఁడవైన విప్రుఁడవు. నాఁటి నీ నామధేయము స్తంభుఁడు. శ్రీవత్సగోత్రమున బుట్టితివి. మహాపాపాత్ముఁడవై చరించితివి. సాంగత్యదోషము కారణముగా నానాఁడు నీకొక వేశ్యతోడ బ్రగాఢమైన యనుబంధ మేర్పడినది. నీవు నిత్యకర్మానుష్ఠానమును మాని శూన్యాచారుడవై శూద్రునివలె జరించితివి. నీకానాఁడు సౌందర్యరాశియగు నొక భార్య కూడ నుండెను. ఆమె బ్రాహ్మణనాయకుఁడవగు నీకు, నీవేశ్యకును గూడ పాదప్రక్షాళనము మున్నగా గల సమస్త పరిచర్యలు గావించినది. మిమ్మిరువురను బర్యంకముపై బరుండజేసి తాను గ్రింద శయనించునది. మీయిరువురి మాటను పాటిసేయునది. వేశ్య వారించుచున్నను దొలఁగక మీకిరువురకు నెల్లవేళల సుఖము గలిగింప బాటుపడుచుండునది. ఈవిధముగా దాను స్వయముగా దుఃఖపడుచు మీకు నిరంతరము సుఖమును గలిగించుటకు బాటుపడుచుండగా నామె కెంతయో కాలము గడచెను. అనంతర మొకనాఁడు నీవు

ముల్లంఘించి, దిలమిశ్రములైన యన్నములను కోరి పెరుగుతోడ భక్షించితివి. ఈ యపథ్యసేవనము కారణముగా నీకు వమనములు, విరేచనములు మొదలైనవి. క్రమముగా దారుణమైన రోగమునకు గురియైతివి. అవ్యాధిమూలమున మహాబాధ ననుభవించుచుంటివి. ఇంటిలో విత్తమున్నంతవఱకు నిలిచియుండి యది సమాప్త మగుటతోడనే నిన్నాశ్రయించియున్న వేశ్య మఱియొక ధనికుని యాశ్రయమును గోరి నిన్ను వీడి వెడలిపోయినది.

అనంతరము నీవు రోగపీడితుడవై దీనవదనుడవై నిభార్యతో దేవీ! వేశ్యాసక్తుడనై యధర్మమతుడనై నిష్ఠురుడనై నీకెట్టి సుఖమును గలిగింపకలంపక పరమమూర్ఖుడనై చరించితిని. నన్ను రక్షించు! పతివ్రతలై చరించు భార్యను క్షోభపెట్టిన మానవుడు పదియు నేడు జన్మములు నపుంసకుడగును. రేబవళ్ళు సజ్జనసమాజమునకు నింద్యుడనైతిని. సాధువర్తనురాలవగు నిన్నవమానించిన కారణమున నేను పాపపు యోనిలోనికి పోయెదను. నేనింతవఱకు నిత్యక్రోధనుడనై నిష్ఠురభాషణుడనై నీకు మహాదుఃఖము నొదవించితిని. నన్ను మన్నింపుము'' అని వేడికోలు మాటలాడితివి. అప్పుడామె దోయిలి గట్టుకొని వినయపూర్వకముగా నీతో నిట్టులన్నది. స్వామీ! మీరు దిగులు జెందవలదు. సిగ్గుపడవలదు. మీ యెడల నాకావంతయు కోపములేదు. పురాకృతములైన పాపములే దుఃఖములగును. అట్టి దుఃఖములను సహర్షముగా సహించు స్త్రీగాని, పురుషుడుగాని యుత్తమత్వము నెనయుదురు. నేను దొలిపుట్టువున నేదియో పాపము లొనరించియుందును. దాని నీనా డనుభవించుచున్నాను. నాకీ విషయమున నిసుమంతయు చింతలేదు. ఈ విధముగా నూఱటమాటలాడి యామె తన కడనుండియు, సోదరబాంధవుల కడనుండియు ధనమును గొనివచ్చి నిన్ను బోషించినది. నీ శరీరమునం

దామె పాలకడలిపై బవళించు శ్రీమహావిష్ణువును ధ్యానించికొన్నది దివారాత్రములు నీచెంతనుండి నీ మలమూత్రశోధనము గావించినది గోటితో నీశరీరమునందు బుట్టిన క్రిములను దొలగించునది. ఆమె రేయిని గాని, పగటను గాని నిదురింప నెఱుగదు.

అనంతర మామె దేవతలను, విశ్వదేవులను సంబోధించి మహానుభావులారా! నాపతి కారోగ్యము ను బ్రసాదింపుడు. నా పతిని బాధారహితుని గావింపుడు. అమ్మా! చండికాదేవి! నామగని కారోగ్యము నేకూరినచో నీకు మహిషరక్తమాంసములతో గూడిన యన్నము నర్పించెదను. గణనాయకా! నీకు గుడుముల నర్పించెదను. ప్రతి శనివారము నుపవాసము సేసెదను. మధురపదార్థములను, నేతిని భుజింపమానివైచెదను. తైలాభ్యంగమును ద్యజించివైచెదను. నా భర్త రోగహీనుడై నూరేండ్లు జీవించునట్లు లనుగ్రహింపుడు.' అని ప్రతిదినము వేడుకొనజొచ్చెను. ఇట్టులుండగా వైశాఖమాసమున నొకనాడు గ్రీష్మతప్తుడై మహానుభావుడగు దేవలమహర్షి నీ గృహమున కరుగుదెంచెను. అప్పుడామె యినా! ఋషిపుంగవు డేగుదెంచినాడు. ఈ మహాత్మునివలన మీ కారోగ్యము సేకూరగలదు. కావున మీకు సమ్మతమైనచో నే నీతని కాతిథ్యమొసగ నెంచుచున్నను. మీకు సమ్మతము గానిచో మానివైచెదను. ఏమి సేయుమందురు? అని నిన్ను బ్రశ్నించినది. నీవు ధర్మప్రముఖుడవైన కారణమున వైద్యుడను నెపమున నిన్ను వంచితుని జేసి ప్రశ్నించినది. అంతటను నీవు సమ్మతించితివి. అప్పుడామె సంతుష్టాంతరంగురాలై సాదరముగా నామునివర్యుని బూజించి యాతనికి పాదప్రక్షాళనము గావించి యాజలమును నీ శిరముపై జల్లినది. ఔషధమును గొంత నీ చేత ద్రావించినది. ఆ మహానుభావునకు శాకములు, దివ్యాన్నములతోడి భోజనము, సుగంధము, వీవన మున్నగునవి సమర్పించినది. ఈ విధముగా నామె

నీ వెలువరించిన యా మహాభాగుని గ్రీష్మతాపమును హరించినది. అతను తెల్లవాఱ సూర్యుడుదయించినంతనే నీ యిల్లు వీడి మఱియొక గ్రామమునకు వెడలిపోయినాడు.

అనంతర మనతికాలమున నీ వ్యాధి సన్నిపాతముగా బరిణమించినది. తన్నివారణమునకై యామె త్రికటుకమును (శొంఠి, మిరియము, పిప్పలి) తెచ్చి నీ నోట నుంచినది. అప్పుడు శ్లేష్మప్రకోపము గారణముగా నీ దంతపంక్తులు రెండును గలిసి బిగిసిపోయి యామె వ్రేలు ఖండితమై తత్ఖండము నీనోట నుండిపోయినది. ఈ విధముగా నీవు శయ్యపై నుండియే పంచత్వము నొందితివి. మరణకాలమున గూడ నీవానాడు నిన్ను వీడిపోయిన గణికను మఱవలేదు. పిమ్మట నీభార్య తన కంకణములనమ్మగా బ్రాప్తించినధనముతో జందనపుగఱ్ఱలను గొని వానితో జితిని జేర్చికొని నీమృతదేహమును దానిమీదకు జేర్చినది. శ్రీమహావిష్ణువునందు జిత్తమును నిలిపికొని యామె గూడ జితి నధిరోహించి నీపాదములతో దనపాదములు, భుజములతో భుజములు, హృదయముతో హృదయము, మొగముతో మొగమును దాకునట్లుగా నీ శరీరము నాలింగనము జేసికొని దగ్ధురాలై యసువులను దొరగినది. ఈ విధముగా నా మహాపతివ్రతాశిరోమణి దేహమును బాసి నీకు నమస్కారము జేసి విష్ణులోకమునకు వెడలిపోయినది.

బ్రదికినంతకాలము దురాచారపరుడవై వేశ్యాలోలుడవై చరించి యంతిమసమయమున నా వేశ్యనే తలపోయుచు నసురులు దొరగిన కారణమున గార్ద్యముతో నిండియుండి యెల్లవేళల నుద్వేగమును గలిగించు నీ పాపభూయిష్ఠమైన బోయపుట్టువు నీకు బ్రాప్తించినది. నీవు దొలిపుట్టువున నొక యుత్తమబ్రాహ్మణునకు బానకమర్పింప సమ్మతించితివి. తత్పుణ్య ప్రభావమున నీకీనాడు నాకు

పాదరక్షాప్రదానము సేయవలెనన్న సత్సంకల్ప ముదయించినది. సమస్తపాపపరిహారకమైన మునిపాదోదకమును శిరముపై దాల్చిన కారణమున నీనాడీ వనములో నీకు నాతోడి సాంగత్యమును, నా ముఖమున నీపూర్వపుణ్య ప్రసంగము నాలకించు సదవకాశమును సంప్రాప్తమయ్యెనవి. భార్యయొక్క వ్రేలి ఖండమును నోట నుంచి కొని మరణించుటచే నీకిప్పుడీ వనములో మాంసమే యాహారమైనది. ఆనాటి వేశ్యయే యిప్పుడు బోయవనితయై పుట్టి నీకు భార్యయైనది. నీవానాడు మంచముపై మరణించిన కారణమున నీకీనాడు భూతలమే శయ్యయైనది. ఇది నీ పూర్వజన్మ వృత్తాంతము. దివ్యదృష్టిచే దెలిసి కొని నీకు దెలియజెప్పితిని.

ఇప్పుడు నీ భావివృత్తాంతమును గూడ నొడువుచున్నాడ నాలకింపుము. ముందు ముందు భృగువను పేర బరగు ముని యొక డనాహారముగా నొక సరోవరమున నుండి తీవ్రతప మొనరించును. తపము ముగిసినమీదట నొకనా డాతని వీర్య మాతని కన్నులనుండి బహిర్గత మగును. దానిని ఋతుకాలమున నొక సర్పిణి గ్రహించును. ఆ సర్పిణికి నీవు తనయుడవై జనియింతువు. బోయనాండ్రచే బెంచ బడి నీవు నొక బోయవాడ వయ్యెదవు. నీవీనాడు చేసిన పాదరక్షా ప్రదానపుణ్యమున నానాడు సప్తమహర్షులతోడ సాంగత్యము నెన సెదవు. వారి యనుగ్రహమున వాల్మీకిమహర్షివై దివ్యమైన శ్రీరామ చరిత్రమును రచించి జగద్విఖ్యాతిని గందువు.

ఇట్లు పలికి శంఖుడు సవిస్తరముగా నాతనికి వైశాఖమాస ధర్మములను గూడ నుపదేశించెను. అప్పుడు సంతసించి యాబోయ తా నాతనినుండి హరించిన వస్తువుల నెల్ల నాతని కిచ్చివైచెను. శంఖుడును సంతుష్టాంతరంగుడై యాబోయవాని నా వనమునందే నివసియింప నియమించి పిమ్మట గౌతమీతీరమునకు వెడలిపోయెను. ప్రీతిపూర్వక

వసగా వైశాఖమాసధర్మములను బాటించుచు నావ్యాధుఁడా వనము నందే నిలిచిపోయెను.

శ్రీరామచంద్రా! ఆవ్యాధుఁడను నేను. ఆ పుట్టువు పూర్తి యైన మీఁకట గృణుమహర్షి వీర్యమున సర్పిణీగర్భమున నా కిప్పటి యీ పుట్టువు సంభవించినది. నేను జిన్ననాట గిరాతులచే బెంచఁబడి తిని. జన్మము మాత్రమే బ్రాహ్మణజన్మము. కాని నా యాచరణము లన్నియు శూద్రాచరణములు. అజితేంద్రియుఁడనగు నాకొక శూద్ర వనిత యందు పెక్కురు పుత్రులు ఉద్భవించిరి. అనంతరము తస్కరుల వర్గములోఁ జేరి నేను నొక తస్కరుఁడనై తిని. అనయమును ధనుర్బాణ ములను జేల ధరించి జీవులపాలిటి కంతకుఁడనై చరించితిని. ఒకనాఁడు నాకు మహారణ్యమధ్యమున జ్వాలనప్రభాజాజ్వల్యమానులై రవితేజో విరాజితులై వెలుగుచు సప్తమహర్షులును గానవచ్చిరి. నిలుఁడు! నిలుఁడు! అని యఱచుచు వారి వస్త్రాభరణాదికమును హరింపనెంచి వారివెనుక బరుగు పెట్టితిని. వారిని సమీపించినంతనే ఓరి బ్రాహ్మ ణాధమా! నీకు మాతో బనియేమి? యని వారు నన్ను బ్రశ్నించిరి. నేను మీవస్త్రాభరణాదికమును హరింప వచ్చితిని. నాకు భార్యయు, జాలమంది పుత్రులు నున్నారు. వా రాఁకలి గొనియున్నారు. వారిని బోషింప నేని వనములోఁ జోరుఁడనై తిరుగుచున్నాను' అని నేను బదులు పలికితిని. అట్లులైన నీవిప్పుడే నీయింటికి బోయి నీవారి నందఱను బిలిచి నేను మిమ్ము బోషింప బ్రతిదినము జేయుచున్న పాపములు నీవు పంచికొందువా? నీవు పంచికొందువా? యని ప్రతి వ్యక్తిని బ్రశ్నించి వారి యభిప్రాయమును దెలిసికొని రమ్ము! నీవు మఱలి వచ్చునంత వఱక మేమిచ్చటనే నిలిచియుందు మని శపథము జేయుచున్నాము. ఆడినమాట దప్పినచో మేము బ్రహ్మహత్య, మద్యపానము, సువర్ణచౌర్యము, గురుపత్నిగమనము, బ్రాహ్మణ

ధనాపహరణము, దుష్టసాంగత్యము మున్నగువానివలన గలుగు మహాపాతకము నొందుదుము. పోయి రమ్మని వారు నాతో జెప్పిరి. నేపథ్యముల మూలమున వారిని విశ్వసించి యట్లు కాక! యని నేనింటికి జని యా మహర్షులు చెప్పిన విధముగా నావారి నందఱను బిలిచి యొక్కొక్కరిని బ్రశ్నించితిని. 'నీవు చేయుచున్న పాపమంతయు నీదే. మేము కేవలము ఫలమును మాత్రమే యాశించువారము' అని వారు నాకు బ్రత్యుత్తర మిచ్చిరి. తోడనే నాకు జాల దుఃఖము గలిగినది. పరితపించు నంతరంగముతో నేనా కరుణాళువులగు మహర్షుల చెంతకు బరుగిడి వచ్చితిని. వారిని దర్శించినంతనే నా కంతఃకరణశుద్ధి యొదవినది. ధనుర్బాణములను బాఱవైచి నేను శీఘ్రముగా వారి చరణకమలములపై సాష్టాంగముగా వ్రాలితిని. నరకసముద్రమున మునిగిపోవుచున్న నాపై గృప జూపి నన్ను రక్షింపుడు! రక్షింపుడు! మహానుభావులారా! యని నేను వారితో మొఱపెట్టుకొంటిని. అప్పుడు వారు నన్ను గాంచి లెమ్ము! లెమ్ము! పురుషుడా! లెమ్ము! నీకు శ్రేయ మొదవగలదు. సజ్జనసాంగత్యము నీయెడల నిప్పుడు చరితార్థమైనది. నీ కేదియేని మోక్షదాయకమగు మంత్రము నుపదేశించెదము. లెమ్మని యూఱడించిరి. 'ఇతడు దుష్టవర్తనుడు. బ్రాహ్మణాధముడు. ఉపదేశమును బొందనర్హుడు గాడు. అయినను మన చరణతలమున వ్రాలి శరణు వేడినాడు. కావున మోక్షమార్గము నుపదేశించి వీనిని రక్షించుట మన ధర్మము' అని వారు పరస్పరసమాలోచనము గావించికొనిరి. పిమ్మట నో శ్రీరామచంద్రా! వారు నాయందు బరిపూర్ణ కృపాకటాక్షములను నెఱపి నీ పాపనామాక్షరములను వ్యత్యస్తములను గావించి 'మరా మరా మరామ' యని నాకు మంత్రము నుపదేశించి మేము మఱలి వచ్చునంత దనుక నీమంత్రము నేకాగ్రమానసుడవై జపించుచుండు మని నాకాదేశించి తము యిచ్చ వచ్చిన నెలవునకు గదలిపోయిరి.

నేను వారి యుపదేశానుసారముగా నట్లే యాచరించితిని. ఏకాగ్ర చిత్తముతో జపము సేయుచు నేను బాహ్యజ్ఞానమును గోలుపోయితిని. నా తపమునకు సాక్షిగా నెదుట నొక దండమును స్థాపించితిని. ఇట్లు సర్వసంగములను బరిహరించి తప మొనరించుచున్న నా కెంతయో కాల మతిక్రమించెను. నామేనిపై బెద్దపెద్ద పుట్ట లుద్భవించెను. నా తపఃప్రభావము గారణముగా నెదుట నిలిపిన దండ మొక మనోహరవృక్షముగా మాఱుపొందెను. అనంతర మొక వేయి యుగముల కాల మతిక్రమించిన మీఁదట నా సప్తమహర్షులును మఱల నా నెలవున కరుగుదెంచి నన్ను బుట్టనుండి వెలికి రమ్మని యాదేశించిరి. వెంటనే నేను మంచునుండి వెలువడు సూర్యభగవానునివలె వల్మీకమునుండి వెలికి వచ్చితిని. అప్పుడు వారు నన్ను గాంచి "నీ విప్పుడు వల్మీకమునుండి ప్రాదుర్భవించితివి. ఇది నీకు నూతనజన్మము. ఇది మొదలు నీవు లోకములో వాల్మీకి మహర్షి యను పేర బ్రసిద్ధి గాంతువు." అని పలికి యాకాశమార్గమున దమ యిచ్చవచ్చిన దిక్కునకు మగిడిపోయిరి.

రఘుకులాంబుధిపూర్ణచంద్రా! శ్రీరామచంద్రా! నీ మహాత్తర నామప్రభావమున నేనిట్టివాఁడను గాగలిగితిని. ఒకనాఁడు సమస్త కల్యాణనిలయమైన కైలాసమునందు బ్రహ్మ పరమశివుని ముఖమున వేదవచనములలో నీ దివ్యచరిత్రము నాలకించెను. అనంతర మా చరిత్రము నా బ్రహ్మ నారదున కుపదేశించెను. పిమ్మట నారదుఁడు నా కుపదేశించెను. పిదప నొకనాఁ డొక బోయవాఁడు తమసానదీతీరమునం దొక క్రౌంచమిథునమును గాంచి యందలి మగపులుగును బొరిమాల్పగా గరుణాక్రందనము సేయుచున్న యాఁడుపక్షి నూరార్చు తలంపుతో నానోట శోకము ముప్పదిరెండక్షరములు గల యొక శ్లోకరూపమున నప్రయత్నముగా వెలువడినది. అనంతర మొకనాఁడు

బ్రహ్మదేవుడు గూడ నరుగుదెంచి నీదివ్యచరిత్రమును నాకు సంగ్రహ ముగా వినిపించు కొన్ని వరములను గూడ ప్రసాదించెను. అప్పుడా మహాభాగుడు నీచరిత్రమును రచింప నాకాదేశించెను. తదనుసార ముగా నేను శతకోటిశ్లోక పరిమితి గలిగి యానందదాయకమగు నీ పుణ్యచరిత్రమును రచింప గలిగితిని. ఇది నా చరిత్రము. నీవు విన గోరితివి. నేను వినిపించితిని." అని నొకిని వాల్మీకిమహర్షి యూర కుండెను

ఈ యుదంత మంతయు రఘునందనుడు స్వయముగా నెఱిగి యుండియు నెఱుగనివానివలె ప్రశ్నించి తనను బరివేష్టించియున్న జను లందఱు నాలకించునట్టి సదవకాశమును సమకూర్చెను. అంతలో బృహస్పతి శ్రీరామచంద్రు నుద్దేశించి యిట్లు పలికెను.

రఘునందనా! పరమానందస్వరూపుడవైన నీదివ్యచరిత్రము నెవరు కీర్తింపగలరు? నీ కనేకనామము లున్నవి. ఆ నామముల తొలి వర్ణములతో గూడియే ప్రతిశబ్దము నేర్పడి జనులచే నుచ్చరింపబడు చున్నది. లోకసంబద్ధమైనవియేని వేదసంబంధమైనవేని 'అ' కార మాదిగా గల స్వరములు (అచ్చులు) పదునాఱును; 'క' కారము మొదలు 'క్ష' కారపర్యంతముగా నున్న వర్ణములు ముప్పదినాలుగును మంత్రరూపములైనవి. మంగళప్రదములైనవి. ఈ యేబదియు నీ పావననామముల తొలివర్ణములే. ఆ వర్ణములచేతనే చరాచరప్రపంచ మంతయు వ్యాప్తమైయున్నది. చరాచరప్రాణుల కేయే నామము లున్నవో అవి యెల్ల నీ నామములే. అందు అకారాదిక్రమమున నీ నామముల నేబదింటిని జేర్కొనుచుంటి. నాలకింపుము.

అ - అనంతః - అనంతాయ నమః, ఆ - ఆనందమయః - ఆనందమయాయ నమః, ఇ - ఇష్టాపూర్తఫలప్రదః - ఇష్టాపూర్త

ఫలప్రదాయ నమః, ఈ - ఈశ్వరః - ఈశ్వరాయ నమః, ఉ - ఉత్కృష్టః - ఉత్కృష్టాయ నమః, ఊ - ఊర్ధ్వరేతాః - ఊర్ధ్వరేతసే నమః, ఋ - ఋతంభరః - ఋతంభరాయ నమః ౠ - ఋణాయుక్తః - ఋణాయుక్తాయ నమః, ఌ - ఌశః - ఌశాయ నమః, ౡ - ౡపకః - ౡపకాయ నమః, ఏ - ఏకః - ఏకస్మై నమః, ఐ - ఐశ్వర్యదః - ఐశ్వర్యదాయ నమః, ఓ - ఓజదః ఓజదాయ నమః, ఔ - ఔదార్యచంచురః - ఔదార్య చంచురాయ నమః, అం - అంతరాత్మా - అంతరాత్మనే నమః, అః - అర్ధగర్భః - అర్ధగర్భాయ నమః, క - కరుణాకరః - కరుణాకరాయ నమః, ఖ - ఖడ్గీ - ఖడ్గినే నమః, గ - గతిదః - గతిదాయ నమః, ఘ - ఘనశ్యామః - ఘనశ్యామాయ నమః, ఙ - ఙణనః - ఙణనాయ నమః, చ - చమితాశేషదుష్కృతః - చమితాశేషదుష్కృతాయ నమః, ఛ - ఛత్రీ - ఛత్రిణే నమః, జ - జగన్మయః - జగన్మయాయ నమః, ఝ - ఝషరూపీ - ఝషరూపిణే నమః, ఞ - ఞటేశ్వరః - ఞటేశ్వరాయ నమః, ట - టణత్కారిధనుః - టణత్కారిధనుషే నమః, ఠ - ఠానబంధః ఠానబంధాయ నమః, డ - డమరుసత్కరః - డమరుసత్కరాయ నమః, ఢ - ఢుణ్ఢులుల్లులితపాపః - ఢుణ్ఢులుల్లులితపాపాయ నమః, ణ - ణకర్ణః - ణకర్ణాయ నమః, త - తపోరూపః - తపోరూపాయ నమః, థ - థవః - థవాయ నమః, ద - దక్షః - దక్షాయ నమః, ధ - ధన్వీ - ధన్వినే నమః, న - నష్టోద్ధరణధీరః-నష్టోద్ధరణ ధీరాయ నమః, ప - పరమేశ్వరః - పరమేశ్వరాయ నమః, ఫ - ఫలప్రదః - ఫలప్రదాయ నమః, బ - బలిపర్వప్రదః - బలి పర్వప్రదాయ నమః, భ - భగవాన్ - భగవతే నమః, మ - మధు

ఘాతీ - మధుఘాతినే నమః, య - యజ్ఞఫలప్రదః - యజ్ఞఫలప్రదాయ నమః, ర - రఘునాథః - రఘునాథాయ నమః, ల - లక్ష్మీశః - లక్ష్మీశాయ నమః, వ - వసిష్ఠః - వసిష్ఠాయ నమః, శ - శరణ్యః - శరణ్యాయ నమః, ష - షడ్గుణైశ్వర్యసంపన్నః - షడ్గుణైశ్వర్యసంపన్నాయ నమః, స - సర్వేశ్వరః - సర్వేశ్వరాయ నమః, హ - హయగ్రీవః - హయగ్రీవాయ నమః, క్ష - క్షమీ - క్షమినే నమః. ॥

రఘునాథా! ఇట్టి యేబది వర్ణములతోడను లోకమంతయు నిండియున్నది. ఘకారముతో మొదలై ఘటము, పకారముతో మొదలై పటము నిట్లే శబ్దము లన్నియు నేర్పడి లోకములో వ్యాపించినవి. కావున నీ లోకమంతయు వర్ణాత్మకమైనది. ఒక్కొక్క వర్ణమున కనేకభేదములు గలవు. తిన్మూలమున నీనామము లసంఖ్యాకములైనవి. వానిని నేను వర్ణింపజాలను. అయిదు మొగముల వేలుపగు నీశ్వరుడు జాలడు. వేయి మొగముల వేలుపగు నాదిశేషుడు గూడ జాలడు. అట్టిచో నీ మహత్త్వము నన్యులెవ్వ రుగ్గడింపగలరు? అయినను నీ వాల్మీకిమహర్షి శతకోటి శ్లోకపరిమితముగా నీ చరిత్రమును రచించి ధన్యత నొందెను.

విష్ణుదాసా! వింటివి గదా! ఇట్లు పలికి యా బృహస్పతి దేవతలవలనను రాఘవుని వలనను బూజల నందికొని యాతని కడ సెలవు గైకొని స్వర్గలోకమునకు వెడలిపోయెను. బ్రహ్మ సత్యలోకమునకు మఱలిపోయెను. వాల్మీకిమహర్షి చిత్రకూటమునందున్న తన యాశ్రమమునకు దఱలిపోయెను. అది మొదలుగా జనులెల్లరు సపన్నీతలమున మందహాసము సేయుదొడగిరి. ఆనందపూర్వముగా యథాపూర్వముగా మాంగళికకృత్యములు, మహోత్సవములు సేయ నారంభిం

చిరి. అతిహాస్యము నెన్నడును జేయక స్త్రీలు, పురుషులు నెల్లవారు నానందసంభరితహృదయారవిందులై క్రీడావినోదములతో గాలము బుచ్చదొడగిరి.

ద్వితీయ సర్గము సమాప్తము.

—:—

# తృతీయ సర్గము

## రామరాజ్య విశేషములు

శ్రీరామదాసుడు విష్ణుదాసున కిట్లు వివరించును.

శ్రీరామరాజ్యమునందు జనులెల్లరు నెల్లవేళల నానంద సంభరిత హృదయారవిందులై జీవనయాపనము సేయువారు. కలహములు, చోరభయములు, నిందాభయములు నన నెట్టివో వారెఱుగరు. ఆరాజ్యమున నెందును శాత్రవులు లేరు. సమృద్ధములై చరించు సైన్యములతో, వాహనములతో, దుష్టిపుష్టుల కొఱత నెఱుగని బుషిబృందములతో, సువర్ణాభరణ విభూషితులై చూడ ముచ్చట గొలుపు జనుల సమూహములతో, వా రనుదినము నాచరించు ధర్మము గారణముగా సస్యసమృద్ధములై పాలుపారు పొలములతో నాదేశము సుదేశమై, జనులు సుజనులై వర్ధిల్లిరి. పశుగ్రాసపు గొఱత నెఱుగక పశుసంతతి వర్ధిల్లెను. దేశ మంతయు దేవాలయపంక్తులతో దేజరిల్లెను. గ్రామము లన్నియు యూపస్తంభములతో, పుత్రమిత్ర కళత్రధనధాన్యసమృద్ధులను గన్న జనవర్గములతో శోభిల్లెను. అచ్చటి భూమి సురుచిర పుష్పగుచ్ఛసమలంకృతములై సొబగులీను కృత్రిమోద్యానములతో, సదాఫలదానదక్షములైన వృక్షపంక్తులతో, చారుతరజలహంసనివహమండితములైన జలజాకరములతో, నమలిన

సలిల సంభారసదనములై పొరలుచు ప్రవహించు నదులతో గన్నుల విందు సేయుచుండెను. అచ్చటి కులము లక్ష్మియు కులీనము లే. అన్యాయోపార్జితవిత్తముల కచ్చట దావేలేదు.

విభ్రమలక్షణము వెలదులకే కాని విద్వాంసులకు లేదు. కుటిలగమనము నదులకేకాని జనులకు లేదు. తమోలక్షణము రాత్రులకే కాని మానవమానసములకు లేదు. రజోలక్షణము రమణీమణులకేకాని ధర్మనిష్ఠాగరిష్ఠు లగు జనులలో గానరాదు. నాటిప్రజలు ధనాంధులు గారు. అయినను భోజనలోపము నెఱుగరు. నాటిరాజపురుషు లన్యాయవర్తనను నెఱుగరు. ఆనాడు గంద్రగోడ్డలి, త్రవ్వగోల, వింజామరము మున్నగువానియందు మాత్రమే దండము గానవచ్చెను. ఆతపత్రమునందు గాక మఱి యెందును దాపలక్షణము గోచరము గాలేదు. పాశమన్నదానికి రథవాదకుల కరములందే కాని జనులందు జాతి లేదు. (ఉరిశిక్ష లేదనుట) జలమునందు మాత్రమే జడత్వమును, నన్నని నెన్నడుములందు మాత్రమే దుర్బలత్వమును, వారివక్షోజములందు మాత్రమే కాఠిన్యమును, నౌషధములయందు మాత్రమే క్షారసంపర్కమును, (చెంగల్వకోష్టు), రత్నములందు మాత్రమే రంధ్రలక్షణమును, విగ్రహముల హస్తములందు మాత్రమే శూలమును, సాత్త్వికభావములందు మాత్రమే కంపానుభూతియు, (వణకుట) గామావేశమునందు మాత్రమే జ్వరతాపమును, గాలుష్యమునందు మాత్రమే దారిద్ర్యమును, జాతకములందు మాత్రమే దుర్లభత్వమును, సరోవరతరంగములందు మాత్రమే సంగరలక్షణమును, మతంగజములందు మాత్రమే దానహానియు (ఏనుగుల చెక్కిళ్లనుండి స్రవించు మదజలము) దరువులందు మాత్రమే కంటకలక్షణమును గానవచ్చెను. కాని జనులయం దిట్టి దోషలక్షణమైన గోచరము గాదు. విహారములు జనులయం దున్నవి. కాని వారి పక్షములల

ములు విహారములు (హారరహితములు) గావు. గుణవియోగలక్షణము (వింటి త్రాటి నెక్కబాయుట, సుగుణములనువీడుట) బాణములయందే కాని ప్రజలయందు బొడసూపదు. బంధోక్తి (కవితాబంధము, బంధనము గలిగించు మాట) పుస్తకములందే కాని జనులయందెందును గోచరముగాదు. నాటి శివభక్తులు దండమును దాల్చువారుగారు. సర్వకర్మసన్యాసము గావించినవారికి మాత్రమే దండ ప్రసంగముండెడిది. మార్గణములు (బాణములు) విండ్లయందు మాత్రమే కానవచ్చునవి. కాని ప్రజలలో మార్గణుడు (యాచకుడు) ఒక్కడును గానరాడు. కేవలము క్షపణకులు మాత్రమే చీవరములను దాల్చువారు. చాంచల్య మొక్క తుమ్మెదలయందే కనుపట్టును. కాని జనములలో నావంతయు గానరాడు.

ఇట్టి సర్వశుభలక్షణసంపన్నమైన దేశములో బహుళములైన యగడ్తలతో నలరారు విశాలమైన యయోధ్యానగరమును రాజధానిని గావించికొని ధర్మమూర్తియు, ప్రతాపశాలియు నగు శ్రీరామచంద్రుడు సీతామహాదేవీ సమేతుడై చక్కగా ధర్మబద్ధముగా, నిర్ద్వంద్వముగా, నిశ్చలముగా జిరకాలము రాజ్యపరిపాలనము జేసెను. అతడు సూర్యభగవానునివలె దేజరిల్లి శత్రువుల హృదయములకు, నయనములకు దాపము నొదవించెను. మిత్రుల హృదయములకు జంద్రుడై యాహ్లాదము నొదవించెను. ఇంద్రుడు మేఘములను బాఱద్రోలు విధమున రణరంగమున గోదండపాణియై నిలిచి వైరివర్గములను బాఱద్రోలెను. ధర్మదేవతవలె ధర్మాధర్మ వివేచనము జేయుచు దండింపదగనివారిని వీడి దండింపదగినవారిని మాత్రమే దండించెను. పాశహస్తుడగు వరుణునివలె దూరమున నుండియే పగతుర నెల్లరను బంధించివైచెను. రాక్షసుల యభ్యుదయమునకై పాటుపడు పుణ్యజనేశ్వరునివలె శత్రువర్గమువారగు రాక్షసులకు గూడ

మహోపకారము గావించెను. జగత్ప్రాణునివలె (వాయుదేవుడు) జగద్రక్షణదీక్ష వహించెను. సుజనులపాలిటి ధనదుడై (కుబేరుడు) రాజరాజత్వము నందెను. ఈశానునివలె(రుద్రుడు)శత్రుభయంకరుడై ప్రకాశించెను విశ్వేదేవులెల్లరు నాపరమపురుషుని గొనియాడుచు గొలుచువారు. సాధ్యులకుగూడ నతడ సాధ్యుడై రాణించెను. వసువు చేత (ధనము) నధికుడై యతడు వసువులను గూడ మీఱెను. గ్రహ ముల ప్రత్యక్షస్వరూప మితడే యనునట్టి వాసిగాంచెను. మరుద్గణము లనైన నాతడు గణింపడు. అశ్వినీదేవతల సౌందర్యము నాతడు పుడికి పుచ్చుకొన్నవాడు. తన సుగుణసంపదచేత నతడు తుషితులకు (గణ దేవతలు)సంతోషముగలిగించెను. సర్వవిద్యావిశారదుడై సర్వవిద్యా ధరాధిక్యమును సముపార్జించికొనెను. తన గీతమాధుర్యముచే గంధ ర్వుల గర్వమునుగూడ హరించెను. యక్షులు, రక్షస్సులును గూడ స్వర్గమున కెనయగు నాతని దుర్గమును రక్షించువారు. స్వర్గమునందలి యేనుగులా మహాపురుషుని మహాబలాఢ్యదంతావళములచే బరాజిత ములైనవి. దానవులు మానవులై యాతని సేవించిరి. గుహ్యకులా మహానుభావుని గూఢచారులై కొలిచిరి. శ్రీరామచంద్ర సార్వభౌమా! మామా వైభవముల తోడ మీదేశమున నిలిచి దివిజులమగు మేమె ల్లరమును మిమ్ము సేవింపగోరుచున్న వార మనుచు బ్రార్థించి యింద్రాదిదేవతలా మహాభాగు నానదము మీఱ సేవించిరి. ఆమహా పురుషుని శరములు వాయుమార్గమున బయనించుచు దమ శీఘ్రగ మన విద్య నాతని యశ్వములకు నేర్పెను. నడగొండలను దలపించు నతని యేనుగులయందు నిరంతరదాన లక్షణము(దాన - మదద్రవము, ఈవి) నవలోకించియే లోకులందఱు దానలక్షణము గలవారైరి. అతని గృహాంగణమున బండితులును, సమరాంగణమున సైనికులును శాస్త్రములచేత, శస్త్రములచేత నెన్నడును బరాజయము నెనయలేదు.

అతని రాజ్యములో శత్రువులకును, ప్రజలలో నాపదలకును దావు లేకుండెను.

దేవతల రాజ్యమగు స్వర్గమునందు గళలు గలవాఁడొక్కఁడే యుండెను. (చంద్రుఁడు) కాని శ్రీరామచంద్రుని రాజ్యములోని జను లెల్లరును బాల్యమునుండియే యచ్ఛమైన కళలతో గలగలలాడువారు. స్వర్గలోకమునందు మన్మథుఁ డొక్కఁడే యందగాఁడు. అయినను నతని కనంగత్వదోషము కూడ సంక్రమించినది. కాని శ్రీరామరాజ్యములో నున్నవారెల్లరు నట్టి దోషము నెఱుఁగని మన్మథు లన్న యెన్నిక గన్నవారు. గోత్రభిదుఁడు (పర్వతముల ఱెక్కలను ఛేదించిన యింద్రుఁడు, వంశమును భేదించినవాఁడు) అను ప్రథ దేవతల నాయకునకు మాత్రమే ప్రాప్తించినది. కాని రామరాజ్యములో నట్టి ప్రథను గన్న వాఁడొక్కఁడును గానరాఁడు. దేవలోకములో చంద్రుఁడు పదునైదు దివసముల కొకమాఱు క్షయరోగమునకు గుఱి యగుచుండును. కాని శ్రీరామచంద్రుని యేలుబడిలో నెవ్వరు నట్టిరోగమునకు గుఱియైన వారు గనరారు. వినరారు. స్వర్గము నవగ్రహములకు నెలవుగా ప్రసిద్ధి గన్న రామరాజ్య మనవగ్రహముగా (అనావృష్టిదోషము లేనిది) నెన్నికగన్నది. అమరలోకమున హిరణ్యగర్భుఁడు (బ్రహ్మ, గర్భమున బంగారమును దాఁచికొన్నవాఁడు) ఒక్కఁడే. కాని రఘువీరుని రాజ్యమునందున్న గృహములన్నియు హిరణ్యగర్భములే. దేవలోకమున సప్తాశ్వుఁడు, నంశుమంతుఁడు ననఁదగినవాఁడు సూర్యుఁడొక్కఁడే యుండెను. కాని యయోధ్యానగరవాసు లందఱు ననేకాశ్వములు గలవారును, సదంశుకులు (నుత్తమవస్త్రధారులు) నై వఱలిరి. స్వర్లోకమున వెలయు నుత్తమశ్రేణికి జెందిన యచ్చరలేమలను బోలు నచ్చరలేమ లెందఱో యయోధ్యయందును నెలకొనియుండిరి. వైకుంఠమునందు విష్ణుప్రియ యగు పద్మ (లక్ష్మి) యొక్కతెయే యుండెను.

కాని యయోధ్యలో నొక్కొక్క పౌరుడు నూరుపద్మముల (పద్మ మనగా నూరుకోట్లు) ధనమున కధిపతియై వర్ధిల్లెను. నాటి రాజపురుషులు నీతిబాహ్యులు గాని తేజోవిహీనులు గాని కారు. అలకానగరమునం దొక్క ధనదుడే (కుబేరుడు) యుండెను. కాని యయోధ్యానగరమునందు ప్రతిగృహస్వామియు ధనదుడే.

ఈవిధముగా శ్రీరామచంద్రుడు సమస్తసద్గుణసంపన్నుడై, సౌభాగ్యశాలియై, సౌందర్యపరిపూర్ణుడై, శౌర్యమునకు, నౌదార్యమునకు సదనమై, యనేక సమరములందు విజయలక్ష్మీశోభితుడై, లోకదారిద్ర్యము నెల్ల సిరి కర్పించినవాడై, యెడమపార్శ్వమున సీతామహాదేవీ విభూషితుడై, శత్రుపురములను జయించువేళ నుగ్రుడై, పూర్ణచంద్రనిభాననుడై, యెడతెగని యవభృథస్నానముల మూలమున దడి యారని శిరోజసంహతి గలవాడై, రాజరాజేంద్రుడై, ప్రజాపాలన తత్పరుడై, బొక్కసముల మూలమున భూసురులకు ప్రీతి నొదవించువాడై, పరమేశ్వర చరణారవింద నిరంతరధ్యానతత్పరుడై, పరమశివుని కథాప్రసంగములతో గాలము బుచ్చువాడై, సీతామహాదేవిచే గమ్మగబడు నడుగుదమ్ములు గలవాడై, యాబంగారుతల్లితోడి క్రీడావినోదములచేత నానందపరవశుడై, సుతులతోడను, సోదరులతోడను గూడి ధర్మబద్ధముగా రాజ్యమును బాలించెను.

శ్రీరామచంద్రుడు చక్కగా సాకేతనగరము నేలు కాలమున ప్రజలు తుష్టిపుష్టుల కొఱత నెఱుగరు. తరువులు సురుచిర పుష్పఫలభారవినమ్రములై సుఖసంధానచణములై శోభిల్లినవి. ఆమహామహుని రాజ్యమునందు పురుషు లెల్లరు నేకపత్నీవ్రతధారులు. పడతు లందఱును పాతివ్రత్యధర్మ పరతంత్రలు. నాడు పండితుడుగాని బ్రాహ్మణుడు లేడు. క్షత్రధర్మము నెఱపని క్షత్రియుడు లేడు. ధనోపార్జనపటుత లేని వైశ్యుడు లేడు. బ్రాహ్మణసేవాపరతంత్రుడు గాని

శూద్రుడు లేడు. ఆరాష్ట్రమునందు బ్రహ్మచారు లేనాడును దమ
బ్రహ్మచర్యవ్రతనిష్ఠకు భంగము నొదవించికొనక గురుకులమున
నసించి చక్కగా వేదాధ్యయనము సేయువారు. ఆనాడు నిమ్న
శ్రేణికి జెందినవారు గాని, యున్నతశ్రేణికి జెందినవారు గాని యెన్న
డును దమ పరంపరను మీఱి ప్రవర్తింప నిచ్చగింపలేదు. ఆరాజ్యము
నందు సంతానహీనుడు గాని, ధనహీనుడు గాని, విరుద్ధసేవనమునకు
బాల్పడువాడుగాని, యకాలమరణము నొందువాడుగాని, కుచ్చి
తుడు గాని, యసభ్యప్రలాపము లాడువాడు గాని, వంచకుడుగాని,
హింసకుడుగాని, వేదబాహ్యుడుగాని, దుశ్చేష్టుడుగాని, కళత్రవియు
క్తుడు గాని, ధూర్తుడుగాని యెక్కడను లేడు. ఆనాడెందు జన్న
నంచే వేదఘోషమో, శాస్త్రచర్చయో, మనోహరసంభాషణమో,
మంగళగీతములో, వీణావేణుమృదంగధ్వనులో కర్ణగోచరము లయ్యె
డివి, సోమపానము దక్క మఱియొక విధమగు పానగోష్ఠిని, బురోడా
శము (యజ్ఞసంబంధమగు ప్రసాదము) దక్క మఱియొక విధమగు
మాంసభోజనమును నాటి జను లెఱుగరు. వారిలో నానాడు జూద
రులు గాని, యవినీతవర్తనులుగాని, తస్కరులుగాని లేరు. తమ
తండ్రుల పాదములను బూజించుటయే నాటి తనయులు సేయు
దేవతార్చనము, నుపవాసము, తీర్థసేవనము నయ్యెను. తమ తమ
పతుల పాదములను సేవించుటయే, వారి మాటలను వేదవచనము
లనుగా శిరసావహించుటయే నాటి స్త్రీలకు బరమధర్మ మయ్యెను.
నాటి యనుజులు తమ యగ్రజులను, సేవకులు తమ స్వాములను
సానందముగా సాదరముగా బూజించువారు. నిమ్నవర్గములవా రగ్ర
వర్ణములవారి గుణగణములను గొనియాడుచు వారిని నిండుభక్తితో
సేవించువారు. ఎల్లవారును బండితులను, బండితులు తపోధనులను,
దపోధనులు జితేంద్రియులను, జితేంద్రియులు జ్ఞానులను, జ్ఞానులు శివ
పూజా ధురంధరులను మిక్కిలిగా గౌరవించువారు నాటిజనులు పవిత్రమైన

హానిస్సు నగ్నియందువలె మంత్రపూతమైన, మహార్హమైన, విధి విహితమైన, సంస్కారయుక్తమైన యన్నము నెల్లవేళల బ్రాహ్మణ ముఖమునందే హోమము సేయువారు, పవిత్రమైన ద్రవ్యముతో వాపీకూపతటాకాదులను నిర్మింపజేయువారు. అన్ని జాతులవారును పరిపుష్టులై, పరితుష్టులై కానవచ్చువారు. సైనికులు, వేటకాండ్రును దక్క నిక నెవ్వరు ననింద్యసేవనమునకు బాల్పడ నెఱుగరు. రాము రాజ్యములో శాఖలందు దక్క మఱియెందును లక్ష్మికి జాంచల్యము లేదు. ఐరావతమను పేర బరగు నాలుగు దంతములు గల తెల్లయేనుగు స్వర్గములో నొక్కటియే యుండెను. కాని శ్రీరామరాజ్యములో నట్టి వనేకము లుండెను. ఆకసమునందు జంద్రసూర్యులిరువురే ప్రకాశించుచుందురు. కాని యీరాజ్యములోని రాజీవాక్షుల పాపటలయం దెందఱో చంద్రసూర్యు లెల్లవేళల బ్రకాశించుచుందురు. ఎల్లవారల చేత గొనియాడబడు. తెల్లని వృషభము కైలాసములో నొక్కటియే యుండెను. కాని యట్టి వృషభము లెన్నియో శ్రీరాముని రాజ్యమున కృషికర్మమునందు నియుక్తములై యుండెను. చంద్రలోకమున నందగించు నల్లనిలేడి యొక్కటియే యున్నది. కాని యట్టి లేళ్ళెన్నియో యీరాజ్యమునందు బాలురకు క్రీడనకములుగా నుపయోగపడుచుండెను. స్వర్గమునందలి యచ్చరముచ్చెకంటులలో సౌందర్యవైభవమున దిలోత్తమ యొక్కతెయే మిన్నగా నెన్నబడినది. కాని శ్రీరామచంద్రుని యేలుబడిలో బ్రతియింటను విలసిల్లు వెలదు లెల్లరును దిలోత్తమలే. వా రనేకమణిఖచిత సువర్ణాభరణములను దాల్చి కాలియందెలు గల్లుగల్లుమన గలకలలాడుచు గృహములలో జరించువారు. స్వర్గమునందు వేయికన్నుల దేవర (ఇంద్రుడు) యొక్కడే యుండెను. కాని రాఘవుని పాలనమున నుపయోగింపబడిన చామరము లన్నియు వేయికన్నులు (నెమలికన్నులు) గలవే. దేవతల కమృతపాన మొక్కటియే పరిమితమైనది. కాని రఘునందనుని

రాష్ట్రప్రజలకు స్వాదిష్టములగు వివిధరసముల పానసౌభాగ్యము ప్రాప్తించినది. అమృతపానమున దేవతలు సంతుష్టులైన శ్రీరామ ప్రభువరుని పౌరులు తమ ప్రియురాండ్ర యధరసుధారసపానమున సంతుష్టు లగువారు. సముద్రములందు మాత్రమే మర్యాదా (చెలియలికట్టు) లక్షణ ముండుటను మానవు లెఱుఁగుదురు. కాని యీ లక్షణమిా రాజ్యమునందలి బాలురయందు సైతము గోచరమయ్యెడిది. మహారాజులు మాత్రమే గజారోహణావైభవమును గాంచగల గలవారని వినుచుందుము. కాని శ్రీరామరాజ్యములోని పౌరులేమి, గ్రామీణులేమి యెల్లవారును గజముల నధిరోహించి యిందందు జరించువారు. చంటిబిడ్డలను జనులు పలుమాఱులు చుంబింతురని మన మెఱుఁగుదుము. కాని యీ పరమపురుషుని పాలనమున బాగులు పర్యాయముగా దమ ప్రియురాండ్రను జుంబించువారు. ఫాల్గుణ మాసమునందు మాత్రమే ప్రజలు పరిమళద్రవ్యములను, రంగులను నొకరిపై నొకరు చల్లుకొనుచు క్రీడించుట మన మెఱుఁగుదుము. కాని రఘువరుని పురజను లనుదినము నట్టి క్రీడలతో వినోదించువారు. ఈ విధముగ శ్రీరామచంద్రమహాప్రభుని రాజ్యము సమస్తసన్మంగళ మూలమై, యనుపమానమై, యాలకించువారి కఖిల శుభములను సమకూర్చునదై ప్రకాశించెను.

తృతీయ సర్గము సమాప్తము

—)o0o(—

# చతుర్థసర్గము

## శ్రీరామచంద్రుడు లవకుశులకు, సోదరులకు రాజనీతి నుపదేశించుట.

రామదాసుడు విష్ణుదాసున కిట్లు వివరించును.

ఒకనాడు శ్రీమంతుడైన రఘునందను డేకాంతమున నసించి లవకుశులను, లక్ష్మణభరతశత్రుఘ్నులను దనకడకు రావించి వారికి సవిస్తరముగా సవిధముగా రాజనీతి నుపదేశించెను.

"బిడ్డలారా! లవకుశులారా! సోదరులారా! నేను మీకిప్పుడు రాజనీతి నుపదేశించుచున్నాను. సావధానమనస్కులరై యాలకింపుడు. కుశా! నేను వైకుంఠారోహణము జేసినంతనే నీవు మహారాజవు గాగలవు. కావున నే నుపదేశించు మాటలను బదిలముగా మనమున నిలిపికొనుము. నరపాలకు డెన్నడును నసృతవచనము లాడరాదు. అతికాముకుడును, క్రోధనుడును గాని యేడు సుఖము నొందును. భూపాలుడు పరదారాభిలాషము సేయరాదు. సత్యము, శుచిత్వము, దయ, క్షమ, ఋజుస్వభావము, మధురవచనము విప్రులయందును, గోవులయందును, యతీశ్వరులయందును భక్తిగలిగి వర్తించుట యను నీయేడును మహారాజుల కుండవలసిన శుభలక్షణములు. నిద్ర, సోమరితనము, మద్యపానము, జూదము, వారవనితలయం దాసక్తి, మితిమీరిన క్రీడ, వేటాడుట యను నీయేడును భూపాలురయం దుండరాని యవలక్షణములు, భూపతి జనులను గన్నబిడ్డలవలె బాలింపవలెను. వారినుండి వారి యాదాయములోని యారవ భాగమును బన్నుగా స్వీకరింపవలెను. చారులవలన నెప్పటికప్పుడు లోకవృత్తమును దెలిసికొనుచుండవలెను. మారువేషములు దాల్చినవారి నేపురనేపురనుగాని, యిరుపుర నిరుపురనుగాని సమాచారములను సేకరింప బరరాష్ట్రములకు బంపుచుండవలయును. పరదూతల నెన్నడును విశ్వసింపరాదు. కాలా

నుసారముగా సామదానభేదదండోపాయముల నుపయోగించి కార్య సాధనము జేసికొనుచుండవలయును. మానసికముగా నూహించిన పనిని సాధించి ప్రజలకు, మంత్రులకును జూపవలయును. కాని యా విషయము నెన్నడును వాచికముగా బహిర్గతము సేయరాదు.

ప్రతిమాసమునందు నొకమాఱు ధనాగారమును బరిశీలించి కొనవలయును. సేవకుల నెన్నడును విశ్వసింపరాదు. సంవత్సరమున కొకమాఱు మంత్రులతోగూడి పురప్రాకారములను, గండకములను దృఢముగా నున్నవో, లేవో పరిశీలించి తెలిసికొనుచుండవలయును. నాలుగు మాసముల కొకమాఱు శస్త్రములను, మార్గములను, ధనాగారాదికమును బరిశీలించికొనుచుండవలయును. పక్షమున కొకమా ఱేనుగులను, నెనిమిది దినముల కొకమాఱు అశ్వములను, నెలకొకమాఱు వస్త్రములను బరిశీలింపవలయును. మూడు దినముల కొకమాఱు పెంపుడు కోయిలలు మున్నగు పక్షుల సంరక్షణ ప్రకారమును బరికింపవలయును. ఆఱుమాసముల కొకమాఱు రాజ్యపు బొలిమేరలలో బని సేయువారిని బరిశీలింపవలయును. గ్రామీణుల యోగక్షేమము నెల్లవేళల నరయుచుండవలయును. మాసమున కొకమాఱు సేనలను, నాఱుమాసముల కొకమాఱు వాపీకూపాదికమును, నెలకొకమాఱు పుష్పవాటికలను స్వయముగా నరిగియో, లేక మంత్రివర్గము నంపియో పరామర్శింపవలయును. సంవత్సరమున కొకమాఱుగాని, యాఱుమాసములకు లేక మూడు మాసములకు నొకమాఱుగాని మహారాజు సైన్యసమేతుడై తన రాష్ట్రములో సంచారము సేయుచుండవలయును. దేవతలకు, భూదేవులకు, గురువులకు, యతీశ్వరులకు నెన్నడు నసంతుష్టి గలిగింపరాదు.

ద్రవ్యాదికమును స్వయముగా బరిశీలించికొనుచు, నాదాయము లోని నాల్గవ భాగమును మాత్రమే వ్యయపఱచుచుండవలయును.

మూడవ భాగమును గూడ వ్యయము సేయవచ్చును. కాని రెండవ భాగమును మాత్ర మెన్నడును వ్యయపఱచరాదు. మంత్రులననుకూలురను, బ్రసన్నులను గావించికొనవలయును. వారియెడల నతికోపము నెన్నడును బ్రదర్శింపరాదు. విశేషముగా మన్ననను గూడ బ్రదర్శింపరాదు. దుర్గపాలకులతోడ వైరమును గల్పించి కొనరాదు. గనులయు, బట్టణములయు, దుర్గములయు, గొండలు, నడవులు, సముద్రతీరము, ద్వీపములు, నుపద్వీపములు, ద్వీపాంతరములు, వర్షాంతరములు. మున్నగు తావుల నివసించువారిలయు స్థితిగతుల నెప్పటికప్పుడు స్వయముగా గాని చారుల మూలమున గాని తెలిసికొనుచుండవలెను. సన్యాసి, యవధూత, వణిజుడు మున్నగు వేషములను దాల్చి తిరుగాడు గుప్తచరుల మూలమున నెప్పటి కప్పుడు పరరాష్ట్రసమాచారములను దెలిసికొనుచుండవలెను.

పడాది కొకమాఱు తన రాజ్యమునందు వేఱువేఱు ప్రదేశములందు నియమింపబడిన యధికారులను, రాజులను మార్పు సేయుచుండవలెను. ఎల్లకాలము నొక్క సేవకునే నిలిపికొనరాదు. పరరాజుల బలాబలములను, దన బలమును నెప్పటి కప్పుడు పోల్చి పరిశీలించి కొనుచుండవలెను. తన రాష్ట్రములో గానవచ్చిన పరరాష్ట్రపు దూత నెన్నడును దండింపరాదు. గౌరవపూర్వకముగా వదలివేయవలెను. పొలిమేరలో నున్న సైనికుల కెప్పటికప్పుడు శిక్షణ మిచ్చుచుండవలెను. పరరాష్ట్రపు దూత మన రాష్ట్రమున కేల వచ్చియుండును? అని సూక్ష్మదృష్టితో విచారణము సేయవలెను. ముందు నడచు సైనికుని, పార్శ్వరక్షకులను, సైన్యాధిపతిని, మంత్రిని, దన ప్రతినిధిని, సూతుని, వీవన వేయువానిని, జెంతవసించు దూతను దానమానములతో సంతోషపెట్టుచుండవలెను. తొలుత దన పక్షమున నున్న బలగమును, ధనమును, దేశకాలపరిస్థితులను, దన యుత్సాహా

శక్తిని బరిశీలించికొని మీఁదట బరపక్షమున బరిశీలనము సేయవలెను. తొలుత తన మిత్రరాజులను, వారి మిత్రులను, వారి మిత్రులను బరిశీలించికొని పిమ్మట బరపక్షపరిశీలనము సేయవలెను. తన శత్రువుల శత్రువులను గుర్తెఱిగి వారితో జెలిమి సేయవలెను. పరుని శత్రువును బాలింపరాదు. పాలింపవలయుచో నతనిని బరీక్షింపవలెను. తన కడకు వచ్చిన శత్రుసైన్యమును, వారి మిత్రసైన్యమును బాలింపవలెను.

చారచక్షువుల మూలమున దొలుత బరరాష్ట్రములందున్న దుర్గములు, పర్వతములు, నడవులు, కుటిలమార్గములు, రహస్యమార్గములు, జలాశయములు మున్నగువానిని జక్కఁగా గుర్తెఱిగి మీఁదట వలయు ప్రయత్నములు సేయవలెను. తొలుత స్వరాజ్యసంరక్షణమునకు వలయు ప్రయత్నము లన్నియు నిర్వర్తించికొని మీఁదట బరరాష్ట్రములలో బదార్పణము సేయవలెను. ప్రయాణకాలమున ముందుగా దన గమ్యస్థానము నెవ్వరికి నెఱిగింపరాదు. తూరుపువంకకు బయనము సాగింపవలయుచో బతాకల నుత్తరదిశ కంపవలెను. సైన్యశిబిరములను గూడ నుత్తరముననే నిర్మింప నాజ్ఞాపింపవలెను. తా నర్ధక్రోశము దూరము తూరుపువంకకు సాగినంతనే యాసైన్యములు వచ్చి తనను గలిసికొని పురోగమించు నేర్పాటు గావించికొనవలెను. ఈ విధముగా బతాకల నొకప్పుడు దక్షిణదిశను మఱియొకప్పుడు పశ్చిమదిశను నిలుపుచు జారుల మూలమున నెప్పటికప్పుడు పరరాష్ట్ర విషయములను దెలిసికొనుచుండవలెను. స్వరాష్ట్రమునందే పయనింపనెంచినవేళ దానరుగనెంచిన దిక్కునందే పతాకలను నిలుపవచ్చును. సేనానివేశములను గల్పింపవచ్చును.

స్వరాష్ట్రమునం దెల్లవేళల నాయుధములు, యంత్రములు, వాహనములు, బలగము ధాన్యాదిసంగ్రహము, మున్నగువాని యభి

వృద్ధికి బాటుపడవలెను. మిక్కుటమైన కోశమును వెచ్చించి స్వరాష్ట్రమునందు, దుర్గములందు, జలరహితములైన వనములందును జలాశయములను గల్పింపవలెను. ప్రాకారములకై, దుర్గములకై, నీటికై చేసిన వ్యయమును వ్యయముగా భావింపరాదు. దానిని దన రక్షణవ్యయముగనే భావించుకొనవలెను. ధర్మమునకై చేసినవ్యయమును భావిసంగ్రహముగా దలపోయవలెను. ఆపత్కాలమునకై ధనరక్షణమును, నంతకన్న నెక్కువగా గళత్రరక్షణమును, నంతకన్న నెక్కుడుగా దన రక్షణమును జేసికొనవలెను. తనకు బ్రాప్తింపవలసిన పావులాను గూడ బ్రభువు విడువరాదు. సమయము వచ్చినప్పుడు కోటి మాప్యములనైన వెచ్చించుటకు వెనుకంజ వేయరాదు.

సైన్యములను దోడ్కొనక యొంటరిగా రేడు పురము వెలికి బోరాదు. ఏకాకియై గ్రామసంచారముగాని యొక్క యెడ గూర్చుండుట గాని రేనికి దగదు. వెలి కెన్నడును బాదచారియై పోరాదు. పర్యాయముగా బరగృహముల కరుగరాదు. ద్వారపాలుని, సేరమిచ్చువానిని, జాకివాని నెన్నడును నమ్మరాదు. ఉదికిన వస్త్రములను బరీక్షింపక ధరింపరాదు. తాంబూలవీటిక నొకదానిని దొలుత బరులచే సేవింపజేసి పరీక్షించిన మీదట మఱియొక వీటికను దాను సేవింపవలెను. పరు లొసగిన జలమును స్వయముగా గంటితో బరిశీలించిన మీదటనే త్రాగుచుండవలెను. పరు లొసగిన ఫలములను గూడ బరీక్షింపక భక్షింపరాదు. దూరమందున్న నరపాలురతోడ మాటలాడరాదు. వారి చెంత జరింపరాదు.

మహారా జొకమాఱుగాని, రెండుమాఱులు గాని సభ కరుగుచుండవలెను. అఱజాముకన్న నెక్కువ సభలో నిలువరాదు. తనను ద్వేషించువానిని నగరమునుండియు, రాష్ట్రమునుండియు బహిష్కరింపవలెను. సభలో నున్న వేళ నెక్కువగా నవ్వరాదు. మోకాళ్ళను

బాహుబంధనములోనికి జేర్చికొని యెన్నడును గూర్చుండరాదు. మలినవస్త్రములతో సభాస్థలి కరుగరాదు. గణికలను, గణకులను, వైద్యులను, గాయకులను, వందిమాగధులను, నటులను, బందితులను, ధర్మశాస్త్రవేత్తలను, దార్కికులను, వేదవేత్తలగు విప్రులను సర్వ కాలములందును దానమానములతో గారవింపవలెను. మంగలిని నమ్మరాదు. అతనికి దఱచుగా ధనము నొసగి సంతుష్టు నొనర్పింప వలెను. ప్రజలను గారవింపవలెను. నిరర్థకముగా వారిని దండింపరాదు. వారికి కట్టి కష్టమును గలిగింపరాదు. రాజ్యద్వారమునం దుండు సైని కులు తమ చెంతకు వచ్చిన నరపాలకులచేత గవచములు నాయుధ ములు మున్నగువానిని బరిత్యజింప జేసిన మీదటనే వారిని దమ ప్రభు వును దర్శింప సంపుచుండవలెను. అట్లు ప్రభువును దర్శింప నేగుదెం చిన మండలాధిపతులు ప్రభువును సమీపించి నమస్కరించి యెదు రుగా గాని, సమీపమందు గాని క్రమముగా దమ కుద్దేశింపబడిన యాసనములమీద గాళ్లు చేతులు ముడిచికొని యడకువగా గూర్చుం డవలెను. వారు ప్రభుని చెంత నున్నవేళ నవ్వరాదు. తుమ్మరాదు. ఆవులించరాదు. ఉమియరాదు. గమనవేళ, నాగమనవేళ బ్రభువునకు నమస్కరించుటను మఱవరాదు. ప్రభుని యెదుట బిగ్గఱగా మాటలాడ రాదు. కవచమును దాల్పక ప్రభువు సభలో గూర్చుండరాదు.

వేటాడు వేళ మహారాజు గజరాజమును, గర్భవతి యగు లేడిని, నిదురించుచున్న, లేక నీరములు గ్రోలుచున్న మృగమును, దనను శరణు జొచ్చిన లేక విశ్వసించిన ప్రాణిని, గ్రీడించుచున్న జంతువును జంపరాదు. తాను వేటాడబోవు తావునను కెంమిది దిక్కులయందును దొలుత సీమారక్షకులను నియమించికొని మీదటనే కార్యరతుండు గావలయును.

రాత్రివేళ బయట జరింపవలయుచో గంబడి గప్పుకొని యొక మిత్రుని దోడుకొని బయలువెడలవలయును. పురద్వారములం దమర్చబడిన యర్గళములు (గడియలు) మున్నగువానిని దఱచుగా బరీక్షించుచు నుండవలెను. ప్రతిరేయి బురములోనికి స్వయముగా నరిగి కాని, విశ్వాసపాత్రు నొకని నంపి కాని ప్రజలు చెప్పికొను మంచి, చెడు మాటల నాలకించుచుండవలెను.

గృహములో గలహమును గల్పించికొనరాదు, గృహవిషయములను సభాసదులతో జెప్పికొనరాదు. నిష్ఠీవనము (ఉమియుట) సేయరాదు. స్వహస్తములతో దల గోకికొనరాదు. శత్రువుల యభివృద్ధి నాలకించి ధైర్యమును గోల్పోవరాదు. రణరంగమున బోరుచు బాఱిపోరాదు. శత్రువులకు వెన్ను జూపరాదు. ముఖ్యమైన నదిని దరింపవలయుచో సేతునిర్మాణమునకు బూనవలయును. నావ సాయమున దాటరాదు. తనయులతోడ నావ నధిరోహించి జలక్రీడల కుపక్రమింపరాదు. అంగడివీధి నడుమను, నాలుగుత్రోవల కూడలియందును నిలువరాదు. దాసీపుత్రులను గొట్టరాదు. స్వకీయమైన ముద్రగల యనుమతి పత్రము లేనిచో జనులను బురములోనికి వెలికి రాకపోకలు సేయనీయరాదు. వనములందు గాని, మార్గములందు గాని చోరులను జరింపనీయరాదు తీర్థస్నానమున దక్క యితరస్థలములందు క్షౌరము సేయించికొనరాదు. వర్షాకాలములందు ప్రభువు స్వగృహమందు స్నానము సేయరాదు. పిల్లపుమ్మలను గాలితో దాకరాదు. అధికముగా బాచికలాడరాదు. ద్వారదేశమునందు గాని, నేలమీద గాని కూర్చుండరాదు. ఎన్నడును ఖేదమును బొందరాదు. ప్రకటింపరాదు. నెలతలు నీరు దెచ్చికొను మార్గమున నిలువరాదు. ధాన్యాదికమును సముచితమైన వెలకు విక్రయింప ననువుగా వణిజులకు దండనము విధించుచుండవలెను. నెల మీఱినవేళ గొంత కరభారమును (పన్ను)

వర్గింపవలెను. కపటమార్గము నవలంబింపరాదు. ప్రజలయం దౌదార్యమును ప్రదర్శింపవలెను. ద్రవ్యమును గైకొని తస్కరుల నెన్నడును విడువరాదు. మొగము జూచి న్యాయమును సేయరాదు. న్యాయము స్వయముగనే చేయదగును. కాని పరులచే జేయింపరాదు. దయతోడ నార్తి గొన్నవారిని జెంతకు బిలువవలయును. సాదరముగా వారి మొఱ నాలకింపవలెను. తన మనమున గరువమునకు దావీయరాదు.

యజ్ఞము, దానము, జపము, హోమము, సంధ్యావందనము, ధ్యానము, శివారాధనము, స్నానము, పురాణశ్రవణము ననువానిని భక్తితో నాచరింపవలెను. మాదకవస్తువులను సేవింపరాదు. కృచ్ఛ్రాదినియమములను బాటింపరాదు. పాదయాత్ర సేయరాదు. ఏకాదశినాడు ఫలాహారము సేయదగును. కాని నిర్జలోపవాసము సేయరాదు. బ్రాహ్మణులకు కోరినదానిని లేదనక యాతని కర్పింపవలెను. ఏలయనగా భూసురులు భూవరులకు దైవతములు, క్రోధవశమున బంధింపబడినవారి నుత్సాహకాలమున బంధవిముక్తులను గావింపవలెను. తన యాజ్ఞను ధిక్కరించుట తన శిరమును ఖండించుట యని యెఱుగవలెను. తన దూత కొదవిన మానావమానములను దనవిగా నూహించికొనవలెను. కుమారా! కుశా! ఇది రాజనీతి. దీనిని నీకు సవిస్తరముగా నెఱిగించితిని. ఇక నాదిన చర్యయెట్టులున్నదో నీవు చూచుచునే యుంటివిగదా! అట్లే నీవు గూడ నీ దినచర్యను సాగించికొనుము.

చతుర్థ సర్గము సమాప్తము

—()—

# పంచమ సర్గము

## కుశుని కొమరిత యైన హేమకు స్వయంవరము

శ్రీరామదాసుడు విష్ణుదాసున కిట్లు వివరించును.

శ్రీరామచంద్రమహాప్రభు వొకనాడయోధ్యానగరమునందు మహావైభవోపేతముగా కుశుని కొమరిత యగు హేమకు స్వయంవరము గావించెను. ఆమహోత్సవమున కాహ్వానింపబడి నానాద్వీపవాసులగు మహారాజు లందఱును మనోహరవేషములను దాల్చికొని వచ్చి సభాస్థలమున దమ కుద్దేశింపబడిన సమున్నతాసనములపై నాసీనులైరి. దేవతలు, గంధర్వులు, మునులును గూడ సానందముగా నాగమించిరి.

ఆ సమయమున వివిధసువర్ణాభరణ విభూషితురాలై బంగారు పల్లకి నధిరోహించి హేమ సభాస్థలి కేగుదెంచెను. ఆమె మెల్లగా శిబిక నవతరించి వరమాలను గరమున ధరించి యొకమారు సభాగతులైన రాజులను, రాజపుత్రులను వీక్షించెను. మన్మథబాణములను బోలు నామె చూపుతూపులకు గుఱియై యా రాజపుత్రులెల్లరును జిత్తములందు దమ్ము దామెఱుగజాలనియంత సంక్షోభమును నొందిరి.

ఇంతలో నవంతిరాజ్యము నేలు జేస తనయుడు చిత్రాంగదుడనువాడా సభాస్థలమున కరుగుదెంచి శ్రీరాముడు మొదలగువారెల్లరును వేఱువేఱు కార్యములలో నిమగ్నులై యుండగా నెఱిగి మోహనాస్త్రమును బ్రయోగించి సభలోని రాజన్యుల నందఱను సమ్మోహితులగావించి నవవధువగు హేమను హరించి రథమునందు గలిపికొని నగరము వెలుపల కొక క్రోశము దూరము కొనపోయి యచ్చట నిలిచెను. మేధావి యగు నా చిత్రాంగదుడు తన మనమున 'నీ కుశతన

యను చోరుని వలె గొంపోవనేల? వీనినివలెనే కొనిపోయెద గాక!' యని చింతించి తాను సభాగతులపై ప్రయోగించిన యస్త్రము నుపసంహరించెను. తోడనే యెల్లయెడల నయ్యో! యుగ్రబాహుని తనయుడు మహాబలశాలి చిత్రాంగదుడు హయము నెత్తికొని పోవుచున్నాడని హాహాకారపూర్వకముగా మహాకోలాహల మయ్యెను.

అంతట ఖిన్నమానసులై సభలో గూరుచున్న రాజన్యులెల్లరును రోషి నొంది క్రోధమున ముఖములు జేవురింప మండిపడుచు దమతమ సైన్యములను దోడుకొని చిత్రాంగదునితో బోరాచరింప సాకేతనగరము వెలుపలకు బయనమై యరిగిరి. ఉగ్రబాహుడు మౌనముగా దన తనయుని సాహసము నవలోకించుచుండెను. అంతలో మహారాజు లందఱు నేగుదెంచి చిత్రాంగదుని యరదమును ముట్టడించి యాతనిపై ననేకశస్త్రములను గురియింప నారంభించిరి. అప్పుడు చిత్రాంగదుడు వాయువ్యాస్త్రమును బ్రయోగించి వారి నందఱను వాహనసమేతముగా నుప్పరమున కెగురగొట్టి గిరగిర దిరుగజేసెను. అనంతరము రఘువరుని సెలవందికొని యుత్సవములో పాల్గొన వచ్చుట కేగుదెంచిన లవాదికుమారు లేడుగురును దమతమ సైన్యములతో రణరంగమున నడుగు వెట్టిరి. అప్పుడు తుముల యుద్ధమయ్యెను. వారు చిత్రాంగదునిపై వివిధములైన శస్త్రములను వర్షింపజేసిరి. అంత చిత్రాంగదుడు గూడ వారి శస్త్రములను సరకు జేయక శరపరంపరలను గుమ్మరించి ఛిన్నభిన్నముల గావించి క్షణకాలమున యూపకేతుని, సుబాహుని, పుష్కరుని, తక్షకుని, చిత్రకేతుని, నంగదుని విరథుల గావించెను. అతని యా విక్రమక్రమము నవలోకించి యది యంతయు నతని తపముల ఫలమని యెఱిగి లవుడు దురంతర శరములను గురియించి యతని ధనువును ఛేదించుటయే కాక యతని కెంతయో యాకులపాటు నొదవించెను.

అలవుని పరాక్రమమును బరికించి యతనితో బోరుట కుగ్ర బాహుడు ముందునకు వచ్చెను. శరపరంపరలను గురియించి లవుడతనిని గూడ క్షణములో విరథుని గావించెను. అప్పు డుగ్రబాహుడు మఱియొక రథము నధిరోహించి వాడి యలుగుల బ్రహరించి లవుని మూర్ఛాక్రాంతుని గావించెను. తోడనే రణరంగమున హాహాకారములు చెలరేగెను. అంతట నుగ్రబాహునితో బోరుటకు కుశుడు ముందునకు వచ్చెను. అతని ననుగమించి రథారూఢులై యంగదాదు లరుగుదెంచిరి. అప్పు డుగ్రబాహుడు విక్రమించి మఱల నంగదాదులను విరథుల నొనరించెను. తోడనే కుశుడు పరాక్రమించి బాణవర్షము గురియించి క్షణకాలమున నుగ్రబాహుని విరథుని గావించి యతని ధనువును దునిమివైచెను. అప్పు డుగ్రబాహు డాకులపాటు నొంది చకితుడయ్యెను. తోడనే యతని నాతని తనయునితో గూడ బంధించి కుశుడు సానందముగా విజయదుందుభిని మ్రోగింపజేసెను. అనంతరము బంధితుల నిరువురను శ్రీరామచంద్రుని సన్నిధికి గొనిపోయెను. శ్రీరామచంద్రు డాతని దన ప్రియమిత్ర మని యెంచి తనయుసమేతముగా విముక్తుని గావింపజేసెను. పిమ్మట నగస్త్యమహర్షి సమక్షమున నుండగా నామహర్షి తనకు గానుకగా సమర్పించిన కంకణమును విజేతయగు కుశునకు బహూకరించెను. ఆకంకణమును దాల్చి కుశు డెంతయో శోభించెను. అప్పుడు కుశు డగస్త్యమహర్షికి నమస్కరించి మహాత్మా! మీకీ కంకణ మెట్లు ప్రాప్తించెనో యెఱుగజెప్పగలరా! యని యామహర్షిని బ్రశ్నించెను. అంతట నగస్త్యమహర్షి కుశునకిట్లు వినిపించెను.

కుశకుమారా! తొల్లి రక్కసులు పెక్కురు సముద్రగర్భమున నెలకొని యుండువారు. అప్పు డింద్రుడు వారిని సంహరించుటకై నన్ను బహువిధముల వేడగా నేనా సముద్రజలము నంతను బుక్కిట

బట్టి యవలీలగా ద్రాగివైచితిని. రాక్షససంహారానంతరము సముద్రము జలవిరహితమై ద్వీపముల నెల్లను లోపించిపోవుటచే నింద్రుడు కోరగా నేను ద్రాగిన జలమునంతను మఱల మూత్రమార్గమున బహిష్కరించితిని. అప్పుడు సముద్రుడు ప్రసన్నుడై నాకీ కంకణమును బహూకరించెను. ఇది నానారత్నవిచిత్రమై సూర్యప్రభాభాసమానమైన కారణమున నేను దీనిని శ్రీరామచంద్రున కర్పించితిని. అతడిప్పుడు నీకర్పించెను. ఇది యీ కంకణవృత్తాంతము.

ఈ యగస్త్యవచనముల నాలకించి కుశుడు మఱల నో మహాత్మా! నాసోదరుడగు లవుడు రణభూమిలో వైరిశస్త్రప్రహారములచే మూర్ఛాక్రాంతుడైనాడు. ఇప్పు డతడు జీవింప ననువగు నుపాయ మేదేని నా కెఱిగింపుడు అని యా మునిరాజును గోరెను. అప్పుడా మహర్షి కుమారా! పూర్వము భరతుడు మార్గమధ్యమున శత్రువులతో బోరుచు మూర్ఛిల్లగా లక్ష్మణుడు ముద్గలమహర్షి యాశ్రమమున కరిగి యచటనుండి సంజీవన మూలికలను దెచ్చి యాతని బ్రదికించినాడు. కావున నావిధముగనే యిప్పుడు కూడ మఱల నొకమారా ముద్గలాశ్రమమునకు నీవు స్వయముగా నరిగియో, లేక హనుమంతు నంపియో యామూలికలను దెచ్చి లవుని బ్రదికింపుము అని బదులు పలికెను. ఆపలుకుల నాలకించి శీఘ్రముగా హనుమంతుడరిగి యా మూలికలను దెచ్చి వానితో సైన్య సమేతముగా లవుని బునరుజ్జీవితుని గావించెను.

శ్రీరామదాసు డిట్లు నొడువుచుండగా విని విష్ణుదాసుడు 'గురువరేణ్యా! ఆ సంజీవనమూలికలు ముద్గలుని యాశ్రమప్రదేశమునందే ప్రాదుర్భవింప గారణమేమి? సమీపమునందున్న యామూలికలను విస్మరించి తొల్లి జాంబవంతుడు హనుమంతుని ద్రోణపర్వతము కడ

కేల యంపెను? నాయీ సంశయమును దొలగింపుడు' అని రాము దాసుని బ్రశ్నించును. అప్పుడు రామదాసుడిట్లు నొడువును.

శిష్యా! విష్ణుదాసా! చెప్పుచుంటి నాలకింపుము. పూర్వము గరుత్మంతుడు తన తల్లికి దాస్యవిముక్తి గలిగించుటకై స్వర్గమునుండి యమృతకలశమును హరించి తెచ్చువేళ వేగవశమున నమృతబిందు వొకటి ముద్గలాశ్రమ ప్రదేశమున జిందిపడినది. తత్కారణమున నాప్రదేశమునందే యీ మూలికలు ప్రాదుర్భవించుట సంభవమైనది. ఈమూలికల యునికిని జాంబవంతు డెఱుగడు. ఆ కారణమున నతడు హనుమంతుని ద్రోణపర్వతము కిడ కంపెను. ఇది నీప్రశ్నమునకు సమాధానము. ఇక మంగళప్రదమైన ముందుగాథను వివరించుచు న్నాడ నాలకింపుము.

అప్పుడు లవాదులు సపరివారముగా స్వపురమున కరిగిరి. మహర్షికి, శ్రీరామానుజులకును బ్రణమిల్లి శ్రీరాముని చెంత నాసీను లైరి. పునరుజ్జీవితుడై లవుడు గానవచ్చుటతో నగరమునం దెల్ల యెడల మహోత్సవము సేయబడెను. వాయునందనునిచే బ్రదికింపబడిన లవుని గాంచి ప్రేమపురస్సరముగా, సానందముగా శ్రీరామచంద్రు డతనిని గౌగిలించికొనెను. పిమ్మట బ్రసన్నత మీఱ రత్నఖచితము లైన రెండు కంకణములను హనుమంతునకు బహూకరించెను. మఱి యొక కంకణమును లవునకు బహూకరించెను. ఈకంకణము కూడ వొల్లి యగస్త్యమహర్షి యర్పించినది. దానిని ధరించి లవుడు సానం దముగా నగస్త్యుని గాంచి నమస్కరించి మహానుభావా! యీకంకణము మీ రెట్లు ప్రాప్తించినదో యెఱుగ జెప్పగలరా? యని ప్రశ్నించెను. అప్పుడా మహర్షి యీవిధముగా వివరించెను.

దండకారణ్యములో నొకనాడు నేనొక సరోవరములో స్నానము సేయ నరిగితిని. అందు స్నానమొనరించి సత్యవిధులను సర్వర్తించి

కొని క్షణకాలము నిలిచితిని. అంతలో నచ్చటకు స్వర్గమునుండి యొక దివ్యపురుషుడు నూఱుమంది స్త్రీరత్నములచే సేవింపబడుచు దివ్య మాల్యాంబరములను దాల్చి శరీరమునందు దివ్యగంధము నలదికొని యేగుదెంచెను. అతడు వచ్చినంతనే యాసరోవరమునుండి భయంకరమైన దుర్గంధభూయిష్ఠమైన యొక శవము బహిర్గత మయ్యెను. అప్పుడా పురుషుడు విమానము నవతరించి చని యాశవమును ఛేదించి యామాంసమును సానందముగా భక్షించెను. పిమ్మట నీరములను గ్రోలి మఱల దన విమానము నధిరోహించెను. ఆశవము మఱల నీటిలో మునిగిపోయెను. స్వర్గమునకు మఱలిపోవ నుంకించుచున్న యాపురుషుని గాంచి నేను జకితుడనై ఓయి భద్రపురుషా! క్షణము నిలువుమా! నీచర్యను నేను జూచితిని. దేవలోకములో నివసించు వాడవగు నీకీ శవాహారయోగ మెందులకు బ్రాప్తించినదో నాకెఱిగింపుమా! యని ప్రశ్నించితిని. అప్పు డాత డిట్లు నొడివెను.

మహాత్మా! నా గుర్పు చున్నాడ నాలకింపుడు. పూర్వము సుదేవుడను వాడు విదర్భదేశమున కేలిక యయ్యెను. అతనికి శ్వేతుడు, సురథుడు నను నిరువురు కొమరు లుండిరి. వారిలో శ్వేతుడను నేను. క్రమముగా నాకు రాజ్యాధికారము ప్రాప్తించినది. రాజ్యమదాంధుడనై నేనానా పెన్నియో పాపకర్మము లాచరించితిని. ఏనాడు నెట్టి దానధర్మములను గూడ నాచరింప నెఱుగను. నాకు సంతానము గలుగలేదు. వార్ధక్యదశ ప్రాప్తించిన మీదట నేను రాజ్యాధికారమును నాసోదరుడగు సురథున కప్పగించి వనమున కరిగి తీవ్రమైన తప మొనరించితిని. ఒకనాడు సరోవరములో స్నానము సేయుచు నీట మునిగి యసువులను బాసితిని. పిమ్మట నాతపోబలము కారణముగా నాకు స్వర్గము ప్రాప్తించినది. నాకక్కడ సమస్తభోగములు నుపలబ్ధములైనవి. కాని తినుట కేమియు గానరాలేదు. అప్పుడు నేనింద్రుని

కడ కేగి అమరేశ్వరా! నా కిక్కడ సుదుర్లభములైన భోగము లన్నియు ప్రాప్తించినవి. కాని తినుట కేమియు లభించుటలేదు. దీనికి గారణమేమి? నాకీ విషయమున సుఖమెట్లు గలుగును? అని ప్రశ్నించితిని. అంతట నింద్రుడు చిఱునవ్వు నవ్వుచు ఓయీ! నీవు భూమిపైనున్న కాలమున రాజ్యమదాంధుడవై యెట్టి దానమును సేయలేదు. ఎవరికి నేమియు బెట్టలేదు. ఆకారణమున నీకిక్కడ నేమియు లభించుటలేదు. కావున నీ వనుదినము విమానము నధిరోహించి నీవు పూర్వమా దే సరోవరమున మునిగి యసువులను బాసితివో యాతావున కరిగి మిష్టాన్నముల నారగించి యారగించి పరిపుష్టమైన యానీ పూర్వశరీరమునే భక్షింపుము. ఆశరీరము క్షయము నొందక చిరకాలము నిలిచియుండును.'' అని బదులు పలికెను. ఆమాటల నాలించి నేనేమి చేసిన దివ్యాన్నములను బడయగలను? అని మరల ప్రశ్నించితిని. "ఇప్పుడు దండకారణ్యము నిర్జనమై యున్నది. భావి కాలమున వింధ్యునకు గర్వభంగము సేయ నగస్త్యమహర్షి కాశికా నగరమునుండి దండకారణ్యమున కరుగుదెంచి యొకనాడా సరోవరమున స్నానము సేసి తీరమున నిలుచును. అప్పుడా మహర్షికి నీకంకణమును నీటితో దడిపి దానము సేయుము. దాన నీకు శవాహారయోగము దొలగి దివ్యాన్నములు ప్రాప్తింపగలవు'' అని యతడు ప్రత్యుత్తరమిచ్చెను. మునికులభూషణా! నాటినుండియు నే ననుదినము నిటకువచ్చి నా శవమును భక్షించుచున్నాను. నాకింతకాలము నిక్కడ నరు లెవ్వరును గానరాలేదు. ఈదినమున మీరే కానవచ్చితిరి. ఇంద్రవచనానుసారము నేను మి మ్మగస్త్యమహర్షిగా దలపోయుచున్నాను. నాకీ దినము సుదినము. నాయీ కంకణమును దానముగా స్వీకరించి న న్నుద్ధరింపుడు.'' అని పలుకుచు నాదివ్యపురుషుడు తన మనోహర కంకణమును నీట దడిపి నాకు దానము చేసి సానందముగా దాను స్వర్గమునకు వెడలిపోయెను. నాటినుండియు నతనికి దివ్యాన్నములు

ప్రాప్తించినవి. నాఁడు మొదలుగా నతని శవ మెన్నఁడు నా సరోవరము నుండి బహిర్గతము గాలేదు. లవకుమారా! ఇది నాకీ కంకణము ప్రాప్తించిన విధము. దీనిని శ్రీరామచంద్రున కర్పింపగా నత డీనాడు స్వీకరించెను.

ఈ కథనము నాలకించి లవుఁడు మఱల "మునికులభూషణా! మఱియొక్క విషయమును గూడ నేను మీ ముఖమున నెఱుఁగగోరు చున్నాను. అది యేమన్న దండకారణ్యమున కా పేరేల కలిగెనో తెలియఁజెప్పుఁడు." అని పృచ్ఛఁజేసెను. అంతట నగస్త్యమహర్షి యీ విధముగా వినిపించెను.

లవకుమారా! చెప్పుచున్నాఁడ నాలకింపుము. వింధ్యపర్వతమునకు దక్షిణమున దొల్లి యిక్ష్వాకు వంశమునందు బ్రాదుర్భవించి ప్రసిద్ధిగన్న దండకుఁ డను భూపతి యుండెను. అతఁడు పాపవర్తనుఁడు. అతఁ డొకనాఁడు సైన్యసమేతుఁడై వేటాఁడు తలంపున వనమున కరిగెను. ఆ సందర్భమున నతఁ డొక మృగమును వెన్నంటి తఱుముచు హయము నధిరోహించి యేకాకియై తన బలగమును వీడి చాల దవ్వు వెడలిపోయెను. కడకా మృగము గానరాకుండ బోయెను. అప్పుడతఁడు మిక్కిలి దప్పికగొని యొక సరోవరమును జేరి యందలి నీరములను గడుపునిండఁ గ్రోలి తీరమునందున్న యొక మున్యాశ్రమమున కరిగెను. అది భృగుమహర్షి యాశ్రమము. ఆ మహర్షి యీ మహీపతికి గురువు. కాని యది తన గురువరుని యాశ్రమ మని యా నరపాలుఁ డెఱుఁగఁడు. అందాసమయమున జంద్రబింబమువంటి మొగముతో గలకలలాడుచు నా మహర్షి కొమరితె యొకతె నాటి కింకను రజోధర్మము నెఱుఁగనిదై యందాలరాశియై చరించుచు నతనికి గానవచ్చెను. తోడనే యతఁడు కామభావావిష్టమానసుఁడై తనకు రతిసౌఖ్యము నొసఁగ నామెను బ్రార్థించెను. అప్పుడామె "మహారాజా!

నేను నా తండ్రిచే రక్షింపబడుచున్నదానను. స్వతంత్రురాలను గాను. నా తండ్రి భృగుమహర్షి మీకు గురువు. నేను మీ చెల్లెలగుదును. నా తండ్రి యిప్పు డిచ్చట లేడు. వెలి కేగినాడు. మీరు నా తోడి పొందును గోరుచుంటిరేని నా తండ్రిని ప్రార్థించి సమ్మతింపజేసి నన్ను మీరా భార్యగా గావించుకొని సుఖమును బొందుడు." అని యతనికి బదులు పలికెను. అయినను గామాంధుడై తాలిమి వహింపక యతడా బాలికతోడ బలిమిని గూడి సుఖించి పిమ్మట తన నగరము దఱలిపోయెను.

అనంతరమా బాలిక దుఃఖించుచు జరిగిన యుదంత మంతయు నాశ్రమమునకు మఱలివచ్చిన తన తండ్రికి నివేదించెను. అప్పుడా మహర్షి తన కొమరితను సాంత్వనవచనములాడి యూఱడించి యడపరాని యాగ్రహమున మొగము జేవురింప మండిపడుచు దోయిట జలమునెత్తి దండకునితోడ శతయోజన విస్తీర్ణమైన యాతనిరాజ్య మంతయు క్షణములో దగ్ధమైపోవుగాక! అందెల్లయెడల నీరము లంతరించిపోవుగాక! చరాచరప్రాణు లన్నియు నశించిపోవుగాక! యని యా దండకుని శపించివైచెను. అప్పుడా బాలిక తండ్రి నా శాపమున కవధిని దెలుపవేడెను. అప్పుడు భృగుమహర్షి యిట్లు పలికెను. భావికాలమున గాశీకానగరమునుండి యగస్త్యమహర్షి యేనాడీ దేశమున కేతెంచునో యానాటినుండియు నీ దేశము మరల సజలమై సుభిక్షము గాగలదు. ఇందు మహర్షులు నివాసము చేయగలరు. దండకుని మూలమున నరణ్యమైన కారణమున జనులందఱు నీ దేశమును దండకారణ్య మనియే వ్యవహరింతురు. ముందు ముందు శ్రీరామచంద్రు డీ దేశమున కాగమించును. అప్పు డిచ్చట ననేక క్షేత్రము లేర్పడగలవు. ఆ పరమపురుషుని యనుగ్రహమున నానాటి నుండియు జనులు దీనిని శ్రీరామక్షేత్రమనికూడ బేర్కొందురు.

మునియొక్కయు, శ్రీరాముని యొక్కయు ప్రభావమున నీ దేశ మెల్ల దేశములలో మిన్నయై, యుత్తమమై, పావనమై, పరమానందదాయకమై, మనోహరమై వఱలగలదు. దండకముతో సమానమైన దేశ మింతకు ముందులేదు. భావిలో నుండబోదు అన్నప్రథ నందగలదు.''

ఇట్లు పలికి యా మహర్షి యా బాలిక నొకవని కిచ్చి యథావిధిగా నర్పించి తాను దప మొనరించికొనుటకై హిమాలయమునకు వెడలిపోయెను. ఆ మహర్షి శాపము గారణముగా దండకునితోడ నాతని రాజ్యమంతయు దగ్ధమయ్యెను. నేను, శ్రీరామచంద్రుడు నడుగు పెట్టుటతో నది మఱల యథాపూర్వముగా జల ఫల సమృద్ధమై జన నివాసయోగ్య మయ్యెను. లవకుమారా! వింటివిగదా! ఇది దండకారణ్య చరిత్రము.

ఈ చరిత్రము నాలకించి యానందించి యా మహర్షికి నమస్కరించి చని లవుడు శ్రీరామచంద్రుని సేవలో నిమగ్నుడయ్యెను. అనంతరము వైభవోపేతముగా, మహోత్సవ పురస్సరముగా రఘునందనుడు హేమను జిత్రాంగదున కిచ్చి పెండ్లి జేసెను. ఆ సందర్భమున వరునకు గోటి విలువసేయు, నేనుగులు, గుఱ్ఱములు మున్నగు వానిని గట్నముగా నర్పించెను. అనంతర ముగ్రబాహుని సపరివారముగా వీడుకొలిపి వారి నెలవున కంపివైచెను. ఆ మహోత్సవమున బాలుగొన్న మునివరులు, జనవరులు నెల్లరును గ్రమముగా రాఘవుని సెలవుగొని తమతమ యిండ్లకు దఱలిపోయిరి.

పంచమ సర్గము సమాప్తము

—()—

# షష్ఠ సర్గము

## శ్రీరామచంద్రుడు బ్రాహ్మణులకు రామనాథపురరాజ్యమును దానము సేయుట

శ్రీరామదాసుడు విష్ణుదాసున కిట్లు వినిపించును.

అనంతరము శ్రీరామచంద్రు డయోధ్యలో బలువిధముల సీతామహాదేవి నానందపఱచెను. సప్తసముద్ర పరివేష్టితమైన ధరణి నంతను జక్కగా బరిపాలించెను. శస్త్రధారులు, నరపతులు నెల్ల వారును శ్రీరామచంద్రమహాప్రభుని రాజముద్ర గల పత్రము లేక యయోధ్యానగరములోపలకు, వెలుపలకు రాకపోకలను సాగింప ననుమతింపబడలేను. శ్రీరామచంద్రుని రాజముద్ర యెట్లు లుండునో వినిపించుచుంటి నాలకింపుము.

శ్రీరామ రాజముద్రా విరచనవిధము:- తొలుత నెఱ్ఱని రంగుతో నిలువుగా బదునైదు, నడ్డముగా బదునైదును రేఖలు (గీతలు) గీయవలెను. అట్లు గీయగా 196 గడు లేర్పడును. అందు మొదటి గడుల వరుసను నాలుగు వంకల బసపురంగుతో బూరింపవలెను. అట్లు పూరింపబడిన యేబదిరెండు గడులును బోగా నిక 144 గడులు శేషించియుండును. అందు దొలి వరుసయు, నేడవ వరుసయు బూర్తిగా దెల్లగా నుండవలెను. రెండవ వరుసలో 1, 2, 4, 6, 7, 8, 9, 11 గడులను నల్లని రంగుతో బూరింపవలెను. అట్లే మూడవవరుసలో 4, 6, 7, 11 గడులను, నాలుగవ వరుసలో 1, 2, 4, 6, 7, 9, 11 గడులను నయిదవ వరుసలో 1, 2, 4, 6, 9, 11 గడులను, నాఱవ వరుసలోని గడుల నన్నిటిని నలుపురంగుతో బూరింపవలెను. ఎనిమిదవ వరుసలో 1, 2, 4, 6, 7, 9, 10, 12 గడులను, దొమ్మిదవ వరుసలో 4, 6, 7, 12 గడులను, బదియవ వరుసలో 1, 2, 4, 6, 8, 9, 10, 12 గడు

లను, బహునొకండవ వరుసలో 1, 2, 4, 6, 7, 8, 9, 10, 12 గడులను, బండ్రెండవ వరుసలోని గడుల నన్నిటిని నల్లని రంగుతో బూరింపవలెను. ఇట్లు పూరింపగా మిగిలిన తెల్లని గడులను జూచినచో నందు 'రాజా రామ' యను నక్షరములు నాగరలిపిలో राजा राम అను రూపములో స్పష్టముగా గానవచ్చును. ఇది శ్రీరామముద్రా స్వరూపము. ఇట్టి ముద్రతో గూడిన శిల నొకప్పుడు శ్రీరామచంద్రుడు బ్రాహ్మణుల కిచ్చియుండెను. అది యిప్పటికిని భూతలమున రామనాథపురములో నున్నది. ఈశ్రీరామముద్రను రచింపగోరువారు తూరుపు మొగముగా గూరుచుండి ప్రయత్నము సేయవలెను.

ఈవిషయము నాలకించి మఱల విష్ణుదాసుడు "గురువరేణ్యా! శ్రీరామచంద్రుడు తన ముద్రతోడ నంకితమైన శిలను బూర్వము బ్రాహ్మణుల కేల యర్పించెను? ఆయుదంతమును సవిస్తరముగా నాకెఱుగజెప్పుడు" అని రామదాసుని గోరెను. అంతట రామదాసుడీ విధముగా వివరించును.

శిష్యా! విష్ణుదాసా! నొడువుచుంటి నాలకింపుము. ఒకానొక సమయమున దక్షిణ దేశమునందలి బ్రహ్మపురములో నివసించు బ్రాహ్మణు లందఱును శ్రీరామచంద్రు డేమి కోరిన లేదనక యిచ్చువాడని యెఱిగి యా మహాపురుషుని దర్శింప నయోధ్య కరిగిరి. ఆ సమయమున రఘునందనుడు సీతతోడను, సోదరులతోడను గూడి తన మిత్రమగు గంధర్వరాజు గృహమున కరిగి చక్కగా స్నానాది విధులను నిర్వర్తించికొని సపరివారముగా భోజనము సేయు తలంపున నాసనముపై నాసీనుడయ్యెను. ఆగంధర్వరాజు శ్రీరామచంద్రుని సాదరముగా బూజించెను. స్త్రీలు పాత్రములందు దివ్యాన్న, చిత్రాన్న, పక్వాన్నాది పదార్థములను వడ్డించుట కూడ బూర్తి చేసిరి. అంతలో బ్రహ్మపురమునుండి వచ్చిన బ్రాహ్మణులు శ్రీరామ

చంద్రుడు గంధర్వరాజగృహమునం దున్న వాడని తెలిసికొని యచ్చట కేగుదెంచిరి. వారి యాగమనవార్తను ద్వారపాలకులు శ్రీరామచంద్రుని కెంచజేసిరి, తోడనే రాఘవుడు లేచి సంభ్రమము మీఱ నా బ్రాహ్మణుల కెదురేగి శిరము వంచి నమస్కరించి సాదరముగా వారినా గంధర్వరాజగృహము లోనికి దోడితెచ్చి యుచితాసనములపై నాసీనుల గావించెను. శీఘ్రముగా స్నానాదివిధులను నిర్వర్తించికొని భోజనములు సేయ రండని వారిని బ్రార్థించెను. భోజనములు సేయుటకు ముందుగనే తమ కోరికను బ్రభువునకు నివేదించికొనుట యుక్తమని యాబ్రాహ్మణులు తమలోదాము తర్కించికొనిరి. నిర్బంధ మెందులకు? శ్రీరామచంద్రప్రభువు యాచకుల కోరికలను గాదనువాడు గాడు అని వారిలో గొందఱు నొడివిరి. ఇట్లు తర్కించుకొనుచున్న యాబ్రాహ్మణుల మనోగతాభిప్రాయము నెఱిగి రాఘవుడు వారి నుద్దేశించి 'యో మునిపుంగవులారా! మీ యభిమతమును నే నెఱిగితిని. రాజ్యమును గోరుటకై మీరు స్వయముగా బ్రయాసపడి యేల వచ్చితిరి? మీశిష్యు నొక్కని నెవనినైన నంపినచో క్షణములో మీకోరికను దీర్చియుండనా?' అని పలికెను. వెంటనే లక్ష్మణుని బిలిచి లక్ష్మణా! బ్రహ్మపురరాజ్యము నేనీ బ్రాహ్మణుల కిచ్చినైచితిని. కావున నొక శిలమీద దానలేఖమును నా పేరుతో వ్రాయింపుము అని యతని కాదేశించెను. అట్లకాక! యని లక్ష్మణుడు సత్వరముగా శిల్పులను రావించి శిలను దెండని వారి కాదేశించెను. అప్పుడా బ్రాహ్మణులు రఘువంశనా! త్వర యేల? భోజనానంతరము శిలాలేఖమును జేయింపవచ్చును. పాత్రము లందు పదార్థములు వడ్డింపబడి సిద్ధముగా నున్నవి. మేము గూడ నాకటిచే నకనకబడుచున్నవారము.' అని సవినయముగా బలికిరి.

ఆపలుకుల నాలకించి రాఘవుడు సాదరముగా ననేకఫలములను దెప్పించి వారి ముందుంచి చిఱునవ్వు నవ్వుచు నీవిధముగా బలికెను.

బ్రాహ్మణోత్తములారా? హాయిగా మీరీ ఫలములను భక్షింపుడు. ఇంతలో శిలాలేఖము పూర్తిగాగలదు. అది పూర్తియైన మీదటనే నేను భోజనము సేయుదును. ఏల యన్న ధనము, మనము, జీవనమును క్షణికములైనవి. యముడు గరుణ లేనివాడు. కావున ధర్మకార్యము నెల్లవేళల సత్వరముగనే సంపన్నము గావింపవలెను. నూఱు పనులను విడిచి భోజనము సేయనలెను. వేయి పనులను మాని స్నానము సేయ వలెను. లక్ష పనులనైనను నిర్లక్ష్యముగా బరిత్యజించి దానము సేయ వలెను. కోటి పనులన్నను బొటి సేయుట మాని శివారాధనము సేయవలెను. భగవద్గీతాపఠనమున గోటి విఘ్నములు, గంగాస్నాన విషయమున బదికోట్ల విఘ్నములు, దానము సేయు సందర్భమున శతకోటివిఘ్నములు నుత్పత్తిల్లుచుండును. కావున మానవు లెల్లవేళల ద్వరపడుచునే దానము సేయవలెను. బుద్ధి నిద్రపోవుటకు ముందొక విధముగా నున్న ననంతర మొక విధముగా నుండును. భోజనము సేయుటకు ముందొక విధముగా నున్న దరువాత వేఱొక విధముగా నుండును. ఇట్లు క్షణక్షణమునకు మాఱిపోవుచుండును. కావున సంకల్పము గలిగిన వెంటనే దానము సేయవలెను. ఇది నా నిజాభిప్రాయము.

శ్రీరామచంద్రు డిట్లు నొడువుచున్నంతలో శిల్పులు గండకీ నదినుండి వెలువరింపబడిన యొక పెనుశిలను దొమ్మిది మూరల పొడవువెడల్పులు గలదాని నాయెడకు దీసికొనివచ్చిరి. వారా శిలపై "సూర్యవంశసముద్భూతుడను, సప్తద్వీపాధిపతిని, దశరథుని తనయుడను, శ్రీరామరాజను పేర బరగువాడను నగు నాచే త్రేతాయుగమునందు సానందముగా బ్రహ్మపురరాజ్యము బ్రాహ్మణులకు దానము సేయబడినది. రవి యంట బ్రకాశించుచుండు నంతకాలము, లోకములో నాచరిత్రము నిలిచి యుండునంత పర్యంతము, వాయువు లోకములో

సంచరించుచుండు నంతకాలము నా యీ దానము స్థిరముగా నిలుచుగాక! బ్రాహ్మణసంబంధమైన యీ దానమును గాపాడుదురుగాక! యని భావితరములం దావిర్భవించు మహారాజుల నెల్లరను సాంజలిబంధముగా వేడుకొనుచున్నాను." అని లిఖించిరి. పిమ్మట రాఘవుడాంజనేయునిచే రామనామాంకితమైన తన ముద్రిక నాశిలపై నంకితమగునట్లు స్పృశింపజేసెను. తోడనే పవమాననందనుని భారము కారణముగా నాశిలపై 'రాజా రామ' అను నక్షరములు ప్రస్ఫుటముగా ముద్రితము లయ్యెను. బ్రాహ్మణులకు రామనాథునిచే నొసగబడిన పురమగుటచే నాటినుండియు నాబ్రహ్మపురము రామనాథపురమని కూడ వ్యవహృతము గాజొచ్చెను. సీతాసమేతుడైన శ్రీరామచంద్రుడా శిలను బూజించి దానిని, దానికి దక్షిణగా దాని బరువుతో సమానమైన బరువు గల ధనమును నాబ్రాహ్మణబృందమున కర్పించెను. ఆంజనేయుని రావించి యంజనానందనా! అందఱ భోజనములు ముగిసినమీదట నీవీశిలను విమానముతో నెక్కించికొని, యాబ్రాహ్మణులను గూడ నందు నీవెంట నిడికొని రామనాథపురమునకు జేర్చి మఱలి రమ్మా! అని యతని కాదేశించెను. ఈబ్రాహ్మణుల కెల్లవేళల సహాయము సేయుచుండు మని యారాజ్యమును బాలించు కంబుకంఠుని పేర నొకలేఖను గూడ వ్రాసెను. అప్పుడు సంతుష్టాంతరంగులై యాబ్రాహ్మణు లందఱును శ్రీరామచంద్రుని వేభంగుల గొనియాడుచు నాశీర్వదించిరి. అనంతరము వారితో గూడి రాఘవుడు సానందముగా భోజనము జేసెను. ప్రభుని సెలవు ననుసరించి హనుమంతుడు వారిని విమానముపై నెక్కించి రామనాథపురమునకు గొనిపోయెను. ఈవిధముగా రఘునందనుడు సప్తద్వీపములందు నెన్నియో దానము లొనరించెను.

శిష్యా! విష్ణుదాసా! ఆలకించుచుంటివి గదా! రామనాథపురవాసులగు నాబ్రాహ్మణులా శిలను భావికాలమున దుష్టభూపతులకు

వెలిచి యొక తటాకములో బడవేయుదురు. అనంతరము దుర్భరము లగు నిడుమలకు లోనై వారు మరణింప నుద్యమింతురు. అప్పుడా శిల నా తటాకమునుండి యాంజనేయుడు వెలికి దెచ్చును.

రామదాసు డిట్లు నొడువుచుండగా నాలకించి విష్ణుదాసుడు 'గురువరేణ్యా! భావికాలమున నా బ్రాహ్మణుల కేమి కష్ట మొదవును? వారేల మరణింప నుద్యమింతురు? ఆ విషయమును నాకు విశదముగా నెఱిగింపుడు.' అని యతనిని బ్రశ్నించును. అప్పుడు రామదాసు డీవిధముగా వివరించును.

భావికాలమున గలియుగమునం దొక దుష్టభూపతి రామనాథపురరాజ్యము నా బ్రాహ్మణులకడనుండి తాను హరింప నెంచి వారిని నిర్బంధించి "యో బ్రాహ్మణులారా! మీకీరాజ్యము శ్రీరామచంద్రునిచే నొసగబడిన దన్న మాట నిక్కువమేని యందులకు సంబంధించిన దానపత్రమును నాకు జూపుడు. కానిచో నీరాజ్యమువలన నిప్పటివఱకు మీ రనుభవించిన ధనము నంతను నా కిచ్చివేయుడు. ఈయకున్న మిమ్ముల నందఱను జంపివైచెదను. నేను ధరణిదేవుల పాలిటి దండధరుడను." అని వారితో దారుణభాషణము లాడును. అప్పుడు వారు భయకంపితులై తమలో దాము తగిన విధముగా మంత్రణము జేసికొని మహారాజా! మాకొక్క మాసము కాలము గడువు నొసగుడు. అప్పుడు మేము మీకా దానపత్రమును జూపగలమని యా తేనిని వేడుకొందురు. అప్పుడా తేడు వారిని విముక్తుల గావించును. వారు నగరములోని కరిగి యాతటాకమును సమీపింతురు. ఆ చెరువుగట్లను ద్రవ్వి యందలి నీరు వెలికి బోవుట కెన్నియో మార్గములు గావింతురు. వారెన్నివిధముల బ్రయత్నించినను నందలి నీరు తఱుగదు. అప్పుడు వారు తమకు బ్రాణసంకటము దప్పదని యెంచికొని నిరాశులై నిరాహారులై యా తటాకతీరమున గూరుచుండి

శ్రీరామచంద్ర పరబ్రహ్మసంస్మరణము సేయ నారంభింతురు. అట్లొక మాసము కాల మతిక్రమించిన మీదట నిక దమకు జేనివలన మరణ మెట్లును దప్పదని నిశ్చయించికొని యా తటాకములోని యగాధ జలమున మునిగి ప్రాణపరిత్యాగము సేయ నుద్యమింతురు. అప్పుడు వారి దారాపుత్రాదు లరుగుదెంచి హాహాకారములు సేయుచు మహా కోలాహలము గావింతురు. వారినా బ్రాహ్మణు లనేకనీతివచనము లాడి యూఱడింతురు. అనంతరము తామా తటాకములో స్నానము జేసి యనేకదానములు సేయుదురు. ఆ సరోవరమున కేను ప్రదక్షిణ ములు సేసి దోయిలి గట్టుకొని యుత్తరాభిముఖముగా నిలిచి సీతా మనోహరా! శ్రీరామచంద్రా! నీవేనాడో చేసిన దానమువలన మాకీనా డిట్టి తప్పింపరాని ముప్పువ్పటిల్లినది. ఇదిగో! మే మెల్లర మును క్షణములో మృత్యుదేవతకు గ్రాసము గాబోవుచున్నవారము కనుగొనుము. నీ వొసగిన రాజ్యమువలన బూర్వమందు బ్రాప్తిం చిన యాదాయము నంతను మా పూర్వు లనుభవించిరి. మేము మా జీవితములో నెంతయో యాదాయము నిప్పటివఱకు ననుభవించితిమి. ఇంతవఱకు మీరు దిన్నదాని నంతను నిప్పుడు వెలిగ్రక్కు డన్న మే మేమి సేయగలము? కావున వేఱొక తెరువు గానక యీ చెరువులో బడి యుసురులను దొరగ దొరకొనుచున్నవార మని దీనముగా విల పించుచు నివేదనము జేసికొందురు. కన్నులు మూసికొని కడపటి మాఱుగా నిష్టదేవతాసంస్మరణము జేసికొనుచుందురు.

అంతలో నచ్చటకు జేరువగా నున్న దేవాలయములోని యాంజనేయుని పాషాణమయవిగ్రహమునుండి యాంజనేయు డావిర్భ వించి బిగ్గఱగా సంభ్రమము మీఱ నా బ్రాహ్మణులతో బ్రాహ్మణు లారా! మీ రుసురులను దొరగ బనిలేదు. ఇదిగో! శ్రీరామచంద్రుని దూతను నే నాంజనేయుడ నాగమించితిని. చూడుడు అని పలుకును

ఆ పలుకు విని వారాశ్చర్యచకితులై కన్నులు దెఱవగా నెదుట వారి కాంజనేయుడు దీర్ఘములైన బాహువులతో, మహాఘోరమైన దేహముతో, బింగళవర్ణముగల కేశములతో, వార్ధక్యమును వెలి బెట్టు సర్వతమంత యాకారముతో, శ్రీరామనామ సంస్మరణము జేయుచు గానవచ్చును. అతనిని గాంచి యా బ్రాహ్మణు లందఱును బరమానందభరితులై తమ యుదంత మంతయు నాతని కెఱిగింతురు. అప్పు డాంజనేయుడు సత్వరముగా నా శిలను వెలికి దెచ్చి యా బ్రాహ్మణులను వెంట నిడికొని దుష్టుడైన యా మహారాజు కడకు బోయి యతనికి జూపును. శ్రీరామముద్రాంకితమైన యాశిలను, నందలి లిపిని జూచి యా తే డాశ్చర్యచకితు డగును. బ్రాహ్మణులను క్షోభపెట్టిన వాడైన కారణమున నాభూపతికి హనుమంతుడు గొఱత శిక్ష విధించును. ఆ మహారాజును విముక్తుని గావింప నేగుదెంచిన రాజభటుల నెల్లరను దోకతో మర్దించును బ్రాహ్మణుల హృదయతాపమును శమింపజేసిన దగుటచే నా సరోవర మానాటి నుండియు హత్తాపశమన మనుపేర బరగును. ఏనాడో బ్రాహ్మణులకు రాజ్యదానము జేసిన శ్రీరామచంద్రుని యౌదార్యమును లోకులచే గుఱుతింప జేయుటకై యా తావున నాంజనేయుడు ఉదార రాఘవేశ్వరు డను పేర నొక శివమూర్తిని బ్రతిష్ఠించును. ఆసరోవరములో స్నానము జేసి యాపరమశివు నారాధించినవారికి దాపత్రయము లణగిపోవును. అనంతర మాంజనేయుడు సంతుష్టాంతరంగులైన యా విప్రులను జూచి- "విప్రులారా! భూతలముపై నొక గుహను నిర్మించి మీరీ శిల నందు బ్రతిష్ఠింపుడు. భయపడవలదు. నే నెల్ల వేళల మీకు సన్నిధానవర్తినై యుందును. శ్రీరామచంద్రుని స్మరించి కొనుచు గాలయాపనము సేయుడు." అని పలికి యచ్చటనే యంతర్హితుడగును. అనంతరమా భూదేవు లాంజనేయుడు నొడివిన విధముగా నాశిల నొక గుహలో నిలిపి సానందముగా దమతమ

గృహాములకు మఱలిపోవుదుగు. అది మొదలుగా నెన్నడు నెవ్వరు నా రాజ్యమును హరింప నుద్యమింపరు.

శిష్యా! విష్ణుదాసా! ఇది భావిచరిత్రము. జ్ఞానదృష్టిచే గ్రహించి నీయానందమును గోరి నీకు వినిపించితిని.

ఇప్పటికి నా రాజ్య మిచ్చట బ్రాహ్మణులచే ననుభవింపబడు చున్నది. అప్పుడప్పుడు పుడమిపై బుట్టిన మహారాజు లెల్లరు నా రామాజ్ఞను మన్నించుచుందురు.

ఈవిధముగా నయోధ్యానగరములో సీతతోడను సోదరుల, తోడను, దనయులతోడను గూడి శ్రీరామచంద్రు డెన్నియో కౌతు కముల నాచరించెను.

షష్ఠసర్గము సమాప్తము.

—) 0 0 0 (—

# సప్తమ సర్గము

## — శ్రీరామచంద్రుని దినచర్య —

శ్రీరామదాసుడు విష్ణుదాసున కిట్లు వివరించును.

శిష్యా! విష్ణుదాసా! లోకశిక్షణము కొఱకు రాజ్యపరిపాలన కాలమున శ్రీరామచంద్రుడు సాగించిన దినచర్యాప్రకారమును వివ రించుచున్నాడ నాలకింపుము.

అనుదినము సీతాసమేతుడై శ్రీరామచంద్రుడు ప్రాతఃకాల మున గాయకుల మంగళగీతముల మధురగానముల తో, నవవిధ మంగళవాద్యముల ధ్వనులతో హాయిగా నిదుర మేలుకొంచును. పార్వతీ పరమేశ్వరులను, గురువును, దశరథుని, దేవతలను, మాతృ

దేవతలను, పుణ్యతీర్థములను, దేవతామందిరములను, పుణ్యక్షేత్రములను, నరణ్యములను, బర్వతములను, సముద్రములను, నదీనదములను స్మరించి సీత మొగమును జూచును. వంగి తనకు వందనము సేయుచున్న సీతను లేపి యామె చేయి బట్టుకొని మంచముపైనుండి క్రిందికవతరించును. దాసీజనపరివేష్టితుడై మెల్లగా నటనుండి కదలి వెలుపలి పరిధికి జేరి యావశ్యక కార్యములను సాధించును. పిమ్మట క్రీడాశాలకు బోయి శౌచవిధిని, దంతధావనమును నిర్వర్తించును. అటు పిమ్మట నొకప్పు డింటను, మఱియొకప్పుడు సరయూనదిలోను స్నాన మాచరించును.

మెల్లగా బాదచారియై పోయి సరయూనదిని సమీపించును. దానికి నమస్కరించి దక్షిణతాంబూలములతోడ నారికేళము నెదుట నుంచి పునః ప్రణామము సేయును. చక్కగా బ్రసన్నత గలుగు విధమున నా నదిని స్తుతించి యథావిధానముగా బ్రాహ్మణుల వేదఘోషముతోడ నందు స్నానము సేయును. పిమ్మట సంధ్యావందనమును, బ్రహ్మయజ్ఞవిధిని నిర్వర్తించి యనేకదానములు సేయును. అప్పుడు సువర్ణసూత్రములతో నలంకృతమై వెండితోడను, రత్నముల తోడను నిర్మింపబడిన రథము నధిరోహించి సుస్నాతుడైన సూతుడు (సారథి) నడపుచుండ, సుస్నాతములైన గుఱ్ఱములు లాగుచుండ, గంటలు గణగణమని ధ్వని సేయుచుండ గృహమున కరుగును. యథావిధానముగా హోమవిధిని నిర్వర్తించును. సాదరముగా శివుని బూజించును. కౌసల్యను, సుమిత్రను, కైకేయిని సేవించును. కామధేనువును, కల్పవృక్షమును, పారిజాతమును, పుష్పకవిమానమును, జింతామణిని, కౌస్తుభరత్నమును బూజించును. అగస్త్య మహర్షిని, వటవృక్షమును, మారేడుచెట్టును, రావిచెట్టును, దులసిని, శమీవృక్షమును బూజించును. సూర్యభగవాను నారాధించి ద్వార

దేవతాపూజనము సేయును. అనంతరము గోవులను వృషభములను, తురగములను, వారణములను, (ఏనుగు) రథమును, శస్త్రములను, బ్రాహ్మణులను బూజించును. కోష్ఠాగారములను, గోశాలలను, బాలశాలను బూజించును. పిమ్మట సింహాసనమును, ఛత్రచామరములను, వీవనలను, గిరీటమును, నాసనమును బూజించును. దీపికను, దర్పణమును, బుస్తకాదికమును బూజించును. పిమ్మట నున్నతాసనముపై నాసీనుడైన దన గురువునకు బూజానమస్కారములు గావించి యా మహామహుని ముఖమున దనయుల తోడను, దరుణితోడను, సోదరులతోడను, బండితులతోడను గూడి గాథాశ్రవణము జేయును. అనంతరము సీతామహాదేవి ప్రార్థింపగా బ్రాహ్మణులను వెంట నిడికొని లోనికరిగి కామధేనువువలన, గల్పవృక్షమువలన, మణిద్వయము వలన బ్రాప్తించినవియు, నగ్ని సహాయమున సీతచే వండబడినవియు నగు నన్నముల నానందపూర్వకముగా నారగించును.

అనంతరము తాంబూలమును సేవించి దివ్యవస్త్రములను దాల్చి కటిబంధమును, శస్త్రములను ధరించును. అంతలో వైద్యుడు, జ్యోతిష్కుడు నాహూతులై యామెడ కాగమింతురు. రాఘవుడు సాదరముగా నెదురేగి తోడితెచ్చి వారి నుచితాసనాసీనుల గావించును. వారిలో వైద్యుడు శ్రీరామచంద్రుని కెదురుగా సుఖముగా గూర్చుండి రత్నఖచిత సువర్ణకంకణ సమలంకృతమైన యతని కుడిచేతిని జేతబట్టి నాడీపరీక్ష సేయును. చేతి బొటనవ్రేలి మూలమునందు జీవసాక్షిణి యను నాడి యుండును. దాని కదలికలను బట్టి వైద్యులు మానవ శరీరములోని సుఖమునుగాని, దుఃఖమునుగాని సులువుగా దెలిపికొనగలరు. అట్లు సూక్ష్మబుద్ధితో నాడి కదలికను బరిశీలించి యా వైద్యుడు రాఘవునితో జెవిలో రహస్యముగా మీరు గడచిన రేయిని విశేషపరిశ్రమ మొనరించితిరి అని వాకొనును. ఆ పలుకు

అని శ్రీరామచంద్రుడు మందహాసము జేయును. సహర్షముగా నా భిషగ్వరునకు దక్షిణతాంబూలము లొసగును. అటు పిమ్మట జ్యోతిష్కుడీవిధముగా బంచాంగపత్రమును జదివి వినిపించును." శ్రీరామచంద్రమహాప్రభూ ! మీకు విఘ్నేశ్వరుడు, బ్రహ్మవిష్ణుమహేశ్వరులు, దేవతలు సూర్యుడు, చంద్రుడు, కుజుడు, బుధుడు, గురుడు, శుక్రుడు శని, రాహు కేతువులు, సర్వగ్రహములు శుభమును గలిగించుగాక ! తిథిశ్రవణమువలన సిరి స్థిరముగా నిలుచును. వారము నాలకించుటవలన దీర్ఘాయువు గలుగును. నక్షత్రశ్రవణమువలన జేసిన పాపములన్నియు నశించును. యోగశ్రవణము వియోగమును హరించును. కరణము నాలకించుటవలన సర్వాభీష్టములును సిద్ధించును. కావున ప్రతిదినము బ్రాహ్మణుని ముఖమున బంచాంగశ్రవణము జేయవలెను. రఘునందనా ! యీనాటి తిథి దశమి, పక్షము శుక్లపక్షము. వారము భానువారము. నక్షత్రము పుష్యమి యోగ మైంద్రయోగము. కరణము బవకరణము. చంద్రుడిప్పుడు మీరాశికి రెండవయింట గర్కాటకరాశిలో నున్నాడు. మాసము చైత్రమాసము. ఋతువు వసంతర్తువు. మీరు హాయిగా రాజ్యపరిపాలనము సేయుడు. పుడమిపై జిరకాలము నిలువుడు. ఎల్లరకు సుఖము, నారోగ్యము, గలుగుగాక ! ఎల్లరు శుభములను గాంతురుగాక ! ఎవ్వనికిని దుఃఖము గలుగకుండును గాక !"

ఈవిధముగా జ్యోతిష్కుని ముఖమున బంచాంగప్రకారమును శ్రవణము జేసి రాఘవు డతనికి గూడ దక్షిణతాంబూలము లొసగి నమస్కరించును.

అనంతరము వెదురుపుటికతో బూలదండలను గొని మాలాకారుడు ముందునకు వచ్చును. ఆ దండల నందఱకు (పుత్రాదులకు) నొక్కొక్కటిగా నొసగి రఘునందనుడు స్వయముగా ధా

నొకటి ధరించును. ఇంతలో మంగలి ముందునకు వచ్చి ప్రభువునకు బంగారపు చట్రమున బిగింపబడిన యద్దమును జూపును. అందు శ్రీరామచంద్రుడు చంద్రబింబముతోడి సామ్యము గలిగి, సుందరమైన దరహాసము గలిగి, తామరపూవులను బోలు కన్నులు గలిగి, తీర్చైన నాసిక గలిగి, మాంసలమై వర్తులమైన గడ్డము గలిగి, యెత్తయిన చెక్కిళ్ళు గలిగి, మనోహరమణి కుండలముల దీప్తులు గలిగి, యందములు చిందు కనుబొమలు గలిగి, యున్నతమై, మూడు ముడుతలు గల ఫాలదేశము గలిగి, నవరత్నఖచిత సువర్ణకిరీటపు శోభ గలిగి కలకలలాడు తన ముఖారవిందము నొక్కమారు జూచికొనును. పిమ్మట నొక సేవకు డగురుధూపపాత్రమును దెచ్చి ప్రభువు నెదుట నుంచి దూతల నడుమకు బోయి నిలుచును.

అప్పుడు శ్రీరామచంద్రుడు పల్లకి నెక్కి గృహమునుండి బయలువెడలును. అతడు వెలుపలి పరిధిలో నిల్చిన వందిమాగధబృందమువంకకు జూచినంతనే వారు సూర్యవంశపు రాజులను వర్ణించుచు స్తుతి ప్రబంధములను బఠింతురు. గొంతెత్తి మధుర స్వరములతో జారణులు రావణసంహారము మున్నగు నా పరమపురుషుని చరితలను వివరించు గేయముల నాలపింతురు. వివిధవాద్యములతోడ నటులు, నాటవెలదులు నర్తనములు సేయుదురు. ఆసమయమున నింకను బలువురు వినోదప్రదర్శకు లెన్నియో వినోదములను బ్రదర్శించి ప్రభువునకు బరమానందము నొదవింతురు. పిమ్మట నవవిధ వాద్యములు మ్రోగును. ఇట్లు కదలి ప్రభువు క్రమముగా మూడవ పరిధిలో బ్రవేశించి యచ్చట నానాలంకారయుక్తములై సుందర వస్త్ర సమలంకృతములైన యేనుగులను, గుఱ్ఱములను, రథములను బల్లకులను దర్శించును. నాల్గవ పరిధిలో దర్శనమును గోరి వేచియున్న మహారాజులను, పురజనులను, మిత్రబృందమును విలోకించుచును. అధు

దవ పరిధిలో బ్రవేశించి యందలి పుష్పక విమానమును, బుష్ప వాటికలను, శస్త్రహస్తులగు దూతలను సందర్శించును. ఆఱవ పరిధికి జేరి యచ్చట దోయిలి గట్టుకొని నిలిచిన వేనవేలుగా నుండు నాశ్వికుల నవలోకించును. అనంతర మేడవకక్ష్యకు జేరి పల్లకి నవతరించి క్రమముగా సభాస్థలి కరిగి మనోహర చ్ఛత్రమండితమైన సింహాసనమును సమీపించును. సోపానమార్గమున గుడివంకగా నరిగి యా యాసనమునకు నమస్కరించి దాని నధిరోహించును. తోడనే లక్ష్మణుడు ఛత్రమును బట్టును. భరతుడు చామరమును వహించును. శత్రుఘ్నుడు వీవనను గ్రహించును. పవమాననందనుడు పాదుకలను బట్టును. సుగ్రీవుడు జలపాత్రమును, విభీషణు డద్దమును, నంగదుడు తాంబూలకరండమును, జాంబవంతుడు వస్త్రముల మూటను, వహించును. సింహాసనముపై శ్రీరామచంద్రుడు మెత్తని దిండు నానుకొని కూరుచున్నంతనే యతని వెనుక లక్ష్మణుడును, గుడియెడమ పార్శ్వములందు వరుసగా భరతశత్రుఘ్నులును, నెదుట బవమాననందనుడును, వాయువ్యదిశయందు సుగ్రీవుడును, నీశాన్యదిశయందు విభీషణుడును, నాగ్నేయకోణమునం దంగదుడును, నైరృతి దిక్కున జాంబవంతుడును, సమక్షదేశమున జేతులు గట్టుకొని సమస్త భూపతులును, సభలో నెల్లయెడల బురజనులు నాసీను లగుదురు. పార్శ్వభాగములం దున్న తాసనములపై మునీశ్వరులు గూరుచుందురు. అప్పుడు శ్రీరామచంద్రు నియెదుట నెందఱో వారవనితలు సుందర నృత్యములు సలుపుదురు. క్రమముగా సభలో వీరులు, దూతలు, శ్రీరామచంద్రుని తనయులు, మిత్రులు మున్నగు వారందఱు బ్రభువు సెలవుగొని కూర్చుందురు. ముఖ్యులు గాని యితరు లందఱు గూర్చుండరు. నిలిచియే యుందురు. సేవకు లెవ్వరును గూర్చుండరు. ఒక్క సుమంత్రుడు మాత్రము కూర్చుండును. వారి నడుమ ననుపమశోభాసమన్వితుడై వెలుగొందుచు రఘునందను డానాటి

రాజకార్యములను బరిశీలించును. అనేక కార్యముల భారమును సోద రులకు, బుత్రులకు నప్పగించును. అనేక కౌతుకముల నవలోకించును.

పిమ్మట పల్లకి నెక్కి గృహమునకు మఱలివచ్చును. అప్పుడు కూడ గోముఖము మున్నగు నవవిధవాద్యములు మ్రోగును. ఆ మంగళధ్వనుల నాలకించి సంభ్రమముతో జనకజాత కరమున జల పాత్రము వహించి స్వామికి బ్రత్యుత్థానముగా ద్వారదేశమునకు జేరి ప్రతీక్షించును. యథాపూర్వకముగా శ్రీరామచంద్రుడు గూడ మఱల క్రమముగా నేడు పరిధులను నతిక్రమించి యాయాతావుల నున్నవా రల కెల్లరకును సెలవొసగి యనుజన్ములతోడను, దనుజన్ములతోడను గూడి గృహములో బ్రవేశించును. పసుపువన్నె పట్టుచీర ధరించి, వివిధములైన యాభరణములను దాల్చి సిగ్గుతో దలవంచికొని క్రీగంటి వీక్షణములచే రాఘవుని చిత్తమున మోహావుదత్తము నొద వించుచు గాలియందెలు గల్లుగల్లుమని రవళింప సీతామహాదేవి స్వామి యెదుటకు జనుదెంచును. అప్పుడు రాఘవు డామె యొసగిన జలమును స్పృశించి యామె కేలును గేల ధరించి లక్ష్మణాదులను వీడుకొని యామె మందిరమున బ్రవేశించును. బయట దాను గన్న విన్న కౌతుకజనకములైన విషయము లన్నియు నామె కెఱిగించి యానందము గలిగించును. పిమ్మట నందఱను భోజనములు సేయ రండు లెండని యాహ్వానించును. శీఘ్రముగా స్నానముజేసి మాధ్యా హ్నికవిధులను నిర్వర్తించును. పితృతర్పణములు సేయును. శివునకు నైవేద్య మర్పించును. వైశ్వదేవము నాచరించును. భూతబలి నర్పిం చును. వెలుపల గాకబలి (కాకికి అన్నపుముద్ద యిడుట) నర్పించును. అతిథులను బూజించును. యతీశ్వరులను, బ్రాహ్మణులను నారాధిం చును. ఇంతలో సీతామహాదేవి బంగారుపాత్రములందు వడ్డనలు పూర్తిసేయును. అప్పుడు రాముండ్రుడు పీవవలుగొని వీచుచుండ నెల్ల

వారలతోడను గూడి సానందముగా భోజనము సేయును. పిమ్మట గరశుద్ధి గావించికొని తాంబూలమును సేవించి తనతోడ భోజనములు సేసిన బ్రాహ్మణులకు దక్షిణల నర్పించును. తరువాత దా నిటునటు నూఱడుగులు నడచి మెల్లగా శయనమందిరమున కరుగును. అంతలో సీతామహాదేవి కూడ భోజనము జేసి శ్రీరామచంద్రుని సన్నిధి కేగు దెంచి మంచముపై గూరుచుండియున్న యా స్వామికి వీవన గొని వీచును. అనంతరము సీత కూడ శయనింపగా దివ్యాలంకారములను దాల్చిన సౌందర్యరాశులగు దాసికామణులు వారి కిరువురకును వీవన లను గొని వీచుదురు. కొంతతడవైన మీాదట వా రిరువురును మేలు కాంతురు.

అప్పుడు సీతతోడ గూడి శ్రీరామచంద్రుడు కొంత తడవు బుద్ధిబలము నుపయోగించి పాచికల యాట యాడును. అనంతరము ద్రాక్షమండపములోనికి జేరి జలయంత్రములు మున్నగువాని కౌతు కముల నవలోకించును. పంజరములలో నున్న పక్షికులములను వీక్షిం చును. సోపానమార్గమున దన ప్రాసాదము నగ్రభాగమునకు జేరి వనములతో, నుపవనములతో, వీథులతో, నాపణములతో గలకల లాడు తన నగరవైభవము నవలోకించును. క్రమముగా నటనుండి కదలి గోశాలలకు జేరి వివిధములైన గోవులను వీక్షించును. పిమ్మట దాసికామణులతోడ సీతామహాదేవిని గృహములోని కంపినైచి తాను మెల్లగా లక్ష్మణాదులు నిలిచియున్న ద్వారము చెంతి కాగ మించును. వా రతనికి నమస్కారము చేయుదురు. వారిని వెంట నిడికొని ప్రభు వటనుండి కదలి క్రమముగా గుఱ్ఱపుశాలలకు జేరి గుఱ్ఱము లను, గజశాలలకు జేరి గజములను, నుష్ట్రిశాలకు జేరి యొంటెలను, శస్త్రశాలకు జేరి శస్త్రములను, వ్యాఘ్రశాలకు జేరి వ్యాఘ్రములను, శిబికాశాలకు (పల్లకులను నిలుపు చోటు) జేరి శిబికలను, మహిషి

శాలకు జేరి గేదెలను, వృషభశాలకు, జేరి వృషభములను రథశాలకు జేరి రథములను బరికించును. పిమ్మట యథాపూర్వముగా నందజను వెంట నిడికొని రథము నధిరోహించి యెనిమిదవ పరిధికి జేరి, యట నున్న యంత్రములను, శకటములపై నమర్చబడిన శతఘ్నులను, తృణకాష్ఠాదికముతో నింపబడిన గృహములను, దూతల నెలవులను గనుగొనును. అటుపిమ్మట దొమ్మిదవ పరిధికి జేరి నిరంతరము శస్త్ర పాణులై తన గృహమును రక్షించు నశ్వారోహులను; గజారోహు లను బరికించును. ఈవిధముగా దొమ్మిది పరిధులను నధిగమించి రఘునందనుడు వెలికి వచ్చి జలభరితములైన తొమ్మిది కందకములను గనుగొనును. మెల్లగా నయోధ్యానగరరాజమార్గము నవలంబించి సానందముగా ముందునకు సాగి పురద్వారమును సమీపించి ద్వార రక్షకులను నిరీక్షించును. అనంతర మనుజులతోడను, దనయుల తోడను గూడి మార్గమందలి వివిధములైన వనములను, నారామము లను, గాతుకములను గనుగొనచు గ్రమముగా సరయూనదీతీరమునకు జేరును. అచ్చట నందములు సిందు నావ నధిరోహించి కొంతసేపు క్రీడించుచు పిమ్మట నా నదీతీరమున దాత్కాలికముగా నేర్పడిన సభలో సైన్యసమేతుడైన యా ప్రభువు కొంత తడవు గూర్చుం డును. అచ్చట గూడ వారవనితలు చారుతర నృత్యములు సేయు దురు. ఆ నృత్యముల నవలోకించుచు కొంత సమయము గడపి మఱల నటనుండి కదలి తన నగరమునకు మఱలి వచ్చును. మెల్లగా సభా స్థలికి జేరి, పూర్వమందు జెప్పబడిన సమస్తములగు నుపచారముల నందికొనుచు లక్ష్మణాదులచే సేవింపబడుచు సింహాసనముపై నుప విష్టు డగును. కొంతతడ వెన్నియో కార్యములను జక్కజేసి సోదరు లను, బుత్రులను వీడుకొని తన గృహమునకు మఱలిపోవును.

అనంతరము సాయంసమయమున సంధ్యావందనము జేసికొనును. హోమవిధిని నిర్వర్తించును. గంధపుష్పోపచారములతో శివుని

బూజించికొనును. బ్రాహ్మణుల కుపహారముల నర్పించి వారిని, దనుజన్ములను, ననుజన్ములను వెంట నిడికొని శిబిక నధిరోహించి సాకేతనగరమునందున్న వేలువేలు దేవతామందిరముల కరిగి యా యా దైవతములను గంధపుష్పాదికముతోడ నారాధించును. ఆదేవతాయతనములలో బ్రవర్తమానము లగుచున్న వివిధములైన కీర్తనములను, వారవనితల మనోహర నర్తనములను, వాహనముల నధిరోహించి యున్న దేవతలను దర్శించి పరమానందము నొందును. అనంతరము బ్రాహ్మణులను వెంట నిడికొని రాజమార్గమున రత్నదీపపు గాంతులతో సాగిపోయి తన భవనమున బ్రవేశించును. అచ్చట దనయులతోడను, దమ్ములతోడను గూడి యొక జాము రేయి గడచువఱకు, నాయా యా ప్రసంగములతో గాలము గడపి క్రమముగా దన శయనమందిరమును బ్రవేశించును.

ఇంతలో నచ్చట సీతామహాదేవి తన స్వామికై పూలపానుపు నేర్పఱచి యతని రాక కెదురు చూచుచుండును. ఆగమించుచున్న స్వామిని గని యెదురువోయి యాతని కేలను గేల ధరించి, మందిరములోనికి దోడ్కొనిపోవును. శ్రీరామచంద్రుడును దాసదాసీజనుల నందఱను వీడుకొలిపి యా మందిరమునందలి గవాక్షముల నన్నిటిని దెఱపించి తాను రత్నమయమైన పర్యంకముపై నధివసించును. చేయి పట్టుకొని సీతను గూడ నా పర్యంకముపై నధివసింపజేయును. సానందముగా నామెతోడ గూడి కొంతతడవు క్రీడావినోదముల దేలియాడును.

ఇట్లు కాలము గడచుచుండగా నొకనాడట్టి తరుణముననే సీత శ్రీరామచంద్రునితో స్వామీ! నేనొక్క విషయము నడుగుచున్నాను. తగిన విధముగా బ్రత్యుత్తర మొసగి నా మనములోని సందియమును దొలగింపుము. అది యేమనిన కుశుని జన్మించిన పిదప నే నింతవఱకు

మఱల గర్భధారణము సేయలేదు. దీనికి గారణమేమి! అని ప్రశ్నించెను. ఆ సీతావచనము నాలకించి శ్రీరామచంద్రుడు చిఱునవ్వు నవ్వుచు నామెతో నిట్లు పలికెను. "జలజదళాయతాక్షీ! జానకీ! నీవు చక్కని ప్రశ్నమొనరించితివి. చెప్పుచున్నాడ నాలకింపుము. పెక్కురు బిడ్డలను నీ వెందులకు గోరుచుంటివి? ఉత్తమవంశము నందు పెక్కురు బిడ్డ లుండుట యుక్తము గాదు. ఏల యనిన వారిలో నే యొక్కడు దురాచారపరాయణుడైనను, వాని వలన గుల మంతయు గళంకిత మగును. ఆకారణముననే నేను పెక్కురు బిడ్డలను గాంక్షించుటలేదు. నా సంకల్పము ననుసరించియే నీవు గర్భధారణము సేయుటలేదు. ఎవ్వరైనను గులభూషణము గాగల కుమారు నొక్కనినే కాంక్షింపదగును. క్రిమికీటకములవలె దురాచారపరులగు పలువురు పుత్రులు పుట్టనేల? గిట్టనేల? రెండు కన్నులవలె, రెండు భుజములవలె, సూర్యచంద్రులవలె, రామలక్ష్మణు లనబడు మా సోదరద్వయమువలె నీకును నిరువురు పుత్రులు గలిగిరి, గదా? వారితోడ దృప్తి జెందుదము. ఇక ముందు మనకు సంతతి గలుగకుండు గాక.

ఈ వచనముల నాలకించి జానకి మఱల స్వామీ! నా కాడు బిడ్డ యొక్కతెయును గలుగకుండుటకు గారణ మేమి? అని ప్రశ్నించెను. అంతట రఘునందనుడు మఱల నిట్లు నోడివెను. దేవీ! విదేహరాజకుమారీ! నీకు గొమరిత గలిగినచో నే నామె నేలోకములో నెవని కర్పింపగలను? సప్తద్వీపాధిపతి నగు నాతోడ సమానుడగు మఱియొక మహారాజెందు గలడు? ఎవని భార్యకు నీవు దల వంచి నమస్కరింపగలవు? సర్వలక్షణ సంపన్నుడై మహానుభావు డిత డనదగు రాజకుమారు డెవడున్నాడు? వివాహకాలమున నే నెవని పాదములను గడుగగలను? ఆ కారణముననే నాకు గన్యను బడయు విషయ

మున నభిలాష మొనవలేదు. కుశాదులకు గొమరితలు గలుగలేదా? వారు మాత్రము నీకు గొమరితలు గారా? యౌవనమదము గారణముగా నీవు మోహమును బొందితివా? త్రిలోకజనని వను మాటను విస్మరించితివా? లోకములో నున్న ప్రతి స్త్రీరూపమును నీయంశము వలన బొడమినది కాదా? ప్రతి పురుషరూపమును నా యంశమున ప్రాదుర్భవించినది గాదా? ఈలోకములో నున్న స్త్రీలు పురుషులు నెల్లవారును నీకు గొమరులును, గొమరితలును గారా? "పెక్కురు బిడ్డలు గల్గినచో వారిలో నొక్కడైన గయకు బోయి పితరులకు పిండ ప్రదానము సేయగలుగును. కావున పెక్కురు బిడ్డలను గాంక్షింప వలెను." అని పెద్దలు చెప్పుదురు. కాని యది సామాన్యమైన వచనము. "కులమును దరింపజేసి ధన్యత గాంచగల తనయు డొక్కడే చాలును. క్రిమికీటకములవలె దుర్మార్గులై చరించు పెక్కుగు పుత్రులవలన ప్రయోజన మేమి?" యను మాటయే యుక్తమైనది. నీకు నేను బలువురు బిడ్డలను బ్రసాదింపకుండుటకు మఱియొక కారణము గూడ నున్నది. అది యేమనగ పెక్కు కాన్పులవలన స్త్రీల యందలి తారుణ్యము క్షీణించిపోవును. ఆకారణమున గూడ నీకు నేను బలువురు బిడ్డలను బ్రసాదింపలేదు. నీవు పలువురు బిడ్డలను బడయ గోరుచుంటివేని భావికాలమున ద్వాపరయుగమునందు ద్వారకానగరములో శ్రీకృష్ణుడనై జన్మించి నీకు బలువురు బిడ్డలను బ్రసాదింపగలను. నాడు వారితోడ నానందించెదవుగాక! ఆ నాడు నొక యాడుబిడ్డను గూడ నర్పింతును. ఆ నాడు కాన్పు లనేకములైన కారణమున నీలో దారుణ్యము నిలువదు. తత్కారణముగా నానాడు నేను బదునారువేల నూటయెనమండుగురు స్త్రీలను బెండ్లి యాడుదును. ఆనాడు నీవు పలువురు పుత్రులవలన బుత్రవధువుల వలన సౌఖ్యమును బొందగలవు. నేను గూడ బహుస్త్రీ సౌఖ్యమును బడయగలను. ఈ పలుకుల నాలకించి చిఱునవ్వు నవ్వుచు జనకజాత సానంద

దముగా స్వామిా! మిా కింతటి వాక్చాతుర్య మెటనుండి ప్రాప్తించి నది? మిా చాతుర్యము నంతను నన్నానందపఱచుటకే వెచ్చించు చుంటిరి' అని రాఘవునితో మేలమాడెను.

శిష్య! విష్ణుదాసా! ఇది శ్రీరామచంద్రప్రభువు యొక్క దినచర్య. నీకు విశదముగా వివరించి తెలియజెప్పితిని.

—నవమసర్గము సమాప్తము—

— 0₀0 —

## అష్టమసర్గము

### భగవానుని వివిధావతారములు

శ్రీరామదాసుడు విష్ణుదాసున కీవిధముగా వినిపించును.

ఒకనాడు లవుడు వసిష్ఠమహర్షిని గాంచి "గురువరేణ్యా! నేను మిమ్మొక్క విషయము నడిగి తెలిసికొనగోరుచున్నాను. తెలియ జెప్పుడు. వాల్మీకిమహాముని కృపాప్రభావమున నాకు సమగ్రముగా దెలిసిన విషయమైనను లోకు లందఱును కూడ దెలిసికొనగలరని యెంచి మిమ్ము బృచ్ఛజేయుచున్నాను. ప్రతిదిన రాత్రి నిదురించు చున్నతరుణమున గోలిమితిత్తినుండి వెలువడు వాయుధ్వనిని బోలు ధ్వని మనకు వినవచ్చుచుండును గదా! ఆధ్వనియొక్క రహస్య మేమియో యెఱుగజెప్పుడు" అని ప్రశ్నించెను. అప్పుడా మహర్షి యిట్లు నొడివెను.

కుమారా! లవా! చెప్పుచుంటి నాలకింపుము. పూర్వము రావణు డే శరీరముతో ననేకబ్రహ్మహత్యలు గావించెనో, యతని యా శరీర మిప్పటికిని లంకానగరము లో దగ్ధమగుచున్నది. శ్రీరామ చంద్రుని చేత నిధనము నొంది రావణుడు క్షణములో ముక్తి

డయ్యెను. పుడమిపై మసినంత కాలము నతడు వైరభావముతో జేసిన శ్రీరామచింతనప్రభావమున నతని పాపము లన్నియు దొలుతనే కాలిపోయినవి. అతడు తన శరీరముతో దేవతల కెన్నడును వంగి నమస్కారము జేసియుండలేదు. దేవాలయములలో సమ్మార్జనము (తుడుచుట) జేసియుండలేదు. భక్తితో దీర్ఘయాత్రలు సలిపియుండలేదు. కామనారహితముగా దప మొనరించియుండలేదు. శీతోష్ణ వాతాతపములను సహించియుండలేదు. సర్వవిధముల గోఱిగానిదై యెందఱో బ్రాహ్మణులను హింసించిన దగుటచే నతని శరీరమిప్పుడు గూడ లంకలో దగ్ధమగుచునే యున్నది. దాని జ్వాలలకు సంబంధించిన శబ్దమే మనకు గాలిమిత్తి ధ్వనివలె వినవచ్చుచున్నది. అది లోకధ్వని కారణముగా బగటివేళ వినరాదు. ఈనాటికి నాంజనేయు డనుదినమును నూఱు మోపుల కట్టెలను గొనిపోయి యా రావణుని చితిలో బడవేయుచుండును. అతని పాపములు శాంతించునంతవఱకు నా చితియట్లు కసలుచునే యుండును. కుమారా! లవా! నీ వడిగిన ప్రశ్నమునకు సమాధానముగా మఱియొక కారణమును గూడ నుగ్గడించుచున్నాడ నాలకింపుము. దేహాంతసమయమున రావణుడు గూడ దనను లోకులెల్లరును స్మరించుచుండు నట్టి వరము నను గ్రహింప శ్రీరామచంద్రుని వేడుకొనెను. అప్పుడు రాఘవు డతని కతని దేహము చితిలో గాలుచుండునంతకాలము నందలి జ్వాలల శబ్దములను సప్తద్వీపములందలి జను లెల్లరును వినగలుగునట్లును, దన్మూలమున నాతని స్మృతి యెల్లరకును గలుగునట్లును వరము నొసగెను. ఈ విషయమును విన్న మీదటనే యతడా పాపపు దేహమును బాసి రఘునందనుని యందు లయము నొందెను. ఇట్టులా మహర్షి వివరింపగా నాలకించి విగతసందేహుడై లవుడా మునిరాజునకు భక్తితో నమస్కరించి సెలవు గొని శిబిక నధిరోహించి స్వగృహమునకు సాగిపోయెను.

ఒకనాడు సీతాసమేతు డగు శ్రీరామచంద్రుడు తనుజన్ముల చేత, సహజన్ములచేత, వసిష్ఠాదిమునివర్యుల చేత బరివేష్టితుడై యుండి సానందముగా వారితో నిట్లు పలికెను. సోదరులారా! మునివర్యులారా! తల్లులారా! దేవీ! నేను మీకొక్క రహస్యము నుగ్గడింతు నాలకింపుడు. నే నీ యవతారములో నా ప్రేయసి యగు సీతతో గూడి యెంతగా సమస్తభోగవిలాసముల ననుభవించి సుఖమును బడయగంటినో యంతగా మఱియొక యవతారమునం దెందును బడసియుండలేదు. అనేక కార్యములను సాధించుటకై నేను దొలుత ననేకరూపములతో నవతరించియుంటిని. వానిలో నేడవతారములు శ్రేష్ఠములైనవి. వానియందు గూడ నిట్టి సుఖమును నేను బొంది యుండలేను.

పూర్వము శంఖాసురు డనుపేర బరగు ఘోరదైత్యు డొకడు మహాసముద్రమున బుట్టెను. అతడు కృతయుగములో సత్యలోకము నుండి వేదములను హరించెను. అప్పుడా వేదములను సంరక్షింప నేను మత్స్యరూపమును దాల్చి క్షణములో నా రక్కసు నుక్కడంచి మఱల దొంటి విష్ణురూపమును దాల్చితిని. ఆ మత్స్యయోనిలో సుఖమేమున్నది? అది తిర్యగ్జాతి గదా! ఆకారణముననే యా యవతారములో నేను చిరకాలము నిలువలేదు.

అనంతరము సముద్రమథనకాలమున మందరపర్వతము సముద్రములో మునిగిపోవుచుండగా జూచి మహాకూర్మరూపము నవధరించి యా పర్వతమును నా వెన్నుపై భరించితిని. కాని యా యవతారము నందు గూడ నేను చిరము నిలువలేదు. ఏల యనిన నది నింద్యమైన జలచరజాతి. అందేమి సుఖ ముండును?

అనంతరకాలమున నొకప్పుడు పుడమి కడలిగర్భమున మునిగి పోవుచుండగా జూచి మహావరాహరూపమును దాల్చి దానిని దంష్ట్ర

లపై నిలిపి యుద్ధరించితిని. ఆ సమయమున నా పుడమి తనదని స్పర్ధ సేయ నరుగుదెంచిన హిరణ్యాక్షుని సంహరించితిని. గర్హ్యమైన యీ పశుయోనియం దేమి సుఖ ముండును? కావున నా యవతారమునందు గూడ నాకు సుఖము ప్రాప్తింపలేదు.

అనంతరకాలమున నొకానొకప్పుడు ప్రహ్లాదునిచే ప్రార్థింపబడి స్తంభము నుండి నారసింహరూపమున బుడమిపై నవతరించితిని. అతితరక్రోధము వహించి యీ సమయమున ప్రహ్లాదుని తండ్రి యగు హిరణ్యకశిపుని సంహరించితిని. దుర్నిరీక్ష్యమైన యప్పటి నా క్రోధమూర్తిని గాంచి ప్రహ్లాదు డొక్కడు దక్క నన్యు లెవ్వరును నా దరికి జేరలేకపోయిరి. ఆ సింహజాతి యందు మాత్ర మేమి సుఖ ముండును? కావున నా యవతారమునందు గూడ నాకు సుఖ మన్నది ప్రాప్తింపలేదు. మఱియొకప్పుడు బలిచక్రవర్తిని వంచించుటకై వామనరూపమున నవనితలముపై నవతరించి త్రివిక్రమములను బ్రదర్శించి యీ చక్రవర్తిని పాతాళమున కంపివైచితిని. ఆ ముని దేహము నందు సౌందర్యమునకు దావే లేదు గదా! వనవాసము దక్క నాకా నాడు వేఱువిధమగు సుఖనివాస మేదియును లేదు. బ్రహ్మచర్య వ్రతదీక్షాపరతంత్రమైన యీ యవతారమునందు మాత్ర మేమి సుఖ ముండును? ఆ కారణమున నేనా యవతారమును శీఘ్రముగా జాలించి కొని స్వర్గమునకు వెడలిపోయితిని.

వేఱొకప్పుడు జమదగ్నిమహర్షికి గొమరుడనై పరశురాము డనుపేరి బుడమిపై బ్రాహ్మణరూపమున నావిర్భవించితిని. ఆ నా డిరువది యొక్క మాఱులు వెదకి వెదకి క్షత్రియుల నంతమొందించి భూతలమును భూవరరహితము గావించివైచితిని. ఆకాలమున నాచే వేయి చేతులవాడగు కార్తవీర్యార్జునుడు నిహతు డయ్యెను. ఆనాటి నా రూపము మునిరూపము, అదియును క్రోధభరితమైనది. వనము

లలో దిరుగాడు మునివరులకు సుఖమేమి యుండును? అని యాలో చించికొని యా పుట్టువున నేను దపమొనరించికొనుచు గాలమును గడపితిని. తపో వ్రతదీక్ష నవలంబించిన నా కానా డేమి సుఖము ప్రాప్తింపగలదు? ఈవిధముగా బూర్వ మాఅవతారములను దాల్చి తిని. అందెందును నాచే సుఖ మన్నది యనుభూతము గాలేదు.

ముందు ముందు ద్వాపరయుగమునందు గోకులములో శ్రీకృష్ణు డనై యవతరింతును. ఆ యవతారమునందు గూడ నిప్పటివలె సుఖ మును బడయజాలను. అప్పటి భావివిషయమును గొంత వివరించు చుంటిని. ఆలకింపుడు. నేను బుట్టుటకు ముందుగనే నా తల్లిదండ్రు లకు గారాగృహక్లేశము ప్రాప్తించును. బాల్యకాలమం దానాడు నేను మాతాపితరులను బాసి గోకులము నందు నందు డను పేర బరగు నొక యన్యుని యింట బెరుగుదును. గోపవేషమును దాల్చి గోవుల వెనుక దిరుగాడు నా కానా డేమి సుఖము కలుగును? ఆనాడు నేను స్త్రీ, గోవు, ఏనుగు, నశ్వము, పక్షి మున్నగు నెన్ని యో ప్రాణులను సంహరింతును. అప్పటి పుట్టువున దేవతున్నల కొసగిన వరముల ననుసరించి యానాడు నేను ధర్మవిరుద్ధముగా బరస్త్రీగమనమునకు బాలు పడుదును. పెక్కు విధముల దొంగతనములు సేయుదును. అనంత రము మధురానగరమున కరిగి యచ్చట నొక యేనుగును, కంసుని బరిమార్తును. ఒక దాసికతో క్రీడింతును. గోపికలయెడల నిష్ఠు రత్వము వహింతును. నేను గూడిన గోపికలతోడ ననంతరకాలమున బలరాముడు గూడును. కాలయవనున కడలి పరాభవము నొందు దును. మూడు లోకములందును బరాభవమును మించిన దుఃఖకార ణము వేఱొకటి యుండదు గదా! స్వస్థలమును బాసిపోయి కొంత కాలము సముద్రతీరమున నివాస మేర్పఱచికొందును. చిరకాల మొకచోట నెలకొనియుండను. మధ్యదేశమునందు నిలువ నాకు

దావుండదు. రాజ్యము నుండదు. పరుల యాజ్ఞకు లోబడి రాజ్య రహితుడై యుండువానికి సౌఖ్య మెట్టులబ్బును? కావున నా జన్మము నందు గూడ నాకు ఛత్రచామరాది రాజ్యభోగము లేవియు నుండవు. ఒక్క తనువువాడనై యుండి పలువురు మగువలలో నెవరికి సుఖమును గలిగింపగలను? ఎవరికి దుఃఖము నొదవింపగలను? వారిని రంజింప జేయుటకై కలతజెందిన చిత్తముతో రేయెల్ల దిరుగాడు నాకు సుఖము శాంతియు నెట్లు చేకూరును? గడియకాలములో నైదునందల ముప్పది యారు గృహముల చొప్పున రేయెల్ల సంచారము సాగించినను నింకను నిరువది యెనిమిది గృహములు మిగిలియే పోవును. ఆ గృహముల కరుగ సమయమే యుండదు. అంతలో సూర్యు డుదయించి వైచునుగదా! ముప్పది గడియల రాత్రియంతయు నాకానాడు మిక్కిలి యారాటముతోడనే గడచుచుండును రేయెల్ల గంటికి కునుకు లేక తిరుగాడు నాకు సుఖమెట్లు దొరకును? సంవత్సరము మొత్తముమీద రాత్రికాలము పెరిగినప్పు డొక్కింత కూరుకు నందుట కవకాశము చిక్కునేమో? యావజ్జీవము దుఃఖమునే యనుభవింపగోరువాడు మాత్రమే పెక్కురు భార్యలను గూర్చుకొన దగు ననుట నిక్కువము. ఈ విధముగా నాకు శ్రీకృష్ణావతారమునందు గూడ సుఖమన్నది మృగ్యమే యగును. ఆ యవతారము సమాప్తమగుట కూడ విప్రశాపము గారణముగా సంభవించును.

అనంతరము దైత్యులు యజ్ఞకర్మపరాయణులు గాగా జూచి ముందు గలియుగమునందు మనోహరమైన బుద్ధరూపమున బుడమిపై నవతరింతును. నాయుపదేశములచే నానాడు వారి బుద్ధిని యజ్ఞకర్మముల నుండి మఱలించి కొంతకాలము పుడమిపై నిలుతును. మౌనము నవలంబింతును. మలినవేషముతో జరింతును. శిరోముండనము జేసికొందును. యుగాది జీవునివలె జరింతును. ఎల్లవారలకు నుపదేశ

ములు సేయుదును. అంతటను నహింసావ్రతమహత్త్వము నుగ్గడింతును. ఆ యవతారమునందు కేశముల మూలమున, చేల మూలమున, మాలిన్యమూలమున నెక్కుడు దుఃఖము ననుభవింతును.

అనంతరము ఘోరకలిప్రభావము ప్రబలి కడపట నెల్లయెడల వర్ణసంకరము గాగా జూచి ముందు ముందు కల్కిరూపము నవధరింతును. బ్రాహ్మణుని యింట ప్రభవించి యశ్వము నధిరోహించి ఖడ్గపాణినై క్షణములో దుర్మార్గుల నందఱను ఖండించివైచెదను. ఆ యవతార మవనిపై నెక్కువ కాలము నిలువదు. ఆ కారణమున నా యవతారమునందు గూడ లేశమాత్రపు సుఖమైన నాకు ప్రాప్తింపదు. అనంతరము కృతయుగము ప్రవర్తిల్లును. అప్పుడు యథాపూర్వముగానే నవతారములను దాల్తును. ఈవిధముగా దొమ్మిది యవతారములలో నాకు సుఖానుభూతి లేదు. కావున నీ యవతారములో నేను యథేచ్ఛముగా సుఖము ననుభవించితిని. ఈ యవతారముతో దుల్యమైనది పూర్వము సంభవింపలేదు. ముందు సంభవింపబోదు.

ఈ యవతారములో నాకు సప్తద్వీపాధిపత్యమున్నది. పరమపావన చరిత యగు కళత్రము సీత యున్నది. మహావీరులు, ధనుర్ధరులు నగు నిరువురు తనయులున్నారు. త్రిలోకవిజేత లగు సోదరులున్నారు. కామధేనువు మున్నగు నేడు రత్నములున్నవి. ప్రత్యక్షవేదస్వరూపు డగు గురువు వసిష్ఠమహర్షి యున్నాడు. పుణ్యదేశ మగు నార్యావర్తములో నయోధ్యానగరములో వసతి యున్నది. రాజభోగము లాదిగా సమస్తభోగములును నాకు ప్రాప్తములై యున్నవి. నాకు సత్యవ్రతదీక్ష యున్నది. ఏకపత్నీవ్రతదీక్ష యున్నది. ఒక్కబాణముతో వాలి మున్నగువారిని సంహరింప సంభవమై యున్నది. సీతాశయ్య యొక్కటిదక్క నితరశయ్యను స్పృశింప గూడ దన్న నియమము యున్నది. మహాపురుషులందును నా యాజ్ఞ

కప్రతిహతత్వ మున్నది. ప్రయాణ సాధనముగా బుష్పకవిమాన మున్నది. దూతగా నాంజనేయు డున్నాడు. మిత్రములుగా సుగ్రీవ విభీషణు లున్నారు. శాత్రవసంహారసాధనముగా గోదండ మున్నది. సూర్యవంశమునందు జన్మము ప్రాప్తించియున్నది. కౌసల్యాదశరథులవంటి మాతాపితరు లున్నారు. నాకు సర్వతంత్రస్వాతంత్ర్య మున్నది. అనురాగవర్ధనురాలగు సుమేధవంటి యత్త యున్నది. జనకమహారాజువంటి జ్ఞాని మామయై యున్నాడు. విశ్వామిత్రుని వంటి విద్యాప్రదాత గురువై యున్నాడు. లక్ష్మణునివంటి యసదృశ శుభలక్షణుడగు మంత్రి యున్నాడు. పరమపావనసలిల యగు సరయూనది యున్నది. అంగదాదులవంటి పార్షదులున్నారు. నాలుగు దంతములు గల యేనుగున్నది. విప్రుల యభీష్టములను నెఱవేర్పవలె నన్న యకుంఠితదీక్ష యున్నది. అత్యంతమనోహరమై వైకుంఠమును దలపించు గృహ మున్నది. హృదయదేశమున జింతామణివంటి యసదృశమైన యాభరణ మున్నది. పదునొకండువేల సంవత్సరముల యాయు వున్నది. నా యీ మస్తక మే భూపతుల యెదుటను నవనతము గానిదై యున్నది. బ్రాహ్మణోత్తములారా! యీ విధముగా నాకీ పుట్టువునందు సమస్తసుఖములును సంప్రాప్తములై యున్నవి. అల్పమైన సుఖము గూడ ననుభవింప శక్యము గానిది నాకులేదు. కావున నా యీ యవతారము పూర్ణావతారము తక్కిన యవతారములు గడచినవియు, గడవనున్నవియును బూర్ణావతారములు గావు. అంశావతారములు.

సీతాలక్ష్మణ సమేతుడనై నేనింతకు ముందు వనవాసము చేసితి నన్నది భూభారమును హరించుటకును, లోకమునకు మానవ ధర్మము నుపదేశించుటకును నాచే నాచరింపబడినది. ఆ మానవధర్మ స్వరూపమెట్టిదో వివరించుచుంటి నాలకింపుడు. ఎంత శ్రమము నోర్చ

పించునట్టైనను దండ్రిమాటను దనయుడు జవదాటరాదను ధర్మమును లోకమున కుపదేశింప నెంచియే నేను దండ్రి యాజ్ఞను బాలించితిని. ఆనాడు నా తండ్రియాడిన మాట నసత్యము గావింపగల సామర్థ్యము నాకు లేదా? ఉన్నది. అయినను లోకశిక్షణము కొఱకే నేనట్లు చేసితిని. నా రాజ్యమునకు విఘాతము గలిగించిన మంథరను, దుష్టురాలగు కైకేయిని నేనానాడు దండింపజాలనివాడనా? అయినను నెట్టిపరిస్థితియందును స్త్రీహత్య సేయరాదనియు, సవతితల్లి యైనను గన్నతల్లి యైనను వలె బాలింపదగుననియు, స్వసుఖమునకై పరుల ప్రాణములను హరింపరాదనియు జనుల కుపదేశింప నెంచియే వారిని సంహరింపక విడిచిపుచ్చితిని. సోదరసంహారము సేయరాదనియు, బరుల రాజ్యమును గోరరాదనియు జనులకు దెలుప నెంచియే నేనానాడు సోదరుని సంహరింపబూనలేదు. తండ్రి మరణించినమీదటనైన సోదరుని వశమందున్న రాజ్యమును హరింప సమకట్టలేను. జనులకు రాజ్యకాంక్షయు, భోగకాంక్షయు దగదని తెలుప నెంచియే నేను వనముల కరిగితిని. తల్లిదండ్రులయందు, పుత్రులయందు, మిత్రములందు నత్యంతాసక్తియుక్తులు గావని తెలుపుటకే నేనానాడు వారితో నున్న యనురాగబంధమును ద్రెంచికొంటిని. సుఖదుఃఖములను సమానముగా భావింపదగుననియు, నుల్లాసకాలమున మహ్వాంగరాదనియు, కష్టకాలమున గ్రుంగిపోరాదనియు లోకమునకు దెలుప నెంచియే నేనానాడు రాజ్యభోగములను త్యజించి వనవాసక్లేశములను వరించితిని. మానవు లెల్లవేళల గామము, క్రోధము మున్నగు నంతశ్శత్రువుల నణచివేయవలె నని తెలుపుటకే నేను మునిహింసాపరాయణులగు ననేక దుష్టరాక్షసులను చునుమాడితిని. స్త్రీసాంగత్యమును బరిహరింపవలె ననియు, నేకాకియై తపస్సు చేయదగు ననియు, మానసము నెన్నడును మగువలపై నాసక్తము జేయరాదనియు జనులకు దెలుపుటకే సీతావియోగమును బ్రదర్శించితిని. కాని

యెన్నడు నాకన్న భిన్నులు గారు. ఆర్తరక్షణము, దుష్టని
గ్రహము సర్వదా కర్తవ్యములని తెలుపుటకే సుగ్రీవవిభీషణులను
రక్షించి, వాలిని, రావణుని నితర రాక్షసులను సంహరించితిని.
యశస్సుపార్జన మొకమానవధర్మ మని తెలుపుటకే నేను నీటిపై
రాలను దేలించితిని. కాని నేను దలచికొన్నచో నాకాశగమనము
జేయజాలనివాడను గాను. ఒకవస్తువు తనకు ప్రియమయ్యు జనులకు
విరుద్ధముగా దోచినచో దానిని వెంటనే పరిత్యజింపదగునని
తెలుపుటకే నేను లోకాపవాదభీతిని నెపముగా జేసికొని సీతను బరి
త్యజించితిని. తాను త్యజించినవస్తువు పరిశుద్ధమైన దన్న యెఱుక
లోకమునకు గలిగినంతనే దానిని మఱల స్వీకరింపదగునని తెలుపు
టకే నేను బరిత్యజించిన సీతను మఱల స్వీకరించితిని. ఏకపత్నీవ్రతాది
నియమములు, రాజకార్యములు, అశ్వమేధాది యజ్ఞములు, సదా
చారము, జపము, తపము, స్నానసంధ్యాద్యనుష్ఠానములు మున్నగు
వాని నన్నిటిని లోకశిక్షణము కొఱకే నేనాచరించితిని. పరమానంద
స్వరూపుడను, ముక్తసంగుడను నైన నాకు గర్మాచరణ మేమి? నే
ననయము నానందమయుడను. లోకమునకు సుఖము నొదవించు
వాడను. ఇప్పుడు మీ సమక్షమునందు మీకుతూహలము నుప
లక్షించియే యవతారపరముగా నా కొదవిన సుఖదుఃఖములను వివ
రించితిని. ఉపాసకుల సంతృప్తికై నా యీ యవతారము మధికగుణ
వంతమైనదని నొడివితిని. కాని నా యవతార లన్నియు నా బుద్ధికి
సమానములే. అయినను సమ్యగ్రీతి నాలోచించినచో నన్ని యవ
తారములందు నాయీ యవతార ముత్తమమైనదని చెప్పక తప్పదు.
నా యవతారములలో రెండు జలచరములు. (మత్స్యకూర్మములు)
రెండు వనచరములు. (వరాహనారసింహములు) రెండు జటావల్కలధ
రములు. (వామనపరశురాములు) ఒకటి వైశ్యావతారము. ఒకటి
గోపావతారము (గొల్లవాడు, కృష్ణుడు) ఒకటి మలినావతారము

(బుద్ధుడు) ఒకటి కల్కికావతారము (కల్కి) ఇందు గొన్ని గడచినవి. కొన్ని గడవనున్నవి. ఇవి యేవియు నాకు సంతోషకరములు గావు. ఇప్పటి నాయీ యవతారమే విశిష్టమైనది. ఉపాసకుల కత్యంత ప్రీతిపాత్రమైనది. ఆరాధకుల కఖిల శుభసంపదలను సమకూర్చునది. ఈ యవతారములో నాచేత సకలపాపహరములు, నత్యంతమనోహరములు, శ్రవణమాత్రమున మోక్షము నొసగ సమర్థములు నగు చరితము లాచరింపబడినవి. జను లెల్లవేళల నా యీ యవతారమును భజింతురు. ఈ యవతారమునందు భక్తి గలవారు నా కత్యంత ప్రీతిపాత్రులు. బ్రాహ్మణోత్తములారా! ఈ విషయ మంతయు నానందపూర్వకముగా నేను మీకు వివరించితిని. ఈ యవతారమునందు దోషారోపణము సేయువారు నా ద్వేషమునకు గుఱియై తమ పూర్వులతోడ నరకములలో గూలుదురు.

శ్రీరామచంద్రుడీ విధముగా వివరించి యా మహర్షుల నెల్లరను బూజించి వీడుకొల్పెను. అనంతరము సీత కానందము నొదవించుచు గాలము గడపెను. శిష్యా! విష్ణుదాసా! వింటివిగదా! ఇది శ్రీరామచంద్రుని యవతారముల వర్ణనము.

అష్టమ సర్గము సమాప్తము

—()—

## నవమ సర్గము

### శ్రీరామచంద్రుదు సపరివారముగా నేకకాలమున రెండురూపములు దాల్చుట

శ్రీరామదాసుడు విష్ణుదాసున కిట్లు వినిపించును.

ఒకానొకప్పుడు, మహర్షులయు, మహారాజులయు మిత్రులయు, సామాన్యక్షత్రియులయు, వైశ్యులయు స్త్రీలు సప్తద్వీపములందు

నుండు వారు వేలాదిగా నానావాహనముల నధిరోహించి చైత్ర స్నానముగావించు దివమున సీతామహాదేవిని దర్శింప నేగుదెంచిరి. వారి యాగమనము నెఱిగి జనకజాత వారి కెదురుగా జని సాదరముగా సగౌరవముగా వారిని నారీశాలకు గొనివచ్చెను. వారిని వివిధ వస్త్రాభరణాదికముతో బూజించెను. వారు గూడ దివ్యసింహాసనముపై చేజరిల్లు సీతామహాదేవిని నానాదేశములనుండియు దాము గొని తెచ్చిన దివ్యవస్త్రాభరణాదికముతో నారాధించిరి. అనంతర మామె చుట్టును సంతుష్టాంతరంగములతో గూరుచుండిరి. ఆ సమయమున జనకజాత వారికి శ్రీరామచంద్రుని దివ్యచరితముల నెన్నిటినో వినిపించెను. ఆ చరితముల నాలకించి పరమానందము నొంది వారు మంగళప్రదమైన యామె వివాహవృత్తాంతము నాలకింపగోరి నగు మొగములతో అమ్మా! విదేహరాజకుమారీ! నీ వివాహమంగళ వృత్తాంతమును మే మెల్లరము నాలకింప గోరుచున్నవారము. సవిస్తరముగా మాకా వృత్తాంతమును వినిపింపుము అని ప్రార్థించిరి. వారి యా పలుకు నాలకించి సీత సిగ్గుపడుచు దన సకియ యగు తులసి యను నామెకు శ్రీవణ జేసెను. అంతట నా తులసి యీ విధముగా నొడువ నారంభించెను.

నారీమణులారా! మహత్తర మంగళములకు మూలమైన మా సీతామహాదేవియొక్క వివాహమహోత్సవ వృత్తాంతమును సంగ్రహముగా వినిపింతు నాలకింపుడు. దీని నాలకించిన బుణ్యములు వృద్ధి బొందును. విశ్వామిత్రమహర్షి సాకేతనగరము నుండి రామలక్ష్మణులను తన యాశ్రమమునకు దోడుకొని వచ్చెను. అచ్చట వారు రాక్షసబాలకులను బరిమార్చి యామునిరాజు యజ్ఞము నిర్విఘ్నముగా గొనసాగునట్లు చేసిరి. అనంతరము వారు రథము నధిరోహించి మునిరాజుతోడ మిథిలనంకకు బయనము సాగించిరి. మార్గ

మధ్యమున శ్రీరామచంద్రుడు తన పాద సంస్పర్శమున గౌతమ మహర్షి భార్యను 'అహల్య' యను నామెను బావనురాలిని గావించెను. అనంతరము మిథిలానగరమునకు జేరి స్వయంవరసభలో నాసీను డయ్యెను. శివధనువు నెత్తిబోయి దానిని మీాద వైచికొని క్రింద బడిన తన శత్రువగు రావణుని గాంచెను. తన గురువు సమ్మతి వడసి యాధనువును సమీాపించెను. దానికి నమస్కరించి దాని నెక్కువెట్టగా నది మూడు ముక్కలయ్యెను. అప్పుడు మా సీతామహాదేవి యా శ్రీరామచంద్రుని మెడలో వరమాలను ధరింపజేసెను. అనంతరము మిథిలానగరములో శ్రీరామచంద్రునకు, నతని సోదరులకు నత్యంతవైభవపురస్సరముగా వివాహమహోత్సవములు సంపన్నము లయ్యెను. పిమ్మట రఘునందనుడు తన మాతాపితరుల తోడను, మగువతోడను గూడి జనకమహారాజుచే ఘనముగా బూజింపబడి తన నగరమునకు బయనమయ్యెను. మార్గమధ్యమున నతితరాగ్రహావ్యగ్రమానసుడై నిలిచిన పరశురాముని వైష్ణవచాపము నవలీలగా గ్రహించి యతని దర్పము నణచివైచెను. ఇది మా సీతామహాదేవివివాహ వృత్తాంతము, వింటిరి గదా!

తులసి ముఖమున నీ యుదంతము నాలకించి యా స్త్రీలందఱును బరమానందము నొందిరి. అనంతరము వారు సానందముగా మఱల సీతామహాదేవిని బూజించిరి. తాము గూడ నామెచేత బూజల నందికొని యామెకు నమస్కరించి యామెకడ సెలవుగొని చని చైత్రస్నానమును ముగించికొని క్రమముగా దమతమ నగరములకు దఱలిపోయిరి.

అనంతర మొకనాడు శ్రీరామచంద్రుని సమక్షమున గూరుచుండి లవుడు గురువగు వసిష్ఠమహర్షి ముఖమున బురాణశ్రవణము జేయుచుండెను. కొంత తడవైన మీాదట నతడు గురువర్యా! గ్రంథ

ములందు ప్రతిపత్రము నందు నొకచో 'శ్రీ' యనియు, నొకచో 'రామ' యనియు జనులు వ్రాయుచుందురు గదా! అందులకు గారణ మేమి? యని యా విషయమును దా నెఱిగియుండియు నచ్చట నున్న వారి కెల్లరకును దెలుపనెంచి యామహర్షిని బ్రశ్నించెను. అంతట వసిష్ఠమహర్షి యిట్లు నొడివెను.

పూర్వకాలమున వ్యాసమహర్షి శ్రీరామచరిత్రమును, నష్టాదశ పురాణములను, నుపపురాణములను రచించెను. ఇతరమహర్షులు షట్శాస్త్రములు మున్నగువానిని రచించిరి. లోకములో శ్లోకరూప మున నేమి యున్నను నదియెల్ల శ్రీరామచరిత్రమునకు సంబంధించిన దియే యని తెలుపుటకై జనులు గ్రంథములలో నొకచోట 'శ్రీ' యనియు, నొకచోట 'రామ' యనియు వ్రాయుచుందురు. అట్లు వ్రాయబడి యున్నచో నది పూర్వము వ్యాసాదిమునివర్యులచే శ్రీరామ చరితమునుండి గ్రహించి వ్రాయబడినదని జనులు దెలిసి కొందురు. ఇది యొకకారణము.

కుమారా! లవా! మఱియొక కారణము కూడ నున్నది. అజ్ఞానవశమున గాని. భ్రాంతివశమున గాని జను లొక పత్రములో దప్పు వ్రాసికొన్నప్పుడా పత్రము పవిత్రమగునను తలంపున నందు 'శ్రీరామ' యని వ్రాసికొందురు. అట్లు శ్రీరామనామాంకితమైన పత్రము దోషరహితముగను, దాని లేఖకుడు దోషరహితుడుగను బరిగణింపబడును.

గురు విట్లు నొడువగా విని లవుడు సంతసించి యామహర్షికి బ్రణమిల్లి మౌనభావము వహించెను.

ఒకనాడు శ్రీ రా మ చ ం ద్రు డు మంచముపై గూర్చుండి తాంబూల చర్వణము సేయుచు దొలుత నుమియుంచిన తాంబూల రసము, దోషకారణ మగుటచే నుమియనెంచి నిష్ఠీవనపాత్రమునకై

(ఉమ్మినేసికొనుపాత్రము) చూడఁగా నది యక్కడ లేకపోయెను. ఆ సమయమున సమీపమందున్న సుగుణ యను పేరఁ బరఁగు దాసి యొకతె నిష్ఠీవనపాత్రము దూరమం దుండుట నెఱిఁగియు, నా పరమ పురుషుని యాత్రమును బరికించియు సరగున వచ్చి తన దోయిలిని పాత్రము గావించి యతని తాంబూలరసము నందు గ్రహించి యా యుచ్ఛిష్టమును దైవికముగా బ్రాప్తమైన మహాప్రసాదముగా భావించి సానందముగా నారగించెను. అప్పటి యామె చర్య నవలోకించి పరమప్రసన్నుఁడై శ్రీరామచంద్రుఁ డామె నిచ్చవచ్చిన వరమును గోరుకొమ్మనెను. అప్పుడా దాసి మహాప్రభూ! మీకీ పుట్టువున నేకపత్నీవ్రతదీక్ష యున్నది. కావున మఱుజన్మమున మీతోడి పొందును నా కనుగ్రహింపుఁడని ప్రార్థించెను. అంతట రఘునందనుఁడు దాసీకామణీ! ముందు ముందు గోకులమునందు నేను శ్రీకృష్ణుఁడనై యవతరించినపుడు నీవు రాధ యనుపేర గోపపత్నివై ప్రాముఖ్య వింపగలవు. ఆనాఁడు చిరముగా నాతోడి క్రీడాసౌఖ్యమును బొందగలవు. ఆనాఁడు గోపిక లందఱియందును నీవు నా కత్యంతప్రీతిపాత్రురాలవు గాఁగలవు. అని పలికి యామెకు సంతోషము నొదవించెను.

శిష్యా! విష్ణుదాసా! శ్రీరామచంద్రుని మఱియొక గాథను మహాకుతూహలము నొదవించుదానిని వివరించుచున్నాఁడ నాలకింపుము.

ఒకానొక సమయమున రఘునందనుఁడు, సోదరులతోడను, పుత్రులతోడను, మంత్రులతోడను, గూడి సభలో సింహాసనముపై నాసీనుఁడై యుండెను. పవిత్రచరిత్రుఁడైన బ్రహ్మచారి యొకఁడు తరుణమున గరముల దండకమండలములతో, దనువున గృష్ణాజినముతో గాషాయవస్త్రముతో నచ్చట కేఁగుదెంచెను. అతనిని గాంచి రాముఁడు సింహాసనమునుండి క్రిందకు దిగి ప్రత్యుత్థానము చేసి ప్రణమిల్లి కొని

వచ్చి యొక యుత్తమాసనము పై నాసీనుని గావించెను. అతని సమక్ష మున గోవును నిలిపి యథావిధిగా నతనిని బూజించెను. పిమ్మట నో మహాత్మా! మీ దర్శనమున నే నీనాడు ధన్యుడ నైతిని. మీ యాగ మనకారణ మేమియో సెలవిండు. వెంటనే మీకార్యమును సఫలము గావించెదను.' అని యతనిని బలుకరించెను. ఆ పలుకువిని యా బ్రహ్మచారి మహాప్రభూ! నేను వాల్మీకిమహర్షి యంపగా నరుగు దెంచితిని. ఆ మహర్షి యొక మహాయజ్ఞము సేయ సంకల్పించి మిమ్మాహ్వానింప నన్నిచ్చట కంపినారు. కావున మీరు సీతామహా దేవి తోడను, సోదరులతోడను నుండి వెంటనే పయనము గండు. ఇది ప్రయాణమునకు తగిన ముహూర్తము' అని బదులు పలికెను.

అంతలో విశ్వామిత్రుని యాశ్రమమునుండి మఱియొక బ్రహ్మ చారి యేగుదెంచెను. అతనిని గూడ ప్రత్యుత్థానాసనములచే గౌర వించి యుపవిష్టుని గావించి రాఘవు డతని రాకకు గారణ మెఱుగ గోరెను. అప్పుడా బ్రహ్మచారి 'మహాప్రభూ! రఘునందనా! నేను విశ్వామిత్రునిచే నంపబడి యేగుదెంచితిని. ఆ మహర్షి యొక మహా యజ్ఞముసేయ సంకల్పించినారు. మిమ్మాహ్వానించి తోడ్కొని వచ్చుటకై నన్ను మీకడ కంపినారు. కావున వెంటనే బయలు దేఱుడు'' అని బదులు పలికెను. ఆ యిరువుర వచనములను నాల కించి చిఱునవ్వు నవ్వుచు రఘునందనుడు వెంటనే వారి వెంట బయన మునకు తన సమ్మతిని బ్రకటించెను. ఆ సన్నివేశము నెఱిగి యాశ్చర్య చకితులై జనులు తమలో దాము ఇది యేమి? ఏకకాల మున రాఘవుడు యజ్ఞములందు బాల్గొనుటకై యిరువురు బ్రహ్మ చారుల ననుగమించి యిరుదిక్కులకు నెట్లు చనగలుగును? అని తర్కించుకొనిరి. కొందఱు శ్రీరామచంద్రుని కశక్యమైన దేముండును? భిన్నరూపములతో మున్ను వనములో వనితలకు దర్శన మొసగలేదా?

లంకానగరమునుండి మజిలి వచ్చినవేళ భిన్నరూపములతో నా పుత్రుల నందఱ నేకకాలమున గలియలేదా? అట్లే యీ స్వామి యీనాడు కూడ రెండురూపములను దాల్చి యీ యిరువురు బ్రహ్మచారులను ననుగమించుచున్నాడో? యని భావించిరి. పౌరు లిట్లు తర్కించుకొను చుండగా శ్రీరామచంద్రుడు లక్ష్మణుని బిలిచి లక్ష్మణా! నే నివ్వాడే భోజనము జేసి పయనము సాగింతును. గుడారములతోడ బయనమగునట్లు సేనల కాదేశింపుము. మంగళవాద్యములను బ్రయోగింప నాజ్ఞాపింపుము అని యతని కాదేశించెను. అట్లే కానీ! యని యతడు వెంటనే మంగళ వాద్యములను బ్రయోగింప నాజ్ఞాపించెను. సేనలను బ్రయాణమునకు పురికొల్పెను. గుడారములను గొనిపోవ దూతల కాదేశించెను.

అనంతరము శ్రీరామచంద్రుడా యిరువురు బ్రహ్మచారులను వెంటబెట్టుకొని గృహములోపలకు జని యీ సమాచారమును సీత కెఱిగించి వారితోడ గూడి భోజనము జేసెను. సీతను, నూర్మిళాదు లను సోదరులను నేనుగులపై నెక్కించెను. పురస్త్రీలను బుష్పకవిమా నము నెక్కించెను. తానొక భద్రగజము నధిరోహించెను. ఆ సమ యమున మంగళవాద్యములు మ్రోగెను. వారవనితలు చారుతర నృత్యముల నలిపిరి. వందిమాగధులు స్తోత్రపఠనము లొనరించిరి. నటులు మధురగానములు సేసిరి. ఈ విధముగా శ్రీరామచంద్రుడు పయనించి క్రమముగా గుడారములు నెలకొల్పబడిన తావునకు జేరెను. ఆ రేయి నచ్చట వసించి ప్రభాతమున మేలుకాంచెను. స్నానము జేసి మరల గజము నధిరోహించి రెండు క్రోశముల దవ్వు ప్రయాణము సాగించెను. అచ్చట దా నరుగుదెంచిన మార్గము రెండు పాయలై రెండు దిక్కులకును బోయెను. ఆ మార్గములను గాంచి శ్రీరామచంద్రుడు సేనను, జనకజను, దనయులను, సోదరులను, సైన్య మును, పుష్పకమును, నేనుగులను, దనతోడ నున్నవార నందఱను,

కనకా బ్రహ్మచారుల నిరువురను సైతము రెండు రెండు మూర్తులనుగా బరిణతి మొనరించెను. పుత్రమిత్రకళత్రభ్రాతృ సేనాపరివార వాహన సమేతముగా రాఘవుఁడు రెండుమూర్తులను దాల్పగా జూచి జనులందఱు నాశ్చర్యచకితులు,నానందభరితులు నైరి. వాల్మీకిచే నంపబడిన బ్రహ్మచారి మూర్తులలో నొకమూర్తి వాల్మీక్యాశ్రమము దిక్కునకు సాగెను. రెండవమూర్తి విశ్వామిత్రాశ్రమము దిక్కునకు బయనించెను. అట్లే విశ్వామిత్రునిచే నంపబడిన బ్రహ్మచారి మూర్తులలో నొక మూర్తి విశ్వామిత్రాశ్రమమార్గమున బయనింపగా, రెండవమూర్తి వాల్మీక్యాశ్రమమార్గము ననుసరించెను. శ్రీరామచంద్రుని మూర్తులలో నొకమూర్తి ననుసరించిన పరివారమంతయు నామూర్తితోఁడ విశ్వామిత్రాశ్రమ మార్గమునందును, రెండవమూర్తి ననుసరించిన పరివార మంతయు నా మూర్తితోఁడ వాల్మీకి మున్యాశ్రమ మార్గమునందును ప్రయాణము సాగించెను. ఈ విధముగా నానాఁడు శ్రీరామచంద్రమహాప్రభువు మొదలుగా నా మహానుభావు ననుసరించి వచ్చిన శునకము వఱకు నెల్లవారును రెండురెండు మూర్తులు గలవారైరి. ఒక వర్గము విశ్వామిత్రుని యజ్ఞమునందు బాల్గొని యామహర్షిచే బూజింపబడఁగా, రెండవ వర్గము వాల్మీకి నెఱపు జన్నమునందు బాల్గొని యామహర్షిచే బూజల నందికొనెను. ఆ యజ్ఞములు ముగిసినంతనే యిరువురు రాములును దమతమ సేనాపరివార వాహనాదికముతోఁడ మఱలి వచ్చి తాము మొదట రెండు మూర్తులను దాల్చినచోట నేకమూర్తి గలవారైరి.

అనంతరము శ్రీరామచంద్రుఁడు క్రమముగా బయనము సాగించి నగరప్రవేశము జేసి మంగళవాద్యములు మ్రోగుచుండగా, వారవనితలు చారుతరనృత్యములు సేయుచుండగా, బుష్పకము

సందున్న పురవనితలు పుష్పవృష్టులను గురియించుచుండగా దన భవనమున బ్రవేశించి సభాస్థలికి జేరి సింహాసనముపై నాసీను డయ్యెను. ఊర్మిళ మున్నగు నన్నువలతోడ సీతామహాదేవి కూడ దన మందిరమున బ్రవేశించెను.

శిష్యా! విష్ణుదాసా! ఈ విధముగా శ్రీరామచంద్రుడు పుడమిపై మానవశక్తి కతీతములై కుతూహలజనకములైన యద్భుత చర్యలను వేనవేలుగా నాచరించెను. ఆ చర్యల నన్నిటిని వాల్మీకి మహర్షి విశదముగా వర్ణించెను. అందలి సారమును గ్రహించి శ్రీరామచంద్రమహాప్రభుని ప్రేరణచేత నీకు సంగ్రహముగా విని పించుచున్నాను. ఆ పరమపురుషుని యనుగ్రహమునకు బాత్రుడ వైన నీవెంతయు ధన్యుడవు. మన యీ సంవాదమును ముందుగనే తెలిసికొని వర్ణించిన వాల్మీకిమహర్షి కూడ నెంతయో ధన్యాత్ముడు. ఆ మహానుభావుడు దొల్లి తన కాలమునందు శ్రీరామావతారమునకు ముందే భావిచరిత్రమును భూతకాలచరిత్రమునువలె రచించి దిగంత విశ్రాంతకీర్తిశాలి యయ్యెను. ఇది యెంతయో గోపనీయమైన చరిత్రము. దీనిని నీకు వినిపించితిని. ఆ వాల్మీకిని బోలు మహాకవి యింతకు ముందుదయింపలేదు. ఇకముందుదయింపబోడు.

—నవమసర్గము సమాప్తము—

—( : )—

# దశమసర్గము

## సీత తునిగిన తులసీదళమును దాని కొమ్మతోడ సంధించుట

శ్రీరామదాసుడు విష్ణుదాసున కిట్లు వివరించును.

శిష్యా! విష్ణుదాసా! నీ కిప్పుడు శ్రీరామచంద్రుని మఱియొక మనోరంజకమైన లీలాచరిత్రమును వినిపించుచున్నాడను సావధాన మనస్కుడవై యాలకింపుము.

ఒకనాడు శ్రీరామచంద్రుడు సోదరులతో, మంత్రివర్గము లతో, పురజనులతో, జానపదులతో, పుత్రులతో, మిత్రులతో సానందముగా గొలువుదీరి యుండెను. ఆ సమయమున నా మహా పురుషున కర్పింప భూరికీర్తిమహారాజుచే నంపబడి కొందఱు దూతలు ద్రాక్షఫలాదికముతోను, బూవులతోను నింపబడిన కొన్ని పుటికలను (బుట్ట)లను దెచ్చి యెదుట బెట్టిరి. వానిని రాఘవుడు సీతామహా దేవి కడ కంపెను. సఖీజన పరివేష్టితయై యా సమయమున జనకజాత క్రీడాశాలలో నుండి కాలము గడపుచుండెను. ఆ పుటికలను గాంచి యామె యందొక్క పుటికను దెఱచెను. అందు మనోహరములగు పద్మములుండెను. అందొక పద్మము నామె కరమున గ్రహించి శ్రీరామార్పణము చేయకయే పర్యాయముగా దాని సుగంధము నాఘ్రాణించెను. అనంతరమా పుటికను మూసివైచి యన్ని పుటిక లను గృహమునం దనువగు చోట బెట్టించెను.

ఆ సమాచారమును సభాగతుడై యుండియే శ్రీరామచంద్రుడు తెలిసికొనెను. అప్పుడతడు తన మనమున నిదియేమి? సీత యిట్టి ధర్మవిరుద్ధమైన పని జేసిన దేమి? పతి నగు నాచే దొలుత ననుభ వింపజేయకయే పద్మసుగంధమును దా నాఘ్రాణించినది గదా! ఈమె నాదర్శముగా జేసికొని ముందు ముందు స్త్రీలందఱు నన్ని విషయము లందును దమ మగల నుపేక్షించి యీ విధముగనే ప్రవర్తింప జూతురు? కావున నామె కొక్క తగు శాసనము జెప్పవలెగాక! యని చింతించెను. అనంతరము మౌనముగా నీ విషయ మావంతయు నెఱుగనివానివలె గృహములోనికి జని యథా పూర్వకముగా వివిధము లగు క్రీడావినోదములతో సీతను రంజింపజేసెను. ఆమెయు ఫల పుష్పభరితములైన యా పుటికల నన్నిటిని రాఘవునకు దెచ్చి చూపెను. అతడు వాని నన్నిటిని దెఱచి చూచెను. అందు బను

నైదు పుటికలను దన సోదరుల యిండ్ల కంపివైచెను. తన తల్లులయు, దనయులయు, మంత్రులయు, మిత్రులయు, నరుంధతీ వసిష్ఠులయు, పౌరులయు, సేవకులయు నిండ్లకు నైదైదు, నేడేడుగా బుటికల నంపించెను. అనేక పుటికలను సీతామహాదేవి కర్పించెను. కొన్ని ఫలములను స్వయముగా దా నారగించెను. పద్మములు మున్నగు పూవులను గూడ నట్లే విభజించి యందఱకు నంపి యెన్నిటినో సీత కర్పించి కొన్నిటిని దాను గ్రహించెను. తన కర్పింపక సీత పద్మము నాఘ్రాణించిన విషయము నెఱుగని వానివలె దన మనమునసే దాచి కొనెను.

అనంతర మొక యేకాదశినాడు జనకజాత యుపవాసము జేసి మఱుచటి దినమున స్నానముజేసి తులసిని బూజింప దులసీవనము లోని కరిగెను. అచ్చట దులసిని బూజించి దానికి బ్రదక్షిణము లాచరించెను. నిరాహారయై యలసియున్న కారణమున నెక్కువసేపు నిలువ జాలక యామె తూలి సుంత ప్రదక్షిణమార్గము నతిక్రమించెను. అంతలో నామె చీరచెరగున దులసిదళ మొకటి చిక్కుకొని తునిగి క్రింద బడెను. ద్వాదశినాడు తన మూలమున దునిగిన యా తులసీదళమును గాంచి యామె తన వలన ననూహ్యముగా నధర్మాచరణ మైనందులకు భయభీతురాలయ్యెను. పిమ్మట నామె యాపత్రమునకు నమస్కరించి దాని నావనములో నొక యెడ బాఁతివైచి మరల బ్రదక్షిణములు సేసి గృహమునకు వెడలిపోయెను.

ఇంతలో నచ్చటకు నారదుడు వీణియ మీటుచు "పాలయ మాం దీనం రాఘవ పాలయ మాం దీనమ్" అను మహాపాతక నాశకమగు పంచదశాక్షర మంత్రమును సుమధురస్వరమున గానము సేయుచు నేగుదెంచెను. శ్రీరామచంద్రుడతనికి బ్రత్యుత్థాన మొనరించి నమస్కరించి తోడ్కొనివచ్చి యొక యుత్తమాసనముపై

నుపవిష్టుని గావించి సాదరముగా గౌరవించెను. సీతాసమేతుడై యత నికి పాదప్రక్షాళనము గావించెను. గోవు నర్పించి గంధాదికముతో బూజించెను. ఆ మహర్షి యెదుట నొక బంగారుపాత్రము నుంచి యందు భోజనపదార్థములను వడ్డింప సీతకాదేశించెను. అంతట సీతామహాదేవియు, గాలి యందెలు, కరముల కంకణములు, జిఱు మువ్వలు కర్ణపర్వముగా సవ్వడి సేయుచుండగా జని కామధేనువు వలన బ్రాదుర్భూతములైన మధురాన్నములను జేకొని శీఘ్రముగా వడ్డింపబోయెను. ఆమెను గాంచి నారదుడు శ్రీరామచంద్రునితో రఘునందనా ! సీతచేత నర్పింప బడుచున్న యీదివ్యాన్నముల నారగింప నిచ్ఛగింపను" అని వాకొనెను. ఆపలుకు నాలకించి సీత చకితురా లయ్యెను. సర్వకర్తయు, సర్వప్రభువు నగు రాఘవు డేమియు నెఱుగనివానివలె సంభ్రమము మీఱ నామహర్షి గారణమేమి ? ఈమె యర్పించిన పదార్థములను మీరేల భుజింపదలపరు ? అని ప్రశ్నించెను. అప్పుడు నారదుడిట్లు నొడివెను.

"శ్రీరామచంద్రా ! సీత పాపము జేసినది. మీ రెఱుగరా ? ఎఱుగకున్నచో జెప్పుచుంటి నాలకింపుము. ద్వాదశినాడీమె తులసీ దళమును ద్రుంచినది. నా మాటను గాదందురేని తులసీవనమున కరిగి పరికింపుడు. సంక్రమణదినములందు, చతుర్దశీదినములందు, పర్వ దినములందు, ప్రాతస్సాయంసంధ్యా సమయములందు, శుక్రవారపు దినమున, మంగళవారమునాడు, మధ్యాహ్నసమయములందు, సూర్య చంద్రగ్రహణకాలములందు, శిశువు జన్మించిన వేళ, నెవరైన మరణించిన వేళ దులసీదళములను ద్రుంచినవాడు హరి శిరస్సును ఖండించిన వాడగుదురు. ద్వాదశినాడు తులసీపత్రమును, గార్తీకమాసమునం దామలక పత్రమును (ఉసిరిక) ద్రుంచిన మానవుడు ఘోర నరకమున గూలును. కాలముగాని కాలమందు దులసీపత్రమును

త్రుంచిన స్త్రీ పురుషుల కొక్కొక్క పత్ర మొక్కొక్క బ్రహ్మహత్యా మహాపాతకము నొదవించును. ఇది మహర్షు లెల్లరును ముక్తకంఠముగా నొడివిన మాట. ఈ కారణముననే నియమనిష్ఠాపరుడ నైన నేను సీతచే నర్పింపబడిన పదార్థముల నారగింప నంటిని."

ఈ నారదవచనముల నాలించి శ్రీరామచంద్రుడు మఱల "ఓ మునిరాజా! మీరే నా సీతను పావనురాలిని గావింపగలరు. వరదానమే చేయుదురో, వ్రతాచరణమునకే పూనుదురో? ఏదియో యొక యుపాయమున నీమెను పవిత్రురాలిని జేయ మిమ్ము జేయి చాచి శిరమువంచి వేడికొనుచున్నాను." అని పలికెను. అప్పుడు నారదుడు మహాప్రభూ! రఘునందనా! బ్రహ్మహత్యాది మహాపాతకముల నివృత్తికి మహర్షు లెన్నియో ప్రాయశ్చిత్తవిధానముల నుగ్గడించినారు. కాని ద్వాదశినాడు తులసీపత్రమును త్రుంచుటవలన గలుగు పాపమునకు ప్రాయశ్చిత్తవిధానము నెందును నేను గనలేదు. వినలేదు. ఇందుల కొక్కటియే యుపాయ మున్నది. తన పాతివ్రత్య బలమున నా తులసీపత్రమును సీత మఱల దాని కొమ్మతోడ సంధింపజేయగలిగినచో నామె పరిశుద్ధురాలు గాగలదు. ఇది సత్యము ఇందు సంశయింప బనిలేదు." అని పలికెను. ఆ పలుకుల నాలకించి రాఘవుడు సీతవంక కవలోకించెను. అప్పుడు సీత ఓ బ్రహ్మమానస పుత్రా! నారదా! మీరు నొడివిన విధమున నాపత్రము నిప్పుడే మీ యెదుటనే దాని కొమ్మతోడ సంధించెదను. చూడుడు. అని వాకొనెను. పిమ్మట దాను దెచ్చిన యన్నపాత్రమును గొనిపోయి యథాస్థానమున నుంచెను. నారదుడు, రాఘవాదులును వెంట నిడికొని తులసీవనమున కరిగెను. ఆమెతోడ కుశలవాదులు, లక్ష్మణాదులు, వారి భార్యలును కూడ నరిగిరి. సభాసమేతయై సీత వారి నడుమ నుండి భక్తితో తులసికి మ్రొక్కుచు తల్లీ! సర్వమంగళ పవిత్రీ!

తులసీ! నాలో బొచ్చెములేని యచ్ఛమైన పాతివ్రత్యబల ముండెనేని తత్ప్రభావమున నీ తునిగిన పత్రము నీతోడ సంధింపబడు గాక! యని శపథము జేసి తన ముందున్న పత్రమువంకకు జూచెను. కాని యది చెట్టుతోడ సంధింపబడలేదు. అప్పుడు సీత చకితురాలై ఖేద మునుబొందెను. అప్పటి యా కౌతుకము నవలోకింప నమరులు, గంధర్వులు, యక్షులు, కిన్నరులు, నాగులు, గుహ్యకులు, మునులు నెల్ల వారలు నేగుదెంచిరి. పిమ్మట విషణ్ణవదనురాలై యున్న సీత నేకాంతమునకు గొనిపోయి నారదుడు సాదరముగా నామె కీ విధముగా బోధించెను.

తల్లీ! జనకనందినీ! తులసీపత్రము వృక్షముతోడ సంధింపబడకుండుటకు గారణమును వివరింతు నాలకింపుము. పాతివ్రత్య నిష్ఠ గల స్త్రీలు తమ మగలచేత ననుభవింపజేయక ముందుగా బూవుల పరిమళమును గూడ నాఘ్రాణింపరాదు. నీ వొకనాడా విధముగా బద్మగంధము నాఘ్రాణించితివి. అది యెఱిగి రాఘవుడీ మాయను గల్పించెను. అతని సంకల్పము ననుసరించియే తునిగిన పత్రము మొక్కతోడ సంధింపబడలేదు. ఇది యంతయు నీకు గుణపాఠము జెప్పుట కేర్పడిన వ్యవస్థ. శ్రీరామచంద్రుని సంకల్పము నెఱిగిన వాడ నగుటచే నేను నీయందు దోషారోపణము జేసితిని. ఈ విషయమున నన్ను మన్నింపుము. నాపై గోపమును జూపవలదు. లోకములోని స్త్రీలకెల్లరకు నుపదేశించుటకై నీకీ శిక్ష కల్పింపబడినది. అట్లుగాకున్న లోకమునందలి స్త్రీలతివలు నిన్నాదర్శముగా జేసికొని తమ మగల నుపేక్షించి సమస్తభోగములను బొందగోరుదురు. కావున నిప్పుడు నే నొక్క పద్ధతి జెప్పుచుంటి నాలకింపుము. దాని ననుసరించినచో నాపత్రము చెట్టుతోడ దప్పక సంధింపబడును. నీ విప్పుడు మూడుల దుళసీవనములోని కరిగి అమ్మా! తులసీ! పద్మసుగంధము

నాఘ్రాణించుట యొక్కటి దక్క నితరవిషయము లన్నిటియందును బరిపూర్ణ పాతివ్రత్యనిష్ఠ నవలంబించిన దాననేని తత్ప్రభావమున నీ పత్రము మఱల వృక్షముతోడ సంధింపబడుగాక! యని శపథము సేయుము. విషాదమును బొందవలదు. మఱల తులసీవనమున కరుగుము.

ఇట్లు బోధించి యామెను దోడ్కొని నారదుడు మఱల తులసీ వనమున కరిగెను. అప్పుడు జనకజాత యెల్లర సమక్షమునందు తులసికి నమస్కరించి నారదుడు నుడివిన విధముగా శపథము జేసెను. తోడనే యెల్లవారు నవలోకించుచుండగా నా తునిగిన పత్రము వృక్షముతోడ సంధింపబడెను. అప్పుడు దేవతలు దుందుభులను మ్రోగించిరి. విమానములపయి నుండి దేవతాస్త్రీలు సీతారాములపై బూలవానలు గురియించిరి. బ్రాహ్మణులు జయ జయ ధ్వానములు గావించిరి. అప్పుడు పరమానందభరితురాలగు సీతను గాఢముగా గాగిలించికొని శ్రీరామచంద్రు డామెతో 'దేవీ! సీతా! మునిజనులకు గూడ మోహము నొదవింపగల మహాసౌందర్యరాశివి నీవు. ఇప్పటి నాయీ చర్య నిన్ను శిక్షించుటకు గాదు. లోకములోని స్త్రీల కెల్లరకును ధర్మరక్షణపద్ధతిని గఱపుట కుద్దేశింప బడినది. దుష్టశిక్షణమునకై, శిష్టరక్షణమునకై, ధర్మసంస్థాపనమునకై నే నీ రూపమును దాల్చితిని. స్త్రీ లెల్లను నెల్లవేళల బాతివ్రత్య ధర్మమును బాటింపదగు నన్న సంకల్పముతో నీకీ శిక్ష నాచే గల్పింపబడినది. కావున నీ విషయమున విషాదమును మానుము'' అని పలికి యామె నూఱడించెను. దేవతల నందఱను జక్కగా బూజించెను. పిమ్మట జనకజాత మొగముపై జిఱుచెమ్మట లుదయింప వడివడిగా నిటు నటు దిరిగి నారదాదుల కెల్లరకును దివ్యాన్నములను వడ్డించెను. వారందఱు నానందము మీఱ నా పదార్థముల నారగించిరి. భోజ

నానంతరము తాంబూలమును సేవించి నారదుడు క్రింది విధముగా శ్రీరామచంద్రుని స్తుతించెను.

—: నారదకృత శ్రీరామస్తోత్రమ్ :—

నా ర ద ఉ వా చ

శ్లో॥ శ్రీరామం మునివిశ్రామం జనసద్ధామం హృదయారామం।
సీతారంజనసత్యసనాతనరాజారామం ఘనశ్యామం।
నారీసంస్తుత కాళిందీనత నిద్రాప్రార్థితభూపాలం।
రామం త్వాం శిరసా సతతం ప్రణమామి చ్ఛేదితసత్త్రాలమ్॥
నానారాక్షసహంతారం శరధర్తారం జనతాధారం।
వాలివిమర్దన సాగరబంధన నానాకౌతుకకర్తారం।
పౌరానందద నారీతోషద కస్తూరీయుత సత్ఫాలం।
రామం త్వాం శిరసా సతతం ప్రణమామి చ్ఛేదితసత్త్రాలమ్॥ 2
శ్రీకాంతం జగతీకాంతం స్తుతసద్భక్తం బహుసద్భక్తం।
సద్భక్తవ్రజవాంఛిత పూరక పద్మాక్షం మునిజనపక్షం।
పృథ్వీజాపతి విశ్వామిత్రసువిద్యాదర్శితసచ్ఛీలం।
రామం త్వాం శిరసా సతతం ప్రణమామి చ్ఛేదితసత్త్రాలమ్॥ 3
సీతారంజితవిశ్వేశం వరపృథ్వీశం సురలోకేశం।
గ్రావోద్ధారణ రావణమర్దన కృత తత్సోదరలంకేశం।
కిష్కింధాపతి సుగ్రీవాఖ్యవలీముఖనాయక పరిపాలం।
రామం త్వాం శిరసా సతతం ప్రణమామి చ్ఛేదితసత్త్రాలమ్॥ 4
శ్రీనాథం జగతాం నాథం జగతీనాథం క్షితిభృన్నాథం।
భూదేవాసురనిర్జరపన్నగ గంధర్వాదికసన్నాథం।
కోదండాశుగతూణీరాన్వితహృద్యాకారం రణధీరం।
రామం త్వాం శిరసా సతతం ప్రణమామి చ్ఛేదితసత్త్రాలమ్॥ 5
రామేశం జగతామీశం రవి సంకాశం వతలోకేశం।

ప్రాచేతసకృత సంస్తవహర్షిత సీతాలాలితవాగీశం।
పృథ్వీశం హృతభూభారం నతయోగీంద్రం జగతీపాలం।
రామం త్వాం శిరసా సతతం ప్రణమామి చ్ఛేదితసత్తాలమ్॥ 6
చిద్రూపం జితసద్భావం నతసద్దిక్పం నతసద్భావం।
సప్తద్వీపజవర్షజ చంద్రముఖీ నీరాజిత సద్భావం।
నానాపార్థివనానోపాయన సమ్యక్తోషితసద్భావం।
రామం త్వాం శిరసా సతతం ప్రణమామి చ్ఛేదితసత్తాలమ్॥ 7
సంసేవ్యం మునిభిర్ధ్యేయం కవిభిస్త్వ నవ్యం హృది సంధార్యం।
నానాపండితతర్క పురాణజవాక్యాదికకృతసత్కావ్యం।
సాకేతస్థిత కౌసల్యాసుత గంధాద్యంకిత సత్కాలం।
రామం త్వాం శిరసా సతతం ప్రణమామి చ్ఛేదితసత్తాలమ్॥ 8
భూపాలం జలధృన్నీలం నృపసద్భాలం కలి సంకాలం॥
సీతాజాని సరోత్పలలోచన ముక్తసుమంత్రక సత్కాలం।
శ్రీసీతాకృతపద్మాస్వాదన సమ్యక్శిక్షిత సత్కాలం।
రామం త్వాం శిరసా సతతం ప్రణమామి చ్ఛేదితసత్తాలమ్॥ 9
హేరాజన్ నవభి శ్లోకైర్భువి పాపఘ్నం నవకం రమ్యం।
మే బుద్ధ్వా కృత ముత్తమనూతన మేతద్రాఘువ! మర్త్యానాం।
స్త్రీపౌత్రాన్నాదిక సౌఖ్యప్రద మస్మత్సద్వరవత్సాలం॥
రామం త్వాం శిరసా సతతం ప్రణమామి చ్ఛేదితసత్తాలమ్॥ 10

సకల శుభగుణధాముడు భక్తవత్సలుడు నగు శ్రీరాము నీ విధముగా స్తుతించి యతని సెలవుగొని సానందముగా నటనుండి కదలి నారదుడు వెడలిపోయెను. తోడనే యమరులు, మునులును గూడ శ్రీరాముని కడ సెలవు గొని తమ తమ తావులకు దరలి పోయిరి.

శిష్యా! విష్ణుదాసా! ఈ విధముగా నరరూపధారి యగు శ్రీరామచంద్రుడు జగతీతలమునం దెన్నియో విచిత్రములైన కౌతుకములనా చరించెను. సవిస్తరముగా వాని నెవ్వడు వర్ణింపగలడు? వానిలో నే యే యుదంతములను శ్రీరామచంద్రుడు నాస్మృతిపథమునకు వచ్చునట్లు చేసెనో వానిని మాత్రమే యా పరమపురుషుని యాజ్ఞకు లోబడి నీకు వినిపించుచున్నాను.

— దశమ సర్గము సమాప్తము —

—) 0₀0 (—

# ఏకాదశసర్గము

## — ఆనందరామాయణ మాహాత్మ్యము —

శ్రీరామదాసుడు విష్ణుదాసున కీవిధముగా వినిపించును.

ఎల్ల లోకములవారును నమస్కరింపదగిన పాదపద్మములు గలవాడగు శ్రీరామచంద్రుడు సీతామహాదేవితోడను, భ్రాతలతోడను, తనయులతోడను, ఇతరపరివారముతోడను గూడి ధర్మబద్ధముగా రాజ్యపరిపాలనము సేయుచుండెను. అట్లుండగా నొక్కనాడొక దూత శ్రీరామచంద్రుని సన్నిధి కరుగుదెంచి నమస్కరించి 'రాజీవనయనాభిరామా! శ్రీరామా! నే నిక మీకడనుండి మీ సేవ జేయుదలపను. తప మొనరించికొన నెంచుచున్నాను. కావున నాకిట నుండి వెడలిపోవ సెలవొసంగుడు' అని ప్రార్థించెను. శ్రీరామచంద్రుడందుల కియ్యకొనెను.

అంతట నాదూత సానందముగా దన గృహమున కరిగి శుచియై నవరాత్రి దీక్ష వహించి పరమపావన మగు నానందరామాయణమును భక్తిశ్రద్ధలతో బారాయణ మొనరించెను. ఆ కార్యము ముగియుటతోడనే యతడ బంధువులతో వెలికి జనెను.

ఇంతలో నొకదేశము నేలు నేలిక మరణించెను. అతని తన యుడు చాల జిన్నవాడు, రాజ్యసంరక్షణదక్షుడు గాడు ఆ కారణ మున నచ్చటి ప్రజలా బాలుడు పెరిగి పెద్దవా డగునంతవఱకు నా రాజ్య సంరక్షణభారము నప్పగింప నొక నూతనమంత్రిని నియమింప నెంచిరి. వారిలో గొంద ఱొకనిని గొనివచ్చి యత డుత్తము డనిరి. మఱికొంద ఱతడు దుష్టుడు. మంత్రిపదవికి దగడనిరి. వాదోపవాద ముల మూలమున వారి కెవనియందును నేకాభిప్రాయము గుదుర లేదు. అప్పుడు వారొక యేనుగును దెచ్చి దాని తొండమున కొక వరమాల నందిచ్చి యది యా మాల నెవని మెడలో వైచిన నతనిని మంత్రిని గావింత మని తమలో దాము తర్కించి నిర్ణయము జేసి కొనిరి. పిమ్మట వారొక యేనుగును దోడితెచ్చి సుందరవస్త్రాభరణా దికముతో నలంకరించి దాని తుండమునం దొక రత్నమాల నర్పించి విడిచి పెట్టిరి. అప్పుడా యేనుగు వయనమై నగరము వెలుపలకు వచ్చి యయోధ్యానగర మార్గము నవలంబించి క్రమముగా ననేకదేశముల నధిగమించెను. నానావాహనముల నధిరోహించి జనులు సానంద ముగా దాని ననుగమించిరి. అట్టులా యేనుగు పోయి పోయి యయోధ్యానగరమున బ్రవేశించి యచ్చట నంగడివీథిలో నిలిచి యున్న యానందరామాయణ పారాయణకర్త యగు దూత మెడలో రత్నమాలను వైచెను. అతనిని గాంచి జను లత్యంతాశ్చర్యచకితులు, నమందానందభరితులు నైరి. అతని నచ్చటనే యా యేనుగుపై నెక్కించి మంత్రిని గావించిరి. పిమ్మట నతనితోడ నతని పరివార మును గూడ నేనుగుపై నెక్కించి తమ దేశమునకు దోడ్కొని పోయిరి. ఆనందరామాయణ పారాయణ ప్రభావమున నతని కట్టి మహాసౌభాగ్యము గలిగినదని క్రమముగా జనులెల్లరకును దెలిసెను

అనంతరము నానాదేశములకు జెందిన వేనవేలు రాజదూతలు తమతమ ప్రభువులను సేవింపమాని తమతమ గృహములకు వెడలి

పోయిరి. వారిలో గొందఱు తమ యిండ్లలో నుండి యానందరామాయణమును బారాయణము జేసిరి. కొందఱు శ్రవణము జేసిరి. కొందఱు పఠనము జేసిరి. కొందఱు కీర్తనము జేసిరి. కొందఱు తన్నిష్ఠములైన యంతరంగములతో వ్యాఖ్యానము జేసిరి. లోకము నందిట్లానందరామాయణ నిష్ఠవహించిన రాజభటులు క్రమముగా వేలు, లక్షలు, కోట్లునైరి. వారిలో గొందఱికా నిష్ఠకు ఫలముగా నల్పధనము లభించిన గొందఱికు మహాధనము లభించెను. ఒకనికి రాజపదవి ప్రాప్తించెను. ఒకనికి మేలైన భవనము ప్రాప్తించెను. ఒకనికి గ్రామాధికారము లభించెను. ఒకనికి కృషి లభించెను. ఒకని కుత్తమమైన వృత్తి లభించెను. ఒకనికి స్వర్గము లభించెను. వేలు వేలు వ్యక్తులకు వారివారి పుణ్యబలములను బట్టి వేలు వేలు లోకములు ప్రాప్తించెను. కొందఱు సుందరమైన సూర్యపదవిని బొందిరి. కొంద ఱింద్రపదవిని బొందిరి. కొందఱు ధర్మరాజలోకమును, కొందఱు నిరృతిలోకమును, గొందఱు వరుణలోకమును, గొందఱు చంద్రలోకమును, గొంద ఱగ్నిలోకమును, గొందఱు ధ్రువలోకమును, గొందఱు బ్రహ్మలోకమును, గొందఱు వైకుంఠమును బొందిరి. ఈవిధముగా నానందరామాయణ ప్రభావమున గలిగిన పుణ్యఫల పరిమాణముల భేదములను బట్టి రాజభటులు, నితరులు గూడ వేలు వేలు సద్గతులను బొందిరి. ఆ నాడే దేశములందు నే ప్రభువు చెంతను గూడ నొక్కభటుడు గూడ లేకపోయెను. ఎల్లరు భటులును దమ తమ ప్రభువుల సేవలను వీడి వెడలిపోయిరి. రాఘవుని భటులు గూడ గొందఱు తమ స్వామికడ సెలవు గొనియు, గొందఱు సెలవు గొనకయు నందఱును క్రమముగా వెడలిపోయిరి. ఈ విధముగా నానాటను సమస్తదేశములందును రాజభటుల యభావము సంభవించెను.

ఇట్లుండగా నొక్కనాడు శ్రీరామచంద్రుని దర్శనమున కరుగనెంచి మహారాజు లందఱును దమతమ సైన్యములను బిలిపింప బోవగా వారి కొక్క సైనికుఁడును గానరాలేదు. ఔర! యిదేమి? యని యాశ్చర్యచకితులై వారు తమ పుత్రమిత్రాదులను దోడ్కొని శ్రీరామచంద్రుని దర్శింప నరిగిరి. వారి యాగమనము నెఱిగి వారి కెదురుగా సైన్యముల నంప రాఘవుడు ప్రయత్నించెను. కాని యతనికి గూడ సైనికు డొక్కడును గానరాలేదు. అప్పు డా మహా ప్రభువుగూడ నాశ్చర్యచకితు డయ్యెను. స్వాగతవచన పురస్సరముగా నా మహారాజులను దోడితెమ్మని యాదేశ మొసగి వారికెదురుగా దన మిత్రవర్గమును, లక్ష్మణుని బంపెను. వారు చని యా మహా రాజులను దోడుకొనివచ్చిరి. వచ్చిన మహారాజులు శ్రీరామునకు నమస్కరించి యాసనములపై గూర్చుండిరి. పిమ్మట వారు సైనికులు లేకుండుటను గూర్చి రాఘవునకు నివేదించిరి. ఆ మహాప్రభువు తానుగూడ దనకడ సైనికులు లేకుండుటను వారి కెఱిగించెను.

అప్పుడు రఘునందనుడు తన కులగురువగు వసిష్ఠుని రావించి గురువరేణ్యా! నాయొక్కయు, నీ మహారాజుల యొక్కయు సైన్యము లన్నియు నెందు బోయినవి? ఏమైనవి? నా కెఱిగింపుము అని ప్రార్థించెను. ఆ మునిరాజు క్షణకాలము ధ్యాననిమగ్నుడై యుండి యిట్లు నొడివెను. శ్రీరామచంద్రా! నీవు సర్వము నెఱిగి యుండియు నన్ను బ్రశ్నించుచున్నావు. నా ముఖమున నాలకింప గోరుచుంటివేని చెప్పుచున్నాడ నాలకింపుము. పూర్వము పరమ పావనమైన నీ చరిత్రమును వాల్మీకిమహర్షి నూఱుకోట్ల శ్లోకము లుగా రచించియుండెను. అందంతర్గతమై యానందరామాయణము తొమ్మిది కాండములతో విలసిల్లుచున్నది. దాని శ్రవణపఠనాదుల మూలమున నెల్ల సైనికులును క్రమముగా నీ దివ్యధామమునకు

వెడలిపోయిరి. వారిలో గొందఱు వేఱు వేఱు దివ్యలోకములను బొందిరి. భూతలమునం దిప్పు డెందును సైన్యములు లేవు. నా మాట నమ్ముము. ఆనందరామాయణ మసాధారణమైనది. ఆనందదాయక మైనది. మనోహరమైనది. దానిని నిష్ఠతో శ్రవణము జేయుటవల ననేక సైనికుల కెల్లరికిను సద్గతులు ప్రాప్తించినవి. ఆ గ్రంథము హీన జాతివారగు దూతలకు సైతము ముక్తి నొసగగలదు. సారకాండ మును శ్రవణముజేసిన మానవునకు సంసారబంధ విముక్తి గలుగును. యాత్రాకాండ శ్రవణమున సమస్త తీర్థయాత్రా ఫలము ప్రాప్తించును. యాగకాండ శ్రవణమున సర్వయజ్ఞఫలము సిద్ధించును. విలాస కాండ శ్రవణమున స్వర్గమునం దచ్చరమచ్చెకంటులతోడి యానం దము లభించును. జన్మకాండ శ్రవణమున నుత్తమసంతాన సౌఖ్య మొదవును. వివాహకాండ శ్రవణమున బురుషుడు మనోహారిణి యగు మగువను బడయును. రాజ్యకాండ శ్రవణమున రాజ్యాధిపత్య మును బొందును. మనోహరకాండ శ్రవణమున మానవుని మనో వాంఛితము లన్నియు సఫలము లగును. పూర్ణకాండ శ్రవణమున బూర్ణపదవి సిద్ధించును. భక్తితోడ నానందరామాయణము నాల కించిన పుణ్యపురుషుడు నీ సచ్చిదానంద స్వరూపమునందు లయము నొందును. నీ ప్రశ్నమునకు సమాధాన మిది. ఆలకించితివి గదా! ఇటుపై నెట్టు లుచితమని తోచిన నట్టు లాచరింపుము.

అంతలో విశిష్ఠదేశములందలి యితర మానవులుగూడ దూత లకు బ్రాప్తించిన సద్గతి నెఱిగి తామునుగూడ వారివలె నిష్ఠతో నానంద రామాయణ శ్రవణపఠనాదికములు సేసి తత్పుణ్యఫలముగా నానా విమానముల నధిరోహించి మహోత్తమమగు స్వర్గమునకు వెడలి పోయిరి. క్రమముగా యమలోకమంతయు శూన్యమయ్యెను. అంతట యమధర్మరాజు బ్రహ్మదేవుని వెంటనిడికొని కైలాసమున కరిగి

శంకరుని దర్శించి యీ యుదంత మాతని కెఱిగించి తన యారాటమును వెల్లడించెను. శివు డతని మాట లాలించి నవ్వుకొని యతనిని దోడ్కొని పార్వతీసమేతుడై వృషభవాహనము నధిరోహించి దేవతాబృందములతోడ సాకేతనగరమున కేగుదెంచెను. అతని యాగమనము నెఱిగి సీతాసమేతుడై శ్రీరామచంద్రు డతనికి ప్రత్యుత్థానము జేసి కొనివచ్చి పార్వతీదేవితోడ నుత్తమాసనముపై నాసీనుని గావించి యథావిధిగా బూజించెను. బ్రహ్మను, దేవతలను, యముని గూడ దగిన విధముగా గౌరవించెను. అప్పుడు బ్రహ్మ శ్రీరామచంద్రునితో రాజీవనయనాభిరామా! శ్రీరామా! నిరుద్యోగియై యారాటపడుచున్న యముని గనుగొంటిరా! ఆనందరామాయణశ్రవణప్రభావము ప్రబలుటచే సంయమినీనగరి యంతయు శూన్యమై పోయినది. భూలోకము గూడ శూన్యమైనది. ఎల్లవారలకు నివసించుటకు స్వర్గములో దావు దొరకకున్నది. కావున నీ విషయమున మీరొక్కింత పర్యాలోచనము జేసి నెఱవు నెఱిగింప వలయును.' అని సవినయముగా నొడివెను. ఆ మాటల నాలించి రఘునందనుడు శత్రుఘ్నునిచేత నాయుదంతమును వాల్మీకి కెఱిగింప జేసెను. అప్పుడు వాల్మీకిమహర్షి నవ్వుకొని యేవిధముగా జేసిన తన కావ్యగౌరవము క్షీణింపకుండ బుడమిపై స్థిరముగా నుండుటయు, నెల్లరకును సుఖము చేకూరుటయు సంభవించునో యా విధముగా జేయదగునని మఱల రాఘవున కెఱిగింపజేసెను. అప్పుడు రఘునందనుడు ఏడు జన్మములందు వరుసగా నన్నారాధించినవానికి మాత్రమే యానందరామాయణమునం దభిరుచి గలుగుగాక! యని నియమము మొనరించెను. ఆ మాట నాలకించి యందఱు నానందించిరి. పిమ్మట దేవత లెల్లరును వారి వారి నెలవులకు వెడలిపోయిరి.

శిష్యా! విష్ణుదాసా! అది మొదలు శతకోటిప్రవిస్తరమై రామాయణములో శివునిచే ప్రవచింపబడిన యానందరామాయణము

ముపై సకృదకృత నెవ్వడో యొక్క పుణ్యపురుషుడు మక్కువను ప్రవర్తించుచుండును. ద్వాపరయుగమునందు, గలికాలమునందును భూలోకవాసుల కెల్లరకు నానందరామాయణముపై నిష్ఠ జనింపదు. ఏడు జన్మములందు వరుసగా బుణ్యసముపార్జనము జేసికొన్నవారికి మాత్రమే యట్టి నిష్ఠగలుగును.

ఏకాదశ సర్గము సమాప్తము

— 0o0 —

# ద్వాదశసర్గము

శ్రీరాముడు యముని శాసించుట, సుమంత్రుని వైకుంఠారోహణము,

ప్రజలకు శ్రీరాముని యుపదేశము.

శ్రీరామదాసుడు విష్ణుదాసున కిట్లు వివరించును.

ఒకనాడు శ్రీరామచంద్రుడు సభామందిరమునందు సింహాసనముపై నాసీనుడై కొలువు దీరియుండగా నొక రాజభటు డెదుటకు వచ్చి రఘుకులాంబుధి పూర్ణచంద్రా! శ్రీరామచంద్రమహాప్రభూ మీ వృద్ధమంత్రులు సుమంత్రులు దివంగతులైనారు. ఆ మహాభాగుని భార్యలు తమ పతి ననుగమింప దమ యనుమతిని గోరుచున్నారు.' అని నొడివెను. ఆమాట నాలించి చకితుడు ఖిన్నుడునై రఘునందనుడు వెంటనే వాహనారూఢుడై సుమంత్రుని గృహమునకరిగెను. సుమంత్రుని జన్మపత్రికను బరిశీలించెను. ఆపత్రిక సుమంత్రుని యాయువు 9999 సంవత్సరముల పదునొకండు మాసములుగా దెలుపుచుండెను. కాని యతని యాయువా నాటికి గడపటి మాసమునం దిరువదియొక్క దివసము లతిక్రమించి యుంకను దొమ్మిది దివసములు శేషించియుండెను. అది యెఱిగి రాఘవుడు కులగురువగు వసిష్ఠునితో గురువరేణ్యా! కృతయుగమునందు మానవుల యాయువు

లక్ష సంవత్సరము లనియు, త్రేతాయుగమునందు పదివేల సంవత్స రము లనియు, ద్వాపరయుగమున వేయేండ్లనియు, గలియుగమున నూఱేండ్లనియు జెప్పబడినది. యముడిప్పుడు త్రేతాయుగనియ మము నుల్లంఘించి నన్నవమానించినాడు. అతడు నాదండనమును గోరుచున్నాడు. తొమ్మిది దివసముల యాయువు శేషించియుండగా సుమంత్రుని గొనిపోయినాడు. సుమంత్రు నిప్పుడు బ్రదికింపబోవు చున్నాను. చూడుడు.' అని పలికెను.

పిమ్మట గోదండమును గేల ధరించి గరుడవాహనము నధి రోహించి శీఘ్రముగా సంయమినీపురము దిక్కునకు బయనమై వెడ లెను. మార్గమధ్యమున సుమంత్రుని పాశబద్ధుని గావించి కొని పోవుచున్న యమకింకరు లాతనికి గానవచ్చిరి. తోడనే యాగ్ర హోదగ్రుడై వారి నందఱను బ్రహరించి సూక్ష్మ శరీరధారియై యున్న సుమంత్రుని విడిపించెను. అప్పుడా కింకరులు మమ్మేల నేల దండించితి రని రాఘవుని బ్రశ్నించిరి. ఇంకను దొమ్మిది దివసముల యాయువు శేషించియుండగా మీరీ సుమంత్రు నేల కొనిపోవు చుంటిరి? శేషించిన యా యవధి కూడ నతిక్రమించిన మీరావట గొని పోండు. మిమ్ముడ్డగింపను. నా రాజ్యమునందు నకాల మరణము లేదు.' అని రాఘవుడు వారికి బ్రత్యుత్తర మిచ్చెను.

ఆ మాట లాలించి వారు మఱల 'స్వామీ! పూర్వము సుమంత్రుని జన్మకాలమున మాతృగర్భము నుండి తొలుత నితని ముఖము, చేతులును వెలువడినవి. అటు పిమ్మట దొమ్మిది దినము లతిక్రమించినపిమ్మట మదియు నా డితని సర్వావయవములును గ్రమ ముగా బహిర్గతములైనవి. అనాడు పండితు లితనికి సుమంత్రుడని పే రిడగావించిరి. ఆ కారణమున నే యితడు సుమంత్రుడని పేర్కొన బడినాడు. తొలుత నతని యవయవములు బహిర్గతములైన నాటి

నుండియు లెక్కించి చూడగా నీతని యాయు వంతయు బూర్తిగా జెల్లిపోయినది. కాని మీ రితడు మాతృగర్భమునుండి పూర్తిగా బహిర్గతు డయినప్పటినుండియు లెక్కించి యితని కింకను దొమ్మిది దినముల యాయువు శేషించినదని చెప్పగలుగుచున్నారు. నిజ మరయుగా నితని జన్మకాలము సందిగ్ధముగా నున్నది. ఇందు మా యపరాధ మావంతయును లేదు. మీ రక్రమముగా మమ్ము దండించి యితనిని గొనిపోవుచున్నారు.” అని వాకొనిరి. వారి పలుకుల నాల కించి రాఘవుడు కింకరులారా! శరీరధారి మాతృగర్భమునుండి సంపూర్ణముగా బహిర్గతుడయినప్పటి నుండియే యాయువును లెక్కింపవలయును. ఆ దినమే యుత్సవము చేసికొనదగిన దినము. జ్యోతిశ్శాస్త్రజ్ఞులాదినమునే యితని జన్మపత్రికలో లిఖించిరి. కావున శేషించిన తొమ్మిది దినముల నితని యాయుశ్శేషముగానే పరిగణింప వలెను. కావున మీరిప్పుడు వెడలిపొండు. మఱల బదియవనాడు వచ్చి యీతని గొనిపొండు.’ అని వారికి దెలియజెప్పెను. అప్పుడు వారు మౌనము వహించి ఛిన్నభిన్నాంగములతో జింతించుచు యముని కడకు వెడలిపోయిరి.

రాఘవుడును మఱలివచ్చి తన నగరమున నడుగు వెట్టి పురపురంధ్రీమణుల నివాళుల నందికొనుచు నరిగి క్రమముగా సుమంత్రుని గృహమున బ్రవేశించెను. అచ్చట సుమంత్రునితోడ నెల్లవారు నమందానందభరితులై యుండిరి. సుమంత్రుడు రాఘవుని జూచి యా పరమపురుషునకు భక్తితో బూజానమస్కారములు గావించెను. అనంతరము సానందముగా శ్రీరామచంద్రుడు తన గృహమునకు వెడలిపోయెను. సుమంత్రుడు శ్రీరామచంద్రుని యాజ్ఞ ననుసరించి యా తొమ్మిది దినములందును విరివిగా దానధర్మములు గావించెను.

అనంతరమా యమదూతలు తమ ప్రభువు సన్నిధి కరిగి కోప ముతో దలపాగల నూడదీసి నేలను వైచి కొట్టి యతనితో ప్రభూ! మీరేమి యధికారము సేయుచుంటిరి? యమధర్మరాజా! మీ యాజ్ఞాకారులమగు మా యీ దురవస్థను గనుగొన్న మీకు లజ్జ గలుగుటలేదా? శ్రీరామచంద్రులు మమ్ము జావగొట్టి సుమంత్రుని మాకడ నుండి విడిపించి కొనిపోయినారు. ఆ సుమంత్రున కింకను దొమ్మిది దినముల యాయువు శేషించియున్నదట. ఇంత యవమాన మును బొందిన కారణమున నికమేము జీవించి యుండవలచుటలేదు. నీట మునిగి యుసురులను దొరగ నెంచుచున్నాము. అని చెప్పిరి. ఆకింకరుల వచనము లాలించి యము డొక్కుమా త్రాగ్రహవ్యగ్రుడై మండిపడెను. దూతలారా! చింతింపకుడు! ఇప్పుడా శ్రీరాముని బట్టి బంధించి నేను దండించెదను. సేనలను సన్నద్ధము సేయుడు. ఈ విష యము నిప్పు డింద్రునకు గూడ సూచించెదను. అని పలికి వారి నూఱడించెను. వెంటనే స్వర్గమున కరిగి యా యుదంతము నింద్రున కెఱిగించి తనకు రణరంగమున దోడుపడ నాతని బ్రార్థించెను. అప్పు డింద్రుడు యమధర్మరాజా! శ్రీమహావిష్ణువుతోడనా సమరమునకు బూనుచుంటివి? నీ కేమైన మతి చలించినదా? మాఱు మాట యాడక మౌనముగా నీ సంయమినీనగరమునకు మఱలిపొమ్ము! ఆ మహావీరుని నీవేమి సేయగలవు? పూర్వము తన కమరపాదపముల (కల్పవృక్షపారిజాతములు) నిమ్మనగా నశలున నడ వడ వడకుచు నా పాదపములను రెంటిని గొనిపోయి నేనే యీ పరమపురుషున కర్పిం చితిని గదా! అట్టి నేను నీ కెట్లు సాయపడ నెంతును? పొమ్ము? పొమ్మని యతని ప్రయత్నమునకు .న యసమ్మతిని బ్రకటించెను. అప్పుడు యము డగ్నిలోకమున కరిగి యగ్నిహోతృని, నిర్‌ృతికడ కరిగి నిరృతిని, వరుణలోకమునకేగి వరుణుని, వాయుదేవుని సన్నిధి కరిగి యతనిని, కుబేరుని జేరి యతనిని, ఈశానుని చెంతకేగి యతనిని,

సూర్యుని, చంద్రుని, బుధుని, గురుని, కుజుని, శుక్రుని, శనైశ్చరుని, రాహుకేతువులను గ్రహములు గూడ సమగ్రముగ దనకు దోడుపడ వేడు కొనెను. యమునకు మతిభ్రమణము కలిగినదని యెంచి వారందఱు చంద్రాదుల వలె సహాయ నిరాకరణ మొనరించిరి. అప్పుడతడు పాతాళము లందు సప్తద్వీపములందు నున్న మహారాజుల నెల్లరను ప్రార్థించెను. శ్రీరామచంద్రునితోడి సమరములో నీకు నే మేవిధముగను దోడుపడజాల మని వారెల్లరు నాతనికి ప్రత్యుత్తరమిచ్చిరి.

అప్పు డాగ్రహోదగ్రుడై యముడు తా నొక్కడే శ్రీరామచంద్రునితో బోర నెంచి తన సైన్యమును వెంటనిడికొని మహిషవాహనము నధిరోహించి యతని రాజధాని కరిగెను. తొమ్మిది ద్వారములతో, దొమ్మిది ప్రాకారములతో, దొమ్మిని కందకములతో, శతఘ్నియంత్రసామగ్రులతో, బలిష్ఠములైన రత్నకవాటములతో, రత్నఖచితములైన కుడ్యములతో (గోడలు) సరయూనదీ పరివేష్టనముతో, వివిధ పతాకాధ్వజ సమలంకృతములైన సుందర మందిరములతో, కోటి సూర్యప్రభాభాసమానమై వెలుగొందు నయోధ్యానగరము నెల్లవంకల ముట్టడించెను.

ఆ ముట్టడి నెఱిగి రఘునందనుడు యమునితో బోరు సలుప లవుని కాదేశించెను. అప్పుడు లవుడు రథారూఢుడై దుందుభుల ధ్వనులతో నగరము వెలుపలకు జని యమునితో భయంకరసమర మొనరించెను. అతని శరప్రహారములచే శరీరములు ఛిన్నభిన్నములు గాగా నెందఱో యమభటులు సమరభూమిపై గూలిపోయిరి. తన వారెందఱో నిహతులు గాగా జూచి యముడతరక్రోధతామ్రాక్షుడై ముందునకుఱికి లవునితో ఘోరముగా బోరొనరించెను. ఖరతరశరపరంపరల గ్రుమ్మరించి లవుని రథమును, సారథిని, బలగములను, ధనువును, కవచమును, కిరీటమును గూడ ఛేదించెను. అంతట

లవుడును వెనుకంజ వేయక తన సైన్యముతో రణభూమిపై స్థిరముగా నిలిచి మఱింత విక్రమించి యమునితో బోర నారంభించెను. ఆ సమయమున నమరు లందఱును దివ్యవిమానముల నధిరోహించి యా సంగరకౌతుకము నవలోకించిరి. లవుడు వాడి యలుగుల బ్రహరించి యముని వాహనమును మూర్ఛాక్రాంతము గావించెను. నూఱు బాణములతో యముని బ్రహరించెను. అప్పుడు యము డడవరాని యాగ్రహమున నదవద జెందుచు లవునిపై దన యమదండమును బ్రయోగించెను. దానిని గాంచి దాని కెదురుగా లవుడు బ్రహ్మాస్త్రము బ్రయోగించెను. అంతట నాయమదండము వెనుకకు మఱలెను. అప్పుడు యము డత్యంతవ్యాకులత జెంది పలాయనము సేయ నారంభించెను. కాలాగ్నిజ్వాలలను వెలిగ్రక్కుచు బ్రహ్మాస్త్ర మాతని వెన్నంటసాగెను.

అంతట దన తనయుని దురవస్థను గని యారటమొంది సూర్యభగవానుడు రెండు రూపములు దాల్చి యొక రూపమున దన రథమునందు నిలిచియుండి రెండవరూపమున లవుని సమీపించి "కుమారా! లవా! నీవస్త్రవిద్యావేత్తలలో నగ్రగణ్యుడవు. నీవు ప్రయోగించిన బ్రహ్మాస్త్రము నుపసంహరింపుమా! యముని ప్రాణములను గాపాడుమా! నీవు నా వంశమునందు జన్మించినవాడవు. యముడు నా కుమారుడు. నీ పూర్వజుని బాధించుట పాడి యగునా? ఎవడో యొక్కడు మూర్ఖతకు బాలుపడిన నందఱు మూర్ఖులగుదురా? రణరంగమునుండి పలాయనము సేయు శత్రువును రక్షించుట వీరధర్మము గాదా?" యని యనేకవచనము లాడుచు నతనిని బ్రార్థించెను. అప్పుడు లవుడు గరుణించి తాను బ్రయోగించిన బ్రహ్మాస్త్రము నుపసంహరించెను. ఆ లవుని ముందిడుకొని యముని వెంటనిడుకొని సూర్యభగవానుడప్పుడు శ్రీరామచంద్రుని దర్శింప నగరమునకేగి

కరుగుదెంచెను. ఆ సమయమున దేవదుందుభులు మ్రోగినవి. లవునిపై బూలవానలు గురిసినవి. అచ్చరలాడిరి. పురవనితలు బూలు సల్లిరి. వారవనితలు చారుతరనృత్యములు సలిపిరి. వందిమాగధులు స్తోత్రపఠనములు సేసిరి. గంధర్వులు, గిన్నరులును మధురగానములు సేసిరి. ఈ విధముగా వివిధోత్సవములతో లవుడు సూర్యుని, యముని దోడుకొని పురవనితలొసగు నివాళుల నందికొనుచు గ్రమముగా సభాస్థలికి జేరి శ్రీరామచంద్రునకు బ్రణమిల్లెను, అతనితోడ సూర్యభగవానుని రాక నెఱిగి శ్రీరామచంద్రు డతని కెదురుగా జని నమస్కరించి యతని కేలు గేల ధరించి తోడ్కొని సభలోనికి వచ్చి యొక యుత్తమాసనముపై నాతని నుపవిష్టుని గావించి షోడశోపచార విధులతో నతనిని జక్కగా బూజించెను. అప్పు డాతనితో సూర్యదేవా మీరు మా పూర్వపురుషులు. మీ యెడల లవు డొనరించిన యపరాధమును మన్నింపుము. అని వినయవచనము లాడెను. అంతట సూర్య భగవానుడు రఘునందనా! నీ నాభికమలమునుండి బ్రహ్మ ప్రాదుర్భవించెను. మరీచి మున్నగువారా బ్రహ్మకు మానసపుత్రులు అందు మరీచికి గశ్యపుడు తనయుడు. అతనికి నేను సుతుడను. అనగా నేను మీ మనుమని మనుమడను. కావున నా కుమారుడగు యముడు మీ యెడల జేసిన యపరాధమును మీరే మన్నింపవలయును. అని ప్రార్థించి రాఘవుని దన పార్శ్వదేశమున గూరుచుండబెట్టుకొనెను. యమునిచేత గూడ నా పరమపురుషునకు బ్రణమిల్లజేసెను. ఆ సమయమున నమరులు గూడ నా సభలోనికి వచ్చి శ్రీరామచంద్రునకు నమస్కారము జేసిరి. రాఘవుడును సాదరముగా వారి నందఱను సంపూజించెను. పిమ్మట నతని యాజ్ఞచే నింద్రు డమృతమును గురియించి రణభూమిలో మరణించినవారి నందఱను బునరుజ్జీవితుల గావించెను. అప్పుడు రాఘవుడు యముని వంకకు దిరిగి ఓయి సూర్యకుమారా యమధర్మరాజా! నేను రాజ్యపరిపాలనము సేయు చున్నంత

కాలము నీవు పూర్తిగా నాయువు సెల్లిన వారిని మాత్రమే కొని పోవలయును. చెల్లని వారిని గొనిపోరాదు. అని యతనిని శాసించెను.

అనంతరము తొమ్మిది దినములు నతిక్రమించిన మీదట సుమంత్రుడు భార్యలతోడ శ్రీరామచంద్రుని సన్నిధి కేగుదెంచి యతనికి నమస్కరించి యతని యెదుటనే ప్రాణపరిత్యాగము చేసి దివ్యదేహములను దాల్చిన భార్యలతోడ దాను గూడ నొక దివ్యరూపమును ధరించి దివ్యవిమానము నధిరోహించి దివ్యులచే గొలువబడుచు దివమున కరిగెను. అటుపిమ్మట సూర్యభగవానుడును, యమధర్మరాజును శ్రీరాముని కడ సెలవుగొని తమతమ నెలవులకు వెడలి పోయిరి. శ్రీరామచంద్రుడు సుమంత్రుని కాతని తనయునిచేత యథావిధిగా నంత్యక్రియలను నిర్వర్తింపజేసి యతని నాతని పదవి యందు నియమించెను.

అనంతరము శ్రీరామచంద్రుడు దుందుభిఘోషము సేయించుచు దన రాజ్యమునం దెల్లయెడల నీ క్రిందివిధముగ బ్రజలకు దన యుపదేశవచనములను జాటింపజేయు లక్ష్మణున కాదేశించెను. అతడు దూతల కాదేశించెను. వారు గజారూఢులై సప్తద్వీపములందు నీ విధముగా జాటించిరి.

"మహాజనులారా! శ్రీరామచంద్రసార్వభౌముల సందేశ మిది యాలింపుడు. మీలో నెవ్వరైన నాయువు పూర్తిగా జెల్లకముందు మరణించినచో వానిని బ్రభువుల సన్నిధికి గొని పోవలెను. గృహములందు బౌరాణికులను నిలుపవలెను. ఎన్నడు నిత్యనైమిత్తికకర్మములను విడనాడరాదు. బ్రాహ్మణుల నవమానింపరాదు. ఎవరిని గూడ ద్వేషింపరాదు. దేవతలకు హవ్యము, పితృదేవతలకు గవ్యము నర్పింపవలెను. చోరులను దండింపవలెను. దురాచారులను శిక్షింప జేయవలెను. తల్లిదండ్రులకు నమస్కరింపవలెను. దేవతలను బూజింప

వలెను. ఎల్లవేళల ధర్మము నాచరింపవలెను. అయోధ్యలోగాని, శ్రీరామతీర్థములందు గాని తప్పక చైత్రస్నానము సేయవలెను. దాన ధర్మము లాచరింపవలెను. ద్వారకలో వైశాఖస్నానము సేయవలెను. పంచనదులనందు గార్తికస్నానము సేయవలెను. ప్రతి సంవత్సరము మాఘమాసమున బ్రయాగలో స్నానమాచరింపవలెను. చాతుర్మాస్య వ్రతము మున్నగువ్రతముల నాచరింపవలెను. ప్రతివాకిటియందును దులసిని నిలిపి పూజింపవలెను. అతిథుల నెన్నడును నిరాకరింపరాదు. బ్రాహ్మణు లేదైన గోరిన లేదనరాదు, వారు గోరినచో సరస్వము నైన వారి కర్పింపవలెను. గ్రామములందు, ధామములందు గలవా ములకు దాపీయరాదు. గురువున కెల్లవేళల వందనము సేయవలెను. గురూపదేశము నాలింపవలెను. అనయము ప్రాతస్స్నానము సేయ వలెను. యథావిధిగా నగ్నిలో హోమములు సేయవలెను. శంకరుని గూర్చి నిత్యము జపధ్యానములు సేయవలెను. ఏకాంతముగా దపము సేయవలెను. ఇరువురు గూడి యధ్యయనము సేయవలెను. మువ్వురు గూడి గానము సేయవలెను. నలుగురు గూడి మార్గములందు జరింప వలెను, పరదారాభిలాషమును బరిత్యజింపవలెను. పరస్త్రీలను బరి కింపరాదు. పరధనము నాశింపరాదు. పర్వదినములందు దీర్థ స్నానము సేయవలెను. గృహములందు స్నానము సేయరాదు. జ్యోతిష్కులను ద్వేషింపరాదు. ప్రతి పురమునందు వైద్యులను బోషింపవలెను. వేశ్యాగమనము సేయరాదు. దాసితోడి పొందును గోరరాదు. యథాకాలముగా నిత్యకర్మానుష్ఠానము సేయవలెను. గురు వుల నవమానింపరాదు. పరనిందను బరిహరింపవలెను. వనములందు జలాశయముల నేర్పఱపవలెను. మార్గములందు వృక్షములను నాట వలెను. ధర్మశాలలను స్థాపింపవలెను. దిగంబరముగా నున్న వనితను వీక్షింపరాదు. అడుగడుగున నన్నసత్రములను నెలకొల్పవలెను.

వనవాసులారా! మీరు బాటసారులను రక్షింపుడు. రాత్రివేళ వనములందు బాటసారుల కెట్టి యాపదయు గలుగరాదు. వైశ్యుల కడనుండియే కరమును గ్రహింపదగును. ఇతరజనులనుండి గ్రహింప రాదు. తీర్థస్థలమునకు, దేవుని సన్నిధికి, గురువుకడకు, గోశాలకు, హోమశాలకు, బృందావనమునకు పాదముల పాదరక్షలతో బోరాదు. నిష్కామభావముతో గ్రంథపారాయణములు, వేదపారా యణములు సేయవలెను. మాసకార్యములను నిర్వర్తింపవలెను. యతీ శ్వరులకు నమస్కరింపవలెను. వారికి భోజనములు పెట్టవలెను. వారికి కౌపీనములను, కమండలువులను, పాదుకలను, వెదురు దండ ములను దానము సేయవలెను. మీ మీ భార్యలను క్షోభపెట్టకుడు. పగటివేళ నిద్రింపకుడు. ఏకాదశినాడు భోజనము సేయకుడు. కృష్ణ చతుర్దశినా డుపవాసము సేసి రాత్రివేళ శివార్చనము సేయుడు. కృష్ణ పక్షమునందలి యష్టమినాడు గూడ నుపవాసము సేయుడు. దేవాలయ ములందు దేవతలకు బూజలు సేసి వివిధపక్వాన్ననైవేద్యముల నర్పిం పుడు. బ్రాహ్మణులకు గోవులను, గుఱ్ఱములను దానము సేయుడు. ప్రతియింటను గోబ్రాహ్మణపూజనములు గావింపుడు. వసంతకాలమున వీవనలను, ఛత్రములను, చందనమును పానకమును, జలకుంభములను, పాదరక్షలను, పెరుగును, మజ్జిగను, నిమ్మరసమును సాదరముగా బ్రాహ్మణుల కర్పింపుడు. కార్తికమాసమునందు దీపదానము, రాత్రివేళ జాగరణము, తులసీపూజనము, నుసిరిక చెట్టుక్రింద భోజ నము, విష్ణువు సమక్షమున గీతనృత్యాదికమును గావింపుడు. కార్తిక పూర్ణిమనాడు శివుని సమక్షమున వత్తుల కట్టలను నేతితో దడిపి మహా జ్యోతిని వెలిగింపుడు. మాఘమాసమున గఱ్ఱలను, విచిత్రములైన కంబడులను దానము సేయుడు. చైత్రమాసమునందు దాంబూలము, నరటిపండ్లు, దోసపండ్లు, చందనము, పెరుగుమజ్జిగలు, నద్దము, కస్తూరి,

యేలకులు, జాజికాయ, కర్పూరము మున్నగునవి దానము సేయ దగినవి.

అన్నను బాదముతో దాకరాదు. పాదమును బాదముతో ఘర్షింపరాదు. రెండుచేతులతో దల గోకికోరాదు. బ్రాహ్మణులు దక్షదక్షిణవారందఱు జేసికి బన్ను జెల్లింపవలెను. రాజదండము నుపేక్షింపరాదు. అత్తమామలను గౌరవించుచు బోషింపవలెను. మిత్రుల నానందపఱపవలెను. వారిపై గోపమును జూపరాదు. శత్రువులను నమ్మరాదు. దానధర్మములందు గృపణత్వము వహింపరాదు. జూదము దారిద్ర్యసూచకమైనది. కావున నందు బ్రవర్తింపరాదు. మద్యప్రసంగముల నాలకింపరాదు. తీర్థయాత్రలు సేయవలెను. కృచ్ఛ్రాదివ్రతముల నాచరింపవలెను. నిత్యము శివలింగార్చనము సేయవలెను. శ్రావణమాసమున గోటిలింగముల నర్చింపవలెను. లఘురుద్రము, మహారుద్రము, అతిరుద్రము నాచరింపవలెను. నిరంతరము బుస్తకదానములు సేయవలెను. గృహములందు, దేవాలయములందు గీర్తనములు సలుపవలెను. సాధువులను బూజింపవలెను. సూర్యునకు నమస్కరింపవలెను. గ్రామగ్రామమునందు నాంజనేయుని విగ్రహములను బ్రతిష్ఠించి సిందూరము, తైలము బూసి పూజింపవలెను. చతుర్థినాడు గణపతిని బూజించి యతనికి గుడుములను, నైదు ఖాద్యవస్తువులను, సిందూరము, దూర్వాంకురములు మున్నగువాని నర్పింపవలెను. అనుదినము నాత్మజ్ఞానచర్చను, స్తోత్రపఠనములను జేయవలెను. గీతాపఠనము, వేదాధ్యయనాధ్యాపనములు సేయవలెను. శాంతి సూక్తములు, పుణ్యసూక్తములు, పురుషసూక్తములు బఠింపవలెను. నిత్యము గర్మమునం దాసక్తి గలిగియుండవలెను. ధర్మసంగ్రహమునకై పాటుపడవలెను. దుష్టబుద్ధిని విడువవలెను. పాపపరిహారమునకై పాటుపడవలెను.

ఆయువు చంచలమైనది. యము డత్యంతక్రూరుడు. నరక యాతన దారుణమైనది. అని మనములో నిరంతరము స్మరించి కొను చుండవలెను. తల్లి, తండ్రి, యాతని తండ్రి, యాతని తండ్రి యెల్లరు గతించి రని యెఱిగి తన గమనమునకై నిరీక్షింపవలెను. బాల్యము నిలువదు. యౌవనము నిలువదు. వార్ధక్యము తప్పదు. అదియు గడచిపోవుట తప్పదు. కావున యముని శాసనమును విస్మరింప రాదు. దంతము లూడిపోవును. కన్నులకు జూపు క్షీణించును. శరీ రము ముడుతలు పడును. నల్లని కుంద్రుకలు తెల్లబడిపోవును. కావున మృత్యుదేవత యెట్టయెదుట నిలిచియున్నట్లు భావించికొని సత్వర ముగా దానము సేయవలెను. మనస్సును నిర్మలముగా నుంచికొన వలెను. విలువలేని పొట్టునువలె ధనమును వెచ్చింపవలెను. కాని రక్షింపరాదు. ఇది శ్రీరామచంద్ర సార్వభౌముల యాజ్ఞ.

ఈ విధముగా శ్రీరామదూతలు దుందుభులను మ్రోగించుచు సప్తద్వీపములందును సంచారము జేసి శ్రీరాముని సందేశమును జాటించి మఱల నయోధ్యానగరమునకు మఱలి వచ్చి యా సమా చారము నామహాప్రభువున కెఱిగించిరి. అప్పుడు రాఘవు డానందిం చెను. ఈ విధముగా శ్రీరామచంద్రుడు భూతలముపై నెన్నియో మహత్తర చరిత్రముల నాచరించెను. వాని నెవ్వరు వర్ణింపగలరు!"

శిష్యా! విష్ణుదాసా! పూర్వార్ధము పండ్రెండు సర్గములు, నుత్తరార్ధము పండ్రెండు సర్గములును గూడి మొత్త మిరువది నాల్గు సర్గములతో గూడిన రాజ్యకాండ మిది మహామంగళములకు మూల మైనది. నీకు వినిపించితిని. భక్తితో నీ కాండమును బఠించిన మహా రాజులకు రాజ్యభ్రష్టత్వ మెన్నడును సంభవింపదు. మహా పుణ్య ప్రదమైన యీ కాండము నాలకించిన వారు శ్రేయములను బొందు దురు. ఈ కాండమును మొదటి దినమున నొక సర్గము, రెండవ దిన మున రెండు సర్గములుగా దినమున కొక సర్గ మెచ్చించుచు నిరువది

నాలుగు దినములు పఠించి యిరువదియైదవ నాటినుండి దినమున కొక సర్గముగా దగ్గించికొనుచు పారాయణము సేయవలెను. ఈ క్రమమున నొక పారాయణమునకు నలుబది యేడు దినములు పట్టును. ఎంతైన నధికారమును బొందినవారీ రాజ్యకాండమును భక్తితో బఠించినచో వారి కధికారభ్రష్టత గలుగదు. ఈ కాండమును బఠించినమీాదట బ్రవర్తించినచో రణమునందు, వాదమునందు విజయము లభించును. దీనిని శ్రవణము జేసిన వారికి శత్రువులు సత్త్వరముగా వశవర్తు లగుదురు. ఆనందరామాయణము నడుమనున్న యీా రాజ్యకాండమును బఠించినవారు రాజ్యభ్రష్టులైనచో నిక నెన్నడును భ్రష్టతను గలిగింపని రాజ్యపదవిని బొందుదురు. నిజ మరయగా నీ యానందరామాయణ ముత్తమమైనది. అందలి కాండములన్నిటియందు నీ రాజ్యకాండము మేలైనది. సౌఖ్యదాయకమైనది. ఆదరముతోడను భక్తితోడను నాలకింప దగినది. ఈ కాండమును రాజ్యపాలకులు వ్యవసాయ తత్పరులు నిరంతరము శ్రవణము జేయదగును. ఉత్సాహకాలమునందు, వ్రతదీక్ష వహించువేళ, వివాహ సమయమునందు నీ కాండము బఠింపదగినది. పుణ్యకాలమునందీ కాండమును భక్తితో బఠించినవారిహలోకమునందు సమస్త సుఖములను, బడసి యంత్య కాలమున దివ్య విమానముల నధిరోహించి విష్ణులోకమును జేరుదురు. శ్రీరామచంద్రుని కథానక మిది. విచిత్రమైనది. పరమపవిత్రమైనది. భక్తితో శ్రవణము జేయదగినది. పఠింపదగినది. మునులకు గూడ శుభముల నొనగూర్చునది.

ద్వాదశ సర్గము సమాప్తము

రాజ్యకాండము - ఉత్తరార్ధము సమాప్తము

సర్వం శ్రీమత్సీతారామచంద్ర పరబ్రహ్మార్పణమస్తు.

—) 0 0 (—